అంతర భారతీయ పుస్తకమాల

# మహాశ్వేతా దేవి ఉత్తమ కథలు

అనువాదం

ఆర్. శాంత సుందరి



నేషనల్ బుక్‌ట్రస్ట్, ఇండియా

ముఖచిత్రం : రామ్‌కింకర్ (1910-1980)

ISBN.81-237-3594-4

ప్రథమ ప్రచురణ 2001 (*శక* 1923)

Original Title : Mahasweta Debir Chhotogalpo Sankolan (*Bangla*)

Telugu translation : Mahasweta Devi Uttama Kathalu

రూ. 75.00

డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్‌పార్క్,
న్యూఢిల్లీ-110 016 ద్వారా ప్రచురింపబడినది.

# విషయసూచిక

# ఉపోద్ఘాతం

1984వ సంవత్సరంలో వెలువడిన తన కథా సంకలనం, 'శ్రేష్ఠగల్స్' ఉపోద్ఘాతంలో మహాశ్వేతాదేవి రాసిన వాక్యాలు : "సాహిత్యాన్ని కేవలం భాష, శైలి, శిల్పం అనే గీటురాళ్ళతో కొలవటం తప్పు - సాహిత్య విలువల్ని చారిత్రక దృష్టితో పరిశీలించాల్సి ఉంటుంది. ఒక రచయిత రచనని, అతను దాన్ని రాసే కాలాన్నిబట్టి అంచనా వెయ్యకపోతే, ఆ రచనకి న్యాయం చేకూరదు. నేను ప్రాచీన కథలనీ, పౌరాణిక పాత్రలనీ, సంఘటనలనీ వర్తమానకాలం దృష్ట్యా నా కథల్లో వాడతాను. నిజానికి జానపద కథల్లో గతమూ, వర్తమానమూ కలిసి ఒకే ప్రవాహంలాగ కనిపిస్తాయి. ఈ ప్రవాహం కపోల కల్పన కాదు. కులం గురించిన పట్టింపులూ, పొలాలమీదా, అడవులమీదా అధికారమూ, ముఖ్యంగా అధికారవర్గం తమ అధికారాన్ని విస్తరింపజేసుకోటానికీ, నిలుపుకోటానికీ తాపత్రయపడుతూ బలహీనవర్గం వాళ్ళని పీడించే వ్యవస్థ గురించిన చరిత్రే ఇది."

ఈ కొత్త సంకలనానికి రచయిత్రి స్వయంగా తొమ్మిది కథలు ఎంచుకున్నారు. వీటిల్లోని ఎనిమిది కథల్లో కేంద్రబిందువు ఆదిమవాసులే. వీళ్ళు సమాజానికి దూరంగా ఎటువంటి సంస్కారమూ లేకుండా, చరిత్ర లేకుండా, వెలివేయబడ్డట్టు బతుకుతున్నవాళ్ళు. ఈ కథల్లోని పాత్రలు నిమ్నజాతివర్గాలని పిలవబడేవాళ్ళూ, అంటరానివాళ్ళనబడే శూద్రులూనూ. ఈ దేశంలో ఆర్థిక పీడన చాలా రోజులుగా మతాలకి సంబంధించిన మాయాజాలాన్ని సృష్టించింది. దాన్ని అడ్డుపెట్టుకుని అది బలహీనుల్ని వేటాడుతుంది. ఇదే విధంగా జానపద కథలూ, పురాణాలూ ఆధారంగా చేసుకుని పీడించేవర్గం బలహీనుల్ని అంధకారంలో కప్పి ఉంచటంలో విజయం సాధించింది. ఈ జనజాతుల్లో తిరోగమనం సృష్టించే ఈ నమ్మకాలు మహాశ్వేతాదేవికి చాలా విచారం కలిగిస్తాయి. తన కథల్లో ఆమె చిత్రించే సమాజాన్ని గురించి ఆమెలో రోజురోజుకీ తాపత్రయం పెరుగుతోంది. వాళ్ళ జీవితాల్లోని యథార్థాన్నీ, వాళ్ళ వెనక ఉన్న చరిత్రని తెలుసుకోటానికి ప్రయత్నించి,

ఆ ప్రయత్నంలో వాళ్ళకి ఇంకా దగ్గరయి ఆమెకూడా వాళ్ళల్లో ఒక మనిషిగా మారిపోయింది. వాళ్ళ జీవితాలూ, హక్కులూ, పొట్టగడుపుకోటానికి చేసే పనులూ అన్నీ ఆమె తనకి సంబంధించినవే అనుకున్నది. ఆ సమాజంతో ప్రత్యక్షంగా పరిచయం పెట్టుకోవటం వల్లనే వాళ్ళనీ, వాళ్ళ నమ్మకాలనీ చూసి తెలుసుకోగలిగింది. ఇటువంటి మూఢనమ్మకాల వల్ల కలిగే భక్తిభావం బానిసత్వాన్నీ, మోసాన్నీ కూడా ఆశీర్వాదమనుకుని స్వీకరించే పరిస్థితి కలిగిస్తుంది. మిత్స్‌నీ, పురాణాలనీ, జానపద కథల్నీ ఎంతో అందంగా చిత్రించి చూపించటమనేది మన దేశంలో చాలా నేర్పరితనంతో నిర్వహించబడుతున్నది. ఇటువంటి పోకడలనీ, అప్పుడప్పుడూ మార్క్సవాదుల పద్ధతిలో తరతరాలుగా వచ్చే అధికారం బదులు కొత్త వారసుణ్ణి ప్రతిష్ఠించటాన్నీ, వారసత్వంగా వచ్చే అధికారం వెనుకనున్న సారంగంలో దాక్కుని కూర్చున్న హిందుత్వాన్నీ, వాటి కీలును ఎరిగి వాత పెట్టిన రచయిత్రి మహాశ్వేతాదేవి.

ఈ కథల్లో కనిపించే ఆటవిక జాతులూ, జనజాతులూ పరిచయమైనవే - బాగ్‌దీ (వెల్లువ), డోమ్ (మంత్రగత్తె), బోయ (సాయం-సంధ్యల తల్లి), ఓరాంవ్ (వేట), గంజూ (విత్తనాలు), దుసాధ్ (బికారి దుసాధ్, ప్రాథమిక హక్కులు), మాల్, లేక భూతవైద్యుడు (బేహులా), సంథాల్ (ద్రౌపది) మొదలైనవి. వీళ్ళల్లో "గంజూలు చేసే పని, చనిపోయిన జంతువుల చర్మం ఒలవటం". బికారి దుసాధ్ చేసే పని "మేకల్ని తోలుకోటం". మంత్రగత్తె అవకముందు చండీకి వంశపారంపర్యంగా వచ్చిన వృత్తి, "శ్మశానంలో శవాల్ని పాతిపెట్టటం". ఇలా వంశానుగతంగా వచ్చే వృత్తులు. తరతరాలవరకూ వాళ్ళని ఆటవికజాతి మనుషులుగానే ఉంచేస్తాయి. వీళ్ళనే కేంద్రంగా చేసుకుని, వీళ్ళ జీవన విధానం ఎప్పటికీ మారకుండా అలాగే ఉంచాలన్న ఉద్దేశంతో పురాణాలు రచింపబడతాయి. బోయజాతివాళ్ళు 'జరాబోయ' సంతతి. డోమ్‌లు గంగాపుత్రుల వంశానికి చెందినవాళ్ళు. మొట్టమొదటి గంగాపుత్రుడికి రాజు హరిశ్చంద్రుడు. ఈ భూమ్మీది శ్మశానాలన్నీ దానం చేశాడు. ఆ దానం పుచ్చుకున్న గంగాపుత్రుడు అమాయకంగా 'రెండు చేతులూ ఎత్తి నాట్యం చేసి' ఆనందించాడు. చాలా ఉల్లాసంగా, "అవును, మాకు శ్మశానాలు దొరికాయండీ! అన్ని శ్మశానాలూ మావే! ఈ భూమ్మీది శ్మశానాలన్నీ మావే!" అని మురిసిపోయాడు.

పురాణకథలని ఉత్త కథలాగ కాకుండా మహాశ్వేతాదేవి దానికి ఒక నాటకీయ

స్వరూపం ఇచ్చి ఇతివృత్తానికి ఒక విస్తృతమైన రూపం సమకూరుస్తుంది. దీనివల్ల కథ పురాణకథే అయినప్పటికీ దాన్లోని కపటమూ, మతంపేర సృష్టించబడే మాయాజాలమూ కళ్ళకి కట్టినట్టు కనిపిస్తాయి. చారిత్రాత్మక కథల నేపథ్యంలో అమాయకులైన ఆటవిక ప్రజలపై పై వర్గాలవాళ్ళు చేసే అత్యాచారాలని తన కథల ద్వారా రచయిత్రి మన ముందుంచుతుంది. కథలు చరిత్రకి సంబంధించినవైనా ఆమె తన విశిష్టమైన శైలినీ, చాతుర్యాన్నీ, భాషనీ ఉపయోగించి తనదైన ఒక కొత్త సృష్టి చేస్తుంది.

ఇంకొకపక్క ఆర్థికంగానూ, సామాజికంగానూ చాలా మార్పులు వస్తూ ఉంటాయి. మలిందర్ గంగాపుత్ర శ్మశానంలో కాటికాపరి పనిచేస్తూ పైకెదిగి, "జిల్లాలోని శవగృహంలో పని సంపాదించుకుంటాడు". సర్కారుబాబుతో చేరి అనాథశవాల అస్థిపంజరాల్ని అమ్మే వ్యాపారం చేస్తూ ఉంటాడు. దొంగతనంగా సంపాదించిన ఆ పై సంపాదనని వడ్డీలకి తిప్పి, అతను కొన్ని పందుల్ని కూడా కొంటాడు. అయినా అతని స్వభావం మారదు, అతని నమ్మకాలు మారవు. తన పెళ్ళాం మంత్రగత్తె అని నలుగురికీ చెప్పి ఆమెను సంఘంనుంచి వెలివెయ్యటానికి అతను ఎంతమాత్రం జంకడు. మహాశ్వేతాదేవి రాసిన 'మంత్రగత్తె' కథలో అన్నిటికన్నా ఎక్కువగా హృదయాన్ని కదిలించే ఘట్టం ఇదే. నాగరిక సమాజం నుంచి వెలివేయబడ్డ ఒక మనిషి, తనవాళ్ళల్లో ఒకరిని తన సమాజంనుంచి వెలివేస్తాడు! మానవ సమాజం అంచున బతుకుతున్నవాళ్ళు తమలో ఒక వ్యక్తిని బహిష్కరిస్తే, ఆ వ్యక్తి ఇక ఒక మనిషిగా కూడా మిగలకుండా పోతాడు. ఈ కథలో చండీ అది తన కర్మ అనుకుని మౌనంగా స్వీకరిస్తుంది. అందుకే ఆమె మనిషిగా మిగలదు, మంత్రగత్తె అయిపోతుంది. మలిందర్ తన కొడుకు భగీరథ్‌తో, "ఒకప్పుడు ఆమె కూడా మనిషే, మీ అమ్మ!" అంటాడు. జీవితంలో మనకి పైపై పూతగా ఉండే ప్రభావాలకీ, స్వతహాగా ఉండే మానవత్వానికీ జరిగే పోరాటం ఎన్నటికీ ఆగదు. అందుకే మంత్రగత్తె అయినా చండీకి "ఉన్నట్టుండి పెళ్ళాంలాగ, అవివేకంగా ప్రవర్తించే మలిందర్‌మీద కోపం వస్తుంది." కథలో ఇంకో మలుపు, ఆధునిక భావాలు అలవరచుకున్న భగీరథ్ తన తల్లి దగ్గరకి వెళ్ళటానికి ప్రయత్నిస్తాడు. అంతేకాదు, తన తల్లి మనిషి కాదని అతను ఒప్పుకోడు. అతను చండీతో మాట్లాడటంవల్ల సంఘం నుంచి వేరుచెయ్యబడిన ఒక స్త్రీని మళ్ళీ సంఘం పరిధిలోకి

తీసుకురావటంలో కృతకృత్యుడౌతాడు. మొదట్లో మృతశిశువుల శవాల్ని పాతిపెట్టే చండీ, కథ ముగిసేటప్పటికి ఆ పని వదిలేసి, విశాలమైన సమాజంలోని మనిషిగా, రైలు ప్రయాణీకుల్ని కాపాడాలనే ప్రయత్నం చేసేంతగా, ఎదిగిపోతుంది.

ఒక పవిత్రమైన భయంవల్ల ఒకప్పుడు సంఘం చండీపైన మంత్రగత్తె అనే ముద్రవేసింది. కథ చివర్లో చండీ బందిపోట్లని ఎదిరించినప్పుడు వాళ్ళ మనసుల్లోనూ అదే పవిత్రమైన భయాన్నే కలుగజేస్తుంది. ప్రతి క్రియకీ ప్రతిక్రియ ఉంటుందనే విషయం మహాశ్వేతాదేవి కథలకి ప్రాణం వంటిది. "మంత్రగత్తె తన సమాజంలో మనుషులు ఇంతగా భయపడటం ఎన్నడూ చూడలేదు". సంఘం నుండి వెలివేయబడి బతకటమనే యాతన అనుభవించిన చండీలో ఒక కొత్త వివేకం నిద్రలేస్తుంది. ఆధునిక యూరోపియన్ సాహిత్యంలోని "అవుట్‌సైడర్" అందరికీ సుపరిచితమైనదే. అందులోని ఒక పాత్ర సంఘంనుండి వెలివేయబడతాడు. అదే పాత్ర ఇక్కడ ఇంకో రూపంలో కనిపిస్తుంది. సంఘమే చండీకి అన్యాయాన్ని ఎదుర్కొనే శక్తిని కూడా ఇచ్చింది. నైతిక విలువలకోసం ఆమె తానుగా పోరాడిన ఈ ఒంటరి పోరాటమే ఆమెని మళ్ళీ తన సమాజంలోకి ప్రవేశింపజేస్తుంది. భగీరథ్ ప్రజల ముందూ, అధికారుల ముదూ తన వంశాన్ని పరిచయం చేసేటప్పుడు, సంఘం నుండి వెలివేయబడ్డ మంత్రగత్తె చండీ కొడుకునని తనని తాను పరిచయం చేసుకుంటాడు. ఆ క్షణాన కథ పరాకాష్టకి చేరుకుంటుంది. పురాణకథకి పునర్జన్మ వస్తుంది.

గుదిబండల్లాగా ఉన్న పాత నమ్మకాలనీ, అలవాట్లనీ వదిలించుకుని ఆధునికమైన ఆలోచనా పద్ధతిని ప్రతిష్ఠించటానికి పోరాడే ఇంకో కథ, 'బేహులా'. ఈ కథలో ఊళ్ళోకి బైటినుంచి వచ్చిన పాత్ర వసంత్ కుమార్‌ది. ఊళ్ళో పాత పద్ధతులని ఆచరించే వ్యక్తి శ్రీపద్ మాల్ - " ఆ ఊరికి భూతవైద్యుడు, 'విచ్ డాక్టర్'. కానీ ఒక వ్యక్తి వేసుకున్న లాభనష్టాల బేరీజు ఊళ్ళో మృత్యువుని పోషించేటప్పుడు (ఒకపక్క మంచి ధర పలకనందువల్ల హేదో నశ్కర్ ఇటుకలు అమ్మడు, ఆ ఇటుకల్లో పాములు పుట్టి పెరుగుతూ ఉంటాయి. ఇంకోపక్క పాముకాటుకి విరుగుడు మందు తయారుచెయ్యటానికి ఏ కంపెనీ కూడా ముందుకు రాదు. ఎందుకంటే పాములు నాలుగు లక్షల మందిని కరిచినా, చనిపోయేవారి సంఖ్య ఇరవైవేలే!) అదే ఊళ్ళో వసంత్‌కీ శ్రీపద్‌కీ మధ్య మంచి

స్నేహం ఏర్పడి ఒకరికొకరు సహాయపడుతూ మనుషులని మృత్యువువాత పడకుండా కాపాడటంలో ఆశ్చర్యంలేదు. ఇద్దరూ తమకి తెలిసిన విద్యల్ని, 'విజ్ఞానమూ, విషహరి' మేళవిస్తారు. ఈ కథకి విస్తారం ఇవ్వటంకోసం మహాశ్వేతాదేవి పాత్రకి అనుగుణంగా భాషని వాడింది. ఒకపక్క విజ్ఞానచర్చల్లో ఇంగ్లీషు పదాల వాడకం విరివిగా ఉండి గ్రామాలకి దూరంగా ఉన్న ప్రభుత్వాన్ని సూచిస్తే, ఇంకో పక్క గ్రామాలకీ నగరాలకీ సంబంధించిన సంస్కృతి మధ్యన ఉన్న తేడాని కూడా ప్రతిబింబిస్తుంది. వసంత్ గ్రామానికి వచ్చినప్పుడు అతని ఆలోచనలకీ అభిప్రాయాలకీ గ్రామప్రజల అభిప్రాయాలకీ మధ్యన చాలా తేడా ఉన్నది. ఆ తేడాని చూపించటానికి రచయిత్రి అతని మాటల్లో ఇంగ్లీషు భాషని ఎక్కువగా వాడింది. "ఇక్కడ బలహీనంగా, క్షీణించిన, జబ్బుల్ని ఎదుర్కోలేని మానవ శరీరాలు", "కాలాజ్ ఎబాండనింగ్", "ఒబ్‌లయిజ్", "రిజీమ్", "ఎకడమిక్ కుతూహలం" మొదలైనవి. వసంత్ తెలివైనవాడు, చదువుకున్నవాడు. ఇలాంటి భాష, నిమ్నవర్గానికి చెంది, అజ్ఞానంతో బతికేవాళ్ళతో కలిసి పనిచెయ్యాలనే అతని ప్రయత్నాలకి అడ్డుపడటం సహజమే!

ఈ తేడా ఇద్దరు వ్యక్తులమధ్య దృఢమైన సంబంధం ఏర్పడనివ్వదు. మనిషికీ మనిషికీ ఉండే సంబంధాన్ని తుంచివేస్తుంది. 'మంత్రగత్తె' కథలోలాగే 'బేహులా'లోనూ ఈ తేడాని మనం చూస్తాం. రెండు కథల్లోనూ జీవన విధానం నుంచే సమాజంపట్ల కర్తవ్యం అనే ఒక కొత్త జ్ఞానదీపం ప్రజ్వలితమౌతుంది. పాత పద్ధతులని వదిలి ఒక కొత్త జ్ఞానాన్ని ప్రతిష్ఠించటానికేనన్నట్టుగా మహాశ్వేతాదేవి ఈ రెండు కథల్లోనూ ముఖ్య పాత్రలను మరణించినట్టు చిత్రించి వాళ్ళ మృత్యువులోనే ఒక కొత్త జీవన విధానానికి నాంది పలికించింది. 'బేహులా' కథ చివర్లో పాత పద్ధతులని వదిలేసి, అవి సృష్టించే భయాలని వదిలించుకోవటం చిత్రించబడింది. "గ్రామ ప్రజల శోకమూ, కాలాజ్ అంటే వాళ్ళకున్న భయమూ, హేదోనక్కర్ మీది కోపమూ అన్నీ ఆ భగభగమండే మంటల్లాగ వాళ్ళ మనసుల్లో కోపాగ్నిని రగిల్చాయి. బహుశా అందుకేనేమో మంటలు ఇంకా పైకి లేచాయి." చనిపోయేముందు శ్రీపద్ ఆలోచించే పద్ధతిలో మార్పు కనిపిస్తుంది. అన్నీ చూస్తూ, అన్నీ తెలిసి, అర్థం చేసుకుని కూడా అతను చావునే కోరుకుంటాడు. అతని చావులోనే పాత పద్ధతులనుండీ, జీవన విధానం నుండీ అతను విముక్తుడయాడన్న సంకేతం ఉన్నది.

'సాయం-సంధ్యల తల్లి' కథ కూడా ఇదే విధంగా మృత్యువు మీదే ఆధారపడి

ఉన్నది. ఈ మృత్యువుకి దగ్గరగా వెళ్ళి, దానికుండా వెళ్ళి, జటేశ్వరి ఠకురానీ తన అలౌకిక రూపం పోగొట్టుకుని సహజంగా ఉన్న మనిషి రూపం పొందుతుంది. తన కొడుకు సాధన్‌కి, "అమ్మా, అని పిలవకు, నాయనా!" అని చెప్పిన అదే మనిషి, "సూర్యాస్తమయం నుండి సూర్యోదయం వరకే నేను నీకు అమ్మను, పగలంతా నేను ఠకురానీనని" చెపుతుంది. కానీ ఆమె చనిపోయే ముందు పగటిపూట అతను 'అమ్మా' అని పిలవటానికి ఒప్పుకుంటుంది. దేవత్వం నుంచి ఆమె ముక్తి కావాలని కోరుకోటం ఈ సంఘటనతోనే మొదలవుతుంది. ఆ తర్వాత డాక్టర్ అనాది ఆమె కళ్ళల్లో 'ఒక విచిత్రమైన అలౌకిక భావం' చూస్తాడు - "మృత్యువు దగ్గర పడినప్పుడు తప్ప మనిషి కళ్ళు ఇంత అందంగా కనిపించవు". ఆమె కూడా మామూలు ఆడదే అని చెప్పటానికి రచయిత్రి ఆమెని 'డాక్టర్ అనాది బల్లమీద ఉండుండి భరించలేని బాధని అనుభవించే యువతులతో' పోలుస్తుంది. 'మంత్రగత్తె'లాగ, శ్రీపద్‌మాల్‌లాగ, జటీ ఠకురానీ మరణించిన తరవాత ఆమె పాత్రకి ఒక ఉదాత్తత చేకూరుతుంది. 'ఒక శూద్రురాలు, పేదరాలు, అభాగ్యురాలు చనిపోయినట్టుగాలేదు. ఎవరో పెద్ద దానశీలురాలు, మర్యాదస్తురాలు చనిపోయినట్టు, అంత జనం!'

'మంత్రగత్తె'కీ 'సాయం-సంధ్యల తల్లి'కీ ఒకే పోలిక ఉన్నది. శూద్రులైన కాటికాపర్ల జీవితం వెనక హరిశ్చంద్రుడి కథ ఉన్నట్టే, బోయవాళ్ళు కూడా జరాబోయ దేవుణ్ణి హత్య చెయ్యటంవల్లే శాపగ్రస్తులైనారు. అడవుల్లో నివసించేవారి ప్రేమకథ కూడా మలిందర్-చండీల కథలోనూ, జటీ-ఉత్సవ్‌ల కథలోనూ కనిపిస్తుంది. మలిందర్‌లాగే జటీ, ఉత్సవ్‌కూడా తమ కులవృత్తి వదిలేసి వేరే పని చేసుకుంటూ ఉంటారు. 'నువ్విప్పుడు నీ జాతికన్నా పైకి ఎదిగిపోయావు, నీ తరగతి మారిపోయింది'. కానీ వాళ్ళు కొన్ని తరాలుగా ఎదుర్కొంటున్న భయాలు మట్టుకు అలాగే ఉంటాయి. స్వజాతికన్నా పైకి ఎదగాలనీ, పాత జీవితం తాలూకు గుర్తులని చెరిపేసుకోవాలనీ ఎంతో ఉత్సాహమూ కోరికా ఉన్నా, భయంవల్ల చాలా కాలం ఏమీ చెయ్యకుండానే వ్యర్థంగా గడిచిపోతుంది. ఉత్సవ్ బతికున్నన్నాళ్ళూ జటీ ధైర్యం చెయ్యలేక, కోరిక-భయం అనే రెండు భావాలమధ్య కొట్టుకుంటూ ఉంటుంది. అతను పోయాక ఎంత ప్రయత్నించినా ఆమె మళ్ళీ తన జాతివాళ్ళని కలుసుకోలేకపోతుంది. వాళ్ళని వెతికి పట్టుకోలేకపోతుంది. 'తన చుట్టూ దేవత్వం అనే గోడని' కట్టుకుని జటీ తనని తాను కాపాడుకుంది. 'సాయంకాలం అవగానే

ఠకురానీ సాధన్ తల్లిగా మారుతుంది. ఠకురానీగా ఉండగా సంపాదించిన బియ్యం, తల్లిగా మారాక వండి తన కొడుక్కి పెడుతుంది.' తనని తాను కాపాడుకోటానికీ, కొడుకుని బతికించుకోటానికీ జటీ 'పవిత్రత', 'దైవత్వం' అనే ఆయుధాలని వాడింది. కానీ అవి ఎంత పనికిమాలినవో, అసహ్యించుకోవలసినవో, సాధన్ పురోహితుడి దగ్గర్నుంచి బియ్యం మూట లాక్కునే సంఘటనలో స్పష్టమౌతుంది. అనుకోకుండా, అకస్మాత్తుగా జరిగిన ఈ అనాచారానికి మానవతాదృష్టి ఆపాదించి, సగటు మనిషి జీవితంలో ఉండే వాస్తవికతను చిత్రించటానికి, మహాశ్వేతాదేవి తన ప్రత్యేక బాణీలో ఈ విధంగా సమర్థిస్తుంది - 'మెడకి బియ్యం మూట తగిలించుకుని సాధన్ ఇంటికి వచ్చాడు. సాధన్ ఇంటికి వచ్చి పొయ్యి అంటిస్తాడు. అన్నం వండుకుంటాడు. ఉడికిన అన్నం వాసన బలే బావుంటుంది. బియ్యం ఉన్నన్నాళ్ళూ సాధన్ అన్నం వండుకుని వేడి వేడి అన్నం తింటాడు. అతను వేడి అన్నం తిన్నన్నాళ్ళూ వాళ్ళమ్మ అతనితోటే ఉంటుంది. తల్లి జ్ఞాపకం వచ్చి తను పురోహితుడితో అలా ప్రవర్తించి ఉండకూడదని సాధన్ బాధపడ్డాడు. అతనికి కన్నీళ్ళు వచ్చాయి. మనసులోనే తల్లితో, "అమ్మా, ఎలాగో ఒకలాగ నువ్వు స్వర్గానికి వెళ్ళిపో! సాధన్ ఇక అన్నం వండుకుని తింటాడు. నువ్వు తప్పుగా అనుకోవద్దు" అని చెప్పుకున్నాడు.'

సాధన్ కాందోరీ మందబుద్ధీ, అమాయకత్వంలో ఒక నగ్నసత్యం ఉన్నది. ఆకలి ఎంత వాస్తవికమైనదో చెప్పి, మనిషికి ఆకలి తీర్చుకోవటం అన్ని అవసరాల్లోకీ అతి ముఖ్యమైనదన్న నగ్నసత్యాన్ని చెపుతుంది. ఈ నగ్నసత్యమే 1436 శకంలో చైతన్యుడి కాలంలో జరిగినట్టు రాసిన 'వెల్లువ' కథలోని పిల్లవాడు చీనివాస్‌లోనూ కనిపిస్తుంది. వీళ్ళిద్దరి దృష్టిలోనూ న్యాయానికీ, ధర్మానికీ ఆకలి తీర్చుకోటానికీ ఏమీ తేడా లేదు. ఒక వింతైన 'నిందాస్తుతి' ద్వారా, ఆకలిగొన్నవాడికి భోజనంపెట్టి బతికించటంకన్నా పెద్ద ఆదర్శమూ, న్యాయమూ, పుణ్యమూ ఇంకేదీలేదని మహాశ్వేతాదేవి ఈ కథల్లో చెపుతున్నది. 'వెల్లువ' కథలో ఎంతో కాలంగా ఎదురుచూసిన చైతన్యదేవుడు చీనివాస్ వాళ్ళ ఊరికి రాడు. దీనివల్ల చీనివాస్ ఒక్కడే నిరాశ చెందడు, మిగతావాళ్ళు కూడా ఆయన వచ్చి సమానత్వాన్ని బోధిస్తాడనీ, ఓదారుస్తాడనీ, నేరాలని విని తీర్పు ఇస్తాడనీ ఎదురుచూసి ఎదురుచూసి నిరాశచెందుతారు. వాళ్ళు వచ్చేది, "గౌరాంగ్‌ని దర్శించుకోటానికి మాత్రమేకాదు, ఆకలిమంటల బాధ భరించలేక కూడా." చాలాకాలం క్రితం గంగానదికి

వరదలొచ్చాయి. ఆ దెబ్బతో తాత్కాలికంగా జాతిభేదాలు అందరూ మరిచిపోయారు. ధనవంతులైన పైజాతివాళ్ళు శూద్రులకీ, బీదవాళ్ళకీ తిండిపెట్టి ఆదుకున్నారు. ఆ ఒక్క సందర్భంలో ఆటవిక జాతులవాళ్ళు తృప్తిచెందారు. జాతి భేదాలు పాటించనందువల్ల వాళ్ళ మనసులకి కూడా శాంతి లభించింది. అందువల్ల చీనివాస్ చైతన్యదేవుడి సమయంలో వచ్చిన వరద మళ్ళీ వస్తుందని ఆశించటంలోనూ, కోరటంలోనూ తప్పేమీలేదు. ఈ రెండు వరదల గురించీ ప్రస్తావించటంలో మహాశ్వేతాదేవి ఉద్దేశం, దయా-దాక్షిణ్యాలూ, హృదయ పరివర్తనా గొప్పవాళ్ళ మధ్యా బీదవాళ్ళ మధ్యా, పైజాతివాళ్ళ మధ్యా తక్కువజాతివాళ్ళ మధ్యా సమానత్వం తీసుకురాలేవు, ఏదో ఒక బలీయమైన మార్పు సంభవిస్తేకాని ఇది సాధ్యంకాదు, అని చెప్పటమే.

పాత జ్ఞాపకాలూ, అలవాట్లూ, నమ్మకాలూ, చేతకానితనమూ, భయమూ ఆటవికులని అణచిపెడతాయి. అంతేకాక, ఇవి వాళ్ళ మనసులమీదా, వ్యక్తిత్వంమీదా చాలా ప్రభావం చూపుతాయి. ఈ ప్రభావం మొదట్లో వాళ్లు జీవించే పద్ధతీ, నేర్పరితనమూ, కల్పనాశక్తీ ద్వారా ప్రకటితమౌతుంది (జటీ ఠకురానీలాగ). ఇంకొకప్పుడు మనిషిలో ఉన్న మానవత్వం నిద్రలేచి తన పాతజీవితాన్ని మరిచిపోయేటట్టు చేస్తుంది (మంత్రగత్తె రైలుని ఆపేందుకు చేసిన బ్రహ్మప్రయత్నంలాగ). 1970 దశాబ్దిలోని మొదటి భాగంలో ఈ విధమైన కథావస్తువులే మహాశ్వేతాదేవిని ఆకర్షించాయి. ఈ భయం ఆటవికులలో మట్టుకేకాదు, మధ్యతరగతికి చెందినవాళ్ళ భయాలని 'రాంగ్ నంబర్' కథలో చూడచ్చు. 1972లో రాసిన ఈ కథని ఒక కోణంనించి చూస్తే ఒక సూక్ష్మమైన విభజనరేఖ ఆమె కథల్ని విడదీస్తూ కనిపిస్తుంది. ఇది కళ్ళకి కనిపించేది కాదు, కానీ తేడా చదివేవారికి తెలుస్తుంది. 'ద్రౌపది' (1976), 'విత్తనాలు' (1977), 'వేట' (1978) ఈ కథల్లో ఒకవిధమైన విద్రోహ భావం కనిపిస్తుంది. ఆటవికులు యుద్ధానికి దిగారు. 'ద్రౌపది'లో ఈ విద్రోహం సంఘటితంగా జరిగితే, మిగతా రెండు కథల్లోనూ వ్యక్తిగతంగా జరుగుతుంది. ఈ విద్రోహం అన్యాయాన్ని సహిస్తూ, చస్తూ బ్రతుకుతున్న ఆటవికుల జీవితాన్నుంచే పుట్టింది. ఏ రాజకీయవాదుల ప్రోద్బలంవల్లనో, ఇంకొకళ్ళు చెప్పగా వాళ్ళలో కొత్త చైతన్యం రావడంవల్లనో వచ్చింది కాదు.

అయినప్పటికీ, డెబ్భైయవ దశాబ్ది చివరిభాగంలో రాసిన ఈ మూడు కథలలోనూ, అదే కాలంలో రాసిన ఈ సంకలనంలో లేని, మిగతా కథలలోనూ ఎటువంటి తేడా లేదు. 'విత్తనాలు' కథలో దూలన్ గంజూకి అనిపిస్తుంది - "జీవించటం ఎలా అని ఆలోచించటంలోనే కాలం గడిచిపోయింది. తన పిల్లలతోనూ, మనవలతోనూ మాట్లాడటానికే అవకాశం దొరకలేదు. జీవితం తనమీద వేసిన బరువుని వదిలించుకోటానికి - శ్రమించి కాదు, తెలివితేటలు ఉపయోగించి, ప్రతిసారీ, అన్ని రకాల పరిస్థితుల్లోనూ అతను ఇతరులని మోసగించి పని జరిపించుకున్నాడు." కానీ దూలన్ జీవితంలో జరిగిన సంఘటనలూ, అతని వెనుకనున్న చరిత్రా అతన్ని ఇలా బతకనివ్వలేదు. మహాశ్వేతాదేవి కథల్లో కనిపించే ఈ చారిత్రాత్మక స్పృహ కేవలం ఆమెకి మాత్రమే కాదు, ఆమె సృష్టించిన పాత్రల్లో కూడా కనిపిస్తుంది. వాళ్ళమధ్య నివశించటం ద్వారా వారి అవగాహన తన స్పృహకి స్ఫూర్తినిచ్చింది. చరిత్ర నుంచి తీసుకున్న సంఘటనల్ని ఆమె పురాణాలలాగానో, మిథ్‌లాగానో రూపకల్పన చేస్తుంది - ఒక కొత్త పాటద్వారా. ఉదాహరణకి - ధతువా పాడే పాట "ఎవరు చెబుతారండి వాళ్ళ ఆచూకీ? పోలీసోళ్ళ లెక్కల్లో జమ అయ్యారేమో!" పురాణాలకీ, ప్రకృతికీ ఉన్న అవినాభావ సంబంధం గురించి చెబుతూ - చనిపోయినవారి శరీరాలు పాతిపెట్టినచోట ప్రాణాలు సంచరించి కొత్త మొక్కలూ, పువ్వులూ ప్రాణం పోసుకోటం - చిత్రించటం ద్వారా ఈ రూపకల్పన జరుగుతుంది. 'ధతువా మిమ్మల్నందర్నీ నేను విత్తనాలుగా మార్చేశాను' అంటాడు దూలన్. కొత్తజీవితం మొలకెత్తిన ఆ తరుణంలో ఆదిమ మానవుడి రక్తంలో వున్న ఉద్రేకం, ప్రతీకారం తీసుకోవాలన్న ఒక పైశాచిక భావాన్ని జాగృతం చేస్తుంది. జన్మ, మృత్యువు రెండూ కలిసే ఉంటాయి, వాటిని వేరు చెయ్యటం సాధ్యం కాదు. ఈ యదార్థం నవపురాణంగా మారి, పాత అలవాట్ల సంకెళ్ళని తెంచుకుని, కొత్త యుగం ప్రారంభం కావటానికి దోహదం చేస్తుంది.

'వేట' కథలో ఆటవిక జాతికి చెందిన మేరీ ఓరాంవ్ ఇంగ్లీషు వానికి పుట్టిన అక్రమ సంతానం అవటంవల్ల రెండు జాతుల గుణాలూ, ఆచార వ్యవహారాలూ ఆమెలో కలగలిసి ఉంటాయి. 'ఆటవికజాతి యువకులకి మేరీ శరీరం రంగు ఒక అడ్డుగోడలా ఉంటుంది.' 'తెల్లవానికీ ఆటవికస్త్రీకీ పుట్టినదవటంచేత ఓరాంవ్ జాతివాళ్ళు ఆమెని తమ జాతి మనిషని ఒప్పుకోరు. అలాగే తమ జాతి నియమాలు

కూడా ఆమె పాటించాలని అనుకోరు. ఈ రకంగా ఆమెకి స్వాతంత్ర్యం లభించటంవల్ల ఆమెకి ప్రత్యేకమైన హక్కులూ, శక్తీ వస్తాయి. వాళ్ళే ఒప్పుకుంటారు, "మేరీలో ఒక నిజాయితీ ఉన్నది, ఆస్ట్రేలియన్ రక్తం తాలూకు చలాకీతనం ఉన్నది". తన జాతినుంచి విడివడిన మేరీ 'మంత్రగత్తె'లాగే తనకంటూ ఒక 'పవిత్రత' సంపాదించుకుంటుంది. ప్రతీకారం తీర్చుకోటం ద్వారా ఆమెకి ఈ 'పవిత్రత' చేకూరుతుంది. పైజాతివాళ్ళకి సహజంగా దొరికే 'పవిత్రత' కిందిజాతివాళ్ళని పీడించటానికీ, అవమానించటానికీ హక్కునిస్తుంది. దానికి విరుద్ధంగా మేరీ 'వేట' అనే తమ జాతిలోని పాత ఆచారం యొక్క పవిత్రత ఆధారంగా న్యాయాన్ని పొందుతుంది. ఆమె ఇప్పుడు తోహరీ బజారులో అమ్మకం చేసుకునే మనిషి కాదు, ప్రసాదుగారికి లాభం వచ్చేట్టు బేరాలాడే పనిమనిషిలాగా కాదు. ఈ 'పెద్ద జంతువుని' వేటాడాక ఆమెకి పునర్జన్మ దొరికినట్టవుతుంది. ఆమె ప్రతీకారం పౌరాణిక స్వరూపం పొందుతుంది. "కాలవలో దిగి స్నానం చేసేటప్పుడు ఆమె ముఖం ఒక వింత తృప్తితో, మగవాడితో కలిశాక కలిగే శారీరక సుఖం పొందినట్టుగా, మెరిసిపోయింది." ఆ తరవాత మేరీ ఓరాంవ్ పూర్తిగా ఇంకో మనిషిగా మారిపోయింది. 'సారా-పాటలూ, సారా-నాట్యమూ' వీటిలో పూర్తిగా మునిగిపోయి ఆమె తన జాతి జీవనంలోని మాధుర్యాన్ని చవిచూస్తుంది. కొత్తగా ఆమెకి లభించిన హక్కు, అందరికన్నా 'పెద్దవేట' చేసినవాళ్ళకి దొరికే హక్కు సంపాదించుకుంటుంది. మేరీ ఓరాంవ్ కూడా దళితులై, పరాజితులై పీడింపబడే తమ జాతి వాళ్ళ ప్రాచీనశక్తిని తెలుసుకున్న క్షణాన, ఆమెకి తన జాతివాళ్ళమీద గౌరవం పెరుగుతుంది. కానీ అదే సమయంలో ఆమె తన జాతివాళ్ళకన్నా చాలా ముందుకి కూడా వెళ్ళిపోతుంది. ఆమెకి ఈనాడు దొరికిన ప్రాచీనశక్తి ప్రస్తుతం తన జాతివాళ్ళ దగ్గర కూడా లేదు. వాళ్ళు ఆమె ఎత్తుకి ఎదగలేదు. అందుకే ఆమె జాలిమ్‌తో తన భవిష్యత్తు గురించిన పథకాలు కొత్తగా వేసుకుంటుంది.

నవపురాణం భాషలోనే మహాశ్వేతాదేవి రాస్తుంది : "నాట్యం చేస్తూనే మేరీ వెనక్కి వెళ్ళసాగింది. వెనక్కి వెళ్ళి వెళ్ళి చీకట్లో కలిసిపోయింది. అందరూ నాట్యం చేస్తున్నారు, మైమరచి ఆడుతున్నారు. మేరీ మట్టుకు చీకట్లో పరిగెత్తసాగింది." చరిత్ర పుటలు తిరగేస్తే అందులో గతమూ, భవిష్యత్తూ ఒకదానితో ఒకటి పెనవేసుకుని ఉంటాయి. అప్పుడు గతంలో కనిపించిన మార్గమే భవిష్యత్తుకి

కూడా మార్గదర్శకమౌతుంది. అందుకే వేటాడి ప్రాచీనశక్తిని సంపాదించుకున్న మేరీ బస్సెక్కి వెళ్తుంది. కలప చేరవేసే లారీలో కూర్చుని, "రాంచీ - హజారీబాగ్ - గోమో - పాట్నాకి వెళ్తుంది. అడవిలోని చీకటి సృష్టించే మాయాజాలంలో బతకదు. చీకట్లో, నక్షత్రాల వెలుగులో మెరుస్తున్న రైల్వేలైనుని చూస్తూ నడుస్తున్న మేరీకి భయం వెయ్యలేదు. ఏ జంతువైనా మీదపడుతుందనీ భయపడలేదు. ఆరోజు ఆమె అన్నిటికన్నా పెద్దజంతువుని చంపింది. అందుకే నాలుగుకాళ్ళ అడవి మృగాలంటే ఆమెకి మామూలుగా ఉండే భయం పూర్తిగా తుడిచిపెట్టుకుపోయింది."

అడవినుంచి రైల్వేలైను వరకూ ఆమె చేసిన ప్రయాణం చరిత్రకి సంబంధించిన అమోఘమైన యాత్రాపథమే!

మేరీ తనకు తానై అడవినుంచి రైల్వేలైను వైపు వెళ్తుంది. "ద్రౌపది" కథలో దోప్దీ మేఝన్‌ని, పోలీసులు నమ్మకద్రోహం చేసి కూలీలతో గూడుపుఠాణీ చేసి, అడవిలో ఉండగా పట్టుకుని సేనాపతి కేంప్‌కి తీసుకెళ్తారు. ఇది కూడా చరిత్రలో ఇంతకు మునుపు జరిగినదే. 'వేట', 'ద్రౌపది' ఒకే కథకి రెండు భాగాలు. మేరీది 'తెల్లదొరల రక్తం'. ద్రౌపదిలో ప్రవహించేది చంపాభూమి నివాసుల పవిత్రమైన నల్లటి మానవుల రక్తం. దాన్లో ఎటువంటి కల్తీ లేదు. 'చంపా నుండి బాకులీ వరకూ ఎంతో దూరం కూడా లేదు. రక్తంలో కల్తీ జరిగి ఉండవచ్చు. దోప్దీ తన పూర్వీకులని తలుచుకుని గర్వపడింది. వాళ్ళు తమ ఆడవాళ్ళ రక్తాన్ని ఒక రకమైన చెట్టు విషం తీసుకుని కాపాడేవారు. సోమయీ, బుధనా, ఇద్దరూ అక్రమ సంతానమే. యుద్ధం తాలూకు పుట్టారు! "శియన్‌డాంగాలో ఉన్న అమెరికన్ సైనికులు రాఢ్ భూమికి ఇచ్చిన బహుమతులు!" మేరీ తన జాతివాళ్ళని విడిచిపోవలసి వస్తుంది. తిరుగుబాటు చేసిన దోప్దీ తన జాతివాళ్ళకి మరింత దగ్గరౌతుంది. నిజానికి ఈ తిరుగుబాటువల్ల ఈ జాతివాళ్ళ సమాజం ఇంకా విస్తృతమైంది - ఇందులో పట్నంనుంచి వచ్చిన యువకులున్నారు. నిర్దయగా జరిపే యుద్ధ తంత్రానికి వాళ్ళు పథకాలు వేస్తారు. అరిజిత్ అంటాడు, "ఎవరైనా పట్టుబడితే టైము చూసుకుని హైడ్ అవుట్ ఛేంజ్ చేసెయ్యండి. నిజమైన కామ్రేడు ఎప్పుడూ తనకోసం మిగతావాళ్ళకి హాని కలగనివ్వడు" అని. అందుకే ఆ జాతికి సహజంగా ఉండే చైతన్యం ద్రౌపదిలోనూ కనిపిస్తుంది. మేరీలో ఉన్న ఆ గొప్ప శక్తి "ఒకసారి,

రెండుసార్లు, మూడుసార్లు" అని ఆమె చేసిన ఆక్రోశం నుండి వెలువడి, కథ చివరిభాగం నాటకీయంగా ముగుస్తుంది. అడవిలో ఆమె పెట్టిన ఆ కేకల ప్రతిధ్వని మళ్ళీ శత్రుశిబిరంలో వినిపిస్తుంది. 'ఇదిగో, కౌంటర్ చెయ్యి...' దోప్డీ ఎత్తుకు పై ఎత్తు వేసి సేనాపతికి కలిగించిన భయాన్ని 'వేట' కథ చివర్లో మేరీ వదిలించుకుంటుంది. "ద్రౌపది గాయపడిన తన రొమ్ముల్తో సేనాపతిని తొయ్యటం మొదలుపెట్టింది. జీవితంలో మొదటిసారి నిరాయుధురాలైన టార్గెట్ ముందు నిలబడటానికి సేనాపతి భయపడ్డాడు, హడలిపోయాడు కూడ."

'వేట' కథకి ఆధారం అడవి. ఆ కథ జరిగేదీ అడవి ప్రాంతంలోనే. 'ద్రౌపది' కథలో ఇతివృత్తం. అడవికీ, ప్రభుత్వానికీ మధ్య పోరాటం. అందుకే ఈ కథలో భాష పాత్రానుగుణంగా ఉంటుంది. ఇంగ్లీషు పదాలు అధికారాన్నీ, ప్రభుత్వాన్నీ, దాని శక్తినీ వ్యక్తపరుస్తాయి. డోసియర్‌లో ఉన్న ఇంగ్లీషు భాష ప్రభుత్వాధికార్లు వాడేటప్పుడు కొద్దిగా మార్పుచెంది వికృతమౌతుంది. ఇక్కడ ప్రభుత్వం తరపున మాట్లాడే మనిషి, సేనాపతి. అతడిని కేంద్రంగా పెట్టుకుని మహాశ్వేతాదేవి ఈ కథలో భాషని ఉపయోగించిన పద్ధతి, సత్తా ఎంత బలమైనదో తెలియజేస్తుంది. ఇన్ని రకాల భాషల తెరలని చీల్చుకుంటూ దోప్డీ : 'ఇదిగో, కౌంటర్ చెయ్యి...' అనటంతో ఆ తెరలు తెగిపోయినట్టవుతుంది. ప్రభుత్వం తలకిందులై బోర్లా పడుతుంది. అలాగే తీవ్రమైన శారీరక హింసని అనుభవించిన దోప్డీ తిరగబడి రోషంతో బుసలు కొట్టినప్పుడు భాష అర్థమే మారిపోతుంది.

మహాశ్వేతాదేవి తన కథల్లోనూ, నవలల్లోనూ ఎన్నుకున్న అభివ్యక్తి ఒకపక్క వాస్తవాన్ని అద్దంపట్టి చూపుతూనే ఇంకోపక్క చరిత్రలో నిరంతరం జరిగే మార్పులని కూడా ఎత్తి చూపుతుంది. ఇక్కడ చరిత్ర అంటే కేవలం గతాన్ని గొప్పగా చిత్రించటం కాదు. అయితే గతంనుంచి భవిష్యత్తులోకి వెళ్ళే మార్గాన్ని చూపించటం మాత్రమే. కేవలం భవిష్యత్తు చాలా చక్కగా ఉండబోతుందనీ, జీవితం మార్పులు చెంది ఇంకా బావుంటుందనీ ఆశచూపించటం కాదు, పురాణ కథల్లోలాగ వర్తమానంలోనే భవిష్యత్తుని చూపించే సరళి కనిపిస్తుంది. నిజానికి ఇలా జరగదు, జరిగి ఉండదు. ఒకవేళ జరిగినా హఠాత్తుగా, అనుకోకుండా ఎక్కడైనా జరిగి ఉండవచ్చు. ఈ కల్పనకి మహాశ్వేతాదేవి ఒక పురాణకథ వంటి రూపం ఇచ్చింది. ఇది వాస్తవికతలో నుంచి పుట్టినా వాస్తవికత హద్దుల్ని దాటిపోతుంది. ఆమె ఈ వాస్తవికతని సాగదీసి దానిలోనే

సాంఘిక - ఆర్థిక - రాజకీయ వాస్తవికతనీ, వీటిమధ్య నిరంతరం జరిగే సంఘర్షణనీ, తన భాషా పటిమవల్ల ఎలా చిత్రిస్తుందంటే ఇదేదో కల్పనలాగ కాకుండా సహజంగా అనిపిస్తుంది. దోప్దీ మేఝేన్, దూలన్ గంజూ, చండీ గంగాదాసి, శ్రీపద్‌మాల్, జటీ ఠకురానీ - వీళ్ళందరూ నిజజీవితంలోనించి వచ్చి కూడా ఆ వాస్తవమైన మనుషులకి ఇంకా విస్తృతమైన వ్యక్తిత్వాన్ని సమకూర్చే సజీవ పాత్రలుగా రూపొందాయి.

**- శమీక్ బంధ్యోపాధ్యాయ**

# వెల్లువ

భాద్రపద మాసంలో 'రసోయి పూజ' రోజు వచ్చింది. ఆ సమయంలో అందరూ 'మనసా' చెట్టుకోసం వెతుకుతారు. రూపసి బాగదీనీ కొడుకు చీనివాస్ కూడా 'మనసా' చెట్టు వెదుకటానికి వెళ్ళాడు. ఈ నెలలో పూర్వస్థలి గ్రామ ప్రజలు 'మనసా' మొక్కను దొడ్లో పాతుతారు. పూజచేసి చెట్టుకి మొక్కి - 'ఇల్లు ఇవ్వు, పొలంలో ధాన్యం పండించు, ఆవు పొదుగులో పాలు నింపు, చెరువులో చేపలు నింపు, కోడళ్ళకు కొడుకుల నివ్వు' అని ప్రార్థిస్తారు. కాని ప్రతి ఇంట్లోనూ 'మనసా' మొక్క ఉండదు. 'రసోయి పూజ' అయిన మర్నాడు ఇంట్లో వంట వండరు.

"అమ్మా, రసోయి పూజ చెయ్యటంలేదా?" చీనివాస్ అడిగాడు.

"లేదురా నాన్నా, ఈసారి చెయ్యటంలేదు."

"ఎందుకమ్మా?"

"ఇదే రోజు మీ పెదనాన్న చనిపోయారుగదూ!"

"నీకెవరు చెప్పారు?"

"నాకు తెలుసు."

చీనివాస్ మరేం మాట్లాడలేదు. కాని అతని ఆలోచనలు వెనక్కి పరుగెత్తాయి. నిరుడు ఇదేరోజు అమ్మ పెందలాడే పొయ్యి రాజేసి ఓపిగ్గా ఎన్ని రకాల వంటలు చేసిందో! షోలచేపల కూర, కొబ్బరివేసి ఆకుకూర, పూంటీ చేపల కూర, మాయరా చేపలు, వంకాయ పులుసు, బియ్యప్పిండి చేమదుంపల కూర, తాటిపళ్ళ రసంతో మిఠాయి ఉండలు!

మర్నాడు కూడా చీనివాస్ రెండుపూటలా కడుపునిండా తిన్నాడు.

ఈయేడు అన్నీ కష్టాలే. గంగానదికి వరదలొచ్చాయి, ఖోడేనది కూడా పొంగుగా ఉంది. అరుణా నదిలో మూడు వెదురు బొంగులు ఒకదానిమీద ఒకటి నిలువుగా పెట్టినా మునిగిపోయాయట, ఎవరో అనుకుంటుంటే చీనివాస్ విన్నాడు. ఎవరినోట విన్నా ఒకటేమాట - వరదలొస్తున్నాయి, వరదలొస్తున్నాయి! వరదలెలా

ఉంటాయో చీనివాస్ ఎప్పుడూ చూడలేదు. చీనివాస్ తల్లి చిన్నపిల్లగా ఉన్నప్పుడు కటువా దగ్గర గంగ పొంగి వరదలొచ్చాయట.

చీనివాస్ వాళ్ళమ్మ కొబ్బరాకులకి ఈనెలు తీస్తోంది. ఏడో ఎనిమిది చీపుళ్ళు తయారుచేస్తేగాని ఆచారి ఇంటివాళ్ళ పని పూర్తికాదు.

"అమ్మా, వరద ఎలా ఉంటుందీ?"

చీనివాస్ ప్రశ్న విని రూపసి ఉలిక్కిపడింది. "ఈసారి చూద్దువుగాని" అంది.

రూపసి వాళ్ళమ్మ తుమ్మచెట్టు జిగురుతో చేపలుపట్టే బుట్టని పాలిష్ చేస్తోంది. "తప్పకుండా చూస్తావురా, వరదొస్తోంది, కుక్కలు, నక్కలు మనుషులని పీక్కుతింటాయి" అంది.

"ఏమిటమ్మా ఆ మాటలు?" రూపసి తల్లిని మందలించింది.

"నీకు తెలియని విషయం ఒకటుంది. చీమలూ, చిన్న చిన్న పురుగులూ నీళ్ళలో కొట్టుకుపోతాయి. ఏనుగులూ, గుర్రాలు చావు తప్పించుకుంటాయి. అలా అని శాస్త్రాల్లో రాసి ఉంది."

"మరయితే ఈ వరదలో ఎవరూ చచ్చిపోరని అందరూ అంటున్నారే?" చీనివాస్ తన సందేశం వెళ్ళబుచ్చాడు.

"ఓహో! గోరా ప్రేమ్ వరద గురించి చెప్తున్నాడా? దాన్ని గురించి నాకు తెలీదు, బాబూ. నే విన్నదేమిటంటే - శాంతిపూర్‌నుంచి కటువా వరకు ఏ నోట విన్నా ఇదే మాట. విని చాలానవ్వుకున్నాను. బజారు కెళ్తున్నప్పుడు కూడా అందరూ ఇదే విషయం మాట్లాడుకోటం విన్నాను. కాని ఎవర్నడిగినా, విషయమేమిటో మాకెవ్వరికీ సరిగ్గా అర్థం కాలేదనేవారే. గొప్పవాళ్ళని నిమ్నజాతివాళ్ళుగానూ, అట్టడుగువాళ్ళని గొప్పవాళ్ళగానూ చేసేస్తానని ఆ సన్యాసి గౌరాంగ్ తెగ గంతులు వేస్తున్నాడు. అది విని నేనడిగాను, "అంటే మనం ఠాకూర్ల చెరువులో నీళ్ళు పట్టుకోవచ్చా? వాళ్ళలాగ మంచాలమీద పడుకోవచ్చా? మంచి మంచి వంటకాలన్నీ, చెరుకు ముక్కల్నీ, పప్పులూ తినవచ్చా? ఇవన్నీ దొరక్కపోతే నేను గోరా ప్రేమ్ సృష్టించే వరదలో ఎందుకు మునుగుతాను?" నా మాటలకి అందరూ తలలూపారు. నేను నా దూడని పట్టుకుని వచ్చేశాను. ఇదేం వరదరా బాబూ!"

"అమ్మా!" రూపసి గట్టిగా అరిచింది.

"వరదల్ని నువ్వు చూడు కావాలంటే! అవి చూసి చూసి నాకు విసుగెత్తింది"

అంది తల్లి

"అమ్మా నువ్వు గౌరాంగ్‌ని చూడటానికి వెళ్ళలేదుకదా?"

"నేనెందుకు వెళ్తాను? అతనేమైనా నాకు తిండిపెడతాడా?"

"అయితే వెళ్ళి చేపలు పట్టుకోరాదూ?"

"ఒసే, ఎంత పొగరే నీకు! అందం చూసుకునా? చేపలు పట్టటం అంత నామోషీ అయిందా నీకు? ఆ చేపలు పట్టేకదా నిన్ను పెంచి పెద్ద చేశాను?"

గాలి జోరు పెరుగుతోంది. మనసా మొక్క తీసుకురావాలా అక్కర్లేదా అని కనుక్కోటానికి చీనివాస్ తుపాను వచ్చేలోపల ఆచారి ఇంటికి బైలుదేరాడు.

పూర్వస్థలిలోని ఆచారిది చాలా సాంప్రదాయమైన, సంపన్న కుటుంబం. 1425 సం॥ము రోజుల్లో రోజూ బీదవాళ్ళకి అన్నదానం చెయ్యగల స్తోమత చాలా తక్కువమందికి ఉంది. కాని పెద్ద ఆచారి ముంగిట్లో మధ్యాహ్నం లోపల కనీసం వంద విస్తళ్ళు లేస్తాయి. నవద్వీపంలోని గౌరాంగ్ సన్యాసి గురించిన వార్తలు ఈ మధ్యన వాయువేగంతో వస్తున్నాయి. గౌడ ప్రదేశంలోని శాంతిపూర్ వెళ్ళి 'మాత'ని దర్శించుకుని ఆ తరవాత నీలాచల్‌వేపు వెళ్తున్నారట. పెద్ద ఆచారిగారు ఇదే అదనుగా నిమయి ఠాకూర్‌ని రెండ్రోజులు తన ఇంట అతిథిగా ఉంచుకోవాలనుకుంటున్నారు.

ఆచారి భార్యకి సందేహం వచ్చింది. పెద్ద ఆచారి జమీందార్లనీ, తాలూకాదార్లనీ, డబ్బూ, పేరూ ఉన్నవాళ్ళని గౌరవించడం ఆవిడ ఎరుగును. కాని ఈ సన్యాసి యువకుడు, ఆయనని ఎందుకు గౌరవించాలనుకుంటున్నారో ఆమెకు అర్థం కాలేదు. ఆయన్నే అడిగింది :

"ఎందుకేమిటి? నువ్వెందుకు పదిమందికి అన్నం పెడుతున్నావ్?"

"పుణ్యంకోసం."

"ఆఁ పుణ్యంకోసం! దీన్నే శ్రీవృద్ధి అంటారు. పదిమందికి తిండీ, బట్టా ఇస్తే నిన్ను నెత్తిమీద పెట్టుకుంటారు."

"గౌరాంగ్‌ని ఎందుకు గౌరవిస్తున్నారు?"

"అరె! గౌరాంగ్ ఇంకా కొత్త. అతని పేరు వింటే చాలు పదిమంది పొగవుతారు. అతన్ని పొగిడేవాణ్ణి సమాజం గౌరవిస్తుంది. అతను శాంతిపూర్ వెళ్ళినప్పుడు నేతగాళ్ళు సహితం బీదవాళ్ళకి బట్టలు పంచిపెట్టారట. వాళ్ళని అందరూ పొగిడారు. నేను కూడా వాళ్ళలాగ మంచివాణ్ణనిపించు కోవాలను

కుంటున్నాను.''

"మీరా? మీకు డబ్బు కాస్త ఎక్కువ ఖర్చుపెట్టాలంటే భయం కదా! గౌరాంగ్ సన్యాసితోపాటు ఆయన శిష్యబృందం కూడా వస్తుందే! ఎంత డబ్బు ఖర్చవుతుందోనని నేను మధనపడి చస్తున్నాను.''

"సర్లే, నీ ఆడబుద్ధి పోనిచ్చుకున్నావుకాదు! కృష్ణుడి భజనలు పాడుతూ గౌరాంగ్ పిచ్చివాడిలాగ తిరుగుతున్నాడు. అలాంటి మనిషి ఒక్కసారి మనింటికి వస్తే కొంచెం ఖర్చు అయితే అయింది. నీకేం అర్థం కాదులే! మన పేరు ఎంత మారుమోగిపోతుందో ఆలోచించు.''

"ఏం మనిషో అతను? అంటరానివాళ్ళని కూడా పిలిచి మరీ కావలించు కుంటాడట! ఇది విన్నాక నాకు నోటంట మాట రాలేదు.''

"కావిలించుకుంటే ఏం? ఆయన దేహం ఎలాగూ నశించిపోయేదే కదా? ఆయన పోయాక అంటరానివాళ్ళు, "బాగ్‌దీట మళ్ళీ ఎప్పటిలాగే ఉంటారు. కాని ఇవన్నీ నీకెందుకు? వెళ్ళి నీ 'రసోయి' పూజపని కానీ.''

పెద్దావిడ నిట్టూర్పు విడిచి వెళ్ళిపోయింది. ఆచారిగారికేం తీరిగ్గా కూర్చుని చెప్తారు. ఈ వయసులో వందమందికి వంట చేసి పెట్టడమంటే మాటలా? అతిథు లందరికీ భోజనం పెట్టి రాత్రి భోజనానికి అన్నం, పప్పు వండాక తను భోజనానికి కూర్చుంటుంది.

"ఎవర్రా అక్కడ?''

వసారాలో ఒక మూలగా చీనివాస్ వచ్చి నిలబడ్డాడు. "నేను, చీనివాసు నమ్మగారూ!''

"ఏ చీనివాసూ?''

"ఉప్పీ బాగ్‌దీని కొడుకుని.''

"మీకోసం 'మనసా' చెట్టు మొక్కని తీసుకురానా అమ్మగారూ? అందుకే వచ్చాను.''

పెద్దావిడకి ఒళ్ళు మండింది. దేవుడికి ప్రసాదం నైవేద్యం చెయ్యటానికి వెళ్ళేముందు ఈ అంట్లవెధవ వచ్చి పలకరించాడు.

"ఇంత ... ఇంత పెద్ద చెట్టమ్మా!'' చీనివాస్ చేతులు రెండూ ఎత్తి చెట్టు మొక్క ఎంత ఎత్తో చూపించాడు.

వంటింటి గుమ్మంలోంచి వేడి వేడి అన్నం వాసన వస్తోంది. బ్రాహ్మలు అన్నం వండేటప్పుడు దాంట్లో ఎంత నెయ్యి వేస్తారో! పాలుపోసి ఆనపకాయకూర, ముల్లంగి, వడియాలు, కొబ్బరి కలిపి కూరలు ఎంత రుచిగా వండుతారో! వంటకాలు నూనె నెయ్యి వాసనలతో ఘుమఘుమలాడుతూ ఉంటాయి. చీనివాస్ అన్నం తిని ఎన్నాళ్ళయిందో! చాలా రోజులుగా బ్రాహ్మల ఇంట్లో తినలేదు.

"తరవాత చెప్తాను. ఇప్పుడు ఇంటికి వెళ్ళిపో!"

"బ్రాహ్మల రసోయి పూజ ఎప్పుడమ్మగారూ?"

"సోమవారంనాడు."

" 'కచూ' ఆకుకూర తెచ్చిస్తాను మీకు."

"అక్కర్లేదు నాయనా, నువ్వు వెళ్ళు బాబూ."

కూుర్రాడు మాటిమాటికీ 'అమ్మగారూ'' అంటుంటే పెద్దావిడకి మండిపోయింది. రూపసికన్నా బీదవాళ్ళు ఊళ్ళో ఎవరూ లేరు. తినటానికి తిండిలేదు, తైలసంస్కారంలేక జుట్టు జడలు కట్టింది. అయినా దాని అందం ఏమాత్రం మాయలేదు. పిల్లవాడుకూడా బాలచంద్రుడిలా ఉంటాడు. పెద్దావిడ కొడుకుకోసం చెయ్యని పూజలూ, వ్రతాలు లేవు. అయినా మాలకాకిలాగ నల్లటి ఆడపిల్లలు తప్ప మగనలుసు కలగలేదు. అందుకే ఆయన చిన్నావిణ్ణి తెచ్చుకున్నారు.

'కళ్ళతోనే తినేసేలా చూస్తున్నాడు వెధవ!' పెద్దావిడ గొణుక్కుంది. చీనివాస్ ఎక్కడ నిలబడ్డాడా అని కళ్ళు కొనసల్పించి చూసింది. వాకిట్లో ఉన్న సీతాఫలం చెట్టు లక్ష్మణరేఖ. ఇంటిపనుల్లో అన్ని జాతులవాళ్ళతోనూ పనిపడుతుంది. అందరూ సీతాఫలపు చెట్టు అవతల నిలబడి మాట్లాడి వెళ్ళిపోతారు. చీనివాస్ మునివేళ్ళమీద నిలబడి మెడనిక్కించి చూడటం పెద్దావిడ కంటబడింది.

అదే సమయంలో ఆచారిగారి రెండో భార్య పిల్లాణ్ణి ఎత్తుకుని గుమ్మంలోకి వచ్చి చీనివాస్‌ని చూసి గిరుక్కున వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది. ఆవిడ పిల్లవాడు ఎప్పుడూ జబ్బుగానే ఉంటాడు. చీనివాస్ దిష్టి తగిల్తే మళ్ళీ సుస్తీ చెయ్యొచ్చు!

"వాడికి కొద్దిగా పప్పులు ఇచ్చి పంపెయ్యి అక్కయ్యా!" చిన్నవాడి గదిలోంచే అన్నది. "పప్పులు తీసుకుని పోబాబూ. నా పిల్లడివైపు చూడకు."

చీనివాస్ కళ్ళు ఎప్పుడూ ఆకలిగా తిండికోసం వెతుకుతూ ఉంటాయి. వాడికంత ఆకలి ఎందుకో తెలీదు!

"ఇందఁ, పప్పులు తీసుకో."

చీనివాస్‌కి ఏం తోచిందో ఏమో, "అవునుగానీ బాపనమ్మగోరూ! గౌరాంగ్ ప్రభు వచ్చినప్పుడు అందరూ కలిసి కూర్చుని ప్రసాదం తింటారుట కదా?" అని అడిగాడు.

"ఏమిట్రా, వాగుతున్నావు?" పెద్దావిడ గొంతు చించుకుని అరవటం ప్రారంభించింది. ఈ కేకల్లో ఎక్కువభాగం తన భర్తమీద కోపంతోటే.

"అవున్రా! ఆయన అంటరానివాళ్ళతో కలిసి చిందులేస్తాడు, వెయ్యనీ! ఆయన రుషో, మునో, దేవుడో ఏమిటో మాకేం తెలుసు? ఆయన వరద తీసుకొస్తాట్ట. ఆ వరదలో అందరూ కొట్టుకుపోతారట. కాని మనం ఈ ఊళ్ళోనే ఉండాలికదా. ఇక్కడ బతకాలి, ఇక్కడే చావాలి. మనమెందుకు ఆయనతో కలవాలి?"

రూపసి బాగ్దీనిని కూడా ఆవిడ నానామాటలు అంది. తక్కువజాతి మనిషి. కొడుకు అంతే, ఈ గ్రామానికి మచ్చలాంటివాళ్ళు!

చిన్నావిడ గబగబా ఒక గ్లాసులో నీళ్ళూ, ఒక చేతిలో కలకండా పట్టుకుని వచ్చింది. ఏ కారణమూ లేకుండా పెద్దావిడ ఇలాగే అరుస్తూ ఉంటుంది. అరిచి అరిచి నోట నురగలు కక్కుతుంది. అప్పుడు ఒక కలకండ ముక్క తిని, కాసిని నీళ్ళు తాగితే కోలుకుంటుంది.

చీనివాస్ రొంటిన కాసిన్ని పప్పులు కట్టుకుని పరిగెత్తాడు. పరిగెత్తి పరిగెత్తి చెరువు ఒడ్డుకి చేరాడు. చెరువు నిండుగా ఉంది. ఇన్ని నీళ్ళుంటే చేపలు పట్టటం కష్టం. కాని చిన్నవీ పెద్దవీ నత్తగుల్లలు చాలా దొరుకుతాయి. చీనివాస్ అమ్మమ్మ చీపుర్లు కట్టటం అయింది లాగుంది, చెరువులో నత్తగుల్లలు ఏరుతోంది. ముసల్ది క్షణం కూర్చోదు.

"నత్తగుల్లలు పట్టి ఏంచేస్తావే అమ్మమ్మా?" చీనివాస్ ఆశగా అడిగాడు.

వైద్యుడిగారి మామగారికి కంట్లో పువ్వేసిందట నత్తగుల్లలు ఉడకబెట్టి తింటే నయమైపోతుంది. ముసలాయన కూతురు నత్తగుల్లలు అప్పుడప్పుడు తెప్పించుకుంటూ ఉంటుంది. బదులుగా దోసెడు బియ్యమో, చిన్న గుమ్మడికాయో ఇస్తుంది. మనవడితో ముసల్ది, 'ఊరికేనేరా. ఎవరైనా కొంటే సరే, లేకపోతే నత్తగుల్లల గుజ్జు సొరకాయ కలిపి కూర చేస్తాను, నీకు పప్పులు ఎవరిచ్చారు? ఆచార్లావిడా?" అంది.

"ఆఁ" అని చీనివాస్ గబగబా పప్పులు బొక్కటం మొదలుపెట్టాడు.

ముసల్ది మూతి మూడు వంకర్లుతిప్పి ఎవర్నో శాపనార్థాలు పెట్టడం మొదలు పెట్టింది. "అప్పుడెన్ని కబుర్లు చెప్పాడు? ఇవిస్తాను, అవిస్తాను, తిండికీ బట్టకీ లోటులేకుండా చేస్తాను. నీ భారమంతా నాదే - ఆ మాటలన్నీ ఇప్పుడేమైనాయి? మరిచిపోయాడా?"

"ఎవరే అమ్మమ్మా?"

"నీ శత్రువు, మీ అమ్మ శత్రువు."

చీనివాస్ ముసల్దానితో కలిసి చాలాసేపు నత్తగుల్లలు పట్టాడు. కాళ్ళూ చేతులూ తిమ్మిర్లెక్కేవరకు నత్తగుల్లలు ఏరారు. ఇంటికొస్తూ, "పరదకాని వరద కథ చెప్పవా అమ్మమా?" అన్నాడు చీనివాస్.

"ప్రళయం లాంటి వరద" ముసల్ది తలాడిస్తూ అంది.

"అంటే?"

"మీ అమ్మ అప్పుడు చిన్నపిల్ల. చాలా అందంగా ఉండేది. వయసుతో పాటు దాని అందం పెరిగింది. పొద్దున్నించి సన్నతుంపర పడుతూ ఉంది. గాలిలో దూదిపింజలు ఎగురుతున్నట్టుగా ఈదురుగాలి రయ్యిన వీస్తోంది."

"ఆ తరవాత ఏమయింది?"

"వరద ముంచుకొచ్చింది. మేమంతా పెద్ద ఆచారిగారి లోగిల్లో చేరిపోయాం. చాలామంది చెట్లు ఎక్కేశారు, ఇంకా చాలామంది నీళ్ళల్లో కొట్టుకుపోయారు. జనం పురుగుల్లా చచ్చిపోయారు. ఇది చూసి బ్రాహ్మలు అందరికీ తమ ఇళ్ళ వసారాల్లోనూ, ముంగిళ్ళలోనూ చోటిచ్చారు."

"తరవాత?"

కథలో ఈ భాగం చీనివాస్‌కి చాలా ఇష్టం. ఈ భాగం వినటంకోసమే మళ్ళీ మళ్ళీ ఈ కథ చెప్పమని అడుగుతుంటాడు. ఇదంతా వినటానికి ఎంతో ఆశ్చర్యంగా, వింతగా ఉంటుంది. వరదొచ్చినప్పుడు మనుషులందరూ దేవతలైపోయారు, లేకపోతే అలా ఎవరైనా చేస్తారా?

"తిండిలేక జనం చస్తున్నారు. బ్రాహ్మలు బస్తాలనిండా అటుకులూ, పంచదార అచ్చులూ ఇచ్చి అందరి ప్రాణాలు కాపాడారు. అన్నం వండుకోటానికి చోటు దొరికినవాళ్ళకి వాళ్ళు బియ్యం, పప్పులు ఇచ్చారు."

"మరి మా అమ్మకి?"

"దాని బట్టలు చిరిగిపోతే బ్రాహ్మలు దానికి బట్టలిచ్చారు."

"ఆ తరవాత ఏమయింది?"

"గొల్లవాళ్ళ ఇంట్లో మేం ఉండటానికి ఏర్పాటుచేశారు."

"ఆ తర్వాత?"

"ఎండుకర్రలూ, బియ్యం, పప్పు, నూనె, ఉప్పు అన్నీ ఇచ్చారు. నదిలో నీళ్ళు తగ్గిపోగానే అందరూ ఎవరిళ్ళకి వాళ్ళు పోయారు. కాని రూపసి గురించీ దాని తల్లి గురించి ఆచారి చాలా బెంగపడ్డారు." వీళ్ళిద్దరూ ఏ ఆసరాలేక ఎన్ని కష్టాలు పడుతున్నారు!" అని ఆయన ఎప్పుడూ అనేవారు. చాలారోజులు వాళ్ళిద్దరినీ తన దగ్గరే పెట్టుకున్నారు. కొన్నాళ్ళయాక తన నౌకరుకిచ్చి రూపసి పెళ్ళి చేశారు. సంవత్సరం లోపల చీనివాస్ పుట్టాడు. కాని రూపసి మొగుడు జ్వరం తగిలి చనిపోయాడు.

"ఆ తరవాత ఏమయింది అమ్మమ్మా?"

"నువ్వు పుట్టావు. అప్పుడింకా వాళ్ళకి జాలిగుండెలుండేవి. ఈ రోజుల్లోలాగ నాలుగు గింజలిచ్చి నిర్దయగా తరిమేసేవారు కాదు."

చీనివాస్ అమ్మమ్మ తలూపుతూ ఏదో అనబోయి మానేసింది. అదే సమయంలో డోలు మోత వినిపించింది. డోలు వాయించి ఆచారిగారు అందర్నీ వాళ్ళింటికి పిలుస్తున్నారు. భజనలూ, దేవుడి పూజ, ప్రసాదం, గౌరాంగ్ ప్రభువువారి దర్శనం - అన్నీ ఉంటాయి. దివాకర చక్రవర్తిలాటి బ్రాహ్మణులూ, చీనివాస్‌లాంటి అంటరాని వాళ్ళూ అందరూ రావచ్చు.

అమ్మయ్యో! నిజంగానే బ్రాహ్మణులు అందర్నీ వాళ్ళింటికి రానిస్తారా? అందరికీ భోజనం పెడతారా? చీనివాస్ అమ్మమ్మ అర్థమయి అర్థమవకుండా తలూపుతూ కూర్చుంది. ఈ వరద కూడా గంగమ్మతల్లి వరదలాగే ఉందే! అందరూ ఒకేసారి కూర్చుని భోజనం చేసి, అందరూ ఒకేసారి లేస్తారు!

"అటుకులు కాదమ్మమ్మా! అన్నం వండుతారు. నేతితో వండిన పప్పు, కొబ్బరివేసి గుమ్మడికాయ కూర చేస్తారు. గొల్లవాడి పెళ్ళాం బోలెడంత పెరుగు తోడుపెట్టింది, తెలుసా?"

"వెళ్ళు అమ్మకి చెప్పి శుభ్రమైన బట్టలు వేసుకో. కొద్దిగా నూనె తేగలవేమో

చూడు. సన్యాసి జుట్టులాగ జుట్టు జడలు కట్టింది. ఈ వాలకంతో వాళ్ళముందుకు ఎలా వెళ్ళను?"

చీనివాస్ వాయువేగంతో అమ్మకి కబురు చెప్పటానికి వెళ్ళాడు. రూపసి రెండు చేతులూ జోడించి నుదుటికి ఆనించి చాలాసార్లు నమస్కారం చేసింది. ఇదేమన్నా మామూలు విషయమా? ఓహ్! ఆయన చీనివాస్‌ని కూడా ఆశీర్వదిస్తే. అందరూ వాణ్ణి కూడా మనిషిగా గుర్తిస్తారు. తన పరపతికూడా పెరుగుతుంది. ఇంకో మనిషి ఈ ఊళ్ళో తలెత్తుకుని గర్వంగా తిరుగుతున్నాడు. రూపసికి గౌరాంగ్‌ని అడగాలని ఉంది. ఈ పొగరుబోతువాడి కొడుకుల్లో ఒకడు బాగ్‌దీగా, జీవితమంతా పేదవాడిగా ఎందుకు బతకాలి? తన కొడుక్కి వాడి ఇంట్లో దొరికే సుఖసంతోషాలలో నూరోవంతు కూడా వీడికి ఎందుకు ఇవ్వడు? ఇదేం అన్యాయం?

రూపసి అప్పుడే ఊహల్లో విహరిస్తోంది. గౌరాంగ్ వచ్చాడు. తన చీనివాస్‌ని కౌగలించుకున్నాడు. తన కష్టాలూ, కన్నీళ్ళూ ఒక్క క్షణంలో తీరిపోయినట్లు అనిపించింది ఆమెకి.

కాని గౌరాంగ్ రాలేదు.

శాంతిపూర్ నుంచి తటువా మీదుగా కుమ్హార్ హాట్ వెళ్ళే దారిలో వెళ్ళిపోయాడు. సన్యాసం పుచ్చుకున్న కొన్నేళ్ళకే జనం ఆయన చుట్టూ తేనెటీగల్లాగ మూగటం మొదలుపెట్టారు. ఆయన చుట్టూ ఎప్పుడూ జనసందోహమే! అందరూ ఆయన్ని ఒక్కసారి దర్శించి కాళ్ళకి నమస్కరించాలనుకునేవాళ్ళే. 'నన్నొకసారి ముట్టుకోండి బాబూ, నాకు చూపు వస్తుంది' అని ఓ గుడ్డివాడి ఘోష. కుంటివాడు ఆయన కాళ్ళు వాటేసుకుని, 'నాకు కాళ్ళు తెప్పించండి' అని ప్రార్థించేవాడు. గొడ్రాళ్ళు ఆయనకి మొక్కి తమకు పిల్లలెందుకు కలగటంలేదో, పుట్టిన పిల్లలు ఎందుకు బతికి బట్టకట్టటంలేదో తెలుసుకోవాలని ఉవ్విళ్ళూరేవారు. ఇలాటివే వేలకొద్దీ సందేహాలూ, సమస్యలు! జనం ఆగకుండా వస్తూనే ఉన్నారు. రావాలని ఎంతో ప్రయత్నించి కూడా ఆయన చీనివాస్ ఉండే ఊరికి రాలేకపోయారు.

చాలాసేపు ఆచారిగారి ఇంటి ఎదురుగా కూర్చుని జనం ఆయనకోసం ఎదురుచూశారు. ఒక్క గౌరాంగ్‌ని చూడటానికే కాదు. ఆకలిమంటలు చాలా దారుణంగా ఉంటాయి. కడుపునిండా తిందామని, తల్లులూ, పిల్లలూ, ముసలివాళ్ళూ, అవిటివాళ్ళూ అందరూ అలా కూర్చుని కూర్చుని ఎదురుచూశారు.

మునుపు వరదొచ్చినప్పటిలాగే ఈసారికూడా సన్న తుంపర మొదలయింది. 'నీళ్ళు గుమ్మరించు, నీ ఇష్టం నీ దగ్గరున్న నీళ్ళన్నీ అయేవరకు ఆగవద్దు!' అని ఎవరో ఆకాశాన్ని ఆదేశించినట్లు ఆగకుండా వర్షం!

ఇలాంటి వర్షం పడ్డప్పుడే వరద వస్తుంది. ఎప్పుడో ఒకప్పుడు ప్రసాదం తీసుకోండని పిలుపొస్తుందనే ఆశతో అందరూ అలా వానలో తడుస్తూ గంటలతరబడి కూర్చుండిపోయారు.

సాయంకాలం ఆచారి నౌకర్లు పప్పులు, పంచదార అచ్చులు తీసుకుని జనం మధ్యకొచ్చారు. తక్కువజాతి వాళ్ళెవరూ వసారాలోకి వెళ్ళలేదు. ఆచారి నౌకర్లు చాలా ప్రేమగా, "ఆయన వచ్చి ఉంటే మీరంతా వసారాలో కూర్చునేవారు. మేమే మిమ్మల్ని పిలిచి మరీ కూర్చోపెట్టేవాళ్ళం. కాని ఏం చేస్తాం? ఆయన రాలేదు! ఉత్త పుణ్యానికి అంతా బురదా, మట్టి చెయ్యడంవల్ల ఏం లాభం?" అని అన్నారు.

"అయితే పప్పులు, పంచదార అచ్చులు ఇస్తున్నారేం? ప్రసాదం పెడతామన్నారుగా?"

"ఆయన వచ్చి ఉంటే ప్రసాదం వండేవాళ్ళం. భజనలూ, పాటలు ఉండేవి. ఆయన ప్రసాదం పంచేవాళ్ళం. మీరందరూ తినేవాళ్ళు. అన్ని ఏర్పాట్లు జరిగాయి. సరుకులు కూడా కొన్నారు. అన్నీ ఉన్నా ఆయన రాలేదుకదా? మరి ప్రసాదం ఎందుకు చెయ్యటం?"

"కాని మేమంతా తిండి దొరుకుతుందన్న ఆశతోనే వచ్చాం బాబూ!"

"ఇది మరీ బావుంది. సన్యాసిని చూడాలని వచ్చారా, ప్రసాదం కోసం వచ్చారా?"

"ఆయన్ని చూడటానికీ, తిండి కోసమూను."

"ఇచ్చేదేదో తీసుకెళ్ళండి. మీతో నేను సొళ్ళు కబుర్లు చెప్తూ కూర్చోలేను. మీకు సన్యాసిని చూడటంకన్నా తిండి ముఖ్యమయింది. అందుకే మీ కష్టాలు ఒకంతట తీరవు. ఇప్పుడు తెలిసిందా నాయనలారా? ఇచ్చేవి తీసుకెళ్ళండి!"

"ఎంత అందంగా ఎర్రగా ఉన్నాయో ఈ పప్పులు! పంచదార అచ్చులు ఎంత పెద్దవో! కాని చీనివాస్ కళ్ళనుండి నీళ్ళు ధారలు కట్టాయి. పొద్దున్నించీ కావడిమీద చేపలూ, కూరలూ, పాలూ పెరుగూ మోసుకుని రావడం చీనివాస్ చూశాడు. అవి ఎవరికోసమో దేవుడు ఎరుగు! ఉన్నట్టుండి చీనివాస్‌కి వాడి

అమ్మమీద కోపం వచ్చింది.

"ఈసారి రసోయి పూజ ఎందుకు చెయ్యలేదే పిశాచీ! కడుపునిండా తిండి తినాలన్న నా కోరిక ఎందుకు చావదు?" తల్లిని మనసులోనే చావగొట్టి, పప్పులు, పంచదార అచ్చులు తీసుకుని చీనివాస్ పరుగెత్తాడు.

చాలాసేపు నెమ్మదిగా తిన్నాడు, మొత్తం తినేశాడు. సాయంత్రం చుట్టూ మిణుగురు పురుగులు ఎగురుతున్నాయి. చిక్కటి చీకటి అలుముకుంటోంది. చీనివాస్ అమ్మమ్మ వాణ్ణి వెతుక్కుంటూ వచ్చింది. వాడు మైదానంలో ఒక మూల కూర్చుని ఉన్నాడు. నీటిలో మునిగిపోయిన తాటిచెట్టుదగ్గర కూర్చొని ఉన్నాడు. ఏడ్చి ఏడ్చి డీలాపడిపోయాడు. నిద్ర ముంచుకొస్తోంది. కాని దయ్యాల భయంవల్ల నిద్రపోలేదు.

"అమ్మమ్మా నా చెయ్యి పట్టుకో!"

ఇద్దరూ నీళ్ళల్లో కాళ్ళు జాడిస్తూ నడిచివెళ్ళాడు. ఇంటికెళ్తూ చీనివాస్ "గౌరాంగ్ వరదకన్నా ఆ పాత వరదే బావుంది. అలాంటి వరద మళ్ళీ రాదా అమ్మమ్మా? బ్రాహ్మలు తినటానికి బోలెడన్ని అటుకులూ, అన్నం, పప్పు కూరలూ ఇస్తారు కదా? మనకింక ఆకలిబాధ ఉండదు కదా? ఆ వరద మళ్ళీ రాదా అమ్మమ్మా?"

# విత్తనాలు

కురుడా హేసాడ ఊళ్ళకి ఉత్తరంగా ఉన్న భూమి. పూర్తిగా ఎండలకి ఎండి వట్టిపోయిన నేల. నేల పైభాగం అలల్లాగ ఉంటుంది. వానలు పడినా ఇక్కడ గడ్డిపోచకూడా మొలవదు. అక్కడక్కడ వేపచెట్లు, మైదానంలో మధ్య మధ్యన నాగజెముడు పొదలు పడగవిప్పిన పాముల్లాగ ఉన్నాయి. ఈ కాలిపోయినట్లున్న భూభాగం మధ్యలో చిన్న పడవ ఆకారంలో ఒక గొయ్యి ఉంది. 1500 చదరపు గజాలుంటుంది. లోతుగా ఉండటంవల్ల దూరంనుంచి ఇది కనపడదు. కాని కొంచెం ఎత్తునించి చూస్తే ఆ లోతు గుంట ఉన్న ప్రదేశంలో కనిపించే పచ్చదనం ఏదో భూతంలాగ భయంకరంగా ఉంటుంది.

దానికన్నా భయంకరంగా ఉండే దొకటుంది - ఆ భూభాగంలో ఉన్న మంచె, ఆ మంచెమీద గడ్డీగాదంతో వేసిన కప్పు! చూసేవాళ్ళకి ఆ ప్రదేశంలో ఒక గుడిసె వేసి ఉండటం చాలా విచిత్రంగా ఇబ్బందిగా ఉంటుంది. ఎందుకంటే అలాంటి మంచెలు పంటపొలాల్లోనే ఉంటాయి. కాని ఈ నేలమీద ఏముంది, ముళ్ళపొదలు తప్ప? ఈ పొదల్ని 'ఎలో' పొదలని అంటారు. వీటిని గేదెలు కూడా తినవు. వీటివల్ల ఒకటే ప్రయోజనం - లోకంలోకెల్లా బలమైన తాడు దీనితోనే చేస్తారు. మన దేశంలో ఇది ఒక అడివిజాతి పొద.

వీటన్నిటికన్నా భయం కొలిపే దృశ్యం సాయంత్రం కనబడుతుంది. కరుడా గ్రామం వైపునుంచి పెద్ద పెద్ద అంగలు వేస్తూ, ఒక మనిషి ఇటు వస్తాడు. దగ్గరకొచ్చాక అతను ఒక ముసలివాడన్న విషయం తెలుస్తుంది. అతని చర్మం ఎండకి ఎండి ముడతలు పడింది. నడుంకి ఒక గుడ్డతో గోచీ కట్టుకున్నాడు. దానినుంచి ఒక గుడ్డసంచీ వేలాడుతోంది. అతని చేతిలో ఒక పొడుగాటి లాఠీ ఉంది. నడుస్తున్నప్పుడు అతను ఆ లాఠీతో పొదల్ని కొడుతూ మంచెవైపు వెళ్తాడు. వంకరపోయిన ఒక కొమ్మ సహాయంతో అతను మంచెపైకి ఎక్కుతాడు. చెకుముకి రాతితో బీడీ వెలిగించి మంచెపైన కూర్చుంటాడు. రోజూ ఇదే తంతు. ఒక్కొక్కప్పుడు బాగా చీకటిపడ్డాక

అతను నేలమీద చాప పరుచుకొని నిద్రపోతాడు.

రోజూ ఇదే సమయానికి కురుడాలో దూలన్ గంజూ పెళ్ళాం అతన్ని తిడుతూ ఉంటుంది. ఆవిడకి తిట్టే హక్కు ఉంది, ఎందుకంటే ఆమె భర్తే రాత్రిళ్ళు మంచెమీద గడుపుతాడు. ఆవిడ అలా తిట్టడం, ఆవిడ కొడుకులకీ కోడళ్ళకీ ఇష్టంలేదు, కానీ వాళ్ళు ఏమీ చెయ్యలేరు. వాళ్ళు నోరెత్తితే ముసలావిడ వాళ్ళని తిడుతుంది. ధతువా వాళ్ళమ్మ తిట్టటంలోనూ పోట్లాడటంలోనూ ఎంత దిట్టో అందరికీ తెలిసిన విషయమే. ఆవిడని పల్లెత్తు మాట అంటే చాలు సవాలు చేసినట్టే. ఆమెని కదిపితే వాళ్ళ వెనకటి ఏడు తరాలవాళ్ళనీ దుమ్మెత్తిపోస్తుంది. ఆవిడ తిట్లు ఏడు తరాల వెనక్కి వెళ్ళి నాలుగో తరమో మూడో తరమో చేరుకునేటప్పటికి ప్రతిపక్షంవాళ్ళు పారిపోతారు. అంత ఘోరమైన తిట్లు తిడుతుంది.

అందరికీ ఆవిడంటే భయం. ఎమర్జన్సీ రోజుల్లో తామాడ అనే ఊళ్ళో చాలా గొడవయింది. అప్పుడు దర్యాప్తు చెయ్యటానికి పోలీసు లొచ్చారు. అప్పుడు ఈవిడ పోలీసుల్ని అనరానిమాటలంది. ఆవిడ శరపరంపరగా వదిలే తిట్లని భరించలేక పోలీసులు కూడా వెళ్ళిపోవలసివచ్చింది. పోలీసులు వెతుక్కుంటూ వచ్చిన మనుషుల్లో ఒకడు పశువులశాల కప్పుమీద దాక్కున్నాడు.

ధతువా వాళ్ళమ్మ అరవటం మొదలుపెట్టింది "రండి... రండి... అన్నిగదులూ వెతకండి! మీ మొహంమండా, శవాల్ని పీక్కుతినే వెధవల్లారా, రండి... "ఆ తిట్లూ, శాపనార్థాలూ భరించలేక పోలీసులు పారిపోయారు. ఊరివాళ్ళకి పోలీసుల భయం తొలగిపోయింది.

ముసలావిడ అప్పటికీ శాంతించలేదు. పోలీసులవెంటే వెళ్ళి వాళ్ళని పిలిచి పిలిచి మరీ తిట్టింది. "రండిరా, పెంట వెధవల్లారా, చూడండిరా, ఊళ్లో ముసలివాళ్లూ, చిన్నపిల్లలూ తప్ప ఇంకెవరైనా కనిపిస్తున్నారా? రండి, వీళ్ళనే తీసుకెళ్ళి మీ జైళ్ళు నింపుకోండి... పారిపోతారేం?"

పోలీసులు వెళ్ళిపోయాక ధతువా వాళ్ళమ్మ కొడుకుని తలవాచేటట్లు చీవాట్లు పెట్టింది, "గుడ్డి గబ్బిలం వెధవా! నీ బుద్ధి గడ్డితిందా? నీకన్నా ముసలిమేక కూడా ఎక్కువ తెలివైనదే! గొడ్డలితో దాడిచేసి రాజపుత్ వడ్డీ వ్యాపారి కాలిమీద కొట్టావు, మెడమీద కొట్టి వుంటే పీడ విరగడయ్యేదిగా? మరి అడవిలోకి వెళ్తేకదా? అంటి పనిచేసి ఏ బుద్ధిలేనిగాడిదో తప్ప ఊళ్ళోకి వస్తాడా? వెళ్ళు, అడవిలోకి

వెళ్ళు, అక్కడే వుండు''

ధతువాకి తల్లంటే చచ్చేంత భయం. తండ్రిని తిట్టొద్దని ఆమెతో చెప్పలేడు. అడ్డుచెప్తే మండిపడుతుంది. ''ఏం, తండ్రిమీద ప్రేమ పొంగుకొస్తుందా? తల్లి మీకు ఎందుకూ పనికిరాదు, ముసలిమేక! ఒరే, నీకు మీ నాన్న గురించి ఏంతెలుసు, నన్నడుగు నే చెప్తాను.''

ధతువా వాళ్ళమ్మకి నాలుగేళ్ళ వయసులో పెళ్ళయింది. పధ్నాలుగేళ్ళు రాగానే కాపురానికి అత్తవారింటికి వచ్చింది. ముసలాడి స్వభావం ఆమెకి పూర్తిగా తెలుసు. ''దయ్యంలాగ ఒంటరిగా ఆ ముళ్ళ పొదలతో నిండిన ప్రదేశాన్ని కాపలా కాస్తుంటాడు, ఆ భూమి ఎందుకు పనికొస్తుంది? అతన్ని ఏ పామో కరిస్తే ఏ పులో చంపేస్తే ముండ మోసేదెవరు? ధతువా, లటువా కాదుగా! ఆ పనికిరాని బంజరుభూమిని చూపించి ప్రతి యేడూ తిండి తెచ్చుకుంటారు. ప్రభుత్వాన్ని మోసగించి తెచ్చిన విత్తనాలని అమ్మేస్తారు. పహాన్ దగ్గరున్న నాగలి చూపించి, నాగలికీ ఎద్దులకి డబ్బు తెచ్చుకుంటారు. దొంగ వెధవలు, వీళ్ళ మొహం మండా!'' అంటుంది ముసల్ది.

కొడుకులు నోరెత్తరు. గట్టిగా హుక్కా పీలుస్తూ, ''నేను చచ్చే లోపల నా విలువ మీకెవ్వరికీ తెలీదు,'' అని ముసల్ది పడుకుంది. కోడళ్ళు తమ పిల్లలతో రహస్యంగా, ''అమ్మయ్య, ఈరోజు గడిచింది!'' అన్నారు.

ముసల్ది పడుకునే చీకటితో మాట్లాడుతుంది, ''ఎప్పుడో ఒకరోజు అక్కడే చస్తాడు. ఆ మనిషి మొహమైనా చూడగలుగుతానో లేదో!''

ఆ ఎలో పొదల మధ్యన మంచెమీద కూర్చుని, దయ్యంలాగా రాత్రంతా జాగారాం చేస్తూ పహరా ఇవ్వటం మామూలు మనుషులు చేసే పనికాదని అతని కొడుకులకి తెలుసు. కాని వాళ్ళెప్పుడు వాళ్ళ నాన్నని మామూలు మనిషికింద జమ కట్టలేదు. వాళ్ళకి వాళ్ళ నాన్న స్వభావం చచ్చినా అంతుపట్టదు. చచ్చిన జంతువుల తోలు ఒలవటం గంజూ జాతివాళ్ళు చేసేపని. ఒకసారి వాళ్ళనాన్న వడ్డీవ్యాపారి లఛ్మన్ సింగ్ గేదెల్ని విషంపెట్టి చంపాడు. లఛ్మన్‌సింగ్ దగ్గర పది పన్నెండు తుపాకులున్నాయి., అయినా అతను భయపడలేదు. ఆ రోజుల్లో అతను లఛ్మన్‌సింగ్ వాళ్ళ ఊరు తామాడీలో ఉండేవాడు. గేదెల్ని చంపి, తోలు ఒలిచి అమ్మేశాడు. లఛ్మన్‌సింగ్ తన సోదారుడివంటి దైతారీసింగ్‌ని

అనుమానించాడు. దీనివల్ల మొదలైన అంతఃకలహం ఇంతవరకు పూర్తిగా ఆగలేదు.

ఇలాంటి పనులు అన్నీ చేసికూడా వాళ్ళ నాన్న హాయిగా బతుకుతున్నాడు. అతడు ఎంత వింత మనిషో దీనివల్ల తెలుస్తూనే ఉంది. బతకటానికి అవసరమైన పన్నాగాలు వేయటంతోనే సరిపోయింది. కొడుకులతోనూ, మనవలతోనూ నింపాదిగా కూర్చుని కబుర్లు చెప్పటానికి ఆయనకి తీరికేదీ?

తల్లికూడా తక్కువదేం కాదు. ఎముకలపోగులాంటి శరీరం, కాని ఎంత పనిచేస్తుందో! ధైర్యం, మొండితనం, కోపం - ఇవన్నీ మామూలు ఆడవాళ్ళకన్నా ఆమెలో చాలా ఎక్కువ మోతాదులోనే ఉన్నాయి.

అమ్మా నాన్న కూర్చుని కబుర్లు చెప్పకోటం వాళ్ళెప్పుడూ చూడలేదు. కాని నాన్న ఏదైనా ముఖ్యమైన పని ఉన్నప్పుడు అమ్మని వసారాలోకి పిలుస్తాడు. హుక్కానింపి అమ్మకిస్తాడు. "ఇదిగో, ఒక విషయం చెప్పు, నువ్వు చాలా తెలివైనదానివని ఊళ్ళో అందరూ అనుకుంటారుకదా, పోలీసులకు కూడా నువ్వంటే భయం కదా..."

"ఏం, ఏదైనా వెధవపని చెయ్యబోతున్నావా? ఎవర్ని మోసం చేద్దామని అనుకుంటున్నావు ఈసారి?"

అమ్మ గట్టిగా మాట్లాడుతుంది, కాని కోపంగా ఉన్న ఛాయలు ఎక్కడా ఉండవు. ఆ తరవాత ఇద్దరూ గొంతులు తగ్గించి ఏవో విషయాలు సంప్రదించుకుంటారు. ఇలాంటిది ఏడాదికో, ఏడాదిన్నరకో ఒకసారి జరుగుతుంది.

మిగతా సమయాల్లో నాన్న అమ్మతో కూడా ఏమీ మాట్లాడడు. అమ్మ అప్పుడప్పుడు విసుగొచ్చి, "ఇలా ఇక్కడ ఉండే బదులు నేను పుట్టింటికే పోవచ్చు" అంటుంది.

నాన్న వంకర నవ్వు నవ్వుతూ నెమ్మదిగా, "అవును! టూరాలో మీ నాన్న పెద్ద బంగళా కట్టించాడు!" అంటాడు.

అమ్మకి తల్లీదండ్రీ, అన్నదమ్ములు ఎవరూ లేరు. అయినా అమ్మ ఇలాంటి మాటలంటుంది. నాన్న ఎద్దేవా చేస్తూ ఉంటాడు.

ఇలాంటి తలిదండ్రుల్ని ధతువా కాని లటువా కాని ఏవిధంగానూ మార్చలేరు. కొండ పడమటివేపు ఎందుకుంది? కురుడా నది రాత్రనక పగలనక ప్రవహిస్తూనే ఉంటుందేం? వీటిని ఎవరూ మార్చలేనట్టే, వాళ్ళని కూడా ఎవరూ

మార్చలేరు!

"మీ అమ్మా నాన్న ఇద్దరూ పిచ్చోళ్ళే! మీ నాన్నకి పూర్తిగా పిచ్చి, కాకపోతే ఆ మడిసెక్క దొరికినప్పటినుంచీ ఏ పంటా పండించకుండా ఉత్తనేలకి ప్రతి రాతిరీ కాపలా కాస్తాడా?" అంటుంది శనీచరి.

దానం పుచ్చుకున్న వస్తువు ఎలాంటిదని చూడకూడదు. దానంలో దొరికిందని సంతోషించటమే! ఈ నేల కూడా అంతే. ఊరికే వచ్చింది. దానిమీద ఏదైనా ఆదాయం వస్తుందని ఆశపెట్టుకోకూడదు.

ఆ భూమి లఛ్మన్‌సింగ్‌ది. చాలా ఏళ్ళక్రితం సర్వోదయ కార్యకర్తలు జమీందార్ల ఇంటింటికీ వెళ్ళారు. వాళ్ళ గురించి కూడా శనీచరి చెప్తూ ఉంటుంది. "వాళ్ళూ పిచ్చినాయాళ్ళే. జమీందార్ల మనసుల్ని కరిగించాలని ప్రయత్నించారు. జమీందారు తనంతట తనే మనసు మార్చుకుని, 'నాదగ్గరింత భూమి ఉంది, పాపం వీళ్ళదగ్గర ఏమీలేదు' అనుకుని బీదోరికి భూమి పంచిపెడతాడని వీరి ఆశ. కూసింత మడిసెక్కని పేదోళ్ళకి దానం యిచ్చిన రోజున నేను నాలుగువీధుల కూడలిలో కూర్చుని వెన్న, కలకండ తింటాను. రెండుపూటలా అన్నం వండుకుతింటాను."

కాని జమీందార్లూ మిగతా జమీందార్ల ముందు తమ పరపతి నిలుపుకోవటం కోసం ఎందుకూ పనికిరాని, బంజరు భూముల్ని, రాతినేలల్నీ ఈ స్వయం సేవకులకి ఇవ్వసాగారు. ఈ జమీందార్లందరి దగ్గరా ఐదు ఆరు వందలనుంచి రెండువేల భీగాలదాకా సారవంతమైన భూములున్నాయి. వరి, గోధుమ, ఇప్పచెట్లు, ఆవాలు, కంది, జొన్న - అన్ని రకాల ధాన్యాలూ పొలాల్లో పండుతాయి. ఈ మధ్య వేరుశనగ వేసినా చాలా లాభం వస్తోంది. బంజరు భూమి దానిమిస్తే పోయేదేముంది?

పైగా లాభమే, దానం ఇచ్చిన వాళ్ళ పేర్లు రాస్తారు. ఈ సర్వోదయ నాయకుల్ని చూసి అందరూ నవ్వుతున్నారు. ఇలా దానం ఇప్పించటంవల్ల వాళ్ళకీ మంచి పేరు వస్తుంది. కురుడా నుంచి బీట్టే వరకూ రాజపుత్రులూ, కాయస్తాలూ భూమి దానంగా ఇవ్వలేదా? అలా ఇవ్వటంవల్ల వాళ్ళ మనసు మారలేదా? నిస్సందేహంగా మారింది. అంతే, సర్వోదయ వాళ్ళ మిషన్ విజయం సాధించింది. ఆ తరవాత వాళ్ళు మధ్యప్రదేశ్‌లోని బందిపోట్లని మార్చటానికి వెళ్ళిపోయారు. జమీందార్లనీ, బందిపోట్లనీ మార్చేవరకూ వాళ్ళ మిషన్ పూర్తికాదు.

భూదానంవల్ల చాలామంచి జరిగింది. బంజరు భూములు వదిలాయి. దానం పుచ్చుకున్నవాళ్ళు జీవితాంతం ఋణపడి ఉంటారు. మంచిపేరు వచ్చింది, ప్రభుత్వం తరపునుంచి గుర్తింపు వచ్చింది. అదీగాక భోజనం తరవాత రసగుల్లా తిన్నట్టు, తాము దయాగుణం కలవారని నిరూపించుకోవటం అన్నిటికన్నా మధురంగా అనిపించింది.

ఆ సందర్భంలోనే దూలన్ గంజూకికూడా ఆ రాతినేల దొరికింది. అతనికి ఆ నేల తీసుకోవటం ఇష్టంలేదు. కాని లఛ్మన్‌సింగ్ ప్రతాపం ముందు ఏమీ చెయ్యలేక పోయాడు. అతను కళ్ళెర్రజేసి, "ఇదే మీ జాతితో వచ్చిన తంటా. నేను మంచివాణ్ణి కాబట్టి ఇవాళ ఇస్తున్నాను. రేపటి విషయం ఎవరు చూశారు? రేపు నా మనసు మారచ్చుకదా!" అన్నాడు.

"మీరే మా దేవుళ్ళు దొరా!" దూలన్ అన్నాడు.

"మరి బంజరయితే ఏం? వానల్లో కావల్సినన్ని నీళ్ళు, ఏంవేసినా పండుతుంది."

కొండలమీదనుంచి పారే మట్టినీళ్ళు ఆ నేలమీదనుంచే పోతాయి. కాని అదంతా రాళ్ళతో నిండిన నేల. ఈ నేలమీద ఎవరైనా పంట పండిస్తారా? నిజంగా పండేనేలే అయితే లఛ్మన్‌సింగ్ ఇంత ఉదారంగా ఇచ్చి ఉండేవాడా? పాపం, దూలన్ డబ్బు అప్పు అడుగుదామని వెళ్తే ఈ నేల అంటగట్టాడు లఛ్మన్‌సింగ్.

"ఇది కూడా గొప్పవాళ్ళ భ్రమే! నేతితో చేసిన రొట్టెలు తిని-తిని వాళ్ళ బుర్ర వేడెక్కిపోయింది. ఇవాళ ఇస్తారు. రేపు మరిచిపోతారు" అని ఊళ్ళోవాళ్ళన్నారు.

"ఒకవేళ మర్చిపోకపోతే?"

"అలా పడి ఉంటుంది. ఈ సర్వోదయవాళ్ళ మాటవిని ఆరాఛామరావాళ్ళు కూడా ఇలాగే భూదానం చేశారు. అలా తీసుకున్నవాళ్ళు వాటిని ఏ వడ్డీవ్యాపారికి అమ్మివేయటమో, తాకట్టుపెట్టటమో చేశారు. నువ్వు కూడా అదే చేస్తావు!"

"ఆ నేల ఎవరిక్కావాలి? భూస్వామి పనికిరాని నేల మనకి అంటగట్టి వదిలించకుంటున్నాడు. మంచి పేరు సంపాదించుకుంటున్నాడు."

దూలన్ ఇంకా ఏదో చెప్పబోతే పహాన్ అతన్ని గట్టిగా మందలించాడు. "ఆయనకి బోలెడన్ని సమస్యలున్నాయి. నీలాటి వాళ్ళకి ఆ నేల అంటగట్టటం ఆయనకో పెద్ద సమస్యేం కాదు."

దూలన్ ఏదో గొణుక్కుంటూ ఉండిపోయాడు.

"ఈ నేల ఎలా ఉపయోగించుకోవాలనేగా నీ ఆలోచన? అబ్బ ఎంత మంచిమనిషో! ఎవరికీ అంతుబట్టడు ఈ మనిషి!" అతని పెళ్ళాం అంది.

"దీనివల్ల ఏమిటి ఉపయోగం?"

శనీచరి మర్నాడు ఈ గొడవంతా విని అంది, "ఏం? అతనన్నదాంన్లో తప్పేముంది? అతన్ని తోహరీ పంపించు. బీ.డీ. ఆఫీసుకి వెళ్ళమను. వ్యవసాయానికి కావాల్సిన సామానంతా ప్రభుత్వం ఇస్తుంది."

ఇది విని దూలన్ నవ్వాడు. అతని కళ్ళు కలలు కంటున్నట్టుగా తేలిపోయాయి.

ఇలాంటి కథలు చాలా చెప్పారు, చూడి కాకుండానే ఆవు పాలివ్వటం లాంటివి. ఈ బంజరునేలతో తన సంసారాన్ని ఎలా పోషించాలో దూలన్‌కి ఏమాత్రం అర్థంకాలేదు.

రాతకోతలన్నీ అయాక నేల తాలూకు కాగితాలు దూలన్ చేతికొచ్చాయి. గంజూపాడాలో వసారాకి ఆనుకుని రెండు గదులున్నాయి. దాన్లోనే వాళ్ళ సంసారం. వసారాలో ఒక మూలగా ముసలివాళ్ళు పడుకుంటారు. నాలుగుపక్కలా రాజపుత్‌లూ, జమీందార్లూ, డబ్బున్న వ్యాపారులూ ఉంటారు. టాహాడ్‌లోని హనుమాన్ మిశ్ర బ్రాహ్మణుడు. ఈ చుట్టుపక్కల ఇలాకాలో ఆయన చాలా పరపతి ఉన్నవాడు. ఇలాంటిచోట ఉంటూ, పైజాతులవాళ్ళకి అణిగిమణిగి ఉండటంవల్ల దూలన్ పూర్తిగా ఒంగిపోయాడు. ఇది స్వభావికం.

కాని బతకడానికిగాను, ఎప్పుడూ తన బుద్ధిని ఉపయోగించి బైటపడటానికి ప్రయత్నిస్తుంటాడు. ఉత్త బలంవల్ల ఏమాత్రం పనులు జరగవని అతనికి తెలుసు. మాటల్తో కాకుండా, అతను చేతలతో మోసం చేసి తన శత్రువులని మూర్ఖులని చేసేవాడు, రకరకాలుగా మోసాలు చెయ్యటం అతనికి వెన్నతో పెట్టిన విద్య.

ధతువా వాళ్ళమ్మ, "ఎంత పెద్ద భూమి దొరికిందో, కావల్సినంత పంట! ఒరే, ధతువా! నాన్నకి చెప్పు ధాన్యం దాచటానికి గాదెలు తయారుచెయ్యమని! లటువా! మీనాన్న జమీందారయాడురా నాయనా!" అంది.

జనం ఎన్నో అనుకుంటున్నారు, కాని దూలన్ ఈ నేలని ఏం చేస్తాడో చూడాలని అందరూ కాచుక్కూర్చున్నారు.

దూలన్ తెలివినీ, ఒంటరిగా పోట్లాడగల ధైర్యాన్నీ అందరూ ఆశ్చర్యంగా చెప్పుకునేవారు. లఛ్‌మన్‌సింగ్ గేదెల విషయం అందరికీ తెలుసు, కాని ఎవరూ నోరు విప్పలేదు. దైతారీసింగ్‌కి గుమ్మడికాయ అమ్మి దాని ఖరీదు - రెండుసార్లు వసూలుచేశాడు - ఒకసారి అతని కోడలిదగ్గరా, ఇంకోసారి అతని తల్లిదగ్గరా. 'ఛట్' పండగప్పుడు లఛ్‌మన్‌సింగ్ ఇంటినుంచి పళ్ళూ, పువ్వులూ, మిఠాయిలూ ఎద్దుబండిమీద వేసి కురుడానది ఒడ్డుకు తీసుకెళ్ళేటప్పుడు, అతను బండితో నడుస్తూ పక్షులని తోలటానికి అరుస్తున్నట్టు నటిస్తూ, చేతులు విదిలిస్తూ, బండిలో వస్తువులు కింద పడేస్తూ వస్తాడు.ఊళ్ళో వాళ్ళకి అతనెప్పుడూ ఏమీ ఇవ్వలేదు, అయినా వాళ్ళందరూ అతన్ని మర్యాదగా చూస్తారు. వాళ్ళు సంపాదించలేనిది అతను సంపాదిస్తాడుగా, అందుకే!

భూమి సంపాదించాక దూలన్, లఛ్‌మన్‌సింగ్ కాళ్ళు పట్టుకుని, ''దొరా, నేలైతే ఇచ్చారు, కాని దాన్లో వ్యవసాయం ఎలా చేసుకునేది? బీ.డీ. ఆఫీసువాళ్ళు నాకేం ఇవ్వరు. అయ్యో, ఇంత నేల దొరికినా నాకేం లాభంలేకుండా పోతోందే?'' అన్నాడు.

''ఏం? బీ.డీ. ఆఫీసువాళ్ళు ఎందుకివ్వరు? తప్పకుండా ఇస్తారు. అడిగినవన్నీ ఇస్తారు.''

''లేదయ్యా! నా కులపోడికి వాళ్ళివ్వరు.''

''నువ్వు అంటరానికులంవాడివే! ఆ విషయం మీకు జ్ఞాపకం ఉండదు, అందుకే చెప్పుదెబ్బలు తింటారు. కాని నేను నేల ఇచ్చినప్పుడు సహాయం చెయ్యనా? బీ.డీ. ఆఫీసరు ఎవరు?''

''కాయస్థ దొరా! రాజపుత్‌లందరూ బైతులు, మూర్ఖులని అంటూ ఉంటాడు. ఎప్పుడూ రేడియో వింటూ ఉంటాడు. ఎడంచేత్తో నీళ్ళు, చాయి తాగుతాడు.''

''రామ-రామ! ఛీ!ఛీ!ఛీ!''

''కళ్ళారా చూశాను అయ్యా!''

''నేను నీకు రాసిస్తున్నానుకదా, ఇంకా ఎందుకు భయం?''

లఛ్‌మన్‌సింగ్ రాతకోతల్లో తెలివైనవాడు. అతని చేతిలో వకీలొకడున్నాడు. ఆ వకీలు దూలన్ తరఫున అర్జీ రాసిచ్చాడు. కైథీ లిపిలో ఎద్దులూ, నాగలీ అవీ

కొనుక్కోవటానికి అప్పు ఇవ్వవలసిందని అర్జీ రాశాడు. బీ.డీ.ఓ. తోహరీలో ఉండవచ్చు, అది లఛ్‌మన్‌సింగ్ ఉండే ఊరు. తామాడీకి చాలా దూరంగా ఉండొచ్చు, కాని ఈ రెండు ఊళ్ళకి రెండు శరీరాలకి ఒకే తలలాగ, లఛ్‌మన్‌సింగ్, హనుమాన్ మిశ్రా ఉన్నారు. ఎస్.డీ.ఓ. స్వయంగా బీ.డీ.ఓ.కి వాళ్ళిద్దరితోటీ పేచీపెట్టుకోవద్దని సలహా ఇచ్చాడు.

బీ.డీ.కి వెంటనే ఆ అర్జీ పాస్ చేశాడు. గోచీపెట్టుకుని వచ్చిన దూలన్‌తో చాలా సౌమ్యంగా మాట్లాడాడు. తనడిగినవన్నీ ఇస్తామని హామీ ఇచ్చాడు. ముందర విత్తనాలూ, గొడ్లమేతకి కావల్సిన డబ్బు ఇస్తామని, కొంత అప్పుతీసుకుని ఎద్దులూ, నాగలి కొనుక్కుని చూపించిన తరవాతే వాటికయిన ఖర్చు ముడుతుందనీ చెప్పాడు.

ఊరికొచ్చాక దూలన్ పహాన్‌తో "ప్రభుత్వం రూల్స్ పెట్టేముందు ఏమీ ఆలోచించదు. ఎద్దులూ, నాగలి కొనుక్కోటానికి డబ్బు కావాలి. మాటిమాటికీ వాటిని కొనటం అమ్మటం నావల్లకాదు. కాస్త నీదగ్గరున్న నాగలీ, ఎద్దులూ ఇద్దూ?" అన్నాడు.

వాటినే చూపించి దూలన్ బీ.డీ. ఆఫీసు నుంచి డబ్బు తెచ్చుకున్నాడు. ప్రతీ ఏడూ అలాగే అతను డబ్బు తీసుకుంటూ వచ్చాడు. డబ్బు తీసుకున్న ప్రతీసారీ బీద ఏడుపులు ఏడ్చేవాడు.

దూలన్ డబ్బూ, ఎరువూ తీసుకుని ఎరువు దోహరీ బజారులో అమ్మేసేవాడు. వొడ్లు మట్టుకు ఇంటికి తీసుకొచ్చేవాడు. పంట వేయటంకోసం ఇచ్చిన ఆ విత్తనాలను ఇంట్లోవాళ్ళు వండుకు తినేవారు.

వడ్లని అలాగే ఉడకబెట్టి అన్నం వండుకునేవాళ్ళు. మొదటిసారి వడ్లబస్తా చూసి, "ఇన్ని వడ్లా? ఎంత భూమి ఉందేం నీదగ్గర?" అంది అతని పెళ్ళాం.

"ఆ నేల కొలవడం అయేపనికాదు."

"కొలవలేని నేలంటూ ఉంటుందా ఏం?"

"అఁ, అది మన కడుపు. ఆకలికి కొలత ఉంటుందా? కడుపులో చోటు పెరుగుతూనే ఉంటుంది. ఆ రాతినేలలో విత్తనాలు నాటుతాననుకున్నావా? పిచ్చేమైనా పట్టిందా?"

"ఏం చేస్తావయితే?"

"దీన్ని నువ్వు ఉడికించు, పొట్టుతీసి తిందాం."

"వడ్లు తింటే చస్తావు!"

"ఇంతవరకు చావలేదు. కరువురోజుల్లో ఎన్ని ఎలకల్ని తినలేదు? వడ్లు తింటే చస్తానా ఏమిటి? ఒకవేళ చచ్చినా హాయిగా అన్నంతిని చస్తున్నానన్న ఆనందం ఉంటుంది. నేరుగా స్వర్గానికి పోతాను."

ఒక్కసారి వడ్ల అన్నం రుచి చూశాక ధతువా వాళ్ళమ్మ జన్మలో ఇంత రుచిగల అన్నం తినలేదని అనుకుంది.

ఊళ్ళో అందరికీ తన మొగుణ్ణి గురించి గొప్పగా చెప్పడం మొదలుపెట్టింది. ఈ ఊళ్ళో ఎవరైనా ఆడది తన మొగుడి గురించి నాలాగ గొప్పలు చెప్పగలదా? సర్కారుని ఇంత తెలివిగా మోసంచేసి తన కుటుంబానికి వడ్ల అన్నం తినిపించగల మొనగాడు ఊళ్ళో నా మొగుడు తప్ప ఇంకొకడున్నాడా అన్ని సవాలు చేసింది.

ఊళ్ళో అందరూ సంతోషించారు. గవర్నమెంటు తమకి ఒరగబెట్టేదేం లేదు. బీ.డీ.ఓ. ఎప్పుడూ వ్యవసాయం విషయంలో తమకి సహాయం చేసిన పాపాన పోలేదు. ప్రభుత్వం నడిపే ప్రైమరీ స్కూళ్ళలో తమ పిల్లలకి సీటు దొరకదు. లఛ్‌మన్‌సింగ్, దైతారీసింగు లాంటివాళ్ళు తుపాకీ చూపించి భయపెట్టో, మంచిగా నాలుగణాలిచ్చో పిడికెడు అన్నంపెట్టో, పంట కోయించుకుంటారు. దీనిగురించి కూడా చాలా టెన్షన్ ఉండేది, ఎందుకంటే ఆ పక్కనే గంజూ, దుసాద్, చాకలివాళ్ళకి రోజుకి ఎనిమిదణాల కూలి దొరుకుతోంది. ఇరవై అయిదు పైసలు మాకూ పెంచమని వీళ్ళు మరీమరీ అడుగుతున్నారు. అన్నీ తెలిసుండీ, గొడవ జరుగుతున్నప్పుడు, ఎస్.డీ.ఓ. పోలీసులతో వచ్చి రైతు కూలీల్నే పట్టుకుపోయాడు. లఛ్‌మన్‌సింగ్‌నిగాని, దైతారీసింగ్‌నిగానీ ఏమీ అనలేదు.

సర్కారు కూడా లఛ్‌మన్‌సింగ్‌దే. లఛ్‌మన్‌సింగ్, దైతారీసింగ్, హనుమాన్ మిశ్రా చెప్పినట్టు వింటుంది. అలాంటి సర్కారుని మోసం చేసేవాళ్ళు దూలన్ గంజూ అయినా, ఇంకెవరైనా, వారిని జనం గౌరవిస్తారు మరి!

ఆ బంజరుభూమి దూలన్‌కి కామధేనువులాగ దొరికింది. దానిమీద అతను ఏటా ఆరువందలదాకా సంపాదించుకుంటున్నాడు. కాని మొదట్లో అతను ఇంట్లోనే, వసారాలో ఒక మూల మంచంమీద పెళ్ళాం పక్కన పడుకునేవాడు. అతని పెళ్ళానికి దగ్గు, ఉబ్బసం. ఆమె తన మంచానికి మేకల్ని కట్టేసి నిద్రపోయేది. రెండు గదుల్లోనూ కొడుకులూ వాళ్ళ కుటుంబాలూ పడుకుంటాయి. గోధుమలు, రాగులు, జొన్నల బస్తాలూ, గిన్నెలూ, పొయ్యిలోకి కట్టెలు అన్నీ ఈ గదుల్లోనే సర్దుకున్నారు. నేలమీద

వచ్చే ఆదాయం సరిపోదు, తండ్రీకొడుకులు అడివిలోకి వెళ్ళి దుంపలూ అవీ తెచ్చుకుని, బరువులు మోసి కష్టపడతారు, సంపాదించుకొస్తారు. మిగతా వాళ్ళలాగ మిశ్రాగారి తోటలో కూలి పనిచేస్తారు.

ఒకరోజు తామాడీనించి కరణ్ దుసాధ్ అక్కడికొచ్చాడు. చాలా ఠీవిగా ఉన్నాడు. లఛ్మన్ పొలంలో పని చేసేవాడు. కూలి పెంచమని పోట్లాట పెట్టుకున్నందుకు జైలుకెళ్ళాడు. జైల్లో బీహార్‌నించి వచ్చిన కొంతమంది ఖైదీలతో పరిచయమైంది. హజారీబాగ్ జైల్లో ఇలాంటి ఖైదీలు బోలెడంతమంది.

అతని జాతిని చూసి ఎవరూ అతన్ని ద్వేషించలేదు. పోట్లాడగలడని అతన్ని గౌరవంగా చూశారు. ఎటువంటి సంఘటితమైన శక్తీ లేకుండా భయంకరమైన పరిస్థితులను ఎదుర్కొని రెండువందలమంది రైతులు సల్పిన పోరాటంగురించి అతను ఆ జైల్లోనే విన్నాడు. వాళ్ళు లఛ్మన్‌సింగ్‌లాంటి పొగరుబోతు జమీందారు పొలంలో ఏపుగా పెరిగిన గోధుమ పంటని మొత్తం కాల్చిపారేశారు. మిగతా ఖైదీలు కరణ్ దుసాధ్‌కి ఇటువంటి పోరాటాలు జరపటం ఎంతో అవసరమని చెప్పారు. పోరాటాలు సల్పటానికి అందరూ ఒకటవ్వాలనీ, ఆ పోరాటం ప్రతి ఒక్కడూ తనే ముందుండి జరిపిస్తున్నట్టుగా ఉండాలనీ అన్నారు.

ఇలా మాట్లాడేవాళ్ళు అప్పుడప్పుడూ జైలు నియమాలకి వ్యతిరేకంగా నిరాహారదీక్షలు చేసేవారు. వాళ్ళని జైలు అధికార్లు చావగొట్టేవాళ్ళు. ఈ దెబ్బలతోనే చాలామంది చచ్చిపోయారుకూడా. అయినా వాళ్ళు కరణ్‌ని ధైర్యశాలి అని మెచ్చుకునేవాళ్ళు. అతను చేసినది చాలా మంచిపని అనేవారు. పోరాటం తప్ప వేరే మార్గం లేదని జ్ఞాపకం పెట్టుకోమనేవారు.

దీనివల్ల దుసాధ్ చాలా మారాడు. లఛ్మన్‌సింగ్ బాధలు భరించలేక పోట్లాటకి దిగిన అదే కరణ్ విడుదలై వచ్చాక అందరితోనూ, "ఇప్పటికీ పరిస్థితి ఏమీ మారలేదు. యజమాని పీడించినప్పుడల్లా మనం ఎదిరించవలసిందే, తుపాకీగుళ్ళు తినవలసిందే, జైలు కెళ్ళాల్సిందే. మనం అందరం కలిసికట్టుగా ఉందాం. అందరం వెళ్ళి యజమానితో మాట్లాడదాం. పంట కోతలప్పుడు పోలీసుల్ని కూడా అక్కడ ఉండమందాం. మనం అడిగేది చాలా చిన్న కోరిక. హరిజనులకీ, గిరిజనులకీ అడివిలో పని ఏం దొరుకుతుంది? ఎనిమిదణాలు కూలీ కావాలని మనం పోట్లాడదాం. ఆడవాళ్ళు, మగవాళ్ళు, పిల్లలూ, అందరికీ ఎనిమిదణాల

కూలీ కావాలని అడుగుదాం. యజమాని నాలుగణాలు ఇస్తున్నాడు. మన పోరాటం ఇంకో నాలుగణాలు కావాలనే. పాతిక పైసలకోసం పోరాటం!" అన్నాడు.

ఈ విషయం దూలన్ దాకా వచ్చి అతను కరణ్‌ని కురుడాకి రమ్మన్నాడు. అతను ఎవర్నీ నమ్మడు. జనంలేనిచోట తనకి దొరికిన నేలమీదే కూర్చుని అతను అందరితో మాట్లాడతాడు. కరణ్ దుసాధ్ సన్నగా పొట్టిగా ఉన్నాడు. యౌవనంలోంచి మధ్యవయసులోకి అడుగుపెడుతున్నాడు. హజారీబాగ్ జైల్లో రెండేళ్ళున్నాక అతనిలో ఏదో కొత్త మార్పు వచ్చింది.

జాతి, కులం ఇవన్నీ అబద్ధాలు. బ్రాహ్మలూ, డబ్బున్నవాళ్ళూ కలిసికట్టుగా మనలాంటి బీదవాళ్ళని అంటరానివాళ్ళుగా చేశారు.

కరణ్ మాటలు విని దూలన్ ఉలిక్కిపడ్డాడు. లోలోపల కొంత భయపడ్డాడు. కాని దూలన్ తెలివైనవాడు, పైకి తేలలేదు. "ఆఁ, ఇదంతా చదువుకున్నవాళ్ళు అంటూ ఉండేదే! అసలు విషయానికొద్దాం. లఛ్‌మన్‌సింగ్, బీ.డీ.ఓ., ఎస్.డి.ఓ., ఇనస్పెక్టరూ మందుభాయిలు. ముందు నువ్వు తోహరీలోని ఆదివాసుల ఆఫీసుకీ, హరిజన సేవాసంఘానికీ వెళ్ళు. వాళ్ళు కూడా నీతో పోలీస్‌స్టేషన్‌కీ, ఎస్.డి.ఓ. ఆఫీసుకీ రావాలని, వాళ్ళకి ముందే కబురు చెయ్యి" అన్నాడు.

"ఎందుకు? మనం బలహీనులమా?"

"అవును కరణ్, చాలా బలహీనులం. మరిచిపోవద్దు. సర్కారు ఎప్పుడూ లఛ్‌మన్‌సింగ్ పక్షమే ఉంటుంది. అతను తుపాకీ ఎత్తితే చూడనట్టు నటిస్తుంది. కాని మీరు కఱ్ఱ ఎత్తినా జైల్లో పెడుతుంది. హరిజనసేవా సంఘంలో మదన్‌లాల్ అనే అతను ఉన్నాడు. చాలా నిజాయితీగల మనిషి. ఆయన్ని అందరూ ఎరుగుదురు. అతన్ని నీతో కలుపుకో!"

కరణ్ దూలన్ మాట విన్నాడు. జనం దగ్గర ఓట్లు సంపాదించటంలో మదన్‌లాల్ దిట్ట. అందుకే ఎస్.డి.ఓ., ఇనస్పెక్టరూ లఛ్‌మన్‌సింగ్‌తో రహస్య సమావేశం జరిపారు. తరవాత మదన్‌లాల్ చెప్పినదానికి ఒప్పుకున్నారు. ఎటువంటి అడ్డంకీ లేకుండా జొన్నపంట కోతా, గోతాల కెత్తటం అయింది. రోజుకి ఎనిమిదణాల కూలీ కూడా ఇచ్చారు. కరణ్ దుసాధ్ హీరో అయిపోయాడు. కట్టుకథ నిజమయింది.

కొన్నాళ్ళు పోయాక లఛ్‌మన్‌సింగ్ ఉన్నట్టుండి దూలన్‌ని పిలిపించి, "ఈరోజు నీ బంజరు దగ్గర ఉండు. ఈ విషయం ఎవరితోనైనా చెప్పావో చంపేస్తాను" అని

బెదిరించాడు.

ఆరోజు రాత్రి ఎస్.డి.ఓ. రాంచీకి, ఇనస్పెక్టర్ బందిపోట్లని పట్టుకోటానికి దూరంగా పురుహిడా అనే చోటికి వెళ్ళిపోయారు.

సాయంత్రం సూర్యాస్తమయం వేళ కొంతమంది రాజపుత్‌లతో లఛ్‌మన్‌సింగ్ తామాడిలో ఉండే దుసాధ్‌ల పేట ప్రవేశించి ఇళ్ళకి నిప్పుపెట్టాడు. ఇళ్ళతోపాటు ఎంతోమంది మనుషులుకూడా కాలిపోయారు. రాత్రి చంద్రోదయం వెలుగులో దూలన్ ఒక భయంకరమైన దృశ్యం చూశాడు. లఛ్‌మన్‌సింగ్ గుర్రంమీద కూర్చుని ఉన్నాడు. దగ్గరగా ఇంకో రెండు గుర్రాలు, వాటి వీపులమీద చిన్న మంచె, దానిమీద శవాలున్నాయి. లఛ్‌మన్‌తో కూడా ఒక పదిమంది ఉన్నారు.

తుపాకీతో బెదిరించి లఛ్‌మన్‌సింగ్ దూలన్‌చేత కరణ్, అతని తమ్ముడు బులాకీ శవాలు రెండూ భూమిలో పాతిపెట్టించాడు. భయంతో వణికిపోతూ తలవంచుకుని దూలన్ పారతో గోతులు తవ్వాడు. లఛ్‌మన్ అక్కడే తాంబూలం నములుతూ నిలబడ్డాడు. "నోరెత్తావంటే వీళ్ళకి పట్టిన గతే నీకు పడుతుంది, జాగ్రత్త! నక్కలూ, తోడేళ్ళూ ఈ శవాల్ని బైటికి లాగుతాయేమో! రేపే ఇక్కడ ఒక మంచె వేసుకో! రాత్రిళ్ళు నువ్వు ఇక్కడే ఉండాలి. కరణ్ ముట్టించిన ఈ నిప్పులో ఇంకా కొన్ని శవాలు కాలబోతున్నాయి. నేను రాజపుత్‌ని. మీ ఆటలు నాదగ్గర సాగవు."

దూలన్ తలాడించాడు. తన ప్రాణం కాపాడుకునేందుకు, "అలాగే దొరా!" అన్నాడు.

మర్నాడు పోలీసులొచ్చారు. చాలా హడావుడి చేశారు. చివరికి గొడవ జరిగినప్పుడు కరణ్ దుసాధ్ ఆ చుట్టుపక్కల లేడని తేల్చారు. 'ఎ ట్రూ హరిజన్ స్టోరీ' రాద్దామనుకున్న రిపోర్టర్లు ఎంతో ప్రయత్నించి కూడా ఓడిపోయారు. లఛ్‌మన్‌కి విరుద్ధంగా ఎవరూ మాట్లాడలేదు. నిప్పు అంటించాడన్న నేరానికి లఛ్‌మన్ అనుచరుడొకడు కొన్నాళ్ళు జైల్లో ఉండవలసివచ్చింది. ఇళ్ళు కాలిపోయిన వాళ్ళకి సర్కారు కొద్దిగా డబ్బు ఇచ్చింది.

అప్పటినుంచి దూలన్ తన భూమిమీదే మకాం పెట్టాడు. మొదట్లో తండ్రి పిచ్చివేషాలేస్తున్నాడనుకుని కొడుకులు ఆపడానికి ప్రయత్నించారు. దూలన్ ఎవరు ఏం చెప్పినా వినిపించుకునేవాడుకాదు. 'ఏమయింది?' అని ఎవరైనా అడిగితే

అతనుమూతి బిగబట్టి కళ్ళెర్రజేసి చూసేవాడు. రెండోసారి అడిగితే తల విదిలించి, చేతిలో కర్రపైకెత్తి, 'మాట్లాడకు! లేకపోతే నీ తల బద్దలు కొడతా!' అనేవాడు.

అతని మనసు పొరల్లో భయంకరమైన పేలుడులు బయలుదేరి మనసు కుంగిపోతుంది. లఛ్‌మన్‌లాంటి వాళ్ళకి ఈ పనులు చెయ్యటం చాలా తేలిక! మృత్యువు కూడా మనిషి జీవితంలో భాగమని దూలన్‌కి తెలుసు. కాని లఛ్‌మన్‌సింగ్ మనిషి జీవితాన్ని ఆదేశించాడు. చాలా సులభంగా మనుషుల్ని చంపేశాడు. గుర్రంవీపుమీద రెండు శవాలు! చాలా బాహాటంగా నిర్భయంగా తామాడీ ఊరిమీదుగా శవాల్ని తీసుకుపోవచ్చు. దీనిని రహస్యంగా చెయ్యవలసిన పనిలేదని లఛ్‌మన్‌కి తెలుసు. చూసినవాళ్ళు నోరు మెదపరు. లఛ్‌మన్ వాడి చూపులంటే వాళ్ళకి భయం. మాట్లాడకుండా నిలబడ్డారు. 'నోరు మెదిపితే మీరు శవాలుగా మారతారు జాగ్రత్త' అని లఛ్‌మన్ బెదిరించాడు.

ఇలా ఇంతకుముందు కూడా జరిగింది. మళ్ళీ జరుగుతుంది. ఆకాశంలో మంటలు లేస్తాయి, కాలిపోయేవాళ్ళ ఆర్తనాదాలు వినపడతాయి. ఇలాంటివి మధ్య మధ్యన జరిగితే హరిజనులకీ, అంటరానివాళ్ళకీ ప్రభుత్వపు నియమాలూ, ఆఫీసర్లూ, వాళ్ళు చెప్పే మాటలూ ఎందుకూ పనికిరావని తెలుస్తుంది. రాజపుట్ రాజపుట్‌డే, బ్రాహ్మణుడు బ్రాహ్మణుడే! దుసాధ్ - గంజూ - చాకలి వాళ్ళకన్నా బ్రాహ్మణ్ - కాయస్థ - రాజపుత్ - భూమిహార్ - కుర్మీలు ఎప్పుడూ పైనే ఉంటారు. కాని వాళ్ళ జాతి వాళ్ళని మంటల్లో కాలిపోకుండా కాపాడుతుంది. ఖాండవవనం దహనం అయినప్పుడు అడివిజాతి మనుషుల మాంసం రుచిమరిగిన అగ్నిదేవుడికి ఇప్పటికీ అలాంటి వాళ్ళే ఇష్టం.

ఈ సంఘటన దూలన్ మనసుని తొలిచేసింది. ఇంతకుమునుపు అతడు చెడ్డవాడే, బతికుండటానికి మామూలు మోసాలు చేసే చెడ్డవాడు. కాని ఇప్పుడు అతను తన ఆత్మలో రెండు శవాల్ని దాచుకుని ఉన్నాడు. అతని ఆత్మలో అవి నెమ్మది నెమ్మదిగా కుళ్ళుతున్నాయి. మట్టికింద పాతిన కరణ్, బులాకీ శవాలలో మాంసం బరువుతగ్గుతోంది. కాని దూలన్ ఆత్మలో ఉన్న శవాల బరువు రోజురోజుకీ పెరుగుతోంది. అతని మొహంలో జీవకళ తగ్గుతోంది. ఈ విషయం ఎక్కడ బైటపడిపోతోందో అన్న భయంతో అతను మనుషులతో మాట్లాడటం మానేశాడు. ఈ భారాన్ని అతనొక్కడే మోస్తున్నాడు. నోరుమూసేసి చావగొడుతున్నట్టుగా ఉంది

అతని పరిస్థితి. అతను నోరు తెరిస్తే కురుడాలో దుసాధ్‌లున్న పేట అంటుకుంటుంది. గాలిలో బూడిదతోపాటు, కాలిన మాంసం దుర్వాసన కూడా అలుముకుంటుంది.

రోజులు గడుస్తున్నాయి. కరణ్ - బులాకీ అనే ఇద్దరు వ్యక్తులు ఎక్కడా కనబడటంలేదు. చేసేదేంలేక జనం ఆ విషయం మరచిపోయారు. తోహరీనుంచి పురిడిహాకీ, ఫూల్‌ఝురీకి రైల్వేలైను పడింది. ఆదివాసులమీదా, హరిజనులమీదా జరిగే అత్యాచారాల్ని వెంటనే విచారించి, కోర్టులో కేసు దాఖలు చెయ్యటానికి ఆ ప్రాంతపు ఎస్.డి.ఓ.కీ, ఇనస్పెక్టర్‌కీ ప్రత్యేకమైన అధికారం ఇవ్వబడింది. ఢాయీ అనే గ్రామంలో పంచాయితీవాళ్ళు బావి తవ్వారు. అది ఆదివాసులు, తక్కువ కులస్తులు ఉండే గ్రామం. ఆ ప్రాంతం కుంటుకుంటూ వర్తమానంవేపు రావాలని ప్రయత్నిస్తోంది.

దీనివల్ల లఛ్‌మన్‌సింగ్ ప్రతాపం ఇంకా పెరిగింది. సర్కారు ఆదేశాన్ని ధిక్కరిస్తూ కూలీలకి అతను నలభైపైసలే కూలీ ఇచ్చేవాడు. హనుమాన్ మిశ్రా తన గుడిలో శివుడి తలమీద బంగారుపాముని చుట్టించాడు. లఛ్‌మన్‌సింగ్ బీ.డీ.ఓ.కు స్కూటరూ, ఇనస్పెక్టర్‌కి ట్రాన్సిస్టరూ కొనిచ్చాడు. కరణ్, బులాకీ తాలూకు ఒకటిన్నర భీగా భూమిని ఏదో పాత బాకీకింద జమకట్టుకుని తీసేసుకున్నాడు.

దీనికి కూడా జనం ఒప్పుకున్నారు, కాని ఉన్నట్టుండి ఒకరోజు పొలం కూలీలకి సంబంధించి ఒక సర్క్యులర్ వచ్చింది. ఒక కొత్త ఎస్.డీ.ఓ. బదిలీ అయి ఆ ఊరికి వచ్చాడు. ఇతను వామపక్షానికి చెందినవాడని ఒక ఆరోపణ ఉంది. ప్రభుత్వం ఇతన్ని సస్పెండు చేసి శిక్షించాలనుకుంది. అందుకే ఇంకా నెలాపదిహేను రోజులకి పంట కోస్తారనగా ఇతన్ని తోహరీకి బదిలీ చేశారు.

తోహరీ ప్రాంతపు వ్యవసాయ కూలీలు, హరిజనులూ, ఆదివాసులూను కిందిజాతివారు. భూస్వాములూ, వడ్డీ వ్యాపారులూ పైజాతివారు. ఈ ప్రాంతంలో ఉన్న పెద్ద సమస్య ఏమిటంటే కూలీలకి తమ యజమానులమీద ఉన్న గొప్ప అపనమ్మకం. అందుకే ఇక్కడ వ్యవసాయం బాగా జరగటంలేదు, సరాసరి ఆదాయం కూడా పెరగటంలేదు. జమాఖర్చులూ, ఆరోగ్యం, చదువు సంధ్యలూ, సామాజిక దృక్పథం - అన్ని విషయాల్లోనూ ఈ ప్రాంతం 'సబ్-నార్మల్'గానే ఉంది. ఇక్కడ పనులు జరిపించటానికి, బీదసాదలంటే సానుభూతి ఉన్న, తెలివైన ఆఫీసరు కావాలి.

తనని శిక్షించాలనే ఇలాటిచోటికి పంపిస్తున్నారని ఎస్.డీ.ఓ.కి తెలుసు. అతను మామగారితో, "మీరే గెలిచారు. బ్యాంకులో ఉద్యోగం చూడండి. ఏగ్రో ఇకనామిక్సు చదివాను. బ్యాంకులో ఉద్యోగం దొరుకుతుంది. లేకపోతే నేను వెళ్ళేచోటునించి ప్రాణాలతో బైటపడతాన్న నమ్మకంలేదు. మీ ఒక్కగానొక్క కూతురు విధవరాలవుతుంది" అన్నాడు.

ఎస్.డీ.ఓ. ఇంకో ఉద్యోగం చూసుకుని మరీవచ్చాడు. చాలా ఉత్సాహంగా పొలం కూలీలతో, "మీకు ఒక్కొక్కరికీ న్యాయప్రకారం రోజుకి అయిదు రూపాయల ఎనభై పైసలు ముట్టాలి" అని చెప్పాడు. ఇదే మాట జమీందార్లకీ చెప్పాడు. లఛ్మన్‌సింగ్‌కి తామాడీ, పురుహిడా, కురుడా, హిసాడీ, చామా, ఢాయీ ఊళ్ళన్నిట్లోనూ భూములున్నాయి. పురుడిహ్ గ్రామపెద్ద కొడుకు అషర్ఫీమహతో, "కరణ్ విషయం జ్ఞాపకం ఉంది. గత మూడేళ్ళుగా మర్చిపోలేకపోతున్నాను. కాని ఈ ఎస్.డి.ఓ. మంచివాడు. అలాటప్పుడు నలభై పైసలకి, పిడికెడు మెతుకులకీ మనం పంట ఎందుకు కొయ్యాలి? అయిదు రూపాయల ఎనభై పైసల కూలీ ఇవ్వవలసిందే! తిండి పెట్టక్కరలేదు. మాకు న్యాయంగా ముట్టవలసింది ఇవ్వండి" అన్నాడు.

మునుపు కరణ్‌కి నచ్చచెప్పినట్టే దూలన్ అషర్ఫీకి కూడా నచ్చచెప్పాడు.

"కరణ్ చాలా పోట్లాడేవాడు. కాని ఏమయింది? తామాడీలో దుసాధ్‌ల పేట కాలిమసయింది!" అన్నాడు.

"కరణ్, బులాకీ ఏరీ?"

"ఎవరికి తెలుసు?"

"చచ్చిపోయారు."

"ఎందుకా మాట?"

"చంపేసి అడివిలో ఎక్కడో గుంటలో పారేసి ఉంటారు."

"తెలీదు. కాని నువ్వొక పని చెయ్యి. ఏం చేసినా ఆఫీసరు ముందరే చెయ్యి."

"అలాగే చేస్తాను."

"తరవాతకూడా ఆయన సహాయం ఎప్పుడూ ఉండేలాగ చూసుకో. పోయినసారి అడిగినంత కూలీ ఇచ్చారు, కాని తరవాత నిప్పంటించారుగా వాళ్ళు!"

"అలాగే నువ్వు చెప్పినట్టే చేస్తాను?"

ప్రతిప్రాంతానికి సంబంధించిన సంఘర్షణ ప్రత్యేకంగా ఉంటుంది. లఛ్‌మన్‌సింగ్, "అంత ఇవ్వలేను, రెండురూపాయలిస్తాను" అన్నాడు.

"పూర్తి కూలీ ఇవ్వండి, దొరా!"

లఛ్‌మన్‌సింగ్ చాలా స్నేహపూర్వకంగా "ఆలోచిస్తాను, మీరూ ఆలోచించండి. ఇవ్వాలన్న విషయం ఏ గాడిదకైనా తెలుస్తుంది. కానీ మీకూ తెలుసు, ఈ చుట్టుపక్కల మఖ్ఖన్‌సింగ్, దైతారీసింగ్, రామ్‌లగన్‌సింగ్, హుజూరీ ప్రసాద్ మహతో వాళ్ళు ఎవ్వరూ ఇంత కూలీ ఇవ్వటంలేదు. నాకుమట్టుకు ఈ శిక్ష ఏమిటని వెళ్ళి ఎస్.డీ.ఓ.ని అడగండి" అన్నాడు.

అషర్ఫీ భయపడుతూనే నవ్వుమొహంతో, "అయ్యో, మీకు శిక్షేమిటి? మీదగ్గర పిండిమర ఉంది, పెద్ద ఇల్లుంది - ఎంతో దూరంనుంచి కనిపిస్తుంది. మిమ్మల్నెవరు శిక్షిస్తారు?" అన్నాడు.

లఛ్‌మన్‌సింగ్ పొగరుగా, నిర్లక్ష్యంగా, "నేను చెప్పిన రెండురూపాయల కూలి విషయం నిర్ధారణ అయిపోయింది. మాదగ్గర భూములుండటం వలన సర్కారు మమ్మల్ని దొంగలనుకుంటోంది. మీదగ్గరున్న కొద్దిపాటి నేలకి ప్రభుత్వం కావలసినంత సహాయం అందజేస్తుంది. నేను దూలన్‌కి భూమి దానం చేశాను. ఆ సోమరిపోతువెధవ వ్యవసాయం చెయ్యడుగాని, ప్రతి ఏటా విత్తనాలు మట్టుకు తెచ్చుకుంటాడు. పశువు! ఆ గింజలు వండుకు తింటాడు. వాడి విషయం అలా ఉండనీ, మాకు దొరికే సహాయం ఏముంది? విత్తనాలూ, ఎరువులూ, చీడపురుగుల్ని చంపే మందులూ అన్నీ మేము డబ్బిచ్చి కొనుక్కోవలసిందేకదా! వెళ్ళి నేనిలా అన్నానని ఎస్.డి.ఓ.తో చెప్పు" అన్నాడు.

అషర్ఫీ వెళ్ళి దూలన్‌కి ఇదంతా చెప్పి, "బాబాయి, జాగ్రత్తగా ఉండు, నువ్వు ఈ నేలలో ఏమీ పండించటంలేదని ఆ వెధవకి తెలుసు" అన్నాడు.

దూలన్ అంతరాత్మలో దాగున్న శవాల బరువు పెరిగింది. ఆ నేలలో కొన్నేళ్ళవరకూ విత్తనాలు చల్లవద్దని లఛ్‌మన్‌సింగ్ దూలన్‌తో చెప్పాడు.

దూలన్ చాలా విచారంగా అషర్ఫీతో, "వాణ్ణి నమ్మవద్దు నాయనా! మీ నాన్న కూడా కొన్నేళ్ళక్రితం వాడిదగ్గర పనిచేశాడు" అన్నాడు.

"అలాగే బాబాయి!"

ఎస్.డీ.ఓ. దగ్గరకీ, లఛ్‌మన్‌సింగ్‌దగ్గరకీ అషర్ఫీ తెగ తిరిగాడు. దూలన్

విచారం పెరిగింది. ఏదో చెడు జరగబోతోందని అనిపించింది. అతను తన కొడుకులతో, "పనికిరానివాడి కొడుకు కూడా పనికిరానివాడే అవుతాడు. మట్టితవ్వి ఈ ముసలివాడు తెచ్చేది తిని కూర్చుంటున్నారు. ఇంకెవరైనా అయితే దగ్గర్లోని ఏ కోలియరీకో వెళ్ళి పని చేస్తారు. ఇక్కడే పాతుకుపోయి కూర్చున్నారేం?" అన్నాడు.

ధతువా చాలా శాంతంగా తండ్రివేపు చూసి, "నాన్నా! ఈసారి మనకి రెండింతలు కూలి ఇస్తారుట!" అన్నాడు.

దూలన్ మరి మాట్లాడలేదు. నేరుగా తోహరీలోని బ్లాక్ ఆఫీసుకి వెళ్ళి "ఈసారి కోతలయాక, నేను రబీ పంట వేస్తాను. మీ సహాయం కావాలి" అన్నాడు.

ఏనాడూ పంట పండించని భూమికోసం ఏటా గింజలెందుకు ఇప్పిస్తున్నారో బీ.డీ.ఓ.కి తెలిసిపోయినట్లుంది. ఈ కుట్రలో అతనూ లఛ్మన్‌సింగ్, దూలన్‌తో చేరిపోయాడు. నవ్వి, "చూస్తాను" అన్నాడు.

బీ.డీ.ఓ. ఇంట్లో ఒక ఎత్తైన బొప్పాయి చెట్టుండటం దూలన్ కంటపడింది. మామూలుగా బొప్పాయి చెట్లు ఇంత ఎత్తు పెరగవు.

"అయ్యా, ఈ చెట్టు ఇంత ఎత్తు ఎలా పెరిగింది?" అని అడిగాడు.

బీ.డీ.ఓ. గర్వంగా నవ్వాడు. "ఎండాకాలంలో ఒక పిచ్చికుక్కని చంపి దీని మొదట్లో పాతిపెట్టాం. మాంసం, ఎముకలు ఎరువుగా పెరిగిన చెట్టు, మరి ఎత్తుగా పెరగదూ?" అని అన్నాడు.

"అది మంచి ఎరువా, బాబుగారూ?"

"చాలా మంచి ఎరువు. పేద ముసల్మానుల గోరీల మట్టిలోని పూలమొక్కలకి ఎన్నెన్ని పూలు పూస్తాయో ఎప్పుడూ చూడలేదూ?"

ఈ మాటలు విన్నాక దూలన్ అంతరాత్మలోని శవాల బరువు కొంత తగ్గినట్టనిపించింది. ఊరికొచ్చాక మిట్టమధ్యాహ్నం అతను తన నేలని చూసుకోటానికి వెళ్ళాడు. అవును, నిజమే! కరణ్, బులాకీ ఎలో పొదల్లోనూ, మిగతా మొక్కల్లోనూ బతికే ఉన్నారు. అతను ఏడవటం మొదలుపెట్టాడు. కరణ్, నువ్వు చచ్చిపోయికూడా బతికే ఉన్నావు! ఎలో మొక్కలు ఎవరికీ పనికిరావు. పశువులు కూడా వీటిని తినవు. నువ్వు మా అందరి హక్కులకోసం పోట్లాడటానికి వెళ్ళావు! మరి గోధుమగానో, జొన్నలుగానో ఎందుకు పుట్టలేదు. మరేం కాకపోతే, కనీసం చైనాగడ్డిగానైనా పుట్టకపోయావా? చైనాగడ్డి గింజలు ఉడికించుకుని తినేవాణ్ణి కదా!

ఈ దుఃఖాన్ని భరించలేక అతను తామడీ వైపు వెళ్ళి లఛ్‌మన్‌సింగ్ కూరగాయల మడిలో ఎవరూ లేకపోవటంచూసి కంచె పీకిపారేసి, చుట్టుపక్కల ఉన్న గేదెల్ని ఆ కూరగాయల మళ్ళలోకి తోలేశాడు. ఆ తరవాత ఇంకో దారిన లఛ్‌మన్‌సింగ్ ఇంటికెళ్ళాడు.

"దొరా! ఒక ఉత్తరం రాయించుకోవాలి. ఆస్పత్రిలో చేరాలి. దగ్గు బాధపెడుతోంది. గుండెల్లో నెప్పిగా కూడా ఉంటోంది" అన్నాడు.

"కోతలు కానీ, తరువాత రాసిస్తాను."

"అలాగేనయ్యా!"

దూలన్ గుండెలమీద మళ్ళీ శవాల బరువు పెరిగిపోయింది. తన అంతరాత్మను తవ్వుకోటం మొదలుపెట్టాడు. కరణ్‌నీ, బులాకీనీ అక్కణ్ణించి వెళ్ళిపొమన్నాడు.

"కోతలు అయాయి, కాని కరణ్, బులాకీకి బదులు ఎవరొస్తున్నారో?" అని అనుకున్నాడు.

పొలాల్లో కోతలు మొదలుపెట్టారు. చాలా రోజులు వాగ్వివాదాలు జరిగాక రోజుకి రెండు రూపాయల కూలీ, ఫలహారం ఇవ్వాలని నిర్ణయించారు. లఛ్‌మన్‌సింగ్ స్వయంగా గుర్రమెక్కి అన్నీ చూసుకుంటున్నాడు. పోలీసులొచ్చి చూసి ప్రశాంతంగా పనిజరుగుతోంది లెమ్మని వెళ్ళిపోయారు. అందరికీ ఏడ్రోజుల కూలీ దొరికింది.

ఎస్.డీ.ఓ. సంతోషించి పోలీసులతో వెళ్ళిపోయాడు.

ఎనిమిదోరోజు తుఫాను లేచింది. లఛ్‌మన్‌సింగ్ బయట కూలీల్ని పిలిపించి కోతలపని ప్రారంభించాడు. అషర్ఫీ అతని అనుచరులూ చాలా విచారించారు. చివరికి ప్రతిఘటించారు.

"అయ్యా, మీరిలా చేయటం ఏం బాగాలేదు!"

"ఎవఁ్రా అలా అనేది? చేస్తున్నాగా! లంజకొడుకుల్లారా, చూడండి! ఎలా చేస్తున్నానో!"

"కాని..."

"కోతలు కొయ్యనిచ్చానుగా, కూలీ కూడా తీసుకున్నారుగా, అంతే, ఆట కట్టు!"

అషర్ఫీ, అతని మనుషులూ చాలా కోపంగా ఉండటంచూసి, ఏం

కొంపమునుగుతుందోనని బయటనుండి కోతలకొచ్చిన కూలీలు కొడవళ్ళు పట్టుకుని ఒకపక్కగా నిలబడ్డారు. తుపాకీ చప్పుడు వినిపించింది. కూలీలు పారిపోయారు.

మళ్ళీ తుపాకీ పేలింది.

ఎన్ని శవాలు నేల కూలాయో లెక్కలేదు. దూలన్ లెక్కన పదకొండు, కానీ పోలీసులూ, లఛ్‌మన్‌సింగ్ ఏడేనని చెప్పారు.

అషర్ఫీ వాళ్ళ నాన్న చాలా గాభరాపడ్డాడు. అతని కొడుకులు మొహర్, అషర్ఫీ అయిపులేరు. చామా గ్రామంనించి వచ్చిన మధువన్ కోయిరీ, బరుడిహానించి వచ్చిన పారస్ అనే చాకలికూడా మాయమయ్యారు. ప్రతీ ఇంట్లోనూ హాహాకారాలే. ఎస్.డీ.ఓ. రాగానే చచ్చిపోయినవాళ్ళ తలిదండ్రులూ, పెళ్ళాలూ, పిల్లలూ కనపడకుండా పోయినవాళ్ళ కుటుంబాలూ అతని కాళ్ళమీద పడ్డారు. ఎస్.డీ.ఓ. ట్రాన్పడిపోయాడు. అతను ఊళ్ళోవాళ్ళకి ధైర్యం చెబుతూ లఛ్‌మన్‌సింగ్ మీద పోలీసుకేసు వేస్తానని ప్రమాణం చేశాడు. పత్రికల నుంచి రిపోర్టర్లు వస్తే, ఊరంతా తిప్పి చూపించాడు.

"నేను వారంటుతో వచ్చేవరకూ లఛ్‌మన్‌సింగ్ ఇజ్ నాట్ టు లీవ్ హోమ్!" అన్నాడు.

వెన్నెలరాత్రి, చల్లనిగాలి వీస్తుండగా లఛ్‌మన్‌సింగ్ వచ్చాడు. ఆ ఇలాకాలో అన్నీ ఒక పద్ధతిలో జరుగుతాయి. ఈసారికూడా గుర్రాలమీద శవాలు వచ్చాయి. నాలుగు గుర్రాలమీద నాలుగు శవాలు. ఈసారి లఛ్‌మన్‌సింగ్ మనుషులు దూలన్‌కి సహాయం చేశారు. గోతులు చాలా లోతుగా తవ్వవలసివచ్చింది. వానవల్లా, మంచుకురవటంవల్లా నేల మెత్తగా ఉంది. గబగబా శవాల్ని గోతుల్లో పూడ్చిపెట్టారు. దూలన్ అంతరాత్మ బరువు ఇంకా పెరిగిపోయింది.

దూలన్ ఇంకా విచిత్రంగా తయారయాడు. బీ.డీ.ఓ.తో పోట్లాడి ఎక్కువ విత్తనాల గింజలు తెచ్చుకుంటాడు. ఎద్దులూ, నాగలికోనం డబ్బులు తెచ్చుకుంటాడు. నెలరోజుల్లో కొత్త ఎలో పొదలు కనబడ్డాకే అతని మనసు నెమ్మదించింది. ఆ పొదలు మునుపటికన్నా ఏపుగా ఉంటాయి. దేశంలో ఎమర్జన్సీ విధించినప్పుడు బీహారులోని కొన్ని ప్రాంతాలలో హరిజనులు హత్యచేయబడ్డ నేరాలు దస్తావేజుల్లోకి ఎక్కలేదు. ఈ ఎలో పొదలు కూడా ఆ దస్తావేజుల్లాగే కనిపించాయి అతనికి. రోజూ అవి సూర్యనమస్కారా లందుకునేవి! లఛ్‌మన్‌సింగ్‌ని

కోర్టు నిర్దోషి అని వదిలేసింది. ఎమర్జన్సీ! పొలం కూలీలని రెచ్చగొట్టి, జమీందార్లకీ రైతుకూలీలకీ మధ్య ఉండే సంబంధాన్ని చెడగొట్టిన నేరానికి ఎస్.డీ.ఓ.ని ఉద్యోగంనుంచి తాత్కాలికంగా తొలగించారు. లఛ్‌మన్‌సింగ్ మిగతా జమీందార్లూ, వ్యాపారులూ, హనుమాన్ మిశ్ర గుడిలో చాలా పెద్ద ఎత్తున పూజ చేయించారు. రూపాయి కూలీకి, ఫలహారం కూడా అడగకుండా, ఏ దిక్కుమాలిన వెధవలు కోతలకొస్తారో, వారు రావచ్చని చాటించారు. లేకపోతే బైటినుంచి కూలీలని తెప్పించుకుంటామని హెచ్చరించారు. ఎమర్జన్సీ వల్ల పరిస్థితులు చాలా ఘోరంగా ఉన్నాయి. కాంగ్రెసు గూండాలు బైటనుంచి కూలీలని తెప్పించడానికి కాంట్రాక్టు తీసుకుంటారు. ఈసారి పరిస్థితి ఇంకా భయంకరంగా ఉండబోతోంది. కూలీలు తమకి ముట్టే దాన్లోంచి నాలుగణాలు కంట్రాక్టర్‌కి ఇవ్వాలి, అతని మనిషయినా కాకపోయినా అదే రూలు. ఆ గూండాలు తుపాకీతో వాళ్ళని భయపెట్టి పనిచేయిస్తామని మాటిచ్చారు. ఎవరైనా నోరువిప్పితే, మీద పెట్రోలుపోసి అంటిస్తామని బెదిరించారు. ఈ ప్రాంతాల ఉన్న రౌడీతనాన్ని చిటికెలో మాన్పిస్తామన్నారు. దూలన్ అంతరాత్మలో శవాల బరువు పెరుగుతూపోతోంది. అతను భరించలేక తన కొడుకులతోపాటు ఊరు విడిచి పారిపోదామనుకున్నాడు. కాని ఎక్కడికి వెళ్తాడు? బీహారుకు ఆగ్నేయంగా ఉన్న ప్రాంతాల్లో గంజూ నిర్భయంగా బతికే దారే లేదే! బయటనుంచి వచ్చిన లఛ్‌మన్‌సింగ్ లాటి జమీందారు ఆక్రమించుకోని చోటంటూ లేదే!

హోలీరోజున అతను హోలీపాటలు కూడా వినడు. ఉన్నట్టుండి ఒకరోజు ఒక అద్భుతమైన పాట వినగానే హోలీ పండగ ఉత్సాహం ఒక్కసారిగా చచ్చిపోయింది. బాగా తాగిన మైకంలో ధతువా వాయిస్తూ కళ్ళు మూసుకుని పాడుతున్నాడు.

"ఏడీ బాబూ కరణ్, ఏడీ బులాకీ?
ఎవరు చెబుతారండి వాళ్ళ ఆచూకీ?
పోలీసోళ్ళ లెక్కల్లో జమ అయ్యారో
అషర్ఫీ మంగలి అతని తమ్ముడు మొహర్ ఎక్కడ మాయమయ్యారో?
మహువన్ ఏడీ, పారస్ ఎక్కడ?
ఎవరు చెబుతారండీ వాళ్ళ ఆచూకీ?
పోలీసోళ్ళ ఫైళ్ళలో మాయమయ్యారో!

కరణ్ పోరాటం పాతికపైసలకోసం,
అషర్ఫీ పోయాడు ఐదు రూపాయల నలభై పైసల కోసం
బులాకీ, మొహర్ పోయారు తమ సోదరులతో
మహువన్‌కి తెలుసు ఎలాదిదో మైకం
పారస్‌కి తెలుసు హోలీ నాట్యం
అందరూ పోయారు పోలీసోళ్ళ ఫైళ్ళల్లో
పోయారు, పోయారు, మాయమయ్యారు...

పాట అయిపోయింది. అందరూ ఎక్కడివారక్కడ నిశ్శబ్దంగా ఉండిపోయారు. హోలీ రంగులు ఎగిరిపోయాయి. నిషా పాదరసంలా దిగిపోయింది. దూలన్ లేచి నిలబడ్డాడు.

"ఈ పాట ఎవరు చేశారు" అని అడిగాడు.

"నేనే నాన్నా!"

దూలన్ ఉన్నట్టుండి వెక్కివెక్కి ఏడ్చాడు. ఏడుస్తూనే, "మర్చిపోరా ఈ పాట! నువ్వు కూడా పోలీసు ఫైళ్ళల్లో మాయమౌతావు బాబూ, నువ్వు కూడా పత్తా లేకుండా పోతావురా!" అన్నాడు.

దూలన్ తన నేల దగ్గరకి వెళ్ళిపోయాడు. మధ్యన లోతుగా ఉన్న ప్రదేశంలోకి దిగాడు. గొంతు తగ్గించి, "వింటున్నారా? మీరంతా పాటగా మారిపోయారు. ఏం, వినబడుతోందా? నా కొడుకు ధతువా మీమీద పాట రాశాడు. పాటగా మారారు. కాని ధాన్యంగా మారలేదు. కనీసం చైనాగడ్డిగా కూడా మారలేదు ... ఇంక నా ఛాతీమీదనుంచి దిగిపొండి, నేనింక భరించలేనర్రా! భరించలేను!" అన్నాడు.

పౌర్ణమి చంద్రుడు వెన్నెలంతా నేలమీద ఒలకబోస్తున్నాడు. ఎలో పొదల మెరిసే ఆకులూ, కుటుస్ పువ్వుల గుత్తులూ వెన్నెల్లో విరగబడి నవ్వుతున్నట్టున్నాయి. బహుశా ఇంత నవ్వొచ్చే విషయం ఎప్పుడూ వినలేదేమో! ఒక అస్పష్టమైన భయం దూలన్ మనసులో కొట్టుకుంటోంది. ధతువా గురించే అతని భయం. మంచె ఎక్కగానే అతనికి మళ్ళీ ధతువా పాడిన పాట వినపడింది. ఈసారి ధతువా మట్టుకే పాడటం లేదు. అందరూ పాడుతున్నారు. కాని వాళ్ళు పోలీసు ఫైళ్ళల్లో మాయంకాలేదు. దూలన్ అన్ని విషయాలు ఎవరితోనూ చెప్పలేదు. లఛ్‌మన్‌సింగ్ అంటే భయం!

చివరికి ఎమర్జన్సీ ఎత్తివేశారు. ఒకరోజు భారతదేశంలోని ముక్తి-సూర్యుడు తమాషా చూద్దామని తన సింహాసనం వదిలి కిందికి దిగాడు. కొంచెం ఆయాసం తీర్చుకున్నాక మళ్ళీ సింహాసనం ఎక్కటానికి పరుగులు పెట్టసాగాడు. ఒకరోజు మళ్ళీ లక్ష్మణ్‌సింగ్ పంట కోతలకొచ్చింది.

రెండేళ్ళపాటు కరువుకాటకాలవల్ల పంటలు సరిగ్గా పండలేదు. కాని ఈసారి భూమి విపరీతంగా పండింది. కనుచూపుమేర వరకూ పొలాల్లో పచ్చటిపైరు పరుచుకుంది. వరసగా మంచెలు కనబడ్డాయి. పక్షులు గుంపులు పగలనక రాత్రనక ఏపుగా పండిన పొలాలమీదకి వచ్చిపడ్డాయి.

రెండేళ్ళక్రితం పొలం కూలీలని పోగుచేసే కాంగ్రెసు గూండాలు కాంగ్రెసు పేరు వదిలేసి ఉత్త కంట్రాక్టర్లుగా మిగిలిపోయారు. వాళ్ళు కూడా టెర్లిన్ బట్టలు వేసుకుని నల్లకళ్ళద్దాలు పెట్టుకుని, తుపాకులు పట్టుకుని నలుగురేసి మనుషులుండేవాళ్ళు.

ఒకరోజు ఒక మనిషి అమితాబ్ బచ్చన్ గొంతుతో, "ఇక మీరోజులు పోయాయి!" అని లఛ్‌మన్‌సింగ్‌తో అన్నాడు. సమ్మెలు జరగకుండా చూడటం, పొలం కూలీలను పోగుచెయ్యడం, కోతలపని చూడటం అన్నీ వీళ్ళే చూసుకోవటం ప్రారంభించారు. "సౌత్-ఈస్టర్న్ బీహార్‌లో మర్సినరీ సర్వీస్ చేస్తున్నాను. మీకిష్టం లేకపోయినా, నా సర్వీస్ ఒప్పుకోవలసిందే. ఐదువేలు అడ్వాన్సు" అన్నాడు.

"ఐదువేలే?"

"పోనీ సర్కారు రేటు ప్రకారం కూలీ ఇవ్వండి!"

"లేదు, అలా కుదరదు."

"సర్కారు రేటు ఇవ్వకుండా ఎనభైవేలు లాభం సంపాదించు కుంటున్నారు, ఐదువేలు ఇవ్వలేరా?"

"ఇస్తాలే బాబూ, ఇస్తా!"

"అంతే నాక్కావలసింది. ఊరిపేరూ, కూలీల పేర్లూ చెప్పండి. గొడవచేసే వాడెవడైనా ఉన్నాడా?"

"లేదు."

"సరే. మఖ్ఖన్‌సింగ్‌కీ, రామలగన్‌సింగ్‌కీ కూడా సర్వీస్ చెయ్యాలి. నేను సరిగ్గా టైముకి వస్తాను. ఇంకో విషయం, కూలీలకి రూపాయి పావలా ఇవ్వండి.

నావంతు నాలుగణాలు.''

''ఒక రూపాయి కాదా?''

''కాదు, రూపాయి పావలా. నా పేరు అమరనాథ్ మిశ్ర. నేను మితభాషిని.''

''టూహాడ్‌లో ఉండే మిశ్రా మీకేమవుతారు?''

''నేనాయన అన్న కొడుకుని. నా సర్వీస్‌కి మదుపు పెట్టింది మా చిన్నాన్నే!''

అంతా నిర్ణయం అయిపోయింది. తరవాత కలిసినప్పుడు హనుమాన్ మిశ్ర లఛ్మన్‌సింగ్‌తో, ''అవునవును, వాడు మా అన్న కొడుకే. మావాడికి నేను సర్ఫేస్ కోలియరీ కొనిపెట్టాను. వీణ్ణికూడా నీకు కావాలా అని అడిగితే, వద్దు కూడనిపని నేను చేయనన్నాడు. చాలా తెలివైన కుర్రాడు. ఎలక్షన్లలో నిలబడే కేండిడేట్లూ, సమ్మెలప్పుడు కార్ఖానా యజమానులూ వీడి సహాయం తీసుకుంటారు. సర్ఫేస్ కోలియరీలకు వీడు లేబర్ సప్లై చేస్తాడు. చురుకైనవాడు. మూడు పెళ్ళిళ్ళు చేసుకున్నాడు. ముగ్గురు పెళ్ళాల్నీ వేరే వేరే ఊళ్ళలో ఉంచాడు. అందరికీ ఇళ్ళు కట్టిచ్చాడు. ఇంతకుముందున్న ప్రభుత్వం ఇతన్ని చాలా గౌరవించేది. ఏం చెయ్యను, నా కొడుకుల్లో ఒక్కడు కూడా ఇంత తెలివైనవాడు కాలేకపోయాడు?'' అన్నాడు.

లఛ్మన్‌సింగ్ చాలా పొగరుబోతూ, చాలా క్రూరుడూను. తన ఇలాకాలో అతను సంజయుడే! కాని అంతవాడికీ మర్సినరి సర్వీస్ ఒప్పుకోక తప్పలేదు. ఒప్పుకోకపోతే మఖ్ఖన్‌సింగ్, రామ్‌లగన్‌సింగ్ నవ్వుతారని భయం!

పంటకోత ప్రారంభించారు. బైటి కూలీలు రాలేదు. ధతువా, అతని మనుషులూ కూలీపనికి వచ్చారు. రూపాయిపావలా రోజుకూలీ, జొన్న సంకటి, పచ్చిమిరపకాయ, ఉప్పు తినటానికి దొరికాయి. ధతువా వాళ్ళమ్మ ఇద్దరు కొడుకులకీ వాక్కాయలతో చేసిన పచ్చడికూడా ఇచ్చేది.

దూలన్ మంచెమీద కూర్చుంటున్నాడు. దేనికోసం ఎదురుచూస్తున్నాడో ఎవరికీ తెలీదు! పంట కోతలు జరుగుతున్నాయి. కోతలప్పుడు ఆడవాళ్ళు పాటలు పాడుతున్నారు. దూరంనించి వింటే వాళ్ళ పాట జోలపాటలాగ వినిపిస్తోంది. కాని దూలన్‌కి నిద్ర రావటంలేదు.

దూలన్ నిద్ర ఎవరు చెడగొట్టారు?

బహుశా పోలీసుల ఫైళ్ళలో అతని నిద్ర మాయమై ఉంటుంది.

ధతువా, లటువా ఇంటికొచ్చేవరకు దూలన్ ఇంట్లోనే ఉంటాడు. ఆ తరవాత

తన నేల దగ్గరకెళ్తాడు. వానలవల్ల, మంచుపడటంవల్ల మట్టి తడిగా ఉంది. ఆ తడి మట్టిలో ఎల్లో పొదలు ఆకుపచ్చగా, ఏపుగా పెరిగాయి. కుటుస్ మొక్కల్లో పువ్వుల గుత్తులు విరగబూశాయి. దూలన్‌కి నిద్రరాదు. అతను భయపడ్డట్టే, కూలీడబ్బులు ఇచ్చే రోజున చాలా గొడవయింది. అమర్‌నాథ్ మిశ్ర తన వాటా అడిగాడు.

లఛ్‌మన్‌సింగ్, "ఎవరిమీదా చేయి చేసుకోవద్దు. నా డబ్బులో వాటా ఇస్తానని మనం మాట్లాడుకోలేదు. వెళ్ళి కూలీలనే అడుగు" అన్నాడు.

"ఎంతమందినని అడుగుతాను, మీరే ఇచ్చెయ్యకూడదూ?" అన్నాడు మిశ్రా తోడేలులా నవ్వుతూ.

కూలీలలో వంతు విషయం విని ధతువా మండిపడ్డాడు.

అందుకే లఛ్‌మన్‌సింగ్ ఈ గొడవలో తల దూర్చలేదు. తుపాకీతో భయపెట్టి అంటరానివాళ్ళని అణచటమే అతనికి తెలుసు. కాని ఏం చేస్తాడు? ధతువాని తుపాకీతో కాల్చటం అతనికి ఇష్టంలేదు. దూలన్ తనకి చాలా పనికొచ్చే మనిషి. ధతువా అతని కొడుకే కదా!

అమర్‌నాథ్ మిశ్రా, " ఈ కుక్కవెధవలతో నేను మాట్లాడతానా? ఐదువందల మంది రోజుకి పావలా చొప్పున ఇస్తే పదిహేనురోజులకి 1875 రూపాయలైనాయి. మాట్లాడకుండా ఇచ్చెయ్యండి" అన్నాడు.

వీళ్ళ మాటలు విని కొద్దిదూరంలో నిలబడ్డ ధతువా మధ్యలో అరిచాడు, "లేదు దొరా! మేం ఇవ్వం!"

లఛ్‌మన్‌సింగ్ నిట్టూర్చాడు. తుపాకీ ఎత్తక తప్పేట్టులేదు. కరణ్ వెళ్ళిపోతే అషర్ఫీ వచ్చాడు. అతన్ని పంపిస్తే ఇప్పుడు ధతువా...

"పదిహేను రోజుల కూలీ 18 రూపాయల 12 అణాలయింది. 15 రూపాయలే ఇస్తామని మీరు ముందుగా చెప్పలేదే! పైగా మేం పని త్వరత్వరగా చెప్పిన గడువులోనే ముగించాంకదా?"

"కాస్త ఆలోచించి మాట్లాడు, ధతువా" లఛ్‌మన్‌సింగ్ ధతువాని కోప్పడ్డాడు.

లఛ్‌మన్‌సింగ్ అమర్‌నాథ్‌కి డబ్బు ఇచ్చేశాడు. ధతువాతో, "ఇక్కణ్ణించి పో, ఊరికే వాదించక" అన్నాడు.

కరణ్ చాలా మెత్తగా మాట్లాడి తనకి కావలసినది అడిగేవాడు. అషర్ఫీ

చాలా పొగరుగా ఉండేవాడు. వీళ్ళ కూలీలో కోతపెట్టి అమర్‌నాథ్‌కి వాటా ఇస్తే, తను ఇంత ధైర్యంగా ఎదిరించగలనని ధతువా ఎన్నడూ అనుకోలేదు. బైటికొచ్చి అతను మిగతావాళ్ళతో, "మీరంతా వెళ్ళండి. నేను ఇదేదో తేల్చుకుని వస్తాను" అన్నాడు.

అతను మళ్ళీ లఛ్‌మన్‌సింగ్ ఎదుటికి వచ్చి నిలబడ్డాడు. "మిగతా ఇరవై ఐదు పైసలూ ఇస్తేగాని మేం రేపటినుంచీ పనిలోకి రాము. ఇంకా బాగా పండిన పొలాలు కోతకున్నాయి. మేమూ పంటకొయ్యము, ఇంకెవర్నీ కోయడానికి రానీయము" అన్నాడు.

"పోలీసులు వాళ్ళ కమీషన్ తీసుకోవటానికి వచ్చారు, అందుకే నువ్వు బతికిపోయావురా!"

"ఏం మీకు పోలీసులంటే భయమా?"

ధతువా వెళ్ళిపోయినా, అతనన్న ఆఖరిమాట లఛ్‌మన్ మనసులో ముల్లులా కలుక్కుమంటూనే వుంది. అయినా ధతువా దూలన్ కొడుకు కాబట్టి, దూలన్ తనకు అతిరహస్యమైన పనులలో సహాయం చేస్తున్నాడు. కాబట్టి లఛ్‌మన్ వీళ్ళకి ఇంకొక్కరోజు గడువిచ్చాడు.

మర్నాడు అందరు కూలీలు వచ్చారు, కాని ఒక్కరూ పనిచెయ్యలేదు. ఎంతో కోపం వచ్చినా లఛ్‌మన్‌సింగ్ ఏమీ చెయ్యలేక బుసలు కొడుతూ ఉండిపోయాడు. మర్సినరీ సర్వీస్ వాళ్ళు దొరకలేదు. వాళ్ళు మఖ్ఖన్‌సింగ్‌కీ, రామలగన్‌సింగ్‌కీ సహాయం చెయ్యటానికి వెళ్ళారు. బైట్నించి లేబరు దొరకడం కష్టం. సాయంత్రం వరకూ చూసి లఛ్‌మన్ తన మనుషులతో బెదిరింపులకి లొంగిపోయినట్లయితే తుపాకీ పేల్చవద్దని చెప్పాడు. ఏపుగా పండిన పంటపొలాలగుండా లఛ్‌మన్‌సింగ్ మనుషులు గుర్రాలమీద వచ్చారు. చంబల్ బందిపోట్ల సినిమాలు చూసి చూసి వాళ్ళు కూడా ఖాకీబట్టలు, వచ్చరంగు యూనిఫారంలు వేసుకోవటం మొదలుపెట్టారు. వాళ్ళు ఇంకొంత దగ్గర కొచ్చారు. ధతువా, మిగతా కూలీలు లేచి నిలబడ్డారు.

"కుక్కనాకొడుకుల్లారా! బాగా వినండి!"

"మీరే కుక్కనాకొడుకులు!"

ఎవరో గట్టిగా అన్నారు. వాళ్ళు తుపాకీలు గురిపెట్టారు. వాయువేగంతో

ధతువా అతనికూడా వచ్చిన కూలీలు పొలాల్లోకి పారిపోయారు. కొంతసేపు తిట్లవర్షం రెండువేపులనించీ కురిసింది. ఆ తరవాత ఏం జరగాలో అదే జరిగింది. తుపాకులు పేలాయి. చాలాసార్లు! గింజలు తింటున్న పిట్టల గుంపులు అరుస్తూ ఆకాశంలోకి ఎగిరిపోయాయి. లోపల్లోపల గొంతు తెగి రక్తం ప్రవహిస్తున్న చప్పుడు వినిపించింది.

క్షణంలో గుర్రాల కాళ్ళని కొడవళ్ళతోనూ, గడ్డికోసే కత్తులతోనూ గాయ పరచటం ప్రారంభించారు. గుర్రాలు అటూ ఇటూ పరిగెత్తాయి. ధతువా, మిగతా కూలీలు పారిపోయారు. లటువా, పరమూ తోహరీవైపు పరిగెత్తారు.

దూలన్ ఎదురుచూస్తూ కూర్చున్నాడు. చాలా భయంతో, ఏమవుతుందో అన్న ఆందోళనతో ఎదురుచూస్తున్నాడు. రాత్రి లటువా వచ్చాడు.

"ధతువా ఏడీ?"

"నేను చూడలేదు! అన్న రాలేదా? నేను పోలీసుస్టేషన్‌కి వెళ్ళాను."

"ధతువా ఏడిరా?"

"మేము పోలీసులని పిలుచుకొచ్చాం. పోలీసులిక్కడికి కూడా వస్తారునాన్నా! పోయినసారి వచ్చిన ఎస్.డీ.ఓ.యే ఈసారికూడా వస్తాడు."

"ధతువా ఏడీ?"

దూలన్ అంతరాత్మలోని శవాలు కదులుతున్నాయి. శవాలు ఎందుకు కదులుతున్నాయి? సర్దుకుని ఎవరికోసమో చోటు చెయ్యటానికా? ఎవరికి? దూలన్‌కంతా తెలుసు. అతను లేచి నిలబడ్డాడు.

"ఎక్కడికి వెళ్తున్నావ్?"

"నేలదగ్గరికి..."

"కొడుకింకా రానేలేదు, నువ్వేమో ... నువ్వు పిచ్చివాడివా, రాక్షసుడివా?"

"నోరు ముయ్యవే వెధవముండా!"

దూలన్ బైటికి పరిగెత్తాడు. పరిగెత్తుతూనే పోయాడు. ధతువా పాడిన పాట అతని చెవుల్లో గింగురుమంటోంది.

"'ఏడి బాబూ కరణ్, ఏడి బులాకీ?

పోలీసోళ్ళ ఫైళ్ళల్లో మాయమయారు!"

దూలన్ కళ్ళు మసకబారాయి. అతని చేతిలో చిన్న గునపం ఉంది. తనలో తను గొణుక్కుంటున్నాడు, "నువ్వు మాయమవకురా ధతువా! ఎలో, కుటుస్,

నామాట వినండి. ఈ రాత్రికి మీరు నవ్వద్దు.''

ధతువా బతికే ఉన్నాడు. ధతువా బతికే ఉన్నాడు.

లఛ్మన్‌సింగూ, అతనికూడా ఇంకో మనిషి. ఆ మనిషి మొహం రక్తసిక్తమై ఉంది. లఛ్మన్‌సింగ్ అతన్ని పిడిగుద్దులు గుద్దుతున్నాడు, కాళ్ళతో తంతున్నాడు. గట్టిగా తన్నేటప్పటికి ఆ మనిషి నేలకొరిగాడు.

వాళ్ళు ఇద్దరూ, గుర్రాలు మూడు.

లఛ్మన్‌సింగ్ దూలన్‌ని చూసి దగ్గరకొచ్చాడు.

''దూలన్?''

''ధతువా ఏడీ?''

''చాలా విచారకరమైన వార్త, దూలన్, నేను ఎంతవద్దన్నా వినకుండా ఈ మనిషి తుపాకీ పేల్చాడు'' అంటూ లఛ్మన్ మళ్ళీ ఆ మనిషిని ఒక తాపు తన్నాడు. ''దొంగలంజాకొడుకు! తుపాకీ చేతికిస్తే పొగరెక్కుతుంది వీళ్ళకి!''

''ధతువా ఏడీ?''

''నేలలో ఉన్నాడు.''

''ఎవరు చేశారాపని?''

''ఈ పశువే!''

''ఓహ్...''

''కాని నోరువిప్పవద్దు, దూలన్! నోరు విప్పావో, నీ రెండో కొడుకూ, కోడళ్ళు, మనవలూ ఎవ్వరూ మిగలరు. వచ్చి డబ్బులు తీసుకుపో. నీ కొడుకు పోలీసుల్ని పిలిపించాడు. పోలీసులంటే నాకేం భయంలేదు. వెండిచెప్పుల్తో వాళ్ళని దార్లోకి తెచ్చుకుంటాను, కాని ఒక మాట జ్ఞాపకం పెట్టుకో, నీ కొడుకు కాబట్టే లటువాని ఏం చెయ్యకుండా వదిలాను. నా తుపాకీ గుళ్ళలోంచి ఒక్క గుండుకూడా ఖర్చుకాలేదు. ఒక్క గుండుతో లటువాని కూల్చేవాణ్ణి, కానీ నీ మొహం చూసి వదిలిపెట్టాను. ఆ విషయం జ్ఞాపకం ఉంచుకో దూలన్!''

లఛ్మన్‌సింగూ, అతనితో వచ్చిన మనిషి వెళ్ళిపోయారు. ఏడు శవాల బరువు అంతరాత్మలో మోస్తూ దూలన్ నిలబడి ఉండలేకపోయాడు. అతనక్కడే పడిపోయాడు. ఎలో పొదల ముళ్ళు ఒంటినిండా గుచ్చుకున్నాయి. అయినా అతను నేలమీద పొర్లుతూనే ఉన్నాడు. ఉన్నట్టుండి శాంతించాడు.

పోయినసారిలాగ ఈసారి విచారణ ఒకంతట ముగియలేదు. ఎస్.డి.ఓ. మధ్యలో కల్పించుకున్నాడు. తుపాకీ పేల్చిన గూండా, అమర్‌నాథ్ మిశ్రా జైలుకెళ్ళారు. ధతువా తిరిగి రాలేదు.

దూలన్ ఆలోచనలకి అంతులేకుండా పోయింది. చివరికి పిచ్చిపట్టినట్టుగా వైశాఖంలో గాలివానవచ్చి వెలిశాక ఎలో పాదలనీ, కుటుస్ మొక్కలనీ ఛిన్నాభిన్నం చెయ్యసాగాడు.

"మిట్టమధ్యాన్నం ఎండలో ఎక్కడికి పోయాడు?" అని పెళ్ళాం అడిగింది.

"కొడవలీ, గునపమూ తీసుకుని బంజరు దగ్గరకెళ్ళారు" అని లటూ పెళ్ళాం చెప్పింది.

"నువ్వు ఆపలేదా?"

"నే నాయనతో ఎప్పుడైనా మాట్లాడానా?"

తన కడుపుశోకం కూడా మరిచిపోయి దూలన్ పెళ్ళాం బంజరుదగ్గరకెళ్ళి అరవటం మొదలుపెట్టింది. "ఏమిటయ్యా? పిచ్చిగాని పట్టిందా? ఈ అడివిని బాగుచేస్తున్నావేమిటి?"

"ఇంటికిపో!"

"నువ్వురా!"

"నువ్వు ఇంటికి పో!"

దూలన్ పెళ్ళాం ఏడుస్తూ పహాన్ దగ్గరకి వెళ్ళింది. పహాన్ వచ్చి, "ధతువా వస్తాడు దూలన్! కొడుకుకోసం ఏడుస్తూ పిచ్చివాడివవకు. వడదెబ్బ తగుల్తుంది. పద!" అన్నాడు.

"ఇంటికి వెళ్ళు పహాన్. మాయమయింది నీ కొడుకా, నా కొడుకా?"

"నీ కొడుకే!"

"ఈ భూమి నీదా, నాదా?"

"నీదే!"

"అయితే నేను పిచ్చివాణ్ణయితే ఏమిటి, కాకపోతే ఏమిటి? నేనీ భూమి పనిపట్టాలి!"

"లటువాని కూడా సాయానికి పిలు!"

"అక్కర్లేదు, నేనొక్కడినే చూసుకుంటాను."

దూలన్ పొలంపని చెయ్యడుగాని, బాగా చెయ్యగలడని పహాన్‌కి తెలుసు. అతను దూలన్ పెళ్ళాంతో, "ఇంటికెళ్ళు. అతని ఇష్టానికి అతన్ని వదిలెయ్యి. నువ్వు తోహరీ వెళ్ళాల్సి ఉంటుంది."

దూలన్ పెళ్ళాం లటువాని తోడుతీసుకుని తోహరీలోని పోలీసుస్టేషన్‌కి చాలాసార్లు వెళ్ళి ధతువా ఆచూకీ తెలపమని అడిగింది.

నేలమీద అడివిలా పెరిగిన పొదలన్నిటినీ కొట్టి చదునుచెయ్యటానికి దూలన్‌కి చాలా రోజులు పట్టింది. ఆ తరవాత నేలని తవ్వి విత్తనాలు చల్లటానికి సిద్ధం చేసుకున్నాడు. ఒకరోజు తోహరీ వెళ్ళి విత్తనాలు తెచ్చుకుని, "ఈ గింజల్ని వండుకు తినను. వీటిని నా నేలలో నాటుతాను" అన్నాడు.

"ఆ బంజరునేలలోనా?"

"అవును."

విత్తనాలు చల్లుతున్నంతసేపు, ఏవో మంత్రాలు చదువుతున్నట్టు, "మిమ్మల్ని ఎలో పొదలుగా, కలబంద మొక్కలుగా ఉండనివ్వను. మిమ్మల్ని ధాన్యంగా మారుస్తానురా, ధతువా! ధాన్యంగా మారుస్తాను" అంటూనే ఉన్నాడు.

ఆ నేలలో మొలకలు రాగానే అందరూ గుంపుగా వింత చూడటానికి వెళ్ళారు. మఖ్ఖన్, రామలగన్, లఛ్‌మన్‌సింగ్‌ల సారవంతమైన పొలాల్లో కూడా ఇంత ఏపుగా పంట పండలేదు.

"కాలినట్లున్న ఈ నేలలో ఇలాంటి పచ్చటి పంటా?" అని అందరూ ఆశ్చర్యపోయారు.

దూలన్ జనాన్ని చూసి విసుక్కునేవాడు. కోప్పడి వాళ్ళందరినీ తరిమేసేవాడు. తనొక్కడే దున్ని, ఒక్కడే నాటి, ఒక్కడే ఆ పైరు పచ్చదనాన్ని చూసి ఆనందించాలి.

పహాన్ ఒకరోజున, "నీ పంట చూస్తే లఛ్‌మన్‌సింగ్‌కి కడుపు మండుతుంది!" అన్నాడు.

"ఎవరికీ?"

"లఛ్‌మన్‌సింగ్‌కి."

"ఎక్కడున్నాడు?"

"అత్తారింటికి వెళ్ళాడు."

"ఓహ్, అలాగా!"

చేలు పెరుగుతున్నాయి, ఎత్తుగా, ఏపుగా, గింజలతో. కొన్నాళ్ళకి కోతకొచ్చాయి. అప్పుడు దూలన్ పిచ్చి ఎంత ముదిరిపోయిందో అందరికీ తెలిసింది.

"ఈ పైరు కోయను," అన్నాడు దూలన్.

"కోయవా? అదేం? దీనికోసం ఎంత శ్రమపడ్డావ్! కాలవ తవ్వి, వానకి నిలిచిన నీళ్ళన్నీ నిలవకుండా చేశావు. రాతినేలని చెమటోడ్చి పంట పండించటానికి అనువుగా తయారుచేశావు. రాత్రనక పగలనక ఇక్కడే పడిగాపులు కాశావు. నీతోబాటు నేనూ ఇంటినుంచి నీకు తిండీ నీళ్ళూ మొయ్యలేక ఒళ్ళు హూనం చేసుకున్నాను. మరిప్పుడు పంట కోయనంటావేమిటి?"

"లేదు, పంట కోయను. మీరంతా కూడా ఇక ఇటుకేసి రావద్దు. నాకిక్కడ ఇంకా పని ఉంది."

"ఇంకేం పని? తినికూర్చోడం తప్ప నీకేం పనుందిక?"

"అవును, తిని కూర్చుంటాను, నువ్వు పో!"

ఏ పనికోసం దూలన్ ఆ నేలనే అంటిపెట్టుకుని ఉన్నాడో ఆ పని కూడా పూర్తయింది. పంట కోతల సమయంలో లఛ్‌మన్‌సింగ్ అత్తారింటినించి వచ్చాడు. దూలన్ నేలలో పండిన పంట విషయం అతనికి తెలిసింది. ధతువా హత్య జరిగి సంవత్సరమయింది.

లఛ్‌మన్ దూలన్‌ని కలిశాడు. అతను తప్పకుండా వస్తాడని దూలన్‌కి తెలుసు.

"దూలన్!"

"ఏం, దొరా?"

"లే, ఇలారా!"

"ఇదేమిటి? మీరొక్కరే వచ్చారా?"

"పిచ్చిమాటలు మానేసి, ఇలారా! ఇదేమిటి?"

"ఏది?"

"నేలలో పంట వేశావేమిటి?"

"వ్యవసాయం మొదలెట్టానయ్యా!"

"మన ఒప్పందం ఏమిటి?"

"తమరే చెప్పండి?"

"లంజకొడకా! నువ్విక్కడ పొలం పండిస్తానని నాతో చెప్పలేదేంరా! మనం అనుకున్నది ఇక్కడ ముళ్ళపొదలూ, పిచ్చిమొక్కలు పెరుగుతాయనేకదా?"

దూలన్ కింద నిలబడి ఉన్నాడు, లఛ్‌మన్‌సింగ్ గుర్రంమీద ఉన్నాడు. ఉన్నట్టుండి దూలన్ లఛ్‌మన్‌సింగ్‌ని ఒక కాలుపట్టుకుని బలంగా గుంజి కిందికి లాగాడు. లఛ్‌మన్ దభీమని కిందపడిపోయాడు. తుపాకీ దూరంగా పోయిపడింది. ఈ తుపాకీ దూలన్ చేతిలోకి వచ్చింది. లఛ్‌మన్‌కి ఏంజరుగుతోందో అర్థమయేలోపల తుపాకీ మడిమ అతని భుజంమీద పడింది. లఛ్‌మన్ బాధ భరించలేక అరిచాడు. దూలన్ మళ్ళీ అతన్ని భుజంమీద కొట్టాడు. అతని మెడమీది ఎముక కటుక్కున విరిగింది.

"కుక్కనాయాలా ... పశువా ..." లఛ్‌మన్‌సింగ్ బెదిరిపోయి కేకలు పెట్టాడు. అతను దూలన్ ఎదుట నేలమీద పడి ఏడ్చాడు. భయం బాధా కలగలిసి అతన్ని ఏడిపించాయి. అతను - లఛ్‌మన్‌సింగ్ నేలకరిచాడు. దూలన్ తుపాకీ పట్టుకుని నిలబడి ఉన్నాడు, నిజమా, కలా? లఛ్‌మన్‌సింగ్ దూలన్ కాలు పట్టుకోవటానికి ప్రయత్నించాడు. కాని అతని చెయ్యి లేవలేదు. తన కుడిచెయ్యి ఇప్పట్లో పనిచెయ్యదని లఛ్‌మన్‌కి తెలిసిపోయింది.

ఏడుస్తూ "పశువా ... కుక్కా ..." అని అరవసాగాడు.

"మన ఒప్పందం ఏమిటి దొరా? పంట పండించకూడదా? ఎందుకు కూడదు? నువ్వు శవాల్ని పేరుస్తూపోతుంటే, నేను వాటికి కాపలా కాస్తూ ఉంటానా? ఏం? ఒకవేళ నేనాపనికి ఒప్పుకోకపోతే నువ్వు ఊరిని తగలబెడతావా? నా వంశాన్ని నాశనం చేస్తావా? బలే బావుంది దొరా! కాని కాస్త ఆలోచించి చూడు. నాకు ఏడుగురు కొడుకులు. వాళ్ళ శరీరాలమీద ఉత్త ముళ్ళపొదలూ, పిచ్చిమొక్కలే మొలుస్తాయా? లేదు, దొరా, లేదు! అలా అవకుండా ఉండటానికే నేను వరిపంట పండించాను. అందరూ నాకు పిచ్చిపట్టిందని అంటున్నారు, తెలుసా? అవును, నేను పిచ్చివాణ్ణే దొరా, ఇవాళ నువ్వు తప్పించుకోలేవు. నిన్ను వెళ్ళనివ్వను. ఇంక పంట కోతలు జరగనివ్వను. తుపాకీ పేలుళ్ళు, ఇళ్ళు తగలబెట్టడాలూ, మనుషుల్ని కాల్చి బూడిద చెయ్యడాలూ సాగనివ్వను. నువ్వు ఇప్పటికే చాలా పంట కోసుకున్నావు, ఇక చాలు!"

"నిన్ను పోలీసులు వదిలిపెడ్తారనుకుంటున్నావా?"

"వదిలిపెట్టకపోయినా ఫరవాలేదు. నీ మనుషులు కూడా ఉన్నారుగా నన్ను చంపటానికి! దొరా, మీరు మమ్మల్ని చంపనిదెప్పుడు? పోలీసులు కూడా మమ్మల్నే చంపుతారు. ఇంకోసారి చంపుతారు, అంతేగా? ఈసారి నేను చచ్చిపోయినా ఫరవాలేదు. ఎప్పుడో ఒకప్పుడు అందరమూ చావవలసినవాళ్ళమే! ధతువా ఇంతకు ముందు ఎప్పుడైనా చచ్చిపోయాడా?"

లఛ్‌మన్‌సింగ్ బొత్తిగా అసహాయుడైపోయాడు. చావు భయంతో అతని మనసు కకావికలయింది. ఎంత చావు భయం కలిగినా రాజపుత్రుడు ఎక్కడైనా అంటరానివాడిముందు తలవంచగలడా? ఒకవేళ వంచినా ప్రతీసారీ ఆ అంటరానివాడు అతన్ని క్షమించేస్తాడా? దూలన్ కూడా క్షమించలేకపోయాడు. లఛ్‌మన్ లేవటానికి ప్రయత్నించాడు. బలమంతా ఉపయోగించి అరవాలని ప్రయత్నించాడు, తన ఎడమచేత్తో రాయిని తియ్యటానికి ప్రయత్నించాడు.

"ఎంత విచారకరమైన విషయం, దొరా! నువ్వొక గంజూ చేతిలో చావవలసివస్తోంది" అన్నాడు దూలన్.

ఒక రాయితీసుకుని లఛ్‌మన్ తల చితగొట్టసాగాడు. ఆపకుండా అలా కొడుతూనే ఉన్నాడు. లఛ్‌మన్‌కి హత్యలు చేయటం అలవాటు, తుపాకీగుండు విలువ తెలిసినవాడు. హత్య చేశాక కూడా అతనికి ఏమీ అనిపించదు. అతని దగ్గర తుపాకీ ఉండి, కుడిచెయ్యి దెబ్బతిని ఉండకపోతే అతను గురిచూసి దూలన్ గుండెల్లోకి తుపాకీ పేల్చి ఉండేవాడు.

దూలన్‌కి హత్యలు చెయ్యటం అలవాటులేదు. రాతికి ఏమీ విలువలేదు. జీవితమంతా అతని అంతరాత్మ అనుభవించిన క్షోభ పరిణామమే ఈ హత్య. అతను ఆపకుండా రాయిపెట్టి లఛ్‌మన్‌సింగ్ తల చితగ్గొడుతూనే పోయాడు.

చివరికి రాయితో పనయిపోయిందనిపించి, దాన్ని విసిరేసి లేచి నిలబడ్డాడు. ఇక ఒక్కొక్కటిగా అన్ని పనులూ ముగించాలి. గుర్రాన్ని కొంతదూరం నడిపించి తీసుకుపోయి, దాని వెనక కాలిమీద కర్రతో గట్టిగా కొట్టాడు. గుర్రం బెదిరిపోయి పరిగెత్తింది. ఇష్టమొచ్చిన చోటికి పోనీ! తరవాత తుపాకీనీ, లఛ్‌మన్ శవాన్నీ కలిపి తాడుతో కట్టి లాగుతూ చాలాదూరం తీసుకుపోయాడు. ఒక గుంటలో పడేశాడు. ఒకదాని తరవాత ఇంకొకటిగా రాళ్ళతో ఆ గుంటని నింపాడు. నవ్వు తన్నుకొచ్చింది. పేదలపాలిటి పెన్నిధి లఛ్‌మన్‌సింగ్ అసహ్యంగా కుక్కచావు చచ్చాడు. రాళ్ళకింద

నలిగి పడి ఉన్నాడు. రాళ్ళతో సమాధి అయాడు.

కంకరరాళ్ళూ, మట్టీ నిండిన ఆ భూమిమీద ఏవైనా గుర్తులూ, మరకలూ ఉండిపోతాయేమోనన్న భయంలేదు. అయినా ఎందుకైనా మంచిదని గట్టుమీద పెరిగిన 'కుటుస్' చెట్టునుంచి ఒక కొమ్మ విరిచి దానితో ఆ ప్రదేశాన్ని శుభ్రంచేశాడు. వెళ్ళి మంచెమీద కూర్చున్నాడు.

చాలారోజులు లఛ్‌మన్‌సింగ్ ఏమయాడని వెతికారు. ఏదైనా పని చేసేటప్పుడు ఎవరితోనైనా చెప్పటంకానీ, ఎవరి సలహానైనా తీసుకోవటంకాని అతనికి అలవాటులేదు కాబట్టి, అతను ఆ సమయంలో దూలన్ దగ్గరకి వెళ్తాడని ఎవరికీ తెలీదు. దూలన్ విషయం అయితే మరీ రహస్యం కూడానూ! అతని మనుషుల్లో కొందరికి తెలిసినా వాళ్ళు నోరు మెదపలేదు. యజమాని మాయమయ్యాడు, అతని గుర్రం దైతారీసింగ్ పొలంలో మేస్తూ కనబడింది, అలాంటప్పుడు గాయాన్ని కెలకటమెందుకని మెదలకుండా ఊరుకున్నారు. లఛ్‌మన్ నౌకరు, "రోజూలాగే పాలూ కలకండా తీసుకున్నాక, గుర్రం మీద షికారు కెళ్ళారు. ఎక్కడకి వెళ్ళారో నాకేం తెలుసు?" అన్నాడు.

చాలా ఆశ్చర్యకరమైన సంఘటన! తోడేళ్ళ అరుపులు విని జనం చెవులు నిక్కబొడుచుకున్నాయి, అదీ ఐదు రోజుల తరవాత! ఐదు రోజులుగా తోడేళ్ళు రాళ్ళమధ్యనుంచి మాంసం వాసన పసిగట్టి, కష్టపడి కొన్ని రాళ్ళు కదిలించి లఛ్‌మన్ మొహం పట్టుకు తినగలిగాయి. శవాల్ని దాచే విషయంలో అతని నేర్పు అందరికీ తెలిసినదే కావటంవల్లా, గుర్రం అతని పొలంలో దొరకటంవల్ల అందరూ దైతారీసింగ్‌నే అనుమానించారు. లఛ్‌మన్‌సింగ్ కొడుకు ఈ సందేహాన్ని ఇంకా బలపరిచాడు. ఏదో పాత వైరం అంటగట్టి అతన్ని జైల్లో పెట్టించాడు. ఎటువంటి రుజువూ దొరక్కపోవటంవల్ల పోలీసులు అతన్ని కొన్నాళ్ళకి వదిలేశారు. కాని లఛ్‌మన్, దైతారీ కొడుకులు ఇద్దరూ పాత వైరాన్ని తవ్వుకుని కక్షలు పెంచుకున్నారు. దూలన్‌మీద ఎవరికీ అనుమానం రాలేదు. అసలు రావటానికి వీల్లేదు. ఎందుకంటే ఎటువంటి పరిస్థితుల్లోనూ దూలన్ గంజూ లఛ్‌మన్‌సింగ్‌పైన చెయ్యి చేసుకోగలడనేది ఊహకి కూడా అందని విషయం!

ఒకపక్క లఛ్‌మన్‌సింగ్ కోసం వెతుకుతూనే ఉన్నారు. మంచెమీదనుంచి కిందికి దిగిన దూలన్ పాత దూలన్ కాదు, కొత్త మనిషి! చాలా ఆనందంగా

ఉత్సాహంగా కనబడ్డాడు. అతను పహాన్‌తో ఏదో అన్నాడు. ఒకనాటి సాయంత్రంవేళ కురుడాలోని ఆదివాసులందరూ పహాన్ ఇంటి ఆవరణలో కూడారు.

"నేను నా చేతులతో ఎప్పుడూ ఎవరికీ ఏమీ ఇవ్వలేదు!" అన్నాడు దూలన్.

దూలన్ మాటలు విని అందరూ ఆశ్చర్యపోయారు.

దూలన్ మళ్ళీ "నా పంట చూసి మీరందరూ చాలా బావుందన్నారు. నేను ఆ పంట కోయటానికి ఒప్పుకోలేదని నన్ను మీరందరూ పిచ్చివాడినన్నారు. అక్కడ అసలు వ్యవసాయం చేస్తున్నానని అంటేనే నాకు పిచ్చిపట్టిందన్నారు. మీ తప్పేం లేదు. పిచ్చివాణ్ణి 'పిచ్చివాడూ' అన్నారు. ఈ పిచ్చివాడి మాట ఒకటి వినండి."

"చెప్పు" అందరూ అన్నారు.

లఛ్‌మన్ చచ్చిపోయాక అందరికీ ఏదో బరువు దింపుకున్నట్టయింది. అతని కొడుకు అతనిలాగే తయారవుతాడా లేదా? అని ఆలోచించటానికి ఎవరికీ మనస్కరించలేదు.

"నా ధాన్యం మీ అందరికీ విత్తనాలుగా ఇస్తున్నాను, తీసుకోండి."

"నువ్వు నీ ధాన్యం ఇచ్చేస్తున్నావా?"

"అవును కోసుకుపొండి. ఇలా ఎందుకు చేస్తున్నానని అడగవద్దు. అదో పెద్ద కథ."

"ఎరువులు వేశావా?"

"ఎరువులా? ఆఁ, వేశాను. చాలా విలువైన ఎరువులు వేశాను..." దూలన్ గొంతు పూడుకుపోయింది. క్షణంలో గొంతు సవరించుకుని, "మీరు కోసుకోండి. నాకూ కొంచెం ఇవ్వండి. నేను తరవాత మళ్ళీ ధాన్యం నాటుతాను."

వాళ్ళు ఆ పొలంలోని ధాన్యం కోస్తామని మాట ఇచ్చారు. వాళ్ళ దగ్గర మాట తీసుకుని అతను మళ్ళీ తన పొలంవేపు వెళ్ళిపోయాడు. ఆశ్యర్యం! అతని మనసు చాలా తేలికగావుంది. బరువంతా దిగిపోయింది. అతను పంట చూస్తూ పొలం గట్టుమీద నిలబడిపోయాడు.

కరణ్, అషర్ఫీ, మొహర్, బులాకీ, మహువన్, పారస్, ధతువాల మాంసమే ఎరువుగా 'పెరిగిన పంట'లో కూడా ఒక విచిత్రమైన ఆనందం కనబడింది, బహుశా మళ్ళీ విత్తనాలు మొలుస్తాయనేమో! విత్తనం అంటేనే జీవించి ఉండటం, కొత్త జీవితం పొందటం! దూలన్ నెమ్మదిగా మంచె ఎక్కాడు. అతనికి ఒక పాట తాలూకు

మాటలు జ్ఞాపకం రాసాగాయి. మాటిమాటికీ ఆ పాటలోని మాటలు జ్ఞాపకం రాసాగాయి. అతను వాటిని దూరంగా తరిమేద్దామని ప్రయత్నించాడు. కాని కుదరలేదు. ఆ పాట ధతువా చేశాడు. 'ధతువా' అంటుంటే దూలన్ గొంతు వణికింది. "ధతువా, మిమ్మల్నందర్నీ మేము విత్తనాలుగా మార్చేశాం నాయనా!"

# ద్రౌపది

పేరు - దోప్డీ మేఝేన్, వయసు - ఇరవై ఏడు, మొగుడి పేరు - దూలన్ మాఝీ, ఊరిపేరు - విలాసం - చేరాఖాన్ గ్రామం, పోలీస్ స్టేషన్ - బాంక్డా ఝూడ్, భుజంమీద గాయం తాలూకు మచ్చ (దోప్డీకి తుపాకీ గుండు తగిలింది), ఆచూకీ తెలిపి పట్టిచ్చినవారికి వంద రూపాయలు బహుమతి ...

యూనిఫార్మ్ వేసుకున్న ఇద్దరు మాట్లాడుకుంటున్నారు.

'ఈ సంథాల్ స్త్రీ పేరు దోప్డీ అని ఎందుకుంది? నేను తీసుకొచ్చిన లిస్టులో ఇలాంటి పేరేదీ లేదే?' అని ఒకడు అన్నాడు.

ఇంకొకడు, 'దోప్డీకాదు, ద్రౌపదీ మేఝేన్! దీని తల్లి బాకులీలో వుండే హమడు, సూర్యసాహూ పొలంలోకి పంటకోతకి వెళ్ళిన ఏడే ఇది పుట్టింది. సూర్యసాహూ పెళ్ళాం దీనికి ఆ పేరు పెట్టింది' అన్నాడు.

మొదటివాడు, 'ఇక్కడి ఆఫీసర్లకి తమకి తోచినదంతా ఇంగ్లీషులో రాయడమంటే ఒక్కటే తెలును. ఈవిడ గురించి ఇంత రాతకోతలు జరుగుతున్నాయేమిటి?' అడిగాడు.

రెండోవాడు, 'మోస్‌లు నొటోరియస్ ఉమన్, లాంగ్ వాంటెడ్ ఇన్ మెనీ ...' అన్నాడు.

డోసియర్ : దూలన్, ద్రౌపదీ దోపిడీలు చేసేవారు. బీర్‌భూమ్ - బర్ధమాన్ - ముర్షిదాబాద్ - బంకులా ఈ ప్రదేశాలలో తిరుగుతూ ఉండేవారు. 1971లో ప్రసిద్ధిచెందిన 'ఆపరేషన్ బాకులీ' కింద మూడు గ్రామాలలోనూ హెవీ కార్డన్ ద్వారా మెషిన్‌గన్‌లతో కాల్పులు జరిపినప్పుడు, వీళ్ళిద్దరూ పడిపోయి చచ్చిపోయినట్లు నటించారు. నిజానికి వీళ్ళిద్దరే మైన్ క్రిమినల్స్. సూర్యసాహూనీ, వాడి కొడుకుని చంపటం, డ్రౌవుట్ వచ్చినప్పుడు అప్పర్‌కాస్ట్ వాళ్ళ భూములనీ, ట్యూబ్‌వెల్స్‌నీ ఆక్రమించటం - ఈ నేరాలన్నీ చేయటంలో వీళ్ళిద్దరే మైన్ క్రిమినల్స్. ముగ్గురు కుర్రాళ్ళు పోలీసులకి సరెండర్ కాలేదు, వాళ్ళని రక్షించడం వీళ్ళపనే.

'ఆపరేషన్ బాకులీ', మైన్ ఆర్కిటెక్ట్ కెప్టెన్ అర్జున్‌సింగ్ తెల్లవారగానే శవాలు లెక్క పెడుతున్నప్పుడు అతనికి ఈ మొగుడు పెళ్ళాల శవాలు దొరకలేదు. దానితో ఆయన బ్లడ్‌షుగర్ పెరిగిపోయింది, అతి మూత్రవ్యాధి పట్టుకుంది. ఈ రోగం రావటానికి నిజంగానే ఆవేశమూ, విచారమూ ముఖ్య కారణాలన్న విషయం తెలిసింది. 'అతిమూత్రం' అనే స్త్రీకి ఉన్న పన్నెండుమంది భర్తల్లో ఏంగ్జయిటీ కూడా ఒకటి.

దూలన్, దోప్దీ చాలా రోజులవరకు 'నియాన్‌డర్ ఘాల్' అంధకారంలోకి, అండర్‌గ్రౌండ్‌లోకి వెళ్ళి కొండల్లో దాక్కున్నారు. ఈ అంధకారాన్ని ఛేదించటానికి ఆయుధాలతో ప్రత్యేకమైన సేన వెళ్ళింది. ఇంతకుముందు పశ్చిమ బెంగాల్‌లోని విభిన్న జిల్లాల్లో దోపిడీలు చేసిన ఆడ, మగ సంథాలుల్ని బలవంతాన సింగబోంగా ప్రాంతానికి పంపించటంలో ఈ సేనే సహాయపడింది. భారతదేశ రాజ్యాంగంలో జాతి మత భేదాలు లేవనీ అందరూ సమానమని ఉంది. అయినా ఇలాటి సంఘటనలు జరుగుతూనే ఉంటాయి. దీనికి రెండు కారణాలు - ఒకటి, పారిపోయిన మొగుడూ పెళ్ళాలు తమ ఆచూకీ ఎవరికీ తెలియకుండా దాక్కోగలగటం, ఇంకోటి - 'ఆపరేషన్ బాకులీ'లోని సైనికుల కళ్ళకి సంథాలులేకాక ఏస్ట్రో ఏషియాటిక్ ముండాజాతి వాళ్ళందరూ ఒకలాగే కనిపించటం.

నిజానికి బాంక్‌డా ఝూడ్ పోలీస్ స్టేషన్ ఆధీనంలో ఉన్న (మన భారతదేశంలో ప్రతీ ప్రాంతమూ ఏదో ఒక పోలీస్ స్టేషన్ ఆధీనంలోనే ఉంటుంది) ఝూడ్‌ఖానీ అడివి నాలుగు దిక్కులా ఉన్న పోలీసు స్టేషన్ల మీద దాడి జరిపి తుపాకులు లాక్కుపోయారు. తుపాకులు లాక్కునేవాళ్ళు, చదువుసంధ్యలు లేకపోవటంవలన తుపాకులు అనటానికి బదులు 'చేంబర్లు ఇచ్చెయ్యండి' అని అంటారు.

జమీందార్లనీ, వడ్డీ వ్యాపారుల్నీ, శాంతివాహినిలోని సిపాయిలనీ, ఫైళ్ళు చూసే గుమాస్తాలనీ హత్యచేసినప్పుడు వీళ్ళని అనుమానించేవారు. ఆ హత్యలను కళ్ళారా చూశామని చెప్పేవాళ్ళు ఇచ్చే వివరాలు ఒక్కొక్కప్పుడు చాలా ఆశ్చర్యకరంగా ఉండేవి. ఈ నల్లటి దంపతులు చేసిన హత్యానేరానికి ముందు పోలీసుల సైరన్ కూతలకి చెవులు దిబ్బళ్ళువేసేవి. మరీ అనాగరికులైన సంథాలులకి కూడా అర్థంకాని భాషలో చనిపోయినవాళ్ళ చుట్టూ చేరి పాటలు పాడేవారు :

"సామూరే హియులేనాకో మార్ గోయేకోపే" అని,

"హేందే రాంబ్రా కెచే కెచే" అని.

కెప్టెన్ అర్జున్‌సింగ్ అతిమూత్రవ్యాధికి వీళ్ళే కారణమని దీనివల్ల నిస్సందేహంగా తెలుస్తోంది. గవర్నమెంట్ చేసే పనులు ఎవరికీ అర్థం కావు. వాళ్ళు మళ్ళీ అర్జున్‌సింగ్‌నే ఆపరేషన్ ఫారెస్ట్ ఝూడ్‌ఖానీకి పంపారు. సి.ఐ.డి.వారు చెప్పగా, ఈ పాటలు పాడి నాట్యం చేసిన మొగుడూ పెళ్ళాలే ఒకప్పటి 'శవాలని' అతనికి తెలిసింది. అవి మాయమవటం జ్ఞాపకంవచ్చి అర్జున్‌సింగ్ కొద్దిక్షణాలు 'జోంబీ'లా అయిపోయాడు. నల్లటి మనిషంటే చాలు హడిలిపోతున్నాడు. గోచీపెట్టుకున్న ఏ నల్లటివాడిని చూసినా, 'చచ్చాన్రా బాబోయ్!' అంటూ బిర్రబిగుసుకుపోతున్నాడు. గబగబా నీళ్ళు తాగి, అట్నించటే బాత్‌రూంలోకి పరుగెడుతున్నాడు. యూనిఫారం, గ్రంథ్‌సాహెబ్ ఏదీ అతన్ని కాపాడలేకపోతోంది. ఆ తరువాత అతనికి ప్రిమెచ్యూర్ ఫోర్స్‌డు రిటైర్‌మెంట్‌కి సంబంధించిన నోటీసిచ్చి, యుద్ధ:లోనూ, వామపక్ష ఉగ్రవాదుల రాజనీతిలో బెంగాలీ స్పెషలిస్ట్ అయిన సేనాపతి ముందు హాజరుపరిచారు.

సేనాపతి మహానుభావుడికి ప్రతివక్షాల పనులగురించీ, వాళ్ళ తెలివితేటలగురించీ వాళ్ళకన్నా ఎక్కువ తెలుసు. అందుకే ముందుగా సిక్కుల యుద్ధకౌశలం గురించి అర్జున్‌సింగ్‌తో చాలాసేపు మాట్లాడాడు. ఆ తరువాత ప్రతిపక్షాలని ఎదుర్కోవటానికే తుపాకీ గొట్టంలోంచి శక్తి పుట్టదనీ, అర్జున్‌సింగ్ శక్తికూడా తుపాకీలోని మేల్ ఆర్గన్‌నుంచే పుడుతుందనీ చెప్పాడు. ఈ రోజుల్లో చేతిలో తుపాకీ లేకపోతే ఎందుకూ పనికిరారు. ఈ మాటలన్నీ అతను తన సైనికులకు కూడా చెప్పాడు. దానివల్ల వాళ్ళ మనసుల్లో 'ఆర్మీ హేండ్‌బుక్' పుస్తకంమీద మళ్ళీ శ్రద్ధ కలిగింది. ఇది మామూలు జనం చదివే పుస్తకంకాదు. ఆదిమానవులు ఆయుధాలతో చేసిన గొరిల్లా యుద్ధం చాలా అసహ్యకరమైనదని దాన్లో రాసి ఉంది. అటువంటివాళ్ళని చూడగానే కాల్చి చంపటం సైనికుల పవిత్ర కర్తవ్యం. ద్రోప్దీ, దూలన్ ఆ కేటగిరీలోకే వస్తారు. ఎందుకంటే వాళ్ళు కూడా కత్తులూ, కటార్లూ, విల్లంబులూ తీసుకుని యుద్ధం చేస్తారు. నిజానికి వాళ్ళు చదువుకున్న వాళ్ళకన్నా చంపటంలో ఆరితేరినవాళ్ళు, సైనికులందరూ తుపాకులు కాల్చటంలో నిపుణులు కారు. తుపాకీ చేతుల్లో పట్టుకుంటే, చంపేశక్తి దానంతట అదే వస్తుందని

వాళ్ళ అభిప్రాయం. కాని చదువు సంధ్యలులేని దూలన్, ద్రోప్దీ చిన్నప్పటినుంచీ వారసత్వంగా వచ్చిన విలువిద్య నేర్చుకున్నారు. ఇక్కడ ఒక విషయం చెప్పాలి. శత్రువులు ఈ సేనానాయకుని గురించి చాలా లోకువ అభిప్రాయం కలిగి ఉండవచ్చు. కాని అతను సామాన్యుడు కాడు. ప్రాక్టీసులో ఏంచేసినా, థియరీలో ఇతనికి ప్రతిపక్షాలంటే గౌరవమే. ఎందుకంటే శత్రువులకి సైనికుల తుపాకులు ఆటవస్తువుల్లాగ కనిపిస్తాయని అతనికి తెలుసు. అటువంటి శత్రువుల్ని అర్థం చేసుకోవటం, నాశనం చెయ్యటం చాలా కష్టమని అతని ఉద్దేశం. "ఇన్ ఆర్డర్ టు డిస్ట్రాయ్ ఎనిమీ, బికమ్ వన్ ఆఫ్ దెమ్". అందుకే అతను కూడా వాళ్ళల్లో ఒకడైనట్టు నటించి, వాళ్ళ గురించీ తెలుసుకోవడానికి ప్రయత్నిస్తాడు. భవిష్యత్తులో ఎప్పుడైనా వాళ్ళగురించి రాయాలని కూడా ఆయన కోరిక. ఆ పుస్తకంలో చదువుకున్నవాళ్ళని 'డిమాలిష్' చేస్తూ, టెర్రరిస్టులనే హైలైట్ చెయ్యదలిచాడు. అతని ఆలోచనలు చాలా చిక్కుముడుల్లాగ అనిపించవచ్చు. కాని నిజానికి అతను చాలా సగటు మనిషి. అతనికి తాబేలు మాంసం చాలా ఇష్టం. పాత జననాట్యమండలివారి పాటలో చెప్పినట్లు, రోజులు మారతాయని అతనికి తెలుసు. ఎన్ని యుగాలు మారినా తన పేరు గొప్పగానే చెప్పుకోవాలని అతని కోరిక. అవసరమైతే అతను ఈ వ్యవహారాన్ని ఎంత చక్కగా, పరస్పర అవగాహనతో ఎలా చక్కబెట్టగలడో భవిష్యత్తుకి చూపించదలిచాడు. ఇవాళ అతను చేసేది రేపు జనం మర్చిపోతారన్నదాన్లో సందేహంలేదు. కాని మారే రెండు యుగాలకి అతను ప్రతినిధిగా ఉండి, రెండువైపులా పేరు తెచ్చుకోవాలని అతని కోరిక. ఇవాళ 'ఎప్రహెన్షన్ అండ్ ఎలిమినేషన్' పేర యువకుల్ని పైలోకాలకి పంపిస్తున్నాడు. కాని ఈ రక్తపాతాన్ని జనం త్వరలోనే మరిచిపోతారని అతనికి తెలుసు. ఇంకోపక్క షేక్స్పియర్‌లాగ ఈ లోకం లెగసీని యువకులకి అప్పచెప్పాలని అతని నమ్మకం. అతను కూడా ప్రాస్పెరోలాంటివాడే.

ఏది ఏమైనా, చాలామంది యువతీయువకులు బేచ్‌లుగా జీపుల్లో వచ్చి ఒకదాని తర్వాత ఒకటిగా పోలీస్‌స్టేషన్లపై దాడిచేశారనీ, ఆ ప్రాంతానికి భయమూ, ఆనందమూ రెండూ కలిగించి ఝూడ్‌ఖానీలోని అడవుల్లో మాయమయారని ఆ తరువాత తెలిసింది. బాకులీనుంచి మాయమైన దూలన్, దోప్దీ దాదాపు అందరు జమీందార్ల దగ్గరా పనిచేశారు. అందుకే చంపేవాళ్ళకి ఎవరెవరు చంపదగినవారో

ఎప్పటికప్పుడు కబురు అందజేసేవారు. గర్వంగా 'మేము కూడా సైనికులమే' అని ప్రకటించుకున్నారు. చివరికి దుర్భేద్యమైన ఆ అడవిని సేనాపతి వెళ్ళి చుట్టుముట్టాడు. ఆర్మీ అడివిలో ప్రవేశించి, దాక్కున్న వాళ్ళని వెతికి పట్టుకున్నారు. ఒకపక్క ఫొటోగ్రాఫర్లు అడివి మేప్ తయారుచేయసాగారు. సైనికులు నీటిచెలమల దగ్గరా, జలపాతాలదగ్గరా పొంచి కూర్చున్నారు. ఇంకా వాళ్ళు వెతుకుతునే ఉన్నారు. అలా వెతుకుతుండగా సేనకి రహస్యంగా సహాయపడే దుఖీరాం ఘడారీ అనేవాడు ఒక బండరాతిమీద బోర్లాపడుకుని నీళ్ళల్లోకి వంగి నోటితో నీళ్ళు తాగుతున్న ఒక సంథాల్ యువకుణ్ణి చూశాడు. అక్కడే వాడిపైన తుపాకీ కాల్పులు జరిగాయి. త్రీ నాట్ త్రీ పేల్చిన గుండు తగిలి వాడు రెండు చేతులూ చాచి 'మా - హో' అని గట్టిగా అరుస్తూ రక్తపు నురుగులు కక్కుతూ చనిపోయాడు. ఆ తరువాత వాడే దూలన్ మాఝీ అన్న విషయం తెలిసింది.

ఈ 'మా-హో' అన్న మాటకి అర్థం ఏమిటి? గిరిజనుల భాషలో ఇది టెర్రరిస్టుల స్లోగనా? దీని అర్థమేమిటో తెలుసుకోవటానికి శాంతివాహిని ఆఫీసులో బుర్రలు బద్దలుకొట్టుకున్నారు, కానీ ఏమీ తెలియలేదు. ఆదివాసుల గురించి క్షుణ్ణంగా తెలిసిన ఇద్దరు మనుషుల్ని కలకత్తానుంచి ఏరోప్లేనులో తీసుకొచ్చారు. వాళ్ళిద్దరూ పాపం హాఫ్‌మన్ జెఫర్, గోల్డెన్ పామర్‌వంటి మహానుభావులు రాసిన శబ్దకోశాల్ని తిరగేసి అలిసిపోయారు. చివరికి అన్నీ తెలిసిన సేనాపతి చమరూని పిలిపించాడు. కేంపుకి నీళ్ళు మోసే సంథాల్ చమరూ ఆ ఇద్దరి నిపుణులని చూసి పకపక నవ్వాడు. బీడీతో చెవి గోక్కుంటూ, 'మాల్దాలో ఉండే సంథాలు జాతివాళ్ళు గాంధీరాజాగారి రోజుల్లో పోట్లాటకి సిద్ధపడేముందు, 'మా-హో' అని అరిచేవారు. అది యుద్ధానికి పిలుపు. కాని ఇక్కడ ఎవరు 'మా-హో' అనే ధీరుడు? ఎవడైనా సంథాల్ మాల్దానించి వచ్చాడా?

సమస్యకి ఈ విధంగా సమాధానం దొరికింది. ఆ తరువాత దూలన్ శవాన్ని అక్కడే వదిలి సైనికులు కామఫ్లాజ్ యూనిఫారాలు వేసుకుని, చెట్లెక్కి ఆకులు, కొమ్మల చాటున దాక్కున్నారు. ఆ కొమ్మల్ని కావిలించుకుని, ఎర్రచీమలు కుడుతున్నా భరిస్తూ, ఆ శవాన్ని తీసుకెళ్ళటానికి ఎవరైనా వస్తారేమోనని ఎదురుచూస్తూ కూర్చున్నారు. ఇదేదో వేటగాళ్ళ తంతులా ఉందిగాని, యుద్ధంచేసేవాళ్ళ పద్ధతిలాగ లేదు. కాని ఈ వెధవలను తుదముట్టించటానికి,

ఒక కొత్త పద్ధతితప్ప గతంలోని పాతవేవీ పనికిరావని తెలుసు. అందుకే అతను తన మనుషులతో శత్రువుని బయటికి రప్పించడానికి శవాన్ని గాలానికి ఎరగా ఉపయోగించమని చెప్పాడు. ఈ రకంగా అంతా సర్దుకుంటుందని అతనికి తెలుసు. దోప్డీ పాడిన పాటల అర్థం కూడా అతను చాలావరకు తెలుసుకున్నాడు.

సేనకి అతని మాట వేదవాక్కు, తూ.చ. తప్పకుండా పాటించింది. కాని దూలన్ శవాన్ని తీసుకుపోవటానికి ఎవరూ రాలేదు. రాత్రి ఎండుటాకుల గలగల చప్పుడు విని, సైనికులు తుపాకీలు పేల్చారు. చెట్టుదిగి చూస్తే చచ్చిపోయిన ముళ్ళపందులు కనిపించాయి. అడివిలో సేనకి దారిచూపించిన దుఖీరాం ఝుడారీ అనేవాడు సన్యాసిలాగ దూలన్‌ని పట్టిచ్చినందుకు ఈనాము కూడా అందుకోకుండా కొడవలితో తన గొంతు తనే కోసుకుని ఆత్మహత్య చేసుకున్నాడు. దూలన్ శవాన్ని మోసుకొస్తున్నప్పుడు సైనికుల్ని విషపు చీమలు కుట్టి తెగ బాధపెట్టాయి. శవానికి పట్టిన చీమలు తమ పనికి అంతరాయం కలిగిందని సైనికుల్ని కుట్టాయి. శవాన్ని తీసుకుపోవటానికి ఎవరూ రాలేదని విని సేనాపతి ఏంటీ ఫాసిస్ట్ పేపర్‌బాక్ పుస్తకం 'డెప్యూటీ'ని చేత్తో గట్టిగా చరిచి 'వ్హాట్' అని అరిచాడు. అదే సమయానికి ఆర్కిమిడీస్‌లాగ ఆనందంగా పరుగెత్తుతూ ఒక ఆదివాసి ఆయన ఎదుటికి వచ్చి, "సర్! హేందే రాంబ్రా మాటల అర్థం కనుక్కున్నాను. ఆ మాటలు ముండారీ భాషకి చెందినవి" అన్నాడు.

దోప్డీ కోసం ఇంకా వెతుకుతూనే ఉన్నారు. ఝాడ్‌ఖానీ అడివి బెల్ట్‌లో ఆపరేషన్ అలా కొనసాగుతూనే ఉంది. గవర్నమెంటు వీపుమీద లేచిన కురుపులాగ సలుపుతూనే ఉంది. పాత మందులతో ఇది నయమయేలాగ లేదు, కత్తికి కూడా లొంగటంలేదు. ఆపరేషన్ మొదటి ఫేజ్‌లో అడివి టోపోగ్రఫీ సరిగ్గా తెలియకపోవటంవల్ల పారిపోయిన వాళ్ళు వెంటనే పట్టుబడ్డారు. పోరాట నియమాల ప్రకారం పన్ను కట్టేవాళ్ళ డబ్బు గంగలో కలిపి, వాళ్ళని తుపాకులతో కాల్చి పారేశారు. ఎన్‌కౌంటర్ పోరాటాల నియమం ప్రకారం వాళ్ళ శరీరాలని నక్కలకీ, తోడేళ్ళకీ ఆహారంగా అక్కడే వదిలేశారు. తోడేళ్ళనుంచి, అడివిపిల్లులూ, చివరికి చీమలవరకూ అన్ని రకాల ప్రాణులూ వాళ్ళ శరీరాలలోని మాంసాన్ని - కళ్ళనీ, పేగుల్నీ, గుండెకాయనీ, జననాంగాలనీ - తినేసిన తరవాత ఉత్త అస్థిపంజరాన్ని డోమ్ జాతివాళ్ళు - కటికవాళ్ళు - చాలా ఆనందంగా అమ్మటానికి పట్టుకుపోయారు.

పర్వతాల ఫేజ్‌లో ఎన్‌కౌంటర్లలో వాళ్ళు పట్టుబడలేదు. వాళ్ళకి ఎవరో నమ్మకస్తుడైన కూరియర్ దొరికాడని అనిపించింది. ఆ కూరియర్ దోపదేనని నమ్మకంగా అనుకున్నారు. దోప్దీకి దూలన్ అంటే ప్రాణం. తప్పకుండా ఆమే మిగతావాళ్ళని పట్టుబడకుండా కాపాడుతోంది.

"వాళ్ళు ఇలా అనుకోవటం కూడా హైపోథీసిసే!"

"ఏం?"

"ఒరిజనలీ ఎంతమంది వెళ్ళారు?"

జవాబు లేదు. ఈ విషయం గురించి చాలా గాలివార్తలు లేచాయి. చాలా పుస్తకాలు ప్రచురించబడుతున్నాయి. ఈ మాటలు నమ్మకపోవటమే మంచిది.

"ఈ ఆరేళ్ళలో ఎన్‌కౌంటర్లలో ఎంతమంది చనిపోయారు?"

జవాబు లేదు.

ఎన్‌కౌంటర్లలో చనిపోయినవాళ్ళ అస్థిపంజరాలు, చేతులు నరకబడో, విరిగిపోయో ఎందుకున్నాయి? అవిటివాళ్ళు ఎన్‌కౌంటర్ పోరాటాలు సల్పగలరా? వారి మెడ ఎముకలు కిందికి వేలాడిపోయి ఉన్నాయి, కాలి ఎముకలూ, రొమ్ము భాగపు ఎముకలూ పిండి అయిపోయాయి. ఎందుకు? ఎలా?

ఈ ప్రశ్నలకి రెండు రకాల జవాబులున్నాయి. మౌనంగా ఉండటం, లేకపోతే గర్వంగానూ, ఏవగింపుతోనూ చూస్తూ, 'ఛీ! ఇవన్నీ ఎవరైనా చెప్పకుంటారా? జరగవలసిందేదో ... ' అని అనటం.

"ఇప్పుడు ఎంతమంది అడవుల్లో ఉన్నారు?"

జవాబు లేదు.

వాళ్ళు ఒక సేనకి సమానమా? పన్నులు కట్టేవాళ్ళ ఖర్చుతో ఆ అడవుల్లో ఇంత పెద్ద సైన్యం పనిచెయ్యడం జస్టిఫయిడేనా?

జవాబు - "అబ్జెక్షన్! అడవులనటం సరికాదు. అక్కడ ఉన్న సైన్యానికి మంచి ఆహారం, మందు, మాకూ, వాళ్ళ వాళ్ళ మతాల్నిబట్టి పూజలు, పండగలూ జరుపుకునే అవకాశం, సంజీవ్‌కుమార్ శ్రీకృష్ణుల సమావేశాన్ని చూపే సినిమాలు చూసే వీలూ, అన్నీ కల్పించాం. అది అడివి ఎలా అవుతుంది?"

"ఎంతమంది టెర్రరిస్టులు?"

జవాబులేదు.

"ఎంతమంది ఉన్నారు? అసలు ఎవరైనా ఉన్నారా, లేరా?"

జవాబు చాంతాడంత!

ఉదాహరణకి - "వెల్, ఏక్షన్ తీసుకుంటున్నాం. జమీందార్లూ, వడ్డీవ్యాపారులూ, గూండాలు, వేశ్యాగృహాలు నడుపుతున్న ఊరు పేరులేనివాళ్ళు, దుండగులూ - అందరూ ఇప్పటికీ భయపడుతున్నారు. దరిద్రులూ, తిండికీ - బట్టకీ నోచుకోని పోకిరి వెధవలుగా ఇప్పటికీ పొగరుబోత్తనంతో తిరుగుతున్నారు. కొన్ని 'పొకెట్స్'లో ఇప్పటికీ టెర్రరిస్టులకి క్రమం తప్పకుండా డబ్బు ముడుతోంది. పారిపోయిన వాళ్ళమీద సానుభూతి ఉన్న ఊళ్ళల్లో జనం ఇప్పటికీ నోరు మెదపకుండా విప్లవకారులుగా ఉన్నారు. ఈ సంఘటనలన్నీ చూస్తే అనిపించేది ..."

"ఈ చిత్రంలో దోప్డీ మేఝేన్ ఎక్కడ ఫిట్ అవుతుంది?"

"ఆమె అజ్ఞాతవాసుల్లో ఒకతైందని అనటానికి సందేహం లేదు. కాని భయపడాల్సిన విషయం అది కాదు. మిగిలున్నవాళ్ళు ఏళ్ళతరబడి అడవుల్లో నివసిస్తూ, అక్కడి ప్రపంచానికి అలవాటుపడ్డవాళ్ళు. ఆ దరిద్రులు టెర్రరిస్టులకీ, ఆదివాసులకీ సహాయం చేస్తున్నారు. అడవుల్లో ఉండటంవల్ల వాళ్ళు తమ చదువంతా తప్పకుండా మరిచిపోయుంటారు. ఇప్పుడు ఆ మట్టిమనుషులు కొత్తగా పుస్తకాల్లో ఉన్న విజ్ఞానం నేర్చుకుని కొత్తరకమైన పోరాటాలు, ప్రాణాలతో బైటపడే నేర్పు, పద్ధతులూ నేర్చుకుంటున్నారు. బైటదొరికే చదువు స్వతహాగా వాళ్ళకి ఉన్నా, కష్టపడి పనిచేసే అలవాటూ ఇప్పటివరకూ వాళ్ళకి ఆధారంగా ఉన్నాయి. వాళ్ళని తుపాకీ గుండుతో చంపటం తేలికే. కాని కలంతో పనిచేసేవాళ్ళని అంతంచెయ్యటం అంత తేలికకాదు.

అందుచేత ఆపరేషన్ ఝూడ్ఖానీ ఆపటం వీలుకాదు. దీనికి కారణం 'ఆర్మీ హేండ్బుక్' ఇచ్చిన హెచ్చరికే.

## రెండు

దోప్డీ మేఝేన్ని పట్టుకోండి, ఆమె మిగతావాళ్ళని పట్టిస్తుంది. దోప్డీ అన్నంపొట్లం కొంగున కట్టుకుని నెమ్మదిగా నడుస్తోంది. ముసాయీ టూడూ పెళ్ళాం అన్నం వండిచ్చింది. అప్పుడప్పుడూ ఆమె అన్నం వండి దోప్డీ కిస్తూంటుంది. అన్నం వండాక

దోప్డీ దానిని కొంగున మూట కట్టుకుని నెమ్మదిగా వెళ్ళిపోతుంది. నడుస్తూనే ఆమె తన జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి పేలుతీసి చంపుతుంది. ఎక్కడైనా కొద్దిగా కిరసనాయిలు దొరికితే తలకి రాసుకుంటుంది. కాని వెధవలు ప్రతీ జలపాతం దగ్గరా కాపలా కాస్తున్నారు. నీళ్ళల్లో కిరసనాయిలు వాసనపట్టేసి దాని ఆధారంతో ఆమెని వెన్నంటి వస్తారు.

"దోప్డీ."

దోప్డీ జబాబు చెప్పలేదు. ఎవరైనా ఆమెని పేరుపెట్టి పిలిచినా జవాబుచెప్పదు. తనపేరుమీద బహుమతి పత్రాన్ని ఇవాళకూడా ఆమె పంచాయతీ ఆఫీసులో చూసింది. ముసాయి టూడూ పెళ్ళాం చెప్పింది, "ఏం చూస్తావులే? ఎవరో తెలీదు. దోప్డీ మేఝూన్‌ట, దానిని పట్టుకుని ఒప్పజెప్తే డబ్బిస్తారట."

"ఎంత?"

"రెండు వందలు."

"అలాగా?"

బైటికొచ్చాక ముసాయీ పెళ్ళాం, "వీళ్ళు పూర్తి బందోబస్తుతో వచ్చారు. అందరూ కొత్త పోలీసులే!" అంది.

"ఔను."

"నువ్వీ మధ్య రాలేదుగా?"

"ఏం?"

ముసాయీ పెళ్ళాం కళ్ళు దించుకుని నెమ్మదిగా అంది, "టూడూ చెప్పాడు, ఆ బాబు మళ్ళీ వచ్చాట్ట. నిన్ను పట్టుకున్నాక బస్తీ మొత్తం..."

"తగలబెడతారా?"

"ఇంకా ... దుఖీరాం గురించి ..."

"బాబుకి తెలుసా?"

"సోమయీ, బుధనా దగా చేశారుగా!"

"ఎక్కడున్నారు వాళ్ళు?"

"రైలెక్కి పారిపోయారు."

దోప్డీ ఒక్క క్షణం ఆలోచించి, "ఇంటికిపో, ఏం జరుగుతుందో నాకే తెలీదు! నన్నొకవేళ పట్టుకుంటే, నే నెవరో తెలీదని మీరంతా చెప్పండి."

"నువ్వు పారిపోవచ్చుగా?"

"లేదు. ఎన్నిసార్లు పారిపోను చెప్పు, పట్టుకుంటే మాత్రమేం చేస్తారు? కవుంటర్ చేస్తారు. అంతేగా? చెయ్యనీ!"

ముసాయీ పెళ్ళాం, "మేము ఎక్కడకీ పారిపోలేం కదా!" అంది.

దోప్దీకి తెలుసు. ఇన్నాళ్ళుగా విని విని హింసని ఎలా ఎదుర్కోవాలో తెలుసుకుంది. శరీరమూ, మనసూ చిత్రహింసలకి తట్టుకోలేకపోతే దోప్దీ తన నాలికని తన చేత్తోనే కోసేసుకుంటుంది. ఆ కుర్రాడు అదేగా చేశాడు. సిపాయిలు అతన్ని కవుంటర్ చేసేశారు.

"కవుంటర్ అంటే రెండుచేతులూ వెనక్కి విరిచి కడతారు. శరీరంలోని ఎముకలన్నీ పిప్పి అవుతాయి. యోని పచ్చడవుతుంది... కిల్డ్ బై పోలీస్ ఇన్ ఎన్‌కౌంటర్ ... అన్‌నోన్‌మేల్ ... ఏజ్ ట్వెంటీత్రీ..."

ఇలా ఆలోచిస్తూ దోప్దీ నడుస్తోంది. మళ్ళీ తనను 'దోప్దీ' అని ఎవరో పిలవటం వింది. ఆమె జవాబు చెప్పలేదు. తన పేరు ఎవరైనా పిలిపిస్తే పలకదు. అటు చూడను కూడా చూడదు. ఇక్కడ ఆమె పేరు ఊమీ మేఝెన్, కాని ఎవరు పిలుస్తున్నారు?

ఆమె మనసులో ఎప్పుడూ సందేహమనే ముల్లు గుచ్చుకుంటూనే ఉంటుంది. 'దోప్దీ' అనే మాట వినగానే అనుమానపు ముల్లు ముళ్ళపంది ముల్లులాగ నిక్కబొడుచుకుంది. నడుస్తూనే తనకి పరిచయమున్నవాళ్ళ మొహాలన్నీ జ్ఞాపకం తెచ్చుకుంది. ఎవరయి ఉంటారు? షోమరా కాదు, వాడు పారిపోయాడు. షోమయీ, బుధనా కూడా ఇంకో కారణంచేత పారిపోయారు. గోలభ్ కాదు, అతను బాకులీలో ఉన్నాడు. బాకులీ మనిషే అయుంటాడా? బాకులీ వదిలేశాక తనపేరు, దూలన్‌పేరు మారిపోయి ఊమీ మేఝెన్, మావంగ్ మాఝె అయిపోయాయి. ఇక్కడ ముసాయీ, అతని పెళ్ళాం తప్ప తన అసలు పేరు తెలిసినవాళ్ళెవ్వరూ లేరు. చదువుకున్న కుర్రాళ్ళలో కూడా మొదటి బేచ్‌లో అందరికీ తెలీదు.

కాలం చాలా విచిత్రమైనది. దోప్దీ ఆలోచించటం మొదలుపెడితే అన్ని సంగతులూ కలగాపులగంగా జ్ఞాపకం వస్తాయి. బాకులీలో 'ఆపరేషన్ బాకులీ' అవుతోంది. సూర్యసాహూ బిడ్డీబాబూతో పోట్లాడి తన ఇంటి ఆవరణలో రెండేసి ట్యూబ్‌వెల్స్, మూడేసి బావులూ తవ్వించుకున్నాడు. ఇంకెక్కడా నీళ్ళు లేవు.

బీర్‌భూమ్ మొత్తం కరువు కాటకాలే. సూర్యసాహూ ఇంట్లో మాత్రం కావలసినన్ని నీళ్ళు, అదీకాక కనుపాపల్లాగ స్వచ్ఛమైన నీళ్ళు.

కెనాల్ టాక్సు కట్టి, నీళ్ళు తెచ్చుకో, కాని టేక్సు డబ్బుతో వచ్చే నీళ్ళతో వ్యవసాయం పనులు చేస్తే, ఏం మిగులుతుంది?

అంతా స్వాహా అయిపోతుంది.

"వెళ్ళండి, వెళ్ళండి. మీ పంచాయితీ దౌర్జన్యం నేను సహించను. నీళ్ళు తీసుకుని పంట పండించుకుంటారు, సగం పంట కూలీకింద తీసేసుకుంటారు. ఆ తరువాత ఇళ్ళు కట్టుకోటానికి డబ్బడుగుతారు. మీకు మంచి చేసి, మంచి గుణపాఠమే నేర్చుకున్నాను!"

"ఏం మంచి చేశావ్?"

"ఊరికి నీళ్ళిప్పించలేదూ?"

"అదంతా నీ పొలంలో నాట్లు వేయించుకోడానికి చేశావు."

"మీకు నీళ్ళు దొరకలేదా?"

"లేదే. డోమ్‌లకీ, చండాలులకి నీళ్ళు దొరకలేదు."

ఈ విషయంమీద గొడవ మొదలయింది. కరువుతో కష్టాలు పడే మనిషి త్వరగా ఓర్పు కోల్పోతాడు. ఊళ్ళోని సతీష్ యుగల్, పట్నం నుంచి వచ్చిన కుర్రాడు - అతని పేరు రాణా కాబోలు - అందరూ, "జమీందార్లూ, వ్యాపారులూ ఏమీ ఇవ్వరు. వాళ్ళని చంపెయ్యండి," అన్నారు.

సూర్యసాహూ ఇంటిని చుట్టుముట్టారు. సూర్యసాహూ తుపాకీ తీశాడు. గొడ్లనికట్టే పలుపుతాడుతో సూర్యసాహూ చేతులు వెనక్కి విరిచి కట్టారు. అతని కళ్ళు భయంచేత ఒకచోట నిలవటంలేదు. అతని పంచె మాటిమాటికీ ఖరాబవుతోంది. దూలన్, "ముందు నన్ను పొడవనివ్వండి. మా తాత ఇతని దగ్గర వడ్డీ అప్పు తీసుకున్నాడు. ఆ అప్పు తీర్చటానికి ఇతని దగ్గర నేను ఈ రోజువరకూ వెట్టిచాకిరీ చేస్తూనే వున్నాను" అన్నాడు.

"నావేపు వెకిలిచూపులు చూస్తూ చొంగకార్చేవాడు, వీడికళ్ళు నేను పీకుతాను" అంది దోప్డీ.

సూర్యసాహూ, ఆ తరువాత సివుడీ నించి టెలిగ్రాఫిక్ మెసేజ్ వచ్చింది. స్పెషల్ ట్రైన్, ఆర్మీ, జీపు బాకులీవరకూ రాలేకపోయింది. మార్చ్, మార్చ్, మార్చ్.

ఇనప మేకుల బూట్లకింద కంకరరాళ్ళు కర-కరమని చప్పుడు. మైకులో, 'కార్డన్ అప్. జుగల్ మండల్, సతీష్ మండల్, రాణా ఎలియాస్ ప్రవాద్ ఎలియాస్ దీపక్, దూలన్ మార్ఝి, దోప్దీ మేఝెన్ ... సరండర్, సరండర్. నో సరెండర్! మో-మో-మో డవున్ ద విలేజ్!''అనే ఆదేశాలు. ఖటా ఖట్ - ఖట్ ఖట్ - గాలిలో కోర్డైట్ - ఖట్ ఖట్ - రౌండ్ ది క్లాక్ ఖట్ ఖట్. ఫ్లేమ్ థ్రోయర్. బాకులీ అంటుకుంది. మోర్ మెన్ అండ్ విమెన్ అండ్ చిల్డ్రెన్ - ఫైర్ ఫైర్ క్లోజ్ కెనాల్ అప్రోచ్. ఓవర్-ఓవర్-ఓవర్ బై నైట్‌ఫాల్. దోప్దీ, దూలన్ నేలకరచుకుని పాకుతూ మాయమయారు.

బాకులీనుంచి పల్తాకుడీ వాళ్ళు వెళ్ళలేకపోయారు. భూపతీ, తపావాళ్ళని తీసుకెళ్ళారు. ఆ తరవాత దోప్దీ, దూలన్ ఝాడ్‌ఖానీ బెల్ట్ ప్రాంతంలో పనిచేయాలని నిర్ణయం జరిగింది. దూలన్ దోప్దీకి నచ్చచెప్పాడు, ''ఇదే మంచిది! దీనివల్ల మనకి ఇల్లు-వాకిలీ, పిల్లాపీచూ అనే బాదరబందీ ఉండదు. ఎవరు చెప్పగలరు, జమీందార్లూ, షావుకార్లూ, పోలీసులూ లేని రోజులొస్తాయేమో!''

కాని ఇవాళ తనని వెనకనించి ఎవరు పిలిచారు?

దోప్దీ నడుస్తూనే ఉంది. ఊళ్ళూ, పొలాలూ, తుప్పలూ, పొదలూ, కొండగుట్టలూ - పి.డబ్ల్యు.డి. స్తంభం - వెనకాలే ఎవరో పరిగెత్తుకొస్తున్న చప్పుడు. ఝాడ్‌ఖానీ అడివి ఇంకా కోసుదూరం ఉంది. అడివిలో జొరబడితే ప్రాణాలతో బైటపడవచ్చని అనిపిస్తోంది. వాళ్ళతో చెప్పాలి పోలీసులు మళ్ళీ తనపేర నోటీసు జారీ చేశారని. పాత ఆఫీసరు ముండాకొడుకే మళ్ళీ వచ్చాడని చెప్పాలి. హయిడ్ - అవుట్ మార్చాలి. ఇదికాక సందారాలో పొలం కూలీలకు ఇవ్వవలసిన డబ్బు విషయంలో జరిగిన గొడవ. తరవాత లక్ష్మీ బేరా, నారాన్ బేరాలని సూర్యసాహూని చేసినట్లే చెయ్యాలన్న ప్లాన్ కూడా కేన్సిల్ చెయ్యాలి. షోమయీ, బుధనాకి కూడా తెలుసు. దోప్దీ గుండెల్లో రానున్న భయంకరమైన ఆపద గురించిన బెంగ కొట్టుకుంటోంది. షోమయీ, బుధనా వెన్నుపోటు పొడిచినా సంథాలు జాతికి చెందినందుకు తను సిగ్గుపడటంలేదు. దోప్దీ ఒంట్లో చంపాభూమి తాలూకు పవిత్రమైన రక్తం ప్రవహిస్తోంది. ఎటువంటి కల్తీలేని రక్తం. చంపానుంచి బాకులీకి చేసిన ప్రయాణం ఎన్ని ఏళ్ళు పట్టిందో! రక్తంలో కల్తీ ఏర్పడటానికి వీలున్నా ఏర్పడలేదు. దోప్దీ తన తాతముత్తాతల్ని తలుచుకుని గర్వపడింది. వాళ్ళు తమ ఆడవాళ్ళ రక్తం కల్తీ కాకుండా కాపలా కాసేవాళ్ళు. షోమయీ, బుధనా ఒక తండ్రికి

పుట్టినవారు, యుద్ధకాలంలో మొలిచిన కలుపుమొక్కలు! షియాన్ డాంగాలో డేరాలు దించిన అమెరికన్ సైనికులు రాఢీ భూమికి ఇచ్చిన బహుమతులు! లేకపోతే కాకి ఎక్కడైనా కాకిని చంపి తినవచ్చుగాని, ఒక సంథాల్ ఇంకో సంథాల్‌ని పట్టిచ్చి ద్రోహం చెయ్యడు.

మళ్ళీ వెనకాల అడుగుల చప్పుడు. ఆ చప్పుడుకీ దోప్దీకి మధ్య దూరం. దోప్దీ కొంగున కట్టుకున్న అన్నంపొట్లం, బొడ్లో దోపుకున్న పొగాకు. ఆరిజిత్, మాలిని, శామూ, మోంటూ - వీళ్ళెవరూ బీడీ, సిగరెట్, టీ ముట్టుకోరు. ఉత్త పొగాకు, సున్నం. చిన్న కాగితం పొట్లంలో 'అలకులీ' గింజలున్నాయి. అవికూడా బొడ్లోనే దోపుకుంది. అది తేలుకుడితే వాడే పేటెంట్ మందు. ఇవేవీ వాళ్ళకి చేరవేయటం కుదరదేమో!

దోప్దీ ఎడమవేపుకి తిరిగింది. కేంప్ ఇటే ఉంది. రెండుమైళ్ళ దూరం. ఇది అడివిలోకి వెళ్ళే దారికాదు, కాని వెనకాలే వస్తున్న పోలీసు గూఢచారిని తీసుకుని దోప్దీ అడివిలోకి వెళ్ళదు.

నీ ప్రాణాలమీద ఒట్టు దూలన్, ప్రాణాలమీద ఒట్టు! ఏమీ చెప్పను. వెనకాల వచ్చే అడుగుల చప్పుడు కూడా ఎడమవైపుకి తిరిగింది. దోప్దీ నడుము తడుముకుంది. అరచేతికి చంద్రవంకలాంటి కొడవలి తగిలి కాస్త ధైర్యం పుంజుకుంది. కొడవలికాదు, కొడవలిపిల్ల! ఝాడ్‌ఖానీలోని కమ్మర్లు మంచి కొడవళ్ళు చేస్తారు. చూస్తుండు, అమ్మీ, ఎంత పదును పెడతానో! కొన్ని వేలమంది దుఖీరాంలని ... అదృష్టంకొద్దీ దోప్దీ పట్నం పడుచుకాదు. కొడవళ్ళు, కత్తులూ మొదలైన వాటి సరుకు మంచిదో కాదో పోల్చుకోగలదు. మాట్లాడకుండా పనిచేస్తుంది. దూరంగా కేంప్ దీపాలు కనిపిస్తున్నాయి. దోప్దీ అటు ఎందుకు వెళ్తోంది? ఒక్క నిమిషం ఆగి వెనక్కి తిరిగింది. అవును, రాత్రంతా నేను కళ్ళు మూసుకుని తిరగగలను. అడివిలోకి వెళ్ళను, దారి తప్పను. అలిసిపోయి రొప్పను. గాడిదకొడకా, సుఖాలు మరిగిన నువ్వు నాతో సమానంగా ఎక్కడ నడవగలవు? నిన్ను అలిపించి, పరుగెత్తి పరిగెత్తించి ఊపిరందకుండా ఉన్నప్పుడు గోతిలోకి తోసి పారిపోతాను.

ఏం చెప్పలేం! కొత్త కేంప్ చూసి వచ్చింది. బస్‌స్టేషన్‌లో బీడీలు చుడుతూ మిగతావాళ్ళతో మాటలు కలిపి పోలీసు జీపులు ఎన్ని వచ్చాయో, ఎన్ని వైర్‌లెస్ వాన్లు వచ్చాయో తెలుసుకుంది. చేమదుంపలు నాలుగు, ఏడు ఉల్లిపాయలు,

మిరపకాయలు ఏభై - సులభమైన లెక్క. ఈ సమాచారం కూడా నేను మిగతావాళ్ళకి చేరవెయ్యలేను. నేను అక్కడకి వెళ్ళకపోతే, కవుంటర్ అయిపోయుంటానని వాళ్ళు అనుకుంటారు. అప్పుడు వాళ్ళు పారిపోతారు. అరిజిత్, "ఎవరైనా పట్టుబడితే నిర్ణీత సమయం వరకూ వాళ్ళకోసం ఎదురుచూసి, మిగిలినవాళ్ళం, హైడ్-అవుట్ ఛేంజ్ చేసేసుకుందాం. కామ్రేడ్ దోప్డీ ఆలస్యంచేస్తే, మనం ఈ ప్రదేశం వదిలెయ్యాలి. ఎక్కడికెళ్తున్నామో గుర్తు చెప్పి, వెళ్దాం. కామ్రేడ్లెవరూ తమకోసం మిగతా కామ్రేడ్లని నాశనం కానివ్వరు" అని అన్నాడు.

జలపాతం హోరుతోపాటు అరిజిత్ గొంతుక కూడా మారుమోగుతుంది, "రాతికింద నొక్కిపెట్టిన బాణం ములికి ఏవైపుకుంటుందో, అటే కొత్త హైడ్-అవుట్ ఉంటుంది."

ఇదంతా దోప్డీకి ఇష్టం. తనకి అర్థం అవుతుంది. దూలన్‌ని చంపేశారు. అతను ఎవర్నీ చంపలేదు. ఎందుకంటే మొదట్నుంచీ అతను ఇలా ఆలోచించలేదు, లేకపోతే కవుంటర్ అయి ఉండేవాడు. ఇప్పుడున్న నియమాలు ఎంతో కఠినంగా ఉన్నా, సులభంగా అర్థం అవుతున్నాయి. దోప్డీ తిరిగొస్తే మంచిది, రాకపోతే ఏదో చెడు జరిగింది, ఛేంజ్ ది హైడ్-అవుట్! వీళ్ళు వదిలే గుర్తు అపోజిషన్‌కి కనిపించదు, కనిపించినా అర్థం అవదు.

వెనకాల అడుగుల చప్పుడు వినబడింది. దోప్డీ మళ్ళీ దారి మళ్ళించింది. మూడున్నరమైళ్ళు విస్తరించిన ఈ ఎగుడు దిగుడు మైదానం భో ఆయీ అడివిలో ప్రవేశించటానికి దారిలాంటిది. దోప్డీ ఆ దారి వదిలి ముందుకెళ్ళింది. ఎదురుగా సమతలంగా ఉండే భూమి ఉంది. ఆ తరువాత మళ్ళీ భో ఆయీ అడివి. ఇటువంటి ఎగుడు దిగుడు భూమిమీద ఎవరూ కేంప్ వేసుకోలేదు. ఇక్కడ నిర్జనంగా ఉంటుంది. దారి వంకర టింకరగా వుంటుంది. చిన్నచిన్న పొదలమధ్యన ఒకేరకమైన మట్టిదిబ్బలు కనిపించాయి. ఏం పరవాలేదు, దోప్డీ ఈ దుర్మార్గుడిని శ్మశానానికి పంపించిగాని ఊరుకోదు. పతితపావనుణ్ణి శ్మశానంలో కాళీమాతకే బలిచ్చారు!

"ఎప్రహెండ్!"

"మట్టిదిబ్బల్లో ఒకటి లేచి నిలబడింది. తరవాత ఇంకొకటి, ఇంకోటి. నిరాశా ఆనందమూ కలగలిపిన భావం. 'ఇఫ్ యూ వాంట్ టు డిస్ట్రాయ్ ద ఎనిమీ, బికమ్ వన్' సేనాపతి ఎనిమీతో కలిసిపోయాడు. ఆరేళ్ళక్రితం కూడా అతను వాళ్ళ

ఒక్కొక్క మూవ్‌నీ ఏంటిసిపేట్ చెయ్యగలిగేవాడు, ఇప్పుడూ చెయ్యగలుగుతున్నాడు. ఇదే అతనికి చాలా సంతోషం కలిగించే విషయం. సాహిత్యంలో అభిరుచి ఉండటంవల్ల 'కర్డ్స్ బ్లడ్' చదివి తన ఆలోచనల్నీ, పనిచేసే విధానాన్నీ రూపుదిద్దుకున్నాడు.

దోప్డీ అతనికి ధోకా ఇవ్వలేకపోయింది. దీనివల్ల అతనికి నిరాశ కలిగింది. దీనికి రెండు కారణాలు. ఆరేళ్ళక్రితం తన బుర్రలో వేసుకున్న లెక్కలప్రకారం అతని వ్యాసం ఒకటి అచ్చు అయింది. ఉగ్రవాదుల దృష్టితో చూస్తే ఈ పోరాటాన్ని సమర్థించవల సిందేనని ఆయన నిరూపించాడు. దోప్డీ ఉగ్రవాది. వెటరన్ ఫైటర్. మార్చ్ అండ్ డిస్ట్రాయ్. దోప్డీ మేఝన్ ఎప్రహెండ్ అవబోతున్నది. డిస్ట్రాయ్ అవుతుంది. చాలా విచారకరమైన విషయం.

"హాల్ట్!"

దోప్డీ తటాలున ఆగింది. వెనకాల వస్తున్న అడుగుల చప్పుడు చుట్టుతిరిగి ముందొచ్చి నిలబడింది. దోప్డీ గుండెల్లో కాలవకట్టలు తెంచుకున్నట్టయింది. స్వప్ననాశనం. సూర్యసాహూ తమ్ముడు దోతానీ సాహూ ఎదురుగా నిలబడి ఉన్నాడు. ఎదురుగా వున్న రెండు మట్టిదిబ్బలు ముందుకి జరిగాయి. షోమయీ, బుధనా. అంటే రైల్లో పారిపోలేదన్నమాట వీళ్ళు.

అరిజిత్ గొంతు వినబడింది, 'గెలిస్తే ఎలా ఉంటావో, ఓడినా అలాగే ఉండాలి. ఆ తరువాతి స్టేజి నుంచి పని మొదలు పెట్టాలి."

ఇక దోప్డీ రెండు చేతులూ చాపి, మొహం పైకెత్తి అడివివైపు తిరిగి తన బలంకొద్దీ కేకపెట్టింది. ఒకసారి, రెండుసార్లు, మూడుసార్లు! ఆమె మూడోసారి అరిచిన అరుపుకి ఝూడ్‌ఖానీ అడివి ప్రాంతాల గల చెట్లమీది పక్షులు నిద్రలేచాయి. అవి రెక్కలు అల్లాడిస్తూ కూయటం ప్రారంభించాయి. దోప్డీ అరిచిన అరుపు తాలూకు ప్రతిధ్వని చాలా దూరం వరకు వినిపించింది.

## మూడు

సాయంత్రం ఆరుగంటల ఏభై ఏడు నిమిషాలకి ద్రౌపది ఎప్రహెండ్ అయింది. ఆమెను కేంప్‌వరకూ తీసుకెళ్ళటానికి గంట పట్టింది. సరిగ్గా ఇంకో గంట ఆమెను ప్రశ్నించటానికి పట్టింది. ఎవరూ ఆమెని ముట్టుకోలేదు. ఆమెను ఒక కాన్వాస్

కేంపు స్టూలు మీద కూర్చోనిచ్చారు. ఎనిమిదిగంటల ఏభై ఏడు నిమిషాలకి సేనాపతి డిన్నర్‌కి వెళ్తాడు. "ఆమెని తయారుచేసి తీసుకురండి. డూ ద నీడ్‌ఫుల్!" అని చెప్పి అతను మాయమయ్యాడు.

ఆ తరవాత కొన్ని యుగాలు గడిచాయి - కొన్ని యుగాలు! లక్షల కోట్ల యుగాల తరవాత ద్రౌపది కళ్ళు తెరిచింది. ఎంత విచిత్రమో! ఆమె కళ్ళు తెరవగానే ఆకాశాన్ని చంద్రుణ్ణీ చూసింది! నెమ్మది నెమ్మదిగా ఆమె మస్తిష్కంలో గుచ్చుకున్న గుండుసూదుల రక్తసిక్తమైన మొనలు దూరంగా పోసాగాయి. కదలటానికి ప్రయత్నించింది. తన రెండు చేతులూ, కాళ్ళూ గుంజలకి కట్టేసున్నాయని తెలిసింది. వీపుకిందా నడుంకిందా ఏదో జిగురు పదార్థం ఉంది. తన రక్తమే! నోట్లోమాత్రం గుడ్డలు కుక్కిలేవు. భయంకరమైన దాహం. 'నీళ్ళు నీళ్ళు' అని ఎక్కడ అంటానో అని ఆమె తన కింది పెదవిని పళ్ళతో నొక్కిపట్టింది. తన యోనిద్వారం నుంచి రక్తం స్రవిస్తోందని ఆమె గ్రహించింది. ఎంతమంది ఆమెని 'తయారుచెయ్యటానికి' వచ్చారో?

సిగ్గుతో ఆమె కంటి కొలకులనించి నీళ్ళు కారసాగాయి. మసక వెన్నెల్లో మసకబారిన కళ్ళతో కిందికి చూస్తే తన రొమ్ములు కనిపించాయి. అవును. తనని సరిగ్గానే తయారుచేశారు అని అనుకుంది. ఇప్పుడు తను నచ్చుతుంది. తన రుచి నచ్చుతుంది. రెండు రొమ్ములు గాయాలైపోయి రక్తం ముద్దల్లాగయిపోయాయి. ఎంతమంది? నాలుగు-ఐదు-ఆరు-ఏడు! ఆ తరవాత ద్రౌపది మూర్ఛపోయింది.

కళ్ళు తెరిచాక అటూ ఇటూ చూస్తే తెల్లగా ఏదో కనబడింది. అవి తన బట్టలే. ఇంకేం చూడలేదు. ఉన్నట్టుండి దేవుడు అనుగ్రహించాడా అనుకుంది. బహుశా వాళ్ళు తనని వదిలేసి పోయారు. ఏ జంతువులో పీక్కుతినటానికి! కాని కాళ్ళీడుస్తూ ఎవరో వస్తున్న చప్పుడయింది. మెడతిప్పి చూస్తే బేయ్‌నెట్‌మీద బరువంతా మోపి నిలబడి తనని చూసి నవ్వుతూ కనిపించాడు కాపలావాడు. ద్రౌపది కళ్ళు మూసుకుంది. ఎక్కువసేపు ఎదురుచూడాల్సిన అవసరం లేకపోయింది. మళ్ళీ ఆమెను తయారుచ్యేటం మొదలుపెట్టారు. అలా సాగుతూనే ఉంది. ఇంకొంత వెన్నెల కక్కుకుని చందమామ నిద్రపోవటానికి వెళ్ళిపోయాడు. ఉత్త చీకటి మిగిలింది. కాళ్ళూ చేతులూ కట్టేసి వెల్లకిలా పడి ఉన్న ఆడదాని శరీరం, దానిమీద మాంసపు పిస్టన్ లేవటం, పడటం. లేవటం, పడటం!

తెల్లారింది.

ఇక ద్రౌపదీ మేఝేన్‌ని డేరాలోకి తీసుకెళ్ళారు. అక్కడ గడ్డిమీద పడేశారు. ఆమె బట్టల్ని ఆమె ఒంటిమీదికి విసిరేసారు.

ఆ తరవాత బ్రేక్‌ఫాస్ట్, వార్తాపత్రిక చదవటం, రేడియో మెసేజ్, "ద్రౌపదీ మేఝేన్ ఎప్రెహెండెడ్." వార్త పంపిన తరవాత ద్రౌపది మేఝేన్‌ని తీసుకురమ్మని ఆజ్ఞ జారీ అయింది. కాని ఉన్నట్టుండి అంతా తలకిందులైంది.

సిపాయి 'పద' అనగానే ద్రౌపది లేచికూర్చుని, "ఎక్కడికి వెళ్ళమంటావు?" అని అడిగింది.

"ఆఫీసర్‌గారి డేరాకి."

"డేరా ఎక్కడుంది?"

"అదిగో, అక్కడ."

ద్రౌపది ఎర్రటి కళ్ళతో ఉరిమిచూసింది. డేరా దగ్గర్లోనే ఉంది.

"పద వస్తున్నాను" అంది.

కాపలాదారు నీళ్ళచెంబు అందించాడు.

ద్రౌపది లేచినిల్చుంది. నీళ్ళచెంబుని తీసుకుని నీళ్ళన్నీ ఒంచేసింది, నీళ్ళు కింద పోయాయి. తన బట్టలన్నీ పళ్ళతో పీకి చింపింది. ఆమె ప్రవర్తన చూసి, 'పిచ్చెక్కింది' అంటూ కాపలాదారు పరిగెత్తాడు. ఖైదీని తీసుకెళ్ళటమే అతని పని. ఖైదీ ఇలా ప్రవర్తిస్తే ఏంచెయ్యాలో అతనికి తెలీదు. అందుకే పైవాళ్ళని అడగటానికి పరిగెత్తాడు.

జైల్లో గంట కొడితే ఎలా పరిగెత్తుతారో అలాగే ఇక్కడా జరిగింది. సేనాపతి ఆశ్చర్యపోతూ డేరా బైటికొచ్చాడు. సూర్యుడి తీక్షణమైన వెలుతుర్లో దిసమొలతో ఉన్న ద్రౌపదిని చూశాడు. ఆమె తలెత్తుకుని అతనివైపే వస్తోంది. కాపలావాడు భయం భయంగా ఆమెవెనకే కాస్త దూరంలో వస్తున్నాడు.

"ఏమిటిది?" అంటూ ఆగిపోయాడు.

ద్రౌపది వచ్చి అతని కెదురుగా నిలబడింది. దిసమొలతో ఉన్న ద్రౌపది. ఆమె యోని - కేశాలమీద రక్తపు మరకలు, రెండు రొమ్ములూ పెద్ద పెద్ద గాయాల్లాగ ఉన్నాయి.

"ఏమిటిది?" బెదిరిస్తూ అన్నాడు.

ద్రౌపది అతనికి ఇంకా దగ్గరగా వచ్చింది. నడుంమీద చేతులు పెట్టుకుని నవ్వింది. ఆ తరవాత, "నువ్వు పట్టుకోవాలనుకున్న దోప్డీ మేఝేన్‌ని నేనేరా! తయారుచేసి తీసుకురమ్మన్నావుగా? ఎలా తయారుచేశారో చూడవామరి?" అంది.

"ఈమె బట్టలేవీ? బట్టలు?"

"వేసుకోవటంలేదు, సార్! చింపి పారేసింది."

ద్రౌపది నల్లటి శరీరం ఇంకా దగ్గరకొచ్చింది. ద్రౌపది అసలు అంతుబట్టటంలేదు. సేనాపతి ఆమెను అర్థం చేసుకోలేకపోతున్నాడు. ద్రౌపది లోపల్నించి తన్నుకొస్తున్న నవ్వుతో వణకసాగింది. నవ్వితే చిట్లిన ఆమె పెదవులనుంచి రక్తం కారసాగింది. రక్తాన్ని చేత్తో తుడుచుకుంటూ భయంకరమైన గొంతుతో, "బట్టలెందుకురా, బట్టలు? బట్టలు విప్పినవాడివి బట్టలు ఎలా వేస్తావురా? నువ్వు పెద్ద మొగాడిననుకుంటున్నావా?" అని అరిచింది.

నలువేపులా చూసి ద్రౌపది రక్తం కలిసిన ఉమ్మిని తెల్లగా మెరుస్తున్న సేనాపతి చొక్కామీద ఊసి "ఇక్కడ మొగాడే లేడురా, ఇంక ఎవర్ని చూసి సిగ్గుపడమంటావు? బట్టలు వెయ్యనివ్వను. ఇంకేం చెయ్యగలవురా నువ్వు? ఇంద, కవుంటర్ చెయ్యి, కవుంటర్ ..." అంది.

ద్రౌపది గాయపడ్డ రొమ్ములతో సేనాపతిని తొయ్యటం మొదలుపెట్టింది. సేనాపతి మొదటిసారిగా చేతిలో ఆయుధంలేని టార్గెట్ ముందు నిలబడటానికి భయపడ్డాడు, హడిలిపోయాడు!

# రాంగ్ నంబర్

రాత్రి ఒంటిగంటయింది. తీర్థబాబుకి మెలకువ వచ్చింది. టెలిఫోన్ మోగుతోంది. అర్ధరాత్రివేళ టెలిఫోన్ మోగితే ఇంత భయమెందుకు వేస్తుందో!

"హలో ... నేను ఆస్పత్రినించి ఫోన్ చేస్తున్నాను ... మీ పేషంట్ ఇంతకు ముందే చనిపోయాడు. హలో ..."

"మా పేషంటా? మా పేషంటెవరూ ఆస్పత్రిలో లేరే?"

"మీ నంబరేమిటి?"

"రాంగ్ నంబర్! ఫోన్ పెట్టేయండి!"

వీళ్ళు రాంగ్ నంబర్‌కి ఎందుకు ఫోన్ చేస్తారో?

తీర్థబాబు ఫోన్ ఎందుకు మోగుతుంది? ఇన్ని రాంగ్ నంబర్లెందుకు వస్తాయి?" అని సబితకి అనుమానం.

చాలా రోజులబట్టి తీర్థబాబుకీ, సబితకీ రాత్రిళ్ళు పెందరాళే నిద్రపట్టటం మానేసింది. రాత్రి సరిగ్గా 12 గంటలకి తీర్థబాబు నిద్రమాత్ర వేసుకుంటాడు. కళ్ళు మూసుకుని పడుకుంటాడు. రకరకాల ఆలోచనల్ని మనసులోంచి నెట్టివెయ్యడానికి ప్రయత్నిస్తాడు. కాని చెయ్యలేడు. అతని మస్తిష్కపు పొరలమధ్య అడ్డుగోడలు లేస్తాయి. ఆ గోడలకి పోస్టర్లు అంటించి ఉంటాయి.

దీపంకర్ ఫొటోలు, చిన్నపిల్లవాడప్పటిది - పుట్టుజుత్తు తీయించిన గుండుతో అమాయకంగా చూస్తూ ఉన్నది! మెట్రిక్ పాసయిన దీపంకర్. గ్రాడ్యుయేట్ దీపంకర్. పొడుగ్గా, ఇనప చువ్వలాంటి శరీరం, భావుకతతో నిండిన ప్రశాంతమైన ముఖం.

దీపంకర్! తీర్థబాబు ఏకైక సంతానం.

పిల్లలు, పిల్లలు! మనిషి సంతానాన్ని ఎందుకు కోరుకుంటాడు? తన సంతానాన్ని ఎందుకు ప్రేమిస్తాడు? తీర్థబాబు రోజూ తనని తాను ప్రశ్నించుకుంటూ ఉంటాడు.

చివరికి నిద్ర వస్తుంది. గాఢమైన నిద్ర, కాని నిద్రలోనూ భయమే, గాభరాయే!

సబిత ఇంకా నిద్రపోయినట్టులేదు.

"ఎవరి ఫోను?" అని అడిగింది.

"రాంగ్ నబంర్."

"ఎక్కణ్ణించి?"

"ఆస్పత్రినించి."

"ఆస్పత్రినించా? ఏవండీ, సరిగ్గా అడిగారా, మనది కాదుకదా?"

"పిచ్చిగా మాట్లాడక సబూ! దీపూ నీరేన్ దగ్గరకెళ్ళాడని తెలుసుగా? నీరేన్ ఢిల్లీలో సీటు సంపాదించే ప్రయత్నంలో ఉన్నాడు. అన్నీ తెలిసీ ఏమిటా అర్థంలేని మాటలు?"

"నీరేన్ దగ్గరుంటే మరి వాడు మనకి ఉత్తరం ఎందుకు రాయడు? నీరేన్ ఉత్తరం ఎందుకు రాయడు? మీ ఉద్దేశం ఏమిటి? నేను ఏడ్చి, రాగాలు పెడతాననా? లేకపోతే నీరేన్ దగ్గరకి పరిగెత్తుతానని భయమా?"

"సబూ, ఏమిటా గాభరా?"

"నాకు తెలుసు. దీపూ నీరేన్ దగ్గరలేడు. కావాలనే నీరేన్ మనకి ఏం చెప్పటంలేదు."

"ఇంక ఆపు సబూ, ఏడవకు. అంతా సర్దుకుంటుంది. దీపూ పారిపోలేదని నీకూ తెలుసు."

"మరయితే వాడు ఇన్నాళ్ళయినా రాడేం?"

"సబూ! ఒంట్లో బాగాలేకపోవడంతో, నువ్వు సరిగ్గా ఆలోచించటంలేదు. రోజులు బాగాలేవు. మనం ఉండే ప్రాంతం కూడా అంత సురక్షితమైనది కాదు. అందుకే వాడు రావటంలేదు."

సబిత ఏడవటానికి కూడా ఒంట్లో శక్తిలేనట్టు, ఆగి ఆగి నెమ్మదిగా ఏడవటం ప్రారంభించింది. అప్పుడప్పుడూ ఇలా ఏడుస్తూనే నిద్రలోకి జారుకుంటుంది. తీర్థబాబుకి మట్టుకు ఒక పట్టాన నిద్రపట్టదు. ఈ దేశానికి ఏమయింది? రోగి చచ్చిపోతే 2-3 ఎక్స్ఛేంజి నంబరయితే, 4-7కి ఫోన్ చేస్తారు. రాంగ్ నంబర్! ఆ రోగి తాలూకు మనుషులు పాపం ఏం కావాలి?

బహుశా వాళ్ళకి ఏమీ అనిపించదేమో! ఈ రోజుల్లో అందరూ కురుక్షేత్రంలోని అర్జునుడిలా తయారయ్యారు. చావుని పట్టించుకోవటం మానేశారు. ఒకరకమైన

వైరాగ్యభావం! బహుశా శవాలు అలా మంచాలమీదే ఉండిపోతాయేమో! ఖర్చు తప్పించుకోటానికి బంధువులు జారుకుంటారు. మళ్ళీ చుట్టుపక్కల కనిపించరు. అలాటి శవాల్ని శవాల గదిలో పడేస్తారేమో! వాటిని గుర్తించటానికి కూడా ఎవరూ రారు.

తీర్థబాబుకి భయం, అతను అకారణంగానే భయపడతాడు. తనుండే పశ్చిమబెంగాల్‌లోని కలకత్తా నగరం ఇంకో ఊరులాగ అతనికి అనిపిస్తుంది. చూడటానికి కలకత్తాలాగే ఉంది, అదే 'బడా మైదాన్', మాన్యుమెంట్స్, భవానీపూర్, అలీపూర్, చడ్‌కడాంగా మలుపు! ఆషాఢమాసంలో ఎప్పటిలాగే రథాల ఊరేగింపు, చైత్రంలో కాళీఘాట్‌లో గుంపులూ, మాఘమాసంలో క్రిస్మస్‌కి ఊరంతా దీపాలు!

కాదు ఇది ఆ ఊరుకాదు. ఇది సరైన ఊరుకాదు. రాంగ్ సిటీ! తీర్థబాబు సరైన రైలెక్కి, సరైన ఊరికి రాలేదు.

సబితకి తను నచ్చచెప్పి, ధైర్యం చెప్పిన విషయాలన్నీ అప్పుడే మర్చిపోయాడు. తను తప్పుడు ఊరికి రాకపోతే దీపూ ఉత్తరం ఎందుకు రాయడు? నీరేన్ దీపూ యోగక్షేమాలు ఎందుకు తెలియబరచడు?

ఎందుకు? ఎందుకు మనిషి సంతానం కావాలని కోరుకుంటాడు? తన పిల్లల్ని ఎందుకు ప్రేమిస్తాడు? తను చనిపోయాక కొరివి పెడతాడనా? రాంగ్ నంబర్. బతికున్నంతవరకే కదా పిల్లలమీద మమకారం! నువ్వు నాదగ్గరే ఉండు. నా బాధలూ, నా వేదనలూ, నా అదృష్టం, దురదృష్టం అన్నీ పంచుకో. నువ్వు నేను వేరుకాదు. ఇద్దరం ఒకటే అనే విషయం గ్రహించు.

రాంగ్ హౌస్!

ఈ ఊళ్ళో ఎక్కడో ఒక ఎక్స్ఛేంజి ఉండి ఉండాలి, ఎక్కడుంది అది? అక్కడ కూర్చుని ఎవరో తీర్థబాబుతో - రాంగ్ నంబర్! రాంగ్ సిటీ! రాంగ్ హౌస్! - అని చెపుతూనే ఉంటాడు. ఎవరిది? ఎవరా కనిపించని ఆపరేటర్? అతను కనిపించ డెందుకని?

ఇలా ఆలోచిస్తూనే తీర్థబాబు, నీళ్ళల్లో రాయి మునిగినట్టు, ఉన్నట్టుండి గాఢనిద్రలోకి జారుతాడు. రాత్రీ పగలూ, సోమవారంనుంచి ఆదివారం వరకూ, ఉదయంనుంచి సాయంకాలం వరకూ ఇదే తంతు. తీర్థబాబుకి రాత్రంటే భయం. నిద్రపోతే అతనికి వరసగా అంతులేనన్ని గోడలు కనిపిస్తూంటాయి.

ఆ గోడలకి దీపంకర్ ఫోటోలు అతికించి ఉంటాయి. నిద్రలోనే తీర్థబాబు 'మళ్ళీ మనోజ్ దగ్గరకెళ్ళాలి లాగుంది!' అని అనుకుంటాడు. మనోజ్ అతని స్నేహితుడు. అతను మానసిక సంబంధమైన రోగాలని నయం చేసే వైద్యుడు. తీర్థబాబు జబ్బుమనిషి అనటంలో సందేహంలేదు.

'నీ ఒంట్లో బాగులేదు, తీర్థా!'

తీర్థబాబు వాడిపోయిన మొహం, బెదురుచూపులూ మాటిమాటికి పట్టిన చెమట అతను తుడుచుకోవటం గమనించి, మనోజ్ అన్నాడు.

"నాకేం జబ్బు?"

"నరాల జబ్బు."

"నా నరాలకేం బాగానే ఉన్నాయే!"

"నీ ఆలోచనలు విచిత్రంగా ఉన్నాయి."

"విచిత్రంగానా?"

"నువ్వన్నమాటలు ఒకసారి విను."

మనోజ్ టేప్‌రికార్డర్ ఆన్ చేశాడు. అతను రోగులు చెప్పిన మాటలు టేప్ చేస్తాడు. తరవాత తాపీగా విని వాళ్ళ సమస్య పరిశీలించి సలహా లిస్తాడు. తీర్థబాబు టేప్‌రికార్డర్ కేసి చూస్తూ మనసులో డబ్బుగురించి లెక్కలు వేస్తున్నాడు. ఉన్నట్టుండి అతనికి బాగా అలిసిపోయి, నీరసించిన గొంతు వినబడింది...

"నా ఇల్లు నాది కాదని అనిపిస్తుంది. నేను రాంగ్ అడ్రస్‌కి వచ్చాను, అందుకే తలుపు తట్టినా ఎవరూ తలుపు తియ్యరు. రోడ్డుమీద నడుస్తుంటే కలకత్తా నగరం ఇంకేదో ఊరులాగ అనిపిస్తుంది. తన ఊర్లోని ఇళ్ళూ, తలుపులూ, బడామైదాన్, మాన్యుమెంట్స్ అన్నీ ఇంకో ఊరికి అప్పగించి కలకత్తా ఎక్కడికో పారిపోయింది. 'ఇట్ ఈజ్ ఎ రాంగ్ సిటీ' అని నాకనిపిస్తుంది. అవసరంలేకపోయినా, నన్ను నేను నమ్మించుకోవాలనుకుని ఒకరోజు నేను కేవడాతల్లాకి వెళ్ళాను. అక్కడ గోడలమీద రాసినది చదవగానే, నేను సరైన చోటికి రాలేదని, నాకు తెలిసిపోయింది. ఆ రాత్రి కలలో ..."

మనోజ్ టేప్ రికార్డర్ ఆపేశాడు. తీర్థబాబువైపు చూసి, 'ఏం కలవచ్చింది, తీర్థా?' అని అడిగాడు.

"చెప్పలేను!"

"ఏం కల, చెప్పు!"

"నన్నడగక మనోజ్! ఆ కల నాకు తరచూ వస్తూంటుంది."

"అందుకే అది నేను తెలుసుకోవటం చాలా అవసరం."

"ఒద్దు మనోజ్!"

"నువ్వు జబ్బుమనిషివి. నీ మనసు బాగులేకపోవడంలో ఆశ్చర్యంలేదు..."

"ఏం? ఎందుకు?"

"మీ అబ్బాయి..."

"మా అబ్బాయా, ఏమిటి?"

"ఇంట్లో లేడు."

"నీకెవరు చెప్పారో నాకు తెలీదు. మా అబ్బాయి దీపంకర్ లక్నో వెళ్ళాడు తన కజిన్ దగ్గరకు. అక్కణ్ణించి పైచదువులకి ఢిల్లీ వెళ్తాడు."

"ఓహ్ గాడ్!"

మనోజ్ చాలా బాధగా చూశాడు, అతని గుండెలోతుల్లోంచి పెద్ద నిట్టూర్పు వచ్చింది. తీర్థకి ఏమయింది? తన స్నేహితులందరిలోకీ మంచివాడూ, నిబ్బరంగా ఉండేవాడూ తీర్థ ఒక్కడే.

మనోజ్ ఒక కాగితంమీద మందుపేరు రాశాడు. ఒక్కక్షణం ఆలోచించి ఆ కాగితాన్ని చించిపారేసి, తీర్థబాబుకి ఒక మందుసీసా ఇచ్చాడు.

"దీన్ని రాత్రి వేసుకో, నిద్ర బాగా పడుతుంది."

"సరే, ఇలాతే."

తీర్థబాబు మందుసీసా పట్టుకుని బైటికి వచ్చాడు. మనోజ్ గుమ్మంవరకూ అతన్ని సాగనంపుతూ, "బోసు మళ్ళీ నీదగ్గరకి రాలేదుకదా?" అని అన్నాడు.

"లేదే, ఎందుకు అలా అడుగుతున్నావ్!"

"నేనే ఒద్దని చెప్పాను."

"వాడిని నా గుమ్మంలోకి మళ్ళీ రానిస్తాననుకుంటున్నావా? ఊరికే ఇంటికొచ్చి సబితతో పోచుకోలు కబుర్లు చెప్తూ కూర్చుంటాడు."

తీర్థబాబు బైటికి వచ్చాడు. ఇది రాత్రా, పగలా? రోడ్డుమీద ఇంతమంది మనుషులేమిటి? ఇక్కడి వీధుల్లో ఎంత రద్దీయో!

"నిర్జనమైన దారి ... మేఘావృతమైన రజని ... జడివాన ... జయసింహ

కత్తికి పదును పెడుతున్నాడు...'' రవీంద్రనాథ్ రాసిన పుస్తకంలోని ఈ వర్ణన తీర్థబాబుకి చాలా ఇష్టం.

దీపంకర్ పుస్తకంలో 'రాజర్షి' అనే పాఠం ఉండేది.

తీర్థబాబుకి తన కళ్ళల్లోంచి నీళ్ళు కారుతున్నట్టనిపించేది.

ఈ కాలంలో పిల్లలు ఎంత దుర్మార్గులైపోయారు! వీళ్ళు తమ తల్లిదండ్రుల ప్రాణాలు తీయడానికైనా సిద్ధమే. తీర్థబాబు మందుసీసాని, అదేదో ఒలింపిక్ జ్వాలలాగ, పైకెత్తి పట్టుకుని వేగంగా నడవటం మొదలుపెట్టాడు.

అవాళ రాత్రి మళ్ళీ తీర్థబాబుకి అదే కల వచ్చింది. చౌరంగీకి రెండువేపులా లక్షలాది జనం నిలబడి ఉన్నారు. అందరూ రాతి బొమ్మల్లాగా, నిశ్చలంగా ఉన్నారు. వీధికి అటూ ఇటూ పెద్దపెద్ద నియోన్ లైట్లు తెల్లని కాంతితో వెలుగుతున్నాయి. వీధిమధ్యలో బోలెడంతా రక్తం నేలమీద పరుచుకునుంది. అక్కడ నిలబడి ఒక స్త్రీ గుండెలు బాదుకుని ఏడుస్తోంది. "ప్రవీర్! ప్రవీర్! ప్రవీర్!" అంటూ విలపిస్తోంది. ఆమె పొడుగాటి జుట్టు విరబోసుకుని ఉంది. ఆమెని చూడగానే, ఆమె పురాణాల్లోని పాత్ర "జనా" అని తీర్థబాబుకి తెలిసిపోయింది.

దూరంగా, ఎక్కడో శిథిలాలలో
ఎడారిలో, శ్మశానంలో
ఇది నువ్వుండ వలసిన చోటుకాదు.
దుర్గమమైన అరణ్యాలలో, మంచుకప్పిన
పర్వతాల వద్దకు పద,
ఈ పాపిష్టి రాజ్యాన్ని వదిలిపద
నీ పతి పుత్ర హంతకుడు, శతృవుల మిత్రుడు.
పద పుత్రశోక తప్తురాలా...

ఆ స్త్రీ రోదనతో ఆకాశం గుండె కూడా పగిలిపోతుందా అనిపిస్తోంది. ఇదే సమయం - తెరదించు. గంట మోగించు. ఎవరా గొంతు చించుకుని అరిచేది? ఇది మహష్మతీపురం కాదని ఎవరన్నారు? వెళ్ళిపొండి!

అప్పుడే తీర్థబాబు అనాలనుకున్నాడు, "షి ఈజ్ ఇన్ ద రాంగ్ సిటీ" అని. కాని సరిగ్గా అప్పుడే గంట మోగుతోంది. గణ గణ గణ గణ...

గంట మోగుతోంది. ఫోన్ మోగుతోంది.

తీర్థబాబు లేచి కూర్చున్నాడు. మనిషి టెలిఫోన్ ఇంట్లో ఎందుకు పెట్టుకుంటాడో! బిల్లు కట్టేటప్పటికి పైప్రాణాలు పైకే పోతాయి!

తీర్థబాబు రిసీవర్ ఎత్తాడు.

'47...9?'

"సరిగ్గా అదే నంబర్ తీర్థబాబు టెలిఫోన్‌మీద రాసి ఉంది. 'నో' అన్నాడు తీర్థబాబు.

"ఇది తీర్థంకర్ చటర్జీ గారిల్లుకాదా?"

"నో!"

"తీర్థబాబూ, నేను బోసుని మాట్లాడుతున్నాను! అవాళ మీకు చెప్పానుకదా? దూరంగా రైల్వేలైన్ పక్కన ఉండే ఇంట్లో, అవును, దీపంకర్ శవం ... డైడ్ ఆఫ్ ఇంజరీస్! మీరు రాలేదేం? బాడీ హేజ్ బీన్ క్రిమేటెడ్. హలో, వింటున్నారా?"

"నో!"

"ఇది తీర్థంకర్ చటర్జీగారిల్లు కాదా?"

"కాదు."

"మీ ఫోన్ నెంబరు 7...9 కాదా?"

"కాదు, కాదు. రాంగ్ నంబర్. 7...9 కాదా?"

తీర్థబాబు ఫోన్ పెట్టేశాడు. ఒక్కక్షణం ఏదో ఆలోచించి, రిసీవర్ తీసి కింద పెట్టాడు. వెళ్ళి పక్కమీద పడుకున్నాడు. మళ్ళీ కల వస్తుంది. ఎలాగైనా సరే ఇంకొక్కసారి ఆ కల మళ్ళీ కనాలి. కల పూర్తిగా కన్నాకే, ఉన్మాదస్థితిలో ఉన్న 'జనా' రాంగ్ సిటీనించి ఎలా బైటపడిందో తెలుస్తుంది. కలలు తప్ప తీర్థబాబు దగ్గర ఇప్పుడింకేమీ మిగలలేదు. మెలకువగా ఉండి కలకత్తా వీధుల్లో ఎంతసేపు తిరిగినా, అక్కడనుంచి పారిపోయేమార్గం అతను కనుక్కోలేడు. ఇప్పుడిక 'జనా' వెనకాలే తనూ వెళ్ళాలి. ప్రవీర్ చనిపోయాక జనమంతా ప్రవీర్ తండ్రితో కలిసి విజయోత్సవం జరుపుకుంటూండగా, 'జనా' పారిపోయింది.

తీర్థబాబుకి నిద్రముంచుకొచ్చింది.

# వేట

ఆ ప్రాంతం గోమో-డాల్టన్‌గంజ్ లైన్‌కిందికొస్తుంది. ఒకప్పుడు ఈ స్టేషన్‌లో రైలు ఆగేది. బహుశా అక్కడ రైలు ఆగటంవల్ల అయే ఖర్చు రైల్వేవారికి ఎక్కువనిపించిందేమో! అందుకే స్టేషన్‌లోనూ, అక్కడ పనిచేసేవాళ్ళ క్వార్టర్లలోనూ, కూలీల బస్తీలోనూ ఎవరూ ఉండటంలేదు. అక్కడక్కడ ఆవులూ, ఎడ్లూ, మేకలూ తిరుగుతూ కనిపిస్తాయి. వీధిలో ఒక పలకమీద 'కురుడా అవుట్ స్టేషన్ ఎబాన్‌డన్డ్' అని రాసి ఉంది. అక్కడికి రాగానే రైలు వేగం తగ్గుతుంది. ఆయాసపడుతూ ఎత్తు ఎక్కుతుంది. ఇక్కణ్ణించి రైలు నెమ్మది నెమ్మదిగా కురుడా కొండమీది కెక్కుతుంది. కొండ వాలుగా ఉంది. కొంతదూరం వెళ్ళాక రైలు ఒక సొరంగంలోకి ప్రవేశిస్తుంది. ఈ సొరంగం పొడుగు అరమైలు. ఈ సొరంగం రెండుమూలలవద్దా డైనమైటుతో పేల్చిన రాళ్ళ గుట్టలున్నాయి. కొండమీద వెదురుపొదలు దట్టంగా పెరిగాయి. రైలు వెళ్తున్నప్పుడు విసురుగా గాలివీస్తే వంగిన వెదురు కొమ్మలు రైలుమీద టపటపా కొట్టుకుంటాయి. ఆ తరవాత రైలు కిందికి దిగటం మొదలుపెడుతుంది. అప్పుడు దాని వేగం పెరుగుతుంది. ఆ తరువాతి స్టేషన్ తోహరీ. అది ఈ ప్రాంతాల ఉన్న స్టేషన్లలోకెల్లా ఎక్కువ సందడిగా ఉండే స్టేషన్. చాలా రోడ్‌వేస్‌కి అది జంక్షను. తోహరీలో కోల్ హాల్ట్ కూడా ఉంది. ఇక్కడ రైల్లో బొగ్గు ఎక్కిస్తారు. నాలుగువేపులా సర్ఫేస్ కోలియరీ ఉంది. ఈ ప్రాంతాల నేలమీద తక్కువరకం బొగ్గు దొరుకుతుంది. తోహరీలో కలప వ్యాపారంచేసే కంట్రాక్టర్ల ఇళ్ళల్లో లక్ష్మి వెలిసింది. ఇక్కడ టేకుచెట్లు విరివిగా పెరుగుతాయి. ట్రక్కులమీద రాత్రనక పగలనక టేకు మానులు వస్తూనే ఉంటాయి. కలప కార్ఖానాల్లో వీటిని కోస్తారు. ఆ తరవాత మళ్ళీ వీటిని ట్రక్కుల్లోకి ఎక్కించి వేర్వేరు ప్రాంతాలకి పంపిస్తారు. కురుడాలో ఎంత స్తబ్ధత ఉంటుందో తోహరీలో అంత కోలాహలంగా ఉంటుంది - అది చూడవలసిందే!

దూరంగా వున్న గ్రామాల్లోంచి చూస్తే కొండకొసన వెళ్ళే రైలు బలే బాగుంటుంది. గ్రామస్తులు ఈ దృశ్యాన్ని రోజూ చూస్తారు, అయినా వాళ్ళకది

వింతగానే కనిపిస్తుంది. రైలు వెళ్తోంది, ఆగకుండా వెళ్తోంది, ఇంజను రొప్పుతోంది. సారంగం రైలుని మింగుతోంది. పరిగెత్తి ముందుకెళ్ళి చూస్తే సారంగంలోంచి రైలు బైటికి రావటం కనిపిస్తుంది. కొండకొసన ఒకసారి ఏనుగులు కూడా కనిపించాయి. వెదురు రెమ్మలు తింటూ నిలబడి ఉన్నాయి. దూరంనుంచి అవి బొమ్మల్లా కనిపించాయి. రైలు దగ్గరకి రాగానే తొండాలు పైకెత్తి ఘీంకరించి పారిపోయేవి.

కురుడా గ్రామం స్టేషన్‌కి చాలా దూరంలో ఉంది. రెండు కొండలూ, ఒక మైదానమూ దాటితేగాని అక్కడికి చేరుకోలేము. గ్రామం దగ్గర్లో ఉంటే బహుశా జనం స్టేషన్ దగ్గరున్న సిమెంటు ఇళ్ళల్లో ఉండేవారు.

కురుడాలాంటి గ్రామాల్లో ఉండేవాళ్ళ జీవితాల్లో సంవత్సరానికి ఒకటి రెండుసార్లు వచ్చే వ్రతాలూ, పండగలప్పుడు తప్ప ఏ విధమైన మార్పూ, వినోదమూ ఉండదు. అందుకే కురుడా కొండపైన కనిపించే దృశ్యాలు వాళ్ళని అంతగా ఆకర్షిస్తాయి.

మేరీ ఓరాంవ్ స్టేషన్ దగ్గరకొచ్చి నిలబడినప్పుడు ఆమె రైలుని ఎంత విచిత్రంగా చూస్తుందో, రైల్లో ఉండే వాళ్ళు కూడా ఆమె కనిపిస్తే, అంత విచిత్రంగానూ చూస్తారు. వయసు పద్దెనిమిది, ఒడ్డూ పొడుగూ ఉన్న పిల్ల, చప్పిడి మూతి, చప్పిడి ముక్కు, ఒంటి రంగు రాగిలాగ మెరుస్తూ ఉంటుంది. సాధారణంగా ఆమె అద్దకం చీరలే కడుతుంది. దూరంనుంచి చూస్తే చాలా అందంగా కనిపిస్తుంది. కాని దగ్గరకెళ్తే ఆమె కళ్ళల్లో ఒక రకమైన కఠోరమైన విద్రోహభావం కనిపిస్తుంది.

చూడటానికి ఆమె గిరిజనుల పిల్లలాగుండదు, కాని ఆమె ఆదివాసే! మునుపెప్పుడో కురుడాలో తెల్లదొరలకి టింబర్-ప్లాంటేషన్ ఉండేది. డిక్సన్‌గారి బంగళా, ఇల్లూ మేరీ వాళ్ళమ్మ చూసుకునేది. డిక్సన్‌గారి కొడుకు 1959లో వచ్చి ఇల్లూ, భూములూ అన్నీ అమ్మేసి వెళ్ళిపోయాడు. పోతూ పోతూ భిఖనీ కడుపులో మేరీని వదిలి మరీ వెళ్ళాడు. అతను ఆస్ట్రేలియా వెళ్ళిపోయాడు. పుట్టిన తర్వాత మేరీ నామకరణం చర్చిలోని మతాధికారి చేశాడు. అప్పట్లో భిఖనీ క్రిస్టియన్. ఆ తరవాత రాంచీనుంచి ప్రసాద్‌గారు డిక్సన్ బంగళాలోకి మారినప్పుడు ఆయన భిఖనీని పనిలోంచి తీసేయటానికి ఒప్పుకోలేదు. అప్పుడు భిఖనీ క్రిస్టియన్ మతాన్ని ఒదులుకుంది. మేరీ ప్రసాదుగారి గొడ్లని మేపేది. ఈ పని ఆ పిల్ల చాలా బాగా చేసేది. ఇదికాక ప్రసాదుగారి తోటలో పండే సీతాఫలాల్నీ, జామపళ్ళనీ కొనడానికి

వచ్చేవాళ్ళతో గట్టిగా బేరాలు చేసేది. మళ్ళల్లో కాసిన కూరగాయల్ని రైల్లో తోహరీ తీసుకెళ్ళి అమ్మేది.

ప్రసాదుగారు చాలా అదృష్టవంతుడని అందరూ అంటారు. భిఖనీకి ఆయన నెలజీతం ఇచ్చేవాడు. మేరీకి తిండీ, ఉండటానికి చోటుకాక బట్టలు కూడా కొనిచ్చేవాడు. డిక్సన్‌గారి బంగళా విదేశీయులు ఉండటానికి కట్టినది. వాళ్ళున్నప్పుడు ఆయా, పనివాళ్ళూ, సిపాయిలూ అంతా కలిసి పన్నెండుమంది ఉండేవాళ్ళు. ప్రసాదుగారి హయాంలో అంత పెద్ద బంగళానీ మేరీ ఒక్కత్తే శుభ్రం చేసి, అద్దంలా ఉంచుతుంది.

తోహరీ బజారులో మేరీ భక్తులు లెక్కపెట్టలేనంతమంది ఉన్నారు. స్టేషన్‌లో ఆమె రాణీలాగ దిగుతుంది. బజారులో ఆమెకని ఒక చోటు ఉంది. అక్కడకెళ్ళి కూర్చుంటుంది. కొనడానికొచ్చినవాళ్ళ చేతుల్లోని బీడీలు లాక్కుంటుంది. వాళ్ళ డబ్బుతో టీలు కిళ్ళీలు లాగించేస్తుంది. కాని ఎవర్నీ ముట్టుకోనివ్వదు. బజార్లోని పెద్దరౌడీ జాలిమ్ ఆమె ప్రియుడు. వీళ్ళిద్దర్లో ఎవరిదగ్గరైనా నూరు రూపాయలు వచ్చిన వెంటనే వాళ్ళు పెళ్ళి చేసుకుంటారు.

ఓరాంవ్ తల్లికి పుట్టినా మేరీ గిరిజనుల పిల్లలాగ ఉండదు. మనిషి చాలా పొడుగు, అందుకే ఆమెకి తన జాతి కుర్రాడెవరూ పనికిరాలేదు. గిరిజనుల కుర్రాళ్ళకి మేరీ ఒంటిరంగు పెద్ద అడ్డుగోడ అయింది. పెళ్ళి చేసుకుంటానని మాటిచ్చాకే మేరీ జాలిమ్‌ని తన దరిదాపులకి రానిచ్చింది.

ప్రసాదుగారి పెళ్ళాం మేరీకోసం సంబంధం చూసింది. వాళ్ళ తోటమాలి కొడుకు. ఆవిడ మేరీతో, ''నువ్వు ఇక్కడే ఉందువుగాని'' అంది.

భిఖనీ ఒప్పుకుంది. కాని మేరీ, ''అమ్మగారు వాళ్ళింట్లో పని నేను చేస్తానని నన్నిక్కడే బంధించి ఉంచుదామనుకుంటోంది, మొద్దూ!'' అంది.

''ఇల్లిస్తారే!''

''గుడిసె!''

''కుర్రవాడు మంచివాడు.''

''ఒద్దు! గుడిసెలో ఉండాలి. సరైన తిండి ఉండదు. మొగుడు తాగుతాడు. నూనె, సబ్బు ఉండవు. కట్టుకోటానికి మంచి బట్టలుండవు. అలాటి బతుకు నాకొద్దు.'' మేరీ ఒప్పుకోలేదు.

ఊళ్ళో మేరీ అంటే అందరూ ఇష్టపడతారు. చాలామంది స్నేహితురాళ్ళు ఉన్నారు. పండగలప్పుడు ఆ పిల్ల అద్భుతంగా నాట్యం చేస్తుంది. కాని తనకి మిగతా ఆడపిల్లల్లాగ బతకాలని లేదు.

చాలాసార్లు చాలామంది ఆమె ప్రేమను పొందాలని చూశారు. మేరీ వాళ్ళకి కొడవలి చూపించింది. వాళ్ళు ఊళ్ళోవాళ్ళు కాదు. భిఖనీకి జరిగినట్టు వాళ్ళు కూడా మేరీకి కడుపుచేసి పారిపోరని ఏమిటి హామీ?

ఒకసారి ఆమె గురించి తోహరీ బజారులో పెద్ద పోట్లాట అయింది. ట్రక్ డ్రయివర్ రతన్‌సింగ్ తాగేసి మేరీని లాక్కుపోవటానికి ప్రయత్నించాడు. అదే సమయానికి జాలిమ్ వచ్చాడు. అతను అడ్డం పడేసరికి పెద్ద కొట్లాట జరిగింది. ఆ తరవాత మేరీ కూరలూ, వేరుశెనక్కాయలూ, మొక్కజొన్న కండెలూ అమ్మేటప్పుడు జాలిమ్ ఆమె పక్కనే కూర్చునేవాడు. ఆమె ఎన్నడూ జాలిమ్ గదికి వెళ్ళలేదు. ముందు పెళ్ళి అవాలి. జాలిమ్‌కి మేరీ అంటే చాలా గౌరవం. ఎందుకుండదు? మేరీ చాలా నిజాయితీగల మనిషి, ఆస్ట్రేలియన్ రక్తం తాలూకు ధైర్యం కూడా ఉంది. కానీ మేరీ మనసులో ఒకమూల ఏదో అపనమ్మకం. జాలిమ్‌ని కూడా ఆమె పూర్తిగా నమ్మదు. నూరురూపాయలు కూడగానే వాళ్ళిద్దరూ పెళ్ళిచేసుకుంటారని తోహరీ బజారులో అందరికీ తెలుసు. ఆ డబ్బు తనొక్కడే సంపాదిస్తానని జాలిమ్ అంటాడు. మేరీ తనవంతు ఏమైనా తీసుకొస్తే మంచిదే, ఒద్దనడు. అందుకే డబ్బు సంపాదించేపని మేరీ అతనికే వదిలేసింది. జాలిమ్‌కి ఇది అంత తేలికైన పనికాదు. గ్రామంలో అతని అమ్మా నాన్నా ఉన్నారు, తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ ఉన్నారు. అక్కడ గది అద్దెకు తీసుకోవాలి, గిన్నెలూ, ముంతలూ కొనాలి. ఇదంతా అతనివల్ల అవదు. ఇదికాక మేరీకి బట్టలు కొనాలి, సబ్బులూ, నూనెలూ కొనాలి.

మొట్టమొదట మేరీయే జాలిమ్‌కి ఒక కానుక ఇచ్చింది - నూలు బనియన్ - రంగుది.

"నువ్వు ఇస్తున్నావా?" జాలిమ్ ఆనందంగా అడిగాడు.

"లేదు, మీ వొదినెగారు పంపింది!"

ఆ తరువాత జాలిమ్ కూడా అడపాతడపా ఆమెకి ఏదో ఒకటి ఇస్తూ వచ్చాడు. మేరీ ఆ వస్తువులన్నీ - చీర, జాకెట్టు, అన్నీ పెళ్ళయ్యాక కట్టుకోటానికి దాచుకుంది.

డబ్బు కూడబెట్టటానికి జాలిమ్ ఎంత కష్టపడుతున్నాడో మేరీకి తెలుసు. తెలిసినా మేరీ ఏమీ అనదు. వందకాదుగాని తొంభైరెండు రూపాయలు తను కూడబెట్టింది.

ఆ డబ్బు తను స్వంతంగా సంపాదించుకుంది. ప్రసాదుగారింట్లో పనిచేస్తే వచ్చిన డబ్బు. గవర్నమెంటు రూలు ప్రకారం ఆ అడివి ప్రాంతంలో ఎవరింట్లోనైనా ఇప్పచెట్టు ఉంటే ఆ చెట్టుకి కాసేపళ్ళు ఆ ఇంటివాళ్ళు వాడుకోవచ్చు. ఇప్పచెట్లు కేష్ క్రాప్. వాటి పువ్వులతో ఇప్పసారా తయారవుతుంది. ఇప్పగింజలతో బట్టలుతికే నల్ల సబ్బు తయారవుతుంది. ప్రసాదుగారింట్లో నాలుగు ఇప్పచెట్లున్నాయి. వాటి పళ్ళు ఏరటం మేరీపని. పరిహాసానికి కూడా ఆ పళ్ళని ఇంకెవ్వరూ ముట్టుకోటానికి వీల్లేదు. మేరీ వెంటనే కొడవలితో బెదిరిస్తుంది. ఆ పళ్ళు ఆమెవి. ఆ పళ్ళకోసమే ఆమె ప్రసాదుగారి దగ్గర జీతంకూడా అడక్కుండా చాకిరీ చేస్తోంది.

ప్రసాదుగారి పెళ్ళానికి మేరీ వ్యవహారం నచ్చలేదు. కాని లఛ్మన్ ప్రసాదు "ఇప్పచెట్లవేపు చూడకు. నీ ఇంత పెద్ద బంగళాని శుభ్రంగా ఉంచటానికీ, గొడ్లని మేపటానికీ, తోహరీ వెళ్ళి కూరలూ, పళ్ళూ, వేరుశనక్కాయలూ అవీ మంచి ధరకి అమ్మిపెట్టటానికీ నీకు మనిషి దొరుకుతాడా?" అన్నాడు.

మేరీ బండచాకిరీ చేస్తుంది, కాని ప్రసాదుగారితో సన్నిహితంగా ఉండదు.

"ఏమ్ మేరీ, ఇప్పపళ్ళమ్మి ఎంత సంపాదించుకున్నావ్?"

"మీకెందుకు?"

"ఒకపని చెయ్యి, వడ్డీ వ్యాపారం మొదలుపెట్టు. బోలెడంత వడ్డీ సంపాదించుకోవచ్చు."

"సరే, మీరు చెప్పినట్టే చేస్తాను."

"చూడూ, నేనే కదా నిన్ను ఇప్పపళ్ళు ఏరుకోనిస్తున్నాను! నిజానికి ఇది గవర్నమెంటు వాళ్ళది. నేను వీటిని ఏరటానికి ఇంకో పనివాణ్ణికూడా పెట్టుకుని ఉండవచ్చు. కాని అలా చెయ్యటంలేదే?"

"పనివాణ్ణి పెట్టి చూడండి. నాదగ్గర కొడవలి ఉంది. వాడిపనిపడతాను."

ప్రసాదుగారు తలాడిస్తూ తనలో తాను, "అవును! పొగరుండదూ మరి! ఎంతైనా విదేశీరక్తం!" అనుకున్నాడు.

ప్రసాదుగారి పెళ్ళాం మేరీచేత తలకి నూనె రాయించుకుంటుంది, ఒళ్ళు

పట్టించుకుంటుంది. కొవ్వుతో లావెక్కిన తన ఒంటినీ మేరీ అంగసౌష్టవాన్నీ పోల్చి చూసుకుంటుంది.

"ఏమే, పెళ్ళికి ఇంకా ఎన్నాళ్ళుంది? జాలిమ్ ఏమంటున్నాడు?"

"పేదోళ్ళమాటలు మీకెందుకులెండి? మీరేవన్నా మా పెళ్ళి చేయిస్తారా?"

"రామ-రామ, తురకవాడితో పెళ్ళా? నేను చేయిస్తానా?"

"ఏం? ఆ తురకవాడు చేసుకుంటానంటున్నాడుగా? మీ తమ్ముడు నన్ను ఉంచుకుంటానన్నాడే!"

చెప్పుతో కొట్టినట్టు అది అన్నమాటకి ఆవిడ నోరుమూసుకుంది. ఈ పిల్ల బండచాకిరీ చేస్తుంది. అర్థమణుగు బరువున్న బస్తా మోసుకుని రైల్లో వెళ్ళి అమ్ముకొస్తుంది. అరగంటలో ఇంత పెద్ద బంగళాని సర్దిపెడుతుంది, అది మాటంటే పడక తప్పదు!

మేరీ అంటే అందరికీ భయమే. మేరీది మంచి ఆరోగ్యం, క్షణం కూర్చోకుండా పని చెయ్యగలదు. పదునైన కత్తిలాంటి తెలివిగలది. ఈ గుణాలవల్లే ఇంటెడు చాకిరీ చేసుకుని పోతుంది. ఆవులూ గేదెలూ మేపటానికి తీసుకెళ్ళినప్పుడు వేయించిన జొన్నగింజలే దానికి లంచ్. తనచేత్తో పళ్ళు తెంపి కూరలమ్మేవాళ్ళకి ఇస్తుంది. పక్షులూ, కోతులూ సగంతిని వదిలేసిన పళ్ళు మూటగట్టి వాళ్ళమ్మ పెంచుతున్న కోళ్ళకి పెడుతుంది. వాన కురిశాక మొలకెత్తిన మొక్కల్ని తీసి విడిగా నాటుతుంది. అన్నీ జాగ్రత్తగా కనిపెట్టుకుని ఉంటుంది. ప్రసాదుగారి సంసారానికి కావల్సిన బియ్యం, పప్పులూ, నూనె, నెయ్యి, మసాలా దినుసులూ, అన్నీ తోహరీ బజారునుంచి కొనుక్కొస్తుంది. "అమ్మగారూ, మీరు కొనే వస్తువులమీద ఏడాదికి నేనెంత ఆదాచేస్తున్నానో తెలుసా? నా బేరాలవల్ల మీకెంత లాభం వస్తోందో మీకు తెలుసా? అలాంటప్పుడు చవకచీర ఎందుకు తీసుకుంటాను? మంచి బట్టలూ, సబ్బులూ, నూనెలూ వాడతాను. అవన్నీ నాకు మీరే ఇవ్వాలి" అంది.

దానితో పడలేక చివరికి ఇంటావిడ మేరీకి మంచి బట్టలు కట్టబెడుతుంది.

అప్పుడప్పుడూ అది పోచుకోలు కబుర్లు చెప్పుకోటానికి గ్రామానికి వెళ్తుంది. అక్కడ తన పొట్టకి బట్టలు చుట్టుకుని ప్రసాదుగారి పెళ్ళాంలాగా, లేకపోతే కుంటుతూ నడిచి ప్రసాదుగారిలాగా వాళ్ళని అనుకరించి చూసేవాళ్ళని నవ్విస్తుంది.

అక్కడికెళ్తే ఆమె పూర్తిగా మారిపోతుంది. గ్రామంలోని యువకులు ఆమెని

ఆటపట్టించటానికి, "తురకాడి పెళ్ళాం ఇక్కడ ఉందేం?" అంటారు.

అప్పుడు ఆమె "మీలో ఎవరో ఒకరు నన్ను పెళ్ళి చేసుకోలేదేం?" అని అడుగుతుంది.

"నువ్వే మాలో ఎవ్వరినీ పెళ్ళి చేసుకుంటాననలేదు."

"నాలాగా పొడుగ్గా తెల్లగా నువ్వు లేవుకదా?"

"నువ్వు దొరబాబు కూతురివి!"

"హుఁ! గొప్ప దొరబాబు! ఆడదానికి కడుపుచేసి జారుకున్నాడు. పిరికిపంద! మా అమ్మకూడా తక్కువ తినలేదు. తెల్లవాడి పోలికలో నేను పుట్టగానే నా పీకనొక్కి చంపెయ్యాల్సింది. అప్పుడింత గొడవే ఉండేదేకాదు."

"చంపేస్తే నువ్వేం అయేదానివి?"

"అప్పుడు నేను ఉండేదాన్ని కాదుగా?"

"సరే, పిచ్చిమాటలు ఆపు. తురకదానివి అవాలంటే అవు. కాని అయేముందు ఒక రోజు మాకు..."

"ఏమిటీ?"

"అన్నం, కోడికూర, మేకమాంసం, తాగటానికి సారాయి ఇవ్వాలి."

ఇస్తాను, తప్పక ఇస్తాను. ఇంతకుముందు ఇవ్వలేదా, చెప్పండి?"

మేరీ తన గ్రామంలో ఉన్న యువతీ యువకులకి ఎప్పుడూ మంచి మంచి పదార్థాలు తినిపిస్తూనే ఉంది. ప్రసాదుగారికి లాభం రావాలని మణుగులకొద్దీ బరువులు మోసే మేరీ, ఒక్కొక్క పండు ధర గురించీ గంటలు గంటలు బేరాలు చేసే మేరీ, వేరుశెనగ గింజకూడా ఎవ్వరికీ ఊరికే ఇవ్వని మేరీ, తన స్నేహితులకోసం ప్రసాదుగారింటినించి వేరుశెనగనూనె, గోధుమపిండి, బెల్లం, ఉప్పు, మసాలా దినుసులూ దొంగిలించి తీసుకువస్తుంది.

ఎవరో ఒకరింట్లో మట్టిపొయ్యి రాజేసి వండుకుని అందరూ కలిసి కూర్చుని తింటారు. వాళ్ళకి మేరీ జాలిమ్‌ని పెళ్ళి చేసుకుంటుందని తెలుసు. మేరీ ఓరాంవ్‌ల పిల్ల అయి వుండి, ఆ పిల్ల తండ్రి సోమరా, బుధనా మంగలా ఓరాంవ్ అయి ఉంటే ఈ పెళ్ళికి ఒప్పుకునేవాళ్ళు కాదని కూడా తెలుసు. తెల్లవాడికి పుట్టిన పిల్ల అవటంవల్ల ఓరాంవ్‌లు మేరీని తమ రక్తం అనుకోరు. అందువల్ల వాళ్ళ సమాజానికున్న కట్టుబాట్లు ఆమెకి వర్తించవు.

ఒకవేళ వాళ్ళు అడ్డుపడినా ఆమె ఎదురుతిరుగుతుంది. వాళ్ళు అడ్డు చెప్పటంలేదే అని ఆమె బాధపడుతుంది. తనుకూడా ఓరాంవ్ సమాజానికి చెందాలన్న కోరిక ఆమె మనసులో ఏమూలో ఉంది. పదమూడు పధ్నాలుగేళ్ళ వయసులో ఎవరైనా ధైర్యం ఉన్న ఓరాంవ్ కుర్రాడు సాహసించి ఆమెను ఎత్తుకుపోయి పెళ్ళి చేసుకుని ఉంటే ఆమె చాలా సంతోషించేది. మేరీ తోహరీ బజారుకెళ్ళినప్పుడు రెండు మూడు హిందీ సినిమాలు చూసింది. పంటకోతలప్పుడు తోహరీకి సినిమాలు చూపించే వాళ్ళొస్తారు. వాళ్ళు ఊరంతా తిరిగి సినిమాలు చూపిస్తారు. మైదానంలో తెరకట్టి సినిమా వేస్తారు. కురుడా గ్రామంలోని ఆడపిల్లల మాట అటుంచి మొగపిల్లలు కూడా ఎప్పుడూ సినిమా చూడలేదు. సినిమాలేదు, మంచి బట్టలు లేవు, కడుపునిండా తిండిలేదు. అప్పుడప్పుడు మేరీకి వాళ్ళని చూస్తే జాలివేసేది.

మేరీ జీవితం ఇలాగే గడుస్తూ వచ్చింది. ఉన్నట్టుండి ఒకరోజు రైల్లోంచి ప్రసాదుగారి కొడుకుతోపాటు ఒక కంట్రాక్టరు దిగాడు. అతని పేరు తహసీల్‌దార్‌సింగ్. ఆ తరవాత మేరీ బతుకులో పెద్ద అడ్డంకి వచ్చింది. కురుడాలోని ప్రశాంతంగా, బీదగా బతుకుతున్నవాళ్ళ జీవితాల్లో తుఫాను వచ్చింది.

## రెండు

ప్రసాదుగారి బంగళాను ఆనుకుని డెబ్భై అయిదు ఎకరాల భూమి ఉంది. ఈ ప్రాంతాల సీలింగ్ అనేదిలేదు. దూరంలో ఉన్న టింబర్ ప్లాంటర్ల బంగళాల పక్కనే ఇలాగే పెద్ద పెద్ద భూములు ఉన్నాయి. డిక్సన్ ఏభై ఎకరాల్లో టేకుచెట్లు నాటాడు. ఈ ప్రదేశంలో టేకుచెట్లు చాలా ఏపుగా పెరుగుతాయి. అతను వేసిన చెట్లు చాలా పెద్దవిగా, లావుగా పెరిగాయి. వాటిని పడగొట్టి కలపగా మార్చడానికి అనువుగా ఉన్నాయి. టేకుచెట్లు లేకపోతే ఈ నేలలో ఏమేమి పండించి ఉండవచ్చో అని ప్రసాదుగారు అప్పుడప్పుడూ ఆలోచించేవారు. ఈ టేకుచెట్లు ధర తెలుసుకున్నాక వీటిని వీలైనంత ఎక్కువ ధరకి ఎలా అమ్మాలా అన్నదే ఆయన లక్ష్యం. ఆయన ఉద్దేశం విని అక్కడి అడివి యజమాని లాల్‌చంద్, ములనిజ్ చాలా ఆనందించారు. ప్రసాదుగారి అబ్బాయి బన్‌వారీ కూడా రంగంలోకి దిగి డాల్టన్‌గంజ్‌లో గాలం వేశాడు. ఆ గాలానికి చిక్కుకుని కంట్రాక్టర్ తహసీల్దార్‌సింగ్ అక్కడకి వచ్చాడు.

రాగానే తహసీల్దార్‌సింగ్ కొట్టవలసిన చెట్లని చూసుకున్నాడు. ఆ తరవాత బేర-సారాలు జరిగాయి. ప్రసాద్‌గారు, "ఇంత మంచి చెట్లని మీరడిగే ధరకి ఎవరైనా అమ్ముతారా?" అన్నాడు.

"ఎందుకు అమ్మటం? మీకు లాభం దొరికినచోటే ఇయ్యండి."

"కొంచెం ఆలోచించి సరైన ధర చెప్పండి."

"ప్రసాదుగారూ, బన్‌వారీ నా ప్రాణమిత్రుడు. ఛిపాడీర్‌లో అతను ఉద్యోగం చేస్తున్నాడు. నేను కంట్రాక్టర్‌గా ఉంటున్నాను. అబద్ధం చెప్పటంలేదు. చెట్లు పూర్తిగా మెచ్యూర్‌గా ఉన్నాయి. కర్రకూడా గట్టిగా ఉంది."

"వీటిని తెల్లదొరలు నాటివెళ్ళారు."

"అవుననుకోండి. అయినా ఇక్కడ ముందు చెట్లని కొట్టాలి, ఆ తరవాత వాటిని కొయ్యాలి. ట్రక్కులు ఇక్కడిదాకా రావు. ఇంగ్లీషువాళ్ళ కాలం కాదుకదా, ఫారెస్ట్ డిపార్టుమెంటు వాళ్ళ ఏనుగులు వచ్చి ఈ దుంగల్ని తోహరీదాకా లాక్కుపోవు. నేను వీటిని మురహాయీదాకా తీసుకుపోవాలి. మట్టిరోడ్డులో ట్రక్ చక్రాలు కూరుకుపోతాయి. ముందుగా మట్టిరోడ్లకి అడ్డంగా పెరిగిన చెట్లని కొట్టించాలి. నాకెంత ఖర్చవుతుందో చెప్పండి?"

"లాభం కూడా సంపాదించుకుంటారు కదా?"

"తప్పకుండా, లాభంలేకుండా ఎవరైనా ఏ పనైనా చేస్తారా? కానీ మీకొచ్చే లాభమే ఎక్కువ. కారుచౌకగా మీరు బంగళా కొన్నారు, దానితోపాటు టేకుచెట్లు ఉచితంగా దొరికాయి. మీకు దొరికిందంతా లాభమేగా. ఎందుకంటే మీరు ఏమీ ఇన్వెస్ట్ చెయ్యలేదు కదా! పనివాళ్ళు కోసుకుపోవటానికీ, జంతువులు జొరబడి తినడానికీ ఇదేం జొన్నపంటకాదు. సీతాఫలాలూ, జామపళ్ళూ కావు, పక్షులు కొట్టిపారేస్తాయన్న భయంలేదు. ఫారెస్ట్ ఏరియా టేకుచెట్లు ఏపుగా పెరిగి ఉన్నాయి. వెంటనే అమ్మేసి డబ్బు చేసుకోండి."

లాల్‌చందూ, ములనిజీ వంతపాడారు, "మరీ అంత మొండిగా బేరం చెయ్యకయ్యా. ఇతను వెళ్ళిపోతే ఏం చేస్తావు? గాలివీస్తే టేకుచెట్లు సముద్రంలా ఘోషపెడతాయి. అది వింటూ ఉంటావా? పువ్వులు పూస్తుంది కాని కాయదు. ఆ పువ్వుల అందం చూస్తూ కూర్చుంటావా? కంట్రాక్టర్ కొంటానని వచ్చాడు, అమ్మేయ్, ఊరికే గొడవపడక" అని అన్నారు.

కంట్రాక్టర్‌కి కావలసినదదే! తెల్లవాళ్ళు ఎంతమంచి చెట్లు నాటి వెళ్ళారో, ఎత్తుచూస్తే ఆకాశాన్నంటుతోంది! మాన్లు రైలు ఇంజన్లంత లావున్నాయి. ఉత్త ప్రసాదుగారి చెట్లు అనే ఏమిటి? ఈ ప్రదేశంలోని చెట్లన్నీ తనే కొనేస్తాడు.

"ఇంకో ఐదు-ఆరేళ్ళకి కొత్త చెట్లు తయారవుతాయి, అవి తనే కొంటాడు. ఈ పని వెంటనే చెయ్యాలి. ఈ ఏరియా ఇప్పటివరకూ వర్జిన్ ఏరియా. ఇక్కడ చెట్లుకొట్టే మోనోపలీ తనే తీసుకుంటాడు.

బేరం కుదిరింది. చెట్లనికొట్టి కలపను తరలించటానికి చాలా ఖర్చు అవుతుందని కంట్రాక్టర్ చెప్పిన మాటలన్నీ అబద్ధాలని ఆ తరవాత ప్రసాదుగారికి తెలిసింది. ట్రక్కులు మురహాయీ దాటి దాదాపు కురుడా వరకూ వచ్చాయని తెలిసింది. అటువైపు రాతినేల ఎగుడుదిగుళ్ళు లేకుండా ఉంది. ట్రక్కులు రావటానికి ఎటువంటి ఇబ్బందీ కలగలేదు. అక్కడే కంట్రాక్టర్ తన డేరా వేశాడు. చెట్లని కొట్టటానికి ఇద్దరు సిద్ధహస్తులు వచ్చారు. కంట్రాక్టర్ ఆ తరవాత పనివాళ్ళని పిలిపించాడు. కురుడా, మురహాయీ, సిహో, ఖాపారీ, ధూమా చినడోహాలో ఉన్న ఓరాంవ్ జాతి ఆడా మగా అంతా పనిలోకి వచ్చారు. వాళ్ళు ఇంట్లో కూర్చుని డబ్బు సంపాదించవచ్చన్న మాటని నమ్మలేకపోయారు. చెట్లు కొట్టేవారు వేరు, చిన్న చిన్న కొమ్మలూ ఆకులూ తీసిపారేశాక, చెట్టు దుంగల్ని ముక్కలుగా చేసి ట్రక్కుల్లోకి ఎక్కించాలి. మొగకూలీకి రోజుకి పన్నెండణాలు, ఆడవాళ్ళకి ఎనిమిదణాలు కూలీ. మధ్యాన్నం టిఫెన్‌కి జొన్నల సంకటీ, ఉప్పు, పచ్చిమిరపకాయ. ఇదంతా ఏదో కలలాగ ఉంది. గ్రామపెద్ద, ఊళ్ళోని వయసుమళ్ళిన పెద్దలూ మగవాళ్ళనీ ఆడవాళ్ళని వెంటపెట్టుకొస్తారు. వారానికొకసారి ప్రతి గ్రామానికీ ఒక బస్తాడు ఉప్పు దొరుకుతుంది. గ్రామంలోని పెద్దవాళ్ళు సందేహం వెలిబుచ్చారు, "ఆడవాళ్ళు పనిచేస్తే వాళ్ళ మర్యాదకి భంగం రాదుకదా?"

కంట్రాక్టరు, "అందరూ తల్లీ-చెల్లిలాంటివారు. ఎవరైనా గడబిడ చేస్తే వెంటనే తరిమేస్తాం" అన్నాడు.

ట్రక్కులవేగం, కంట్రాక్టర్ మాటలజోరు, పనిచేసే తీరు, స్పీడూ - ఈ స్పీడులన్నీ చూసి గ్రామపెద్దల తల తిరిగిపోయింది. దానివల్ల కంట్రాక్టరు అబద్ధాలు చెప్తున్నాడన్న విషయం వాళ్ళకి తట్టనేలేదు. అందరు ఆడవాళ్ళూ తల్లీ-చెల్లెలు కాలేరు. మాటలు అయాక, కంట్రాక్టర్ గ్రామపెద్దలు ఇద్దరిచేతుల్లో ఆరు నాటుసారా సీసాలు

ఉంచాడు. కురుడా గ్రామపెద్దలు మిగతావాళ్ళతో, "ఊరికెళ్ళాక దేవుడి గుడిలో పూజ చేయించండి. మన రోజులు బాగుపడ్డాయి" అన్నారు.

కంట్రాక్టర్ రైలు డ్రైవర్‌తో కూడా మాట్లాడాడు. మురహోయిాలో రైలు ఆగుతుంది. అవసరమైతే కురుడాలో కూడా రైలు ఆపవచ్చు. వేగన్లు దొరుకుతాయి. కంట్రాక్టర్ డ్రైవర్‌కికూడా సీసా అర్పించుకున్నాడు. ఒక్కొక్క చెట్టుకీ అతను పదిహేను రూపాయ లిస్తున్నాడు. ఎంత ఖర్చయినా అతనికి వచ్చే లాభంలో ఏ మార్పూ ఉండదు. అతను క్యూబిక్ ఫీట్ లెక్కన అమ్ముతాడు. బన్‌వారీకి అతను ఒక ట్రాన్సిస్టర్ ఇచ్చాడు. బన్‌వారీ చెప్పకపోతే చిన్న చిన్న టేకుచెట్లున్న ఈ ప్రాంతంలో ఇంతమంచి క్వాలిటీ చెట్లున్నాయని తనకి తెలిసేదే కాదు. మొత్తంమీద లాభసాటి బేరమే!

కంట్రాక్టర్ తన జాతివాళ్ళైన ప్రసాదు, లాల్‌చంద్, ములని అజ్ఞానానికి మనసులోనే నవ్వుకున్నాడు. బాబుగార్లకి ఎలాంటి సరుకు తాము ఒదులుకుంటున్నారో తెలీదు. బన్‌వారీకి చెట్టుకి రూపాయి చొప్పున కమీషన్ ఇచ్చేశాడు. అయినా అతనికి చాలా లాభమే! ఇంకా కొన్ని చెట్లు ఐదారేళ్ళల్లో కొట్టి తీసుకెళ్ళటానికి తయారుగా ఉంటాయి. ప్రసాదుగార్ని చేజారిపోనివ్వకూడదు. త్వరలోనే ఈ ప్రాంతం ఒకవైపు తోహరీతోనూ, ఇంకోవేపు నిరాలాఘాట్‌తో కలిసిపోతాయి. రోడ్డు తయారవుతోంది. రోడ్డుపడ్డాక ట్రాన్స్‌పోర్టు ఖర్చుకూడా మిగులుతుంది.

కొన్నాళ్ళు పోయాక కంట్రాక్టర్ తోహరీనుంచి డబ్బానిండా మిఠాయిలూ, ఒక చిన్న ముంతనిండా నెయ్యి తీసుకుని ప్రసాదుగారింటికి వచ్చాడు.

ప్రసాద్‌గారూ, "మేరీ, అతిథులొచ్చారు. తినటానికి ఫలహారం, టీ తీసుకురా" అన్నారు.

మేరీ అంతకుముందే స్నానం చేసింది. అందుకే మొహం మెరుస్తోంది. నూనె రాసుకుని తలదువ్వి జడవేసుకుంది. అద్దకం చీరకొంగు నడుంచుట్టూ తిప్పి బొడ్లో దోపుకుంది. చేతులకీ, చెవులకీ ఇత్తడి నగలు పెట్టుకుంది. ట్రేలో టీ, ఫలహారం తీసుకుని గదిలోకి వచ్చింది. ఆమెని చూస్తూనే తహసీల్దార్‌సింగు నిటారుగా కూర్చున్నాడు. మనసులో - 'ఆహా, ఏం పిల్ల! అదీ ఈ అడివిలో?' అనుకున్నాడు.

తహసీల్దార్‌సింగు మొహం చూసి అతని ఆలోచనల్ని ప్రసాదుగారు

గ్రహించారు. మేరీ గదిలోంచి బైటికెళ్ళగానే ఆయన, "మా పనిమనిషి కూతురు. ఈ పిల్లతల్లి వయసులో ఉండగా ఒక తెల్లదొర..." మేరీ అందం రహస్యం గురించి వివరంగా చెప్తూ చివరగా, "మా ఇంట్లో ఈ పిల్లని మా అమ్మాయిలాగే చూసుకుంటాం. తనూ మమ్మల్ని తన తల్లిదండ్రుల్లాగే గౌరవిస్తుంది" అన్నాడు.

"అది సమంజసమే! లేకపోతే మిమ్మల్ని చాలా పెద్దమనిషి అని అందరూ ఎందుకంటారు? పెద్దమనసున్నవాళ్ళే పెద్దవాళ్ళు!" అన్నాడు తహసీల్దార్‌సింగ్. మనసులో మటుకు - ఇక్కడ చెట్లుకొట్టే వ్యాపారం మొదలుపెట్టడం మంచిదైంది. మేరీలాంటి పిల్ల ఇక్కడ ఉండటం తనకి రెండు విధాలా లాభించింది అనుకున్నాడు.

తోహరీ కురుడా ఊళ్ళమధ్య మేరీ తిరుగుతూ ఉండటంవల్ల ప్రసాదుగారికి బైటి ప్రపంచం గురించిన సంగతులు ఆమె ద్వారా తెలుస్తూ ఉంటాయి. రాత్రి ప్రసాదుగారు మందు వేసుకోటానికి వేణ్ణీళ్ళు పట్టుకొచ్చిన మేరీ, "ఆ దొంగవెధవ మిమ్మల్ని బాగా మోసం చేశాడు. బాగా లాభం గుంజాడు. తోహరీనించి ఛిపాడోర్ వరకూ అందరూ మిమ్మల్ని చూసి నవ్వుతున్నారు" అంది.

ప్రసాదుగారు కట్టుడుపళ్ళు తీసి గిన్నెలో పెట్టాడు. మందు వేసుకున్నాక ఒక్క క్షణం ఏదో ఆలోచిస్తూ ఉండిపోయాడు. ఉన్నట్టుండి, "ఏం చేస్తాం మేరీ? రోడ్డులేదుకదా! నేను లాభం పొందే మార్గం లేదు. అడివిలో ఉంటే అంతే. బన్‌వారీ అతన్ని తీసుకొచ్చాడు. బన్‌వారీ, వాళ్ళమ్మా ఇద్దరూ బైతులని నీకు తెలుసు. నేను ముందు ఒప్పుకోలేదు. కాని లాల్‌చంద్‌కీ, ములనీకీ కోపం వచ్చింది. ఇంట్లో కూడా ఈ విషయం మీద చాలా పోట్లాట జరిగింది" అన్నాడు.

"బన్‌వారీ కూడా దీన్లో డబ్బు తింటున్నాడు."

"నీకు తెలుసా?"

"ఆ౯, నాకు తెలుసు."

"చూడు, నా కర్మ ఎలా కాలిందో!"

పెద్ద నిట్టూర్పు విడిచి ప్రసాదుగారు ఒక రూపాయితీసి మేరీకిచ్చాడు. ఆయన అప్పుడప్పుడూ మేరీకి ఇలా ఇనాము ఇస్తూ ఉంటాడు.

"నాకు నష్టం రాకూడదని ఒక్కొక్క పండుకీ, ఒక్కొక్క జొన్నపొత్తుకీ నువ్వెంత కష్టపడతావో నాకు తెలుసు. నా సొంత కొడుకు ఏమీ అర్థం చేసుకోడు. ఏం

చెయ్యను చెప్పు? నాకు తెలీదూ, నేను పోయాక ఇదంతా అమ్మేసి పోతాడు వాడు!"

"ఈసారి చెట్లు అమ్మేటప్పుడు ఇతనికి అమ్మకండి. అప్పటికి ఇక్కడికి రోడ్డుపడుతుంది. మీరే స్వయంగా కలప ఛిపాడోర్‌కి తీసుకెళ్ళండి. పెద్ద పెద్ద కంపెనీలతో మాట్లాడి సరుకు అమ్మండి. అప్పుడు మళ్ళీ మెత్తబడకండి."

"బాగా చెప్పావు."

మేరీ కురుడాలోని పెద్దమనుషులతో, "పన్నెండణాలూ, ఎనిమిదణాలు. ఈ డబ్బుకి తోహరీలోనూ, ఛిపాడోర్‌లోనూ కూలీలు సామాను ముట్టుకోనుకూడా ముట్టుకోరు" అంది.

"ఏం చేస్తాం మేరీ? మేం చెయ్యకపోతే ఊళ్ళోవాళ్ళకి కోపం వస్తుంది. ఇంత డబ్బు ఈ పనికెవరిస్తారని అంటారు" అన్నారు పెద్దలు.

"అతను పరమ లోభి. డబ్బు రుచి మరిగాడు. ఈసారి నాలుగైదేళ్ళ తరవాత మళ్ళీ వచ్చినప్పుడు బాగా బేరమాడి మనిషికి మూడు రూపాయలూ, రెండు రూపాయలూ చొప్పున తీసుకోండి. అతను ఇచ్చి తీరవలసిందే. ఇవ్వకపోతే ఇక్కడ పనికి మనుషులెక్కడ దొరుకుతారు?" అంది మేరీ.

"సరైన రోడ్డులేదు, చెయ్యటానికి పని దొరకదు. నీకు పరిస్థితి తెలుసుకదా మేరీ?"

కాంట్రాక్టర్ గురించి తనకి తెలిసిన విషయాలు అందరికీ చెప్పి వాళ్ళని హెచ్చరించటంతో తను చెయ్యవలసింది తను చేశానని మేరీ తృప్తిపడింది.

తహసీల్దార్‌సింగ్ కళ్ళల్లో మేరీ రూపం ఇంకా మెదుల్తూనే ఉంది. అతను అదేపనిగా ఆమెగురించి ఆలోచించసాగాడు. చాలా రోజుల తర్వాత మేరీ గేదెవీపుమీద కూర్చుని పశువుల్ని తోలుతూ ఇంటికొస్తుంటే తహసీల్దార్‌సింగ్ ఎక్కణ్ణించో వచ్చి ఆమె ముందు నిలబడ్డాడు.

"ఎంత అందంగా వున్నావే నువ్వు! నువ్వు హేమమాలిని లాగుంటావు" అన్నాడు.

"ఏమన్నావూ?"

"నువ్వు హేమమాలినిలాగున్నావని అన్నాను."

"నువ్వు గుడ్లగూబలాగున్నావు!"

తహసీల్దార్‌సింగ్‌దంతా తలకిందులు వ్యవహారం. మేరీ మాటల్తో అతని

ఉత్సాహం పెరిగింది. అతను మేరీకి దగ్గరగా వచ్చాడు. మేరీ గేదెని ఆపలేదు, అలా వెళ్తూనే ఆమె తన నడుందగ్గర దోపుకున్న పదునైన కొడవలి బైటికి తీసి నెమ్మదిగా, "నీలాంటి సన్నటి మీసం, నల్లకళ్ళద్దాల కంట్రాక్టర్లు తోహరీ వీధుల్లో రూపాయికి పదిమంది దొరుకుతారు. వాళ్ళకీ ఈ కొడవలే చూపిస్తాను నేను. నమ్మకపోతే తోహరీకెళ్ళి నాగురించి అడుగు" అంది.

తహసీల్దార్ భయపడ్డాడు, కానీ అప్పుడు కూడా మేరీ మాట్లాడే పద్ధతీ, ఆమె భావభంగిమలూ అతన్ని అమితంగా ఆకర్షించాయి.

రాత్రి బోజనాలప్పుడు బన్‌వారీ, "మేరీ నా స్నేహితుణ్ణి అవమానించింది" అన్నాడు.

బన్‌వారీ ఈ మాట తన తండ్రితో అన్నాడు, కానీ జవాబు మేరీ చెప్పింది, "నీ స్నేహితుణ్ణి నేనేం అవమానించాను?"

"నువ్వతనితో కరుకుగా ఎందుకు మాట్లాడావు?"

"ఈసారి మాటలతో వదిలిపెట్టాను. ఇంకోసారి వెధవ వేషాలేశాడంటే ముక్కు కోసేస్తాను."

బన్‌వారీ భయపడ్డాడు, "ఏం అతనేమన్నా చెడుగా మాట్లాడాడా?"

"అతని ప్రవర్తన నాకు చెడుగానే కనిపించింది. నీకు మంచిగా ఉండొచ్చు."

ప్రసాదుగారు బన్‌వారీతో, "నువ్వు ఆ కంట్రాక్టర్‌కి మేరీ జోలికి రావద్దని చెప్పు. చెట్లు కొనటానికి వచ్చాడు, ఆ పని చేసుకుని వెళ్ళమను. ఇంకేం గొడవ పెట్టుకోనక్కర్లేదు" అన్నాడు.

"తోహరీ బజార్లో టేకుచెట్లు కొట్టటం గురించి ఎవరితోటీ చెప్పవద్దని మేరీకి కూడా చెప్పండి. ఇంటి ఆవరణలో పెరిగిన చెట్టైనా సరే టేకుచెట్లని అమ్మటం చట్టవిరుద్ధం. చెట్లన్నీ గవర్నమెంటుకి చెందుతాయి" అన్నాడు బన్‌వారీ.

"నీ చట్టం నీదగ్గరే పెట్టుకో. ఇక్కడ చట్టప్రకారం ఎవరు నడుచుకుంటున్నారు? ఈ ఇలాకాలో చెట్లు అమ్మనివాళ్ళెవరు?"

"అవును, మీరు చెట్లు అమ్ముతున్నారని తోహరీ బజార్లో చెప్పాను."

"నేను చెప్పవద్దని అనలేదా? పైగా తోహరీ బజార్లో చెప్పివచ్చానని అంటున్నావు!"

"నామీద అధికారం చెలాయించక" అనేసి మేరీ అక్కణ్ణించి లేచి

వెళ్ళిపోయింది.

ప్రసాదుగారు బన్‌వారీతో, "అతను చేసేపని సరికాదు. నువ్వు నీ స్నేహితుడుకి చెప్పు. నా ఇంట్లో ఉంటోంది, నా కూతురులాంటిది. అతను దీన్ని ఏమన్నా అంటే నన్ను అవమానించినట్టే" అన్నారు.

తహసీల్దార్‌ని కలసినప్పుడు బన్‌వారీ "ఆ పిల్ల చాలా కోపిష్టిదీ, పొగరుబోతుదీ! ఎవ్వరినీ లెక్కచెయ్యదు" అన్నాడు.

"లెక్కచెయ్యాలని ఇక్కడెవరన్నారు?"

"అదీగాక దాని పెళ్ళి కూడా నిశ్చయమైంది."

"ఎవడితో?"

"ఒక తురకవాడితో."

"రామ-రామ! దానికింకెవ్వరూ దొరకలేదా?"

"దానిష్టం."

కురుడాలాంటి అడివి ప్రాంతంలోని మేరీ ఓరాంవ్ తనని లెక్కచేయటం లేదంటే తహసీల్దారుకి నమ్మకం కుదరటంలేదు. చెట్లకి గుర్తులు పెట్టటం, కొట్టటం, నరికిన ముక్కలకి బిల్లులు రాసి పంపించటంతోపాటు, మేరీ వెంటపడటంకూడా ఒక పనిగా పెట్టుకున్నాడు. మేరీ తనవైపు కన్నెత్తి కూడా చూడదు, తురకవాణ్ణి పెళ్ళాడుతుంది. ఇది తెలిశాక మేరీని ఎలాగైనా తనదాన్ని చేసుకోవాలని మొండిపట్టు పట్టాడు.

ఒకరోజు డాల్టన్‌గంజ్‌నించి మేరీకి ఒక నైలాన్ చీరా, ప్రసాదుగారికి మిఠాయిలూ పట్టుకొచ్చాడు. అవన్నీ తీసుకుని ప్రసాదుగారి దగ్గరకెళ్ళి, "నేను ఇక్కడికి వచ్చినప్పుడల్లా మేరీ చాలా మర్యాద చేస్తుంది. అందుకే తనకోసం చీర తెచ్చాను" అన్నాడు.

ప్రసాదుగారు తీసుకోనన్నాడు, కానీ తహసీల్దారు అంత సులభంగా వదులుతాడా? మేరీ ఆ సమయంలో తోహరీకి వెళ్ళింది. వచ్చాక ఇదంతా తెలిసింది. ముందర డబ్బులెక్కలన్నీ నింపాదిగా ప్రసాదుగారికి చెప్పింది. తరవాత వంటింట్లోకి వెళ్ళి టీ, రొట్టె తీసుకుంది. చీర తీసుకుని ఇంట్లోంచి బైటపడింది.

తహసీల్దార్ డేరాలో కూర్చుని కూలీలకి డబ్బులిస్తున్నాడు. అక్కడ చాలా రద్దీగా ఉంది. మేరీ మనుషుల్ని తోసుకుంటూ తహసీల్దార్ దగ్గరకెళ్ళి నిలబడింది.

అసహ్యంగా తిడుతూ చీర తహసీల్దార్ మొహానకొట్టి, "పట్నంలో ఉండే సానిదాన్ననుకున్నావా? చీర ఇచ్చి లోబరుచుకోటానికి చూస్తున్నావా? మళ్ళీ ఇలాంటి వెధవపని చేస్తే నీ ముక్కుకోసి నీ చేతికే ఇస్తాను!" అంది.

చేతులాడించుకుంట గర్వంగా తలెత్తుకుని వెళ్ళిపోయింది మేరీ.

అంతమంది ముందు మేరీ చేసిన అవమానానికి తహసీల్దారు మొహం వాడిపోయింది. తహసీల్దారు నిర్ఘాంతపోతూ, "నేను మంచి మనసుతో ఒక వస్తువిస్తే..."

ఊళ్ళోని పెద్దలు, "ఇంకెప్పుడూ ఇవ్వకండి" అన్నారు.

"ఏమిటీ?"

"ఇంకెప్పుడూ ఇవ్వద్దు."

"తనేం పెద్ద గొప్ప మనిషా? మంచివాళ్ళెవరైనా తురకవాణ్ణి పెళ్ళి చేసుకుంటారా?"

"ఆ విషయం మీకనవసరం."

హఠాత్తుగా తహసీల్దారుకి ఊళ్ళోని మనుషులతో పోల్చి చూసుకుంటే తన మనుషుల సంఖ్య చాలా తక్కువ అని అర్థమైంది. వీళ్ళల్లో ఒక్కొక్కళ్ళ దగ్గరా బల్లెమో, కొడవలో ఉంటుంది. అతను నోరుమూసుకున్నాడు.

రాత్రి అతనితో, "అనవసరంగా గొడవల్లో ఇరుక్కోకండి. గిరిజనులు దుర్మార్గులు. పైగా పోలీసులకి తెలిస్తే ఇంకా ప్రమాదం!" అన్నాడు డ్రైవర్.

తహసీల్దార్‌కి పెళ్ళాం పిల్లలున్నారని డ్రైవర్‌కి తెలుసు. అయినా అతను పరాయి ఆడవాళ్ళని చూసి చొంగకారుస్తూనే ఉంటాడు. మేరీ చాలా అందమైనదే, కాని అంతమాత్రాన ఊళ్ళోవాళ్ళకి కోపం తెప్పించి విషయం పోలీసులదాకా తీసుకెళ్ళడం ఎంత బుద్ధిలేనిపని? ఒకవేళ మేరీ ఒప్పుకుంటే అప్పుడే బెంగాలేదు. కాని ఆమె ఒప్పుకోవటంలేదు కదా, మర్యాదగా తహసీల్దార్ ఈ విషయాన్ని వదిలిపెట్టేయాల్సిందే.

ఇది జరిగాక, ప్రసాదుగారు కూడా కాస్త జాగ్రత్తగా ఉంటున్నాడు. టీ, టిఫినూ మేరీ తల్లి భిఖనీచేత తెప్పించుకుంటున్నారు. తహసీల్దార్ ప్రసాదుగారింటివైపు వెళ్ళటం మానేశాడు. కాని మేరీమీది కోరిక అతను చంపుకోలేకపోయాడు.

మేరీ గొడ్లని మేపుకు వచ్చేటప్పుడూ, తోహరీనించి వచ్చేటప్పుడు, తోహరీకి

వెళ్ళటానికి మూడుమైళ్ళు మురహాయీ వరకు నడిచి వెళ్ళేటప్పుడూ తహసీల్దారు ఆమెని కొద్దిదూరంలో నడుస్తూ వెంబడిస్తాడు.

ఆడపిల్లలు మేరీతో, ''ఈ కంట్రాక్టర్‌కి నువ్వంటే ప్రేమ'' అంటారు.

''ఇంతవరకూ నేను చేతికి దొరకలేదుగా, అందుకే దొరికిన వెంటనే ప్రేమా ఉండదు, ఏమీ ఉండదు. మా అమ్మని కూడా తెల్లదొర ప్రేమించాడుగా?''

''నిన్ను పెళ్ళి చేసుకుంటాడు.''

''అతగాడికి పెళ్ళాం ఉంది.''

''అయితే ఏం?''

''పిచ్చిగా మాట్లాడక.''

చెట్లు కొడుతున్నారు. చలి తగ్గింది. కనుచూపుమేర వరకూ మోదుగచెట్లు కనిపిస్తున్నాయి. చెట్లు చిగుళ్ళు తొడిగాయి. ఒకరోజు పహాన్ ఇంట్లో నగారా మోగింది. గిరిజనుల్లో హోలీరోజున వేటాడే ఆచారముంది. ఆరోజు పన్నెండేళ్ళపాటు మొగవాళ్ళు వేటాడతారు. పన్నెండేళ్ళ తర్వాత ఆడవాళ్ళ వంతు వస్తుంది. ఈసారి వేటాడటం ఆడవాళ్ళ వంతు. మొగవాళ్ళలాగే వాళ్ళు కూడా బల్లేలూ, బరిసెలూ, విల్లంబులూ తీసుకుని బైలుదేరుతారు. అడవుల్లోనూ కొండల్లోనూ వేటకోసం వెతుకుతూ పరిగెత్తుతారు. కుందేలో, పక్షో, జింకో, దేన్నో ఒకదాన్ని చంపి తీసుకొస్తారు. తరువాత అందరూ కలిసి అడివిలోనే భోజనం చేస్తారు, తాగుతారు, పాటలు పాడతారు, సాయంత్రం ఇళ్ళకి వెళ్తారు. మగవాళ్ళు చేసేదల్లా ఆడవాళ్ళు చేస్తారు. పన్నెండేళ్ళలో ఈ ఒక్కరోజు పూర్తిగా వాళ్ళది. హోలీమంట ఆరిపోయాక చుట్టూ కూర్చుని వాళ్ళు కబుర్లు చెప్పుకుంటారు. ''పోయినసారి నేను చిరుతపులిని చంపాను. నేనప్పుడు వయసులో ఉండేదాన్ని'' అంది బుధనీ.

వయసుమళ్ళిన ఆడవాళ్ళు పోచుకోలు కబుర్లు చెప్పుకుంటారు. వాళ్ళకన్నా చిన్నవాళ్ళు వంటలు చేస్తారు. వయసులో ఉన్న అమ్మాయిలు పాటలు పాడతారు.

వాళ్ళెందుకు వేటాడతారో వాళ్ళకి తెలీదు, మొగవాళ్ళకి తెలుసు. కొన్ని వేల లక్షల సంవత్సరాలుగా వాళ్ళు ఈ రోజు వేటాడుతున్నారు. ఒకప్పుడు జంతువులతోపాటు మనిషి కూడా అడవుల్లో జీవించేవాడు, అప్పుడు వేటకి వేరే అర్థం ఉండేది. ఇప్పుడు అడవులు లేవు. జీవితం చాలా దుర్భరంగా తయారైంది. వేటాడటం కూడా అర్థంలేనిపని అని అనిపిస్తుంది.

ఒక్కరోజు సంతోషంగా గడపటంకోసం వాళ్ళు వేటాడతారు. తహసీల్దారు ఎప్పుడూ తన వెంటపడటంతో మేరీ ఓర్పు నశిస్తోంది. జాలిమ్‌కి ఈ సంగతి తెలిస్తే ప్రమాదం ఉంది, అతనికి చాలా కోపం వస్తుంది. తోహరీ బజారులో తహసీల్దారు కనిపిస్తే, ఆ కోపంలో అతన్ని చావగొడతాడు. తహసీల్దారు దగ్గర చాలా డబ్బుంది, చాలామంది మనుషులున్నారు. అతను పట్నం రౌడీ. ఏ దొంగతనం కేసులోనో జాలిమ్‌ని ఇరికించగలడు.

ఇంకోవక్క తహసీల్దార్‌కి కూడా ఓర్పు పోతోంది. చెట్లుకొట్టటం అయిపోవచ్చింది. అది అయిపోతే మూటా ముల్లే సర్దేసి వెళ్ళిపోవలసిందే. కాని అతనికి ఉత్తచేతులతో వెళ్ళాలని లేదు. ఒకరోజు మేరీ ఒంటరిగా దొరికితే తహసీల్దార్ ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

మంచి అవకాశం. ఈసారి వేటకి మగాళ్ళు వెళ్ళటంలేదు. వాళ్ళు బాగా తాగి, కొత్త హోలీ పాటలు పాడుతూ గుంపుగుంపులుగా ఇంటింటికి వెళ్ళి డబ్బులు అడుగుతారు. ఈసారి హోలీకి సారా ఇస్తానని తహసీల్దార్‌సింగ్ మాటిచ్చాడు.

చెట్లుకొట్టే స్థలంనుంచి ఇంటికొచ్చి రోజూ గిరిజనులు పాటలు పాడతారు. వాళ్ళ పాట చాలా సరళంగా ఉంటుంది. మేరీ పాట వింటోంది. ఇంతలో సాయంత్రం అయింది. మేరీ ఇంటికి బయలుదేరింది.

తహసీల్దార్ దోవలో నిలబడి ఉన్నాడు. మేరీ ఈదోవంటే వస్తుందని అతనికి తెలుసు. మేరీ దగ్గరకి రాగానే ఆమె చెయ్యి గట్టిగా పట్టుకుని, "నిన్నివాళ వదిలిపెట్టను" అన్నాడు.

హఠాత్తుగా ఇలా అతను అడ్డంపడేసరికి మేరీ గాభరాపడింది. అంతలో కోలుకుని తన చెయ్యి విడిపించుకోవటానికి చాలా గట్టిగా ప్రయత్నించింది. ఈ పీకులాటలో ఆమె కొడవలి దూరంగా పోయి పడింది. చాలాసేపు ప్రయత్నించి పెనుగులాడిన తరవాత మేరీ అతని పట్టు విడిపించుకోగలిగింది. ఇద్దరూ లేచి నిలబడి ఒకర్నొకరు కొరకొర చూసుకోసాగారు. తహసీల్దారు తన నల్లకళ్ళజోడు పెట్టుకోలేదు. తలమీద పొడవాటి జుట్టు, చెంపలమీద ఒత్తుగా పెరిగిన వెంట్రుకలూ ఉన్నాయి. టెరీకాట్ పేంటూ, ఎర్రరంగు చొక్కా వేసుకుని ఉన్నాడు. కాళ్ళకి కొనదేరిన జోళ్ళు వేసుకున్నాడు. అంతకుముందే హోలీపాటలు విన్న మేరీకి అతనొక జంతువులాగ కనబడ్డాడు. జం-తు-వు! మేరీని ఎవరో ఒక్క చరుపు చరిచినట్టయింది.

ఉన్నట్టుండి మేరీ నవ్వింది.

"మేరీ!"

"ఉండు, అక్కడే ఆగు, ముందుకి రాకు."

"ఏమిటి చూస్తున్నావు?"

"నిన్నే."

"నాకు నువ్వంటే..."

"చాలా ప్రేమ, అంతేనా?"

"అవును, చాలా!"

"సరే."

"ఏమిటి సరే?"

"నువ్వు నిజంగానే నన్ను చాలాప్రేమిస్తున్నావని నాకు అర్థమయింది."

"అవును. నిజంగానే నువ్వంటే ప్రేమ. నీలాటి ఆడదాన్ని నేనింతవరకు చూడలేదు. నూటికీ కోటికీ నీలాంటివాళ్ళు ఒక్కరుంటారు. నీ విలువ ఆ బజారుగూండా, ఆ తురకవెధవకి ఏం తెలుస్తుంది?"

"నీకు తెలుసుకదా?"

"అనుమానమా? నీకు బట్టలూ, నగలూ ఇస్తాను..."

"ఔనా?"

"అవును. ఏం కావాలన్నా ఇస్తాను."

మేరీ గుండెలనిండా ఊపిరి పీల్చుకుంది. "ఇవాళ కాదు, ఇవాళ నేను మైలలో ఉన్నాను" అంది.

"మరి ఎప్పుడు మేరీ, ఎప్పుడు?"

మేరీ మొహంలోనూ, కళ్ళలోనూ కోమలత్వం కనిపించింది. "హోలీ రోజున నువ్వు ఆ గుంట దగ్గర ఉండు. అందరూ ఆడవాళ్ళూ వెళ్ళిపోయాక నేను నీదగ్గర కొస్తాను. తెలుసుకదా ఏ గుంటో? నువ్వు ఆ రాయి వెనకాల నక్కి కూర్చునేగా రోజూ నన్ను చూస్తూ ఉంటావు?" అంది.

"అలాగే, అర్థమయింది."

"అయితే మరిచిపోవద్దు!"

"అలాగే మేరీ!"

"కానీ ఎవ్వరికీ చెప్పొద్దు. మగవాణ్ణి ఎవరూ తప్పుపట్టరు, ఆడదాన్నే అంటారు. నేనెంత పిచ్చిదాన్ని కాకపోతే ఆ తురకవాణ్ణి పెళ్ళాడదామనుకున్నాను?"

"ఇప్పుడు తురకవాణ్ణి చేసుకోవుగా?"

"ఇప్పుడెవరు చేసుకుంటారు? నువ్వు కూడా కొంచెం ఓర్చుకో. నా వెనకాలే తిరగకు."

"నీకోసం ఎన్నో అవస్థలు పడ్డాను."

"హోలీరోజున నీ కష్టాలన్నీ తీరుస్తాను."

"మేరీ అతని దగ్గరకెళ్ళి బుగ్గలు నిమిరింది. "నువ్వు చాలా మంచివాడివయ్యా. ముందు తెలీలేదు" అంది.

కులుకుతూ మేరీ అక్కణ్ణించి వెళ్ళిపోయింది. ఇక వెనకనుంచి అతను దాడి చెయ్యడని మేరీకి తెలుసు.

## మూడు

నిన్నటిరాత్రి మంట వేశారు, ఈ రాత్రి కూడా వేస్తారు. నిన్నటి హోలీమంట ఆకాశమంత ఎత్తుకి లేచి కొంతసేపు అన్నివేపులా ఎర్రరంగు పులిమింది. ఇవాళ పొద్దుటినుంచీ మగవాళ్ళు సారా తాగటంలో మునిగిపోయారు. మరీ వయసుమళ్ళిన ఆడవాళ్ళు చిన్నపిల్లలని చూసుకుంటున్నారు.

మిగతా ఆడంగులంతా అడివిలోకి వెళ్ళారు. ముందు వాళ్ళ వాళ్ళ ఇళ్ళ ముందర వాళ్ళ మొగుళ్ళు బల్లాలూ, విల్లంబులు పట్టుకుని నిటారుగా నిలబడ్డారు. పహాన్ నగారామీద మొదటి దెబ్బ పడిందో లేదో కేకలు పెడుతూ ఆడవాళ్ళు పరిగెత్తారు. మేరీ తల్లి భిఖనీ ప్రసాదుగారి షర్టు ఆయన భార్య పరికిణీ తొడుక్కుని అడివిలోకి పరిగెత్తింది.

బుధనీ, ముంగరీ, షోమరీ, శనీచరీ పరిగెత్తే రోజులు వెళ్ళాయి. వాళ్ళందరూ సారాబుడ్లూ, అన్నం, పప్పు, కాల్చిన జొన్నలూ, ఉల్లిపాయలూ, పచ్చిమిరపకాయలూ తీసుకుని బూమ్‌ఫీల్డ్‌లోని శిథిలావస్థలో ఉన్న బంగళాకి వెళ్ళారు. అక్కడ ఒక బావి ఉంది. దానినీళ్ళు తియ్యగా ఉంటాయి. మగవాళ్ళు కూడా వేటాడిన తరవాత ఆ ఇంట్లోనే వండుకుని తింటారు. బుధనీ అమ్మాయిలతో, "మా రోజుల్లో ఏ ఆడదీ వేటాడకుండా వెనక్కి వచ్చేదికాదు. కుందేలో, తీతువుపిట్టో, ఏది దొరికితే

అది చంపి తెచ్చేవాళ్ళం. ఈసారి మీరంతా ఏం చేస్తారో చూస్తాను. ఎలా వేటాడతారో చూడాలి'' అంది.

మేరీ జాలిమ్ కొనిచ్చిన కొత్తచీర కట్టుకుంది, మెళ్ళో గురివిందగింజల దండ వేసుకుంది. నాట్యం చేస్తూ బుధనీనీ రెండు చేతులతో కావిలించుకుని, ''వేటాడి వచ్చాక నేను నిన్ను పెళ్ళి చేసుకుంటాను. అప్పుడు నేను నీకు భర్తని, నువ్వు నా పెళ్ళానివి'' అంది.

''అలాగే!''

''నేను నిన్ను ఆడిస్తాను!''

''నువ్వాడిస్తే నే నాడతాను.''

మేరీ ఈ రోజు సంతోషం పట్టలేకపోతోంది. పదిరూపాయాలిచ్చి తన అమ్మ దగ్గర నాలుగు కోళ్ళు కొంది. ఆ కోళ్ళని శనీచరికి ఇచ్చింది. రెండు సారాబుడ్డీలు కూడా శనీచరికిచ్చింది. తహసీల్దార్‌సింగ్ ఆడవాళ్ళకి సారాబుడ్లు, మగవాళ్ళకి సారాబుడ్లతోపాటు ఒక మేకను కూడా ఇచ్చాడు. సాయంత్రం వచ్చినప్పుడు పట్నంలోని ట్విస్టుడాన్సు చేసి చూపిస్తానన్నాడు. వాళ్ళతో కలిసి కూర్చుని బుడ్లకి బుడ్లు ఖాళీ చేస్తానన్నాడు. చెట్లు నరకడం, కలప పంపించటం అయింది. అక్కడక్కడ చిన్న చిన్న ముక్కలు పడి వున్నాయి. ముక్కలు చాలా ఉన్నాయి. తహసీల్దార్‌సింగ్ చాలా ఉదారంగా ఆ ముక్కలన్నీ ఊళ్ళోవాళ్ళకి వంటచెరుకు కింద ఇచ్చేశాడు.

''నేను మళ్ళీ వస్తాను. మీచేతే చెట్లు కొట్టిస్తాను. అప్పుడు మిమ్మల్ని సారాతో ముంచెత్తుతాను'' అన్నాడు.

బుధనీతో పరాచికాలాడాక మేరీ కూడా వెళ్ళిపోయింది. ''మేరీ ఇవాళ ఎంత అందంగా ఉందో! ములనజీ కోడల్లాగ చాలా అందంగా ఉంది'' అంది శనీచరి.

''పెళ్ళయి తను వెళ్ళిపోతే మన ఊరే చిన్నబోతుంది'' అంది బుధనీ.

''గూడెంలోకి ఎప్పుడూ ఉత్తచేతులతో రాదు. మీరు ఈమెని చూసి మురిసిపోతున్నారు. కాని వీళ్ళమ్మ భిఖనీ చిన్నప్పుడు ఎంత అందంగా ఉందో మరిచిపోతున్నారే?'' అంది ముంగరీ.

షోమ్రీ ఊరికే లోపలికీ బైటికీ తిరుగుతోంది. ఉన్నట్టుండి కళ్ళు మూసుకుని గట్టిగా పాడటం మొదలుపెట్టింది.

హోలీ జ్వాల రగులుతోంది, హోలీ జ్వాలా

మరువక నువ్వు ఇంటికి రా, జాగ్రత్త సుమా...

మిగతా ఆడంగులు ఆమె గొంతులో గొంతు కలిపారు. వయసు మళ్ళిన ఆ స్త్రీలు ప్రేమ గీతాలు పాడుతున్నారు. ఎండ వేడెక్కుతోంది, వాళ్ళ నిషా కూడా పెరుగుతోంది. నగారాల మోత, బాకాల చప్పుడూ చాలా దూరం వరకూ వినిపిస్తున్నాయి.

మేరీ పరుగెత్తుతోంది. మిగతా ఆడపిల్లలు కూడా కొండెక్కుతున్నారు. అడవిలో దూరుతున్నారు, కాలవ ఒడ్డునే వెళ్తున్నారు. మేరీ లోలోపల నవ్వుకుంది. వాళ్ళకి వేటాడటానికి జంతువు దొరకదు. అన్ని ఆటల్లాగే వేటకి కూడా కొన్ని నియమాలున్నాయి. కుందేలునీ, తీతువుపిట్టనీ కొడితే ఏంలాభం? పెద్ద జంతువుని పట్టాలంటే వలవేసి పట్టాలి.

రంగు చీర, ఎర్రటి జాకెట్టులో మేరీ చూట్టానికి నడుస్తున్న మోదుగు చెట్టు లాగుంది. గాలిలో మోదుగుపువ్వుల గుత్తి ఎగురుతూ వెళ్తున్నట్టు అనిపిస్తోంది. అన్నివైపులా మోదుగుచెట్లమీద ఎర్రటిపువ్వులు విరగబూసి వున్నాయి. దిక్కులు కూడా ఎర్రబడుతున్నాయి. అప్పుడే ఒక కుందేలు పరుగెత్తుకుంటూ వచ్చింది. మేరీ నవ్వింది. ఆ కుందేలు ఏ బొరియలో ఉంటుందో ఆమెకి తెలుసు. "పో, భయపడక్కర్లేదులే" మేరీ నవ్వుతూ అంది. అబ్బ! సారామత్తు ఎంత బాగుంటుందో! రక్తంలో ఏదో తీరని దాహం! తహసీల్దార్, తహసీల్దార్, నేనొస్తున్నాను. తహసీల్దార్‌కి నేనంటే చాలా ఇష్టం. నాకిప్పుడు జాలిమ్ ఏమీ కాడు. తహసీల్దార్ ఎంత ఘాటుగా ప్రేమిస్తున్నాడో! అతని ప్రేమలో ఎన్ని డిగ్రీలు ఫారెన్ హయిట్ ఉంది? అతని రక్తంలో కూడా మేరీ ఒంట్లోలాగే ఉడుకురక్తం ప్రవహిస్తోందా? అంత సాహసమా?

అదే సమయంలో ఒక ముళ్ళపంది ఆమె ముందునించి వెళ్ళింది. "పో, పో!" తహసీల్దార్‌తో పనిలేకపోతే మేరీ దాన్ని చంపి, మాంసం వండుకు తినేదే. కానీ ఇవాళ ఈ చిన్న చిన్న జంతువులని చంపాలని అనిపించటంలేదు. వేటాడటానికి ఆమెకి పెద్దజంతువు కావాలి. మనిషి కావాలి, తహసీల్దార్‌సింగ్. దూరంనించే నిటారుగా ఉన్న ఆ బండరాయి కనిపించింది. పైన కార్నిస్‌లాగ రాయి భాగం ముందుకి పొడుచుకొచ్చింది. అక్కడ మొలిచిన ఒక అడివితీగ పెరిగి అక్కడ ఒక పొదరిల్లులాగ ఏర్పడింది. ఆ పొదకి పసుపుపచ్చని పువ్వులున్నాయి. ఆ పొదరింట్లో దాక్కోటానికి వీలుగా ఉంది. ఇంకొంచెం ముందుకుపోతే ఆ పొదవెనకాల లోతైన

పెద్దగుంట ఉంది. ఆ గుంట అంచున ఒక పెద్ద బండ విడిగా ఉంది. ఆ గుంటలోతు ఎవరికీ తెలీదు. ఎవరూ లోపలికి దిగి చూడలేదు. ఆ లోతు తెలియని గుంటలోని చల్లని చీకటిలోకి తనూ, తహసీల్దారు దిగితే? తహసీల్దారు వేసుకున్న ముదురు ఎరుపురంగు చొక్కా కనబడింది. మేరీ నరాల్లో రక్తం పొంగింది.

విదేశీ సారా, సిగరెట్టు, తహసీల్దార్‌సింగ్!

"పదండి. లోపలికి వెళ్దాం."

"లోపలికెక్కడికి? నీ లోపలికి దూరమంటావా?"

"అవునండీ, అవును!"

"గుంట అంచునున్న పొదరిల్లు వెనకా?"

"ముందు సారా తాగు."

"ఉత్త సారాయేనా? సిగరెట్టుకూడా ఇయ్యి."

"నేనిచ్చిన సారా ఎలా ఉంది?"

"చా...లా బావుంది."

"అంత త్వరత్వరగా తాగకు."

"నాకు మత్తు కావాలి."

"ఎంత?"

"చాలా చాలా మత్తు, ఇంకా సారా ఇయ్యి. మత్తెక్కుతోంది. తలలో నక్షత్రాలు వెలుగుతూ ఆరుతున్నాయి. ఆహా! ఈ మత్తులో కళ్ళముందు ఏదో పల్చటి తెర కనబడుతోంది, ధగధగ మెరిసే తెర. ఆ తెర వెనుక తహసీల్దార్ మొహం కనబడుతోంది. ఇంకా మత్తు కావాలి. బుడ్డీ దొర్లి గుంటలో పడిపోయింది. కిందపడిన చప్పుడు అవలేదు. గుంట ఎంత లోతు? అతని మొహం ఇప్పుడు వేటకి పనికివచ్చే జంతువులాగ కనిపిస్తోంది.

మేరీ చాలా ప్రేమగా తహసీల్దారు మొహం తడుముతోంది. ఆమె వంగి అతన్ని ముద్దుపెట్టుకుంది. తహసీల్దార్ కళ్ళల్లో ఒక్క మెరుపు మెరిసినట్లయింది. అతని పెదవులు విడాయి. ఎర్రటి పెదవులు, రక్తం అంటినట్టు ఎర్రగా కనిపించాయి. అతని పళ్ళు చీకట్లో మెరుస్తున్నాయి. మేరీ అతన్ని కన్నార్పకుండా చూస్తోంది. అతని మొహం నెమ్మది నెమ్మదిగా మారటం చూస్తోంది. ఇప్పుడా? ఆ(!, ఇప్పుడతను జంతువుగా మారిపోయాడు.

"రా, ఇప్పుడు నన్ను తీసుకో!"

మేరీ నవ్వుతూ అతన్ని బాహువుల్లో బంధించి నేలమీద పడుకోబెట్టింది. తహసీల్దార్ నవ్వుతున్నాడు. మేరీ కొడవలి ఎత్తి దించింది, మళ్ళీ ఎత్తి మళ్ళీ దించింది, మళ్ళీ ...

ఎన్నో యుగాలు గడిచిపోయాయి. మేరీ లేచి నిలబడింది. రక్తం! బట్టలమీద రక్తం! కాలవలో కడిగేసుకుంటుంది. చాలా ఒడుపుగా మేరీ తహసీల్దార్ జేబులోంచి పర్సు తీసింది. పర్సునిండా రూపాయలు కుక్కి ఉన్నాయి. బోలెడంత డబ్బు! తన బొడ్లో ఉన్న సంచీ తీసి ఈ డబ్బుకూడా తనడబ్బుతో కలిపి సంచీలో పెట్టుకుంది.

ఆ తరవాత తహసీల్దార్ శవాన్ని గుంటలోకి నెట్టి, అతని పర్సు, సిగరెట్టుపెట్టె, రుమాలు కూడా గుంటలో పడేసి రాళ్ళతో నింపింది. రక్తం వాసన పసికట్టి రాత్రి తోడేళ్ళు వస్తాయి. రాకనూ పోవచ్చు!

మేరీ పొదరింట్లోంచి బైటపడి కాలవవైపు వెళ్ళింది. కాలవలో నగ్నంగా స్నానం చేస్తుంటే ఏదో తెలియని తృప్తి కలిగింది. మగవాడితో కలిసినంత తృప్తి అనిపించింది.

ఆడవాళ్ళ గుంపులో మేరీయే అందరికన్నా ఎక్కువగా సారా తాగింది, అందరికన్నా ఎక్కువ పాటలు పాడింది, ఎక్కువ ఆడింది. అందరికన్నా ఎక్కువ తిండి తిన్నది. ఆమెకు వేటలో ఏ జంతువూ దొరకలేదని అందరూ వెక్కిరించారు. "చూడండి, అందరికన్నా పెద్ద జంతువుని చంపినట్లు ఎలా తింటోందో?" అంది బుధనీ. మేరీ ఎంగిలి మూతితోనే బుధనీని ముద్దుపెట్టుకుంది. రెండు ఖాళీ బుడ్లని చేతుల్లో పట్టుకుని చిన్న చిన్న అడుగులు వేస్తూ నాట్యం చేసింది. సాయంకాలపు గాలి చల్లగా వీస్తోంది. శనీచరి మంట వేసింది.

సారా, పాటలూ, సారా, నాట్యమూ. అందరూ చలిమంట చుట్టూ చేరి ఆడుతూ పాడుతున్నారు - "హే హరమూదేవా! ప్రతిసారీ హోలీ ఇలాగే ఉండాలి, ప్రతి ఏడూ వేట ఇలాగే ఆడాలి. నీకు సారా ఇస్తాం" - ఆడుతూనే మేరీ వెనక్కి వెళ్ళసాగింది. అలా వెనక్కి వెళ్ళి వెళ్ళి చీకట్లో కలిసిపోయింది. మిగతావాళ్ళు వేగంగా నాట్యం ఆడుతున్నారు. మేరీ చీకట్లో పరిగెత్తసాగింది. ఆమెకి అన్ని దారులూ బాగా తెలిసినవే. ఈ రాత్రి కురుడా కొండదాటి ఏడుమైళ్ళు నడిచి తోహరీ చేరుకోవాలని ఆమె ఆశ. అక్కడికెళ్ళి జాలిమ్‌ని లేపుతుంది. తోహరీనించి బస్సులూ, కలప చేరవేసే

ట్రక్కులూ వెళతాయి. అవి ఎక్కి ఎక్కడికైనా వెళ్ళిపోతారు - రాంచీ, హజారీబాగ్, గోమో, పాట్నా - ఎక్కడో ఒకచోటికి. ఇవాళ ఇంత పెద్ద జంతువుని చంపాక తనకి జాలిమ్ కావాలి. జాలిమ్‌ని దగ్గరగా చూడాలని ఉంది.

అక్కడక్కడా దూరంగా హోలీమంటలు మండుతున్నాయి. చీకట్లో నక్షత్రాల కాంతిలో మెరుస్తున్న రైలుకట్ట వెంబడే నడుస్తున్న మేరీకి ఎటువంటి భయమూ లేదు, ఇక ఏ జంతువు భయమూ లేదు. ఇవాళ అన్నిటికన్నా పెద్ద జంతువుని హతమార్చింది. అందుకే మిగతా జంతువుల గురించి ఇన్నాళ్ళూ ఉండిన భయం ఇప్పుడు పూర్తిగా మటుమాయమయింది.

# సాయం-సంధ్యల తల్లి

వైశాఖ మాసం ఎండలకి రాళ్ళు పగులుతున్నాయి. ఆ నెలలోనే సాధన్‌కాందోరీ వాళ్ళమ్మ, జటీ ఠకురానీ, చనిపోయింది.

పోయేముందు ఆమె పొట్టా, మెడా బానలాగ ఉబ్బిపోయాయి. వెదురుతో చేసిన తొట్టెలో తల్లిని కూర్చోపెట్టి సాధన్ కాందోరీ ఆస్పత్రికి తీసుకెళ్ళాడు.

ఆస్పత్రికి తీసుకుపోబోతూండగా ఆమె ప్రాధేయపడింది, "సాధన్ నన్ను ఆస్పత్రికి తీసుకుపోకురా! అక్కడ 'డోములు' నా పొట్ట చీల్చి పేగులు బైటికి లాగుతారు, నాయనా!"

"డాక్టర్ ఆస్పత్రికి తీసుకెళ్ళమంటున్నాడు కదా!"

"మా నాయనకదూ! నా మంచి సాధన్ కదూ! వాళ్ళచేత నా పొట్ట కోయించకు బాబూ!"

"నీ పొట్ట ఎవరూ కొయ్యరమ్మా."

"కోస్తారు నాయనా! నీకేం తెలుసు? నీకన్నా పాలుతాగే పసివాడు నయం. ఆస్పత్రిలో డోమ్‌లు (కాటికాపర్లు) పొట్టకోసి పేగులు బైటికి పీకుతారు. డాక్టర్లు వాటిని గాజుసీసాల్లో పెడతారు."

"ఎందుకమ్మా?"

"నీకేం తెలుస్తుందిరా, నాయనా! పసివాడివి. ఈ శరీరాన్ని కలియుగంలో కాల్చటం, పాతిపెట్టటం అనే ఆనవాయితీ పోయింది. అర్థమయిందా?"

"అయ్యో, అమ్మా! అదేమిటే?"

"అంతే నాయనా! ఇంట్లో ఎవరైనా పోతే అయినవాళ్ళూ, బంధువులూ, స్నేహితులూ పాడెకట్టి మోస్తారు. ఔనా?"

"ఔను!"

"ఈ డాక్టర్లూ, వైద్యులూ, కాటికాపర్లూ, ఆయాలూ రాబందుల్లాగ చచ్చిపోయే మనుషులమీద కన్నువేసి ఉంచుతారు."

"ఏమిటమ్మా నువ్వనేది?"

"అవునురా! వాళ్ళకళ్ళన్నీ రోగులమీదే. అనాధ శవం దొరికితే దాన్ని ముక్కలుగా కోసి పంచుకుంటారు. కాటికాపర్లు పేగులని డాక్టర్లకిస్తారు. ఆయాలు వంటిమీద బట్టలు లాగేసుకుంటారు. ఆ తరవాత కాటికాపర్లు శవాన్ని తీసుకుపోయి, కుళ్ళబెట్టి, ఎముకలు అమ్ముకుంటారు."

"ఛీ! నేనలా చెయ్యనిస్తానేమిటి?"

"అందుకే చెపుతున్నానురా! నేను నీ సాయం-సంధ్యల అమ్మని. నన్ను ఆస్పత్రికి తీసుకెళ్ళి బాధపెట్టకురా!"

"ఊరుకో అమ్మా!"

సాధన్ కాంధోరీ తల్లిని మందలించాడు. చిన్నప్పుడు జటీ ఠకురానీ అతన్ని తన కడుపులో దాచుకుంది. వాళ్ళు చాలా ప్రాచీన జాతికి చెందినవాళ్ళు. జరా అనే వేటగాడి సంతతి. పిట్టలుకొట్టే జాతి. ఆ జాతికి చెందినదే జటేశ్వరి. సాధన్‌ని పదినెలలు మోసి కన్నది.

స్వయానా కన్నతల్లి సాయం-సంధ్యల తల్లిగా ఎలా మారింది అనటానికి చాలా విచిత్రమైన కథ ఉన్నది. సాధన్ ఏడాదిన్నర పిల్లవాడుగా ఉండగా జటేశ్వరికి దేవుడు పూనాడు. అప్పట్నించీ అందరూ ఆమెని పగలంతా జటీఠకురానీ అని పిలవసాగారు. సూర్యోదయం నుంచి సూర్యాస్తమయం దాకా ఆమెని ఎవరూ తల్లీ, చెల్లీ, పెళ్ళాం అని అనుకోకూడదు, అలా పిలవకూడదు.

అలా పిలవద్దని జటీ సాధన్‌కి కూడా చెప్పింది. "అమ్మా అమ్మా అని పిలవకురా, నాయనా!" అని సాధన్‌కి ఆమే చెప్పింది.

"ఎప్పుడూ అమ్మా అని పిలవకూడదా?"

"లేదు నాయనా, చీకటిపడి మళ్ళీ పొద్దుపొడిచేదాకా నన్ను అమ్మా అని పిలవచ్చు."

"సాయంకాలం అయాక, మళ్ళీ తెల్లవారేవరకూ పిలవచ్చు, అంతేనా అమ్మా?"

"అవును."

"సాయంకాలమూ, తెల్లవారగట్లా నువ్వు అమ్మవు, మిగతా అప్పుడు ఠకురానీవి."

"అవును, నాయనా! నేను నీ సాయం-సంధ్యల అమ్మని."

ఈ సాయం-సంధ్యల తల్లి జటేశ్వరి జాదవ్‌పుర్ లైను దాటి ఎలా వచ్చిందో, తన కొడుకుకోసం ఎలా రిక్షా సంపాదించిందో, అదంతా ఒక పెద్ద కథ.

సాధన్ కాందోరీకి తనతల్లి తప్ప ఇంకో ప్రపంచం తెలీదు. చాలా అమాయకుడు. ముప్ఫై ఏళ్ళు నిండినా అతని బుద్ధి వికసించలేదు. గేదెలాగ పెరిగిన శరీరంలో పెద్ద బానపొట్ట తప్ప ఇంకేమీ లేదు. గన్నేరుపువ్వు రెక్కల్లాంటి సున్నితమైన మనసూ, పాములాగ చేతికందకుండా జారిపోయే నాడీ, సూర్యోదయాన, అప్పుడే వికసించిన చిగురాకు వంటి అతి కోమలమైన ఆత్మ ఉన్నాయి. అతని శరీరంలో ఆ పొట్ట తప్ప ఇంకేమీ లేదు.

ఆ పొట్టనిండా ఆకలి. కుర్రదైన అతని యజమాని భార్య తిండి పెడతానని ఆశపెట్టి అతనిచేత అడ్డమైన పనులూ చేయించుకుంటుంది. కట్టెలు కొట్టిస్తుంది, ట్యూబ్‌వెల్ నుంచి నీళ్ళు మోయిస్తుంది, మణుగులకొద్దీ బొగ్గు ముక్కలు కొట్టిస్తుంది.

యజమాని భార్య మంచి వయసులో ఉండి అందంగా ఉంటుంది. ఎప్పుడూ ముసుగు వేసుకునే ఉంటుంది.

"సాధన్, యజమానురాలి వేపు అలా మిర్రి మిర్రి చూడకు."

"అలాగేనమ్మా!"

"చూసినా తల్లిలాగ చూడు, తెలిసిందా?"

"అలాగే నమ్మా!"

అమ్మ చెప్పేవన్నీ సాధన్ బుద్ధిగా వింటాడు. అమ్మ ఏం చెప్పినా 'అలాగే' అంటాడు. అమ్మే అతనికి ప్రపంచం, అమ్మే అతనికి సూర్యుడూ, చంద్రుడూ. అదే అమ్మ జ్వరంతో, బంక విరోచనాలతో, కడుపునెప్పి, కఫంతో బాధపడుతూ ఉంటే, ఆమె శరీరం ఉబ్బిపోతే సాధన్ యజమానిని, "డబ్బివ్వండయ్యా! నాకు కొంచెం డబ్బు కావాలి" అని అడిగాడు.

"ఎందుకు, సాధన్?"

"మా అమ్మ చావు బతుకుల్లో ఉందండయ్యా."

"ఏమయింది, ఆమెకి?"

"జబ్బు చేసింది, బాబుగారూ. ఆమెకి పట్టపగలే చీకటిగా కనిపిస్తోంది. ఉప్పు రుచి చూసి పంచదార బిళ్ళ లాగుందంటుంది. ఇవాళ మిట్టమధ్యాన్నం

'నువ్వు నన్ను అమ్మా అని పిలవరా!' అన్నది.''

"నువ్వు పిలిచావా?"

"ఆఁ, పిలిచాను. డాక్టర్‌ని తీసుకురావాలి డబ్బివ్వండి, బాబూ!"

యజమాని సాధన్ కాంధోరీ చేతిలో పది రూపాయలు పెట్టి, "మీ అమ్మకి మంచి వైద్యం చేయించు, సాధన్! ఎంతైనా నిన్ను కన్నతల్లి!" అన్నాడు.

"మా అమ్మ మనిషి కాదు బాబుగారూ! ఆమె దేవత, ఠకురానీ."

"నువ్వు ముందు డాక్టర్‌ని తీసుకురా."

డాక్టర్ అనాది మందిస్తే ఆ మనిషి చస్తాడు, అందుచేత కాలనీలో వాళ్ళు అతన్ని కొట్టి తరిమేశారు. ప్రస్తుతం అతను రైల్వేలైను కవతల చెరువుపక్కన తన 'దుకాణం' తెరిచాడు. ఆశ్చర్యం ఏమిటంటే అతని పని ఇప్పుడు మూడు పువ్వులూ ఆరు కాయలూగా ఉన్నది. చంపబడ్డవాళ్ళ శవాలని పరీక్షించి డెత్ సర్టిఫికేట్లు ఇస్తాడు. దానికి అతను బోలెడంత డబ్బు గుంజుతాడు. 'డైడ్ ఆఫ్ హార్ట్ ఫెయిల్యూర్' అని సర్టిఫికేటిచ్చి, అట్నించి అటే శ్మశానానికి పంపేస్తాడు. ఈ రోజుల్లో శ్మశానాలలో పనిచేసేవాళ్ళని కూడా సులువుగా డబ్బుతో కొనెయ్యవచ్చు.

జటీఠకురానీ చాలాకాలం క్రితమే డాక్టర్ అనాదికి ముందు ముందు మంచి రోజులొస్తాయని చెప్పింది. అతను డాక్టర్‌గా ఉన్నప్పుడు భ్రూణహత్యలు చెయ్యటం, దొంగ సర్టిఫికేట్లు ఇవ్వటం వంటి పాపాలు చాలా చేశాడు. ఆ పాపాలకి ప్రాయశ్చిత్తంగా సద్బ్రాహ్మణుడైన అనాది నూనె, కొబ్బరికాయలూ, బియ్యమూ, ఉప్పు ఇచ్చి జటీఠకురానీ కాళ్ళకి దండం పెట్టాడు.

బహుశా అందుకే జటీ ఠకురానీని చూడటానికి రమ్మని కబురుపెట్టగానే అతను వెంటనే వచ్చాడు. జటీ పడుకున్న గదిలో దుర్భరమైన కంపు. ఎర్రటి ఎరుపురంగు చీర కట్టుకుని, దేవతాకథల్లోని రాక్షసిలాగ, ఆమె దుప్పటి మీద వెల్లకిలా పడుకుని ఉన్నది. ఆమె పొట్ట ఉబ్బిపోయి డోలులాగా ఉంది, కాళ్ళూ చేతులూ బార్లాచాపి పడుకుంది. కానీ ఆమె కళ్ళల్లో మాత్రం ఏదో అలౌకిక భావం! పుసికట్టిన ఎర్రటికళ్ళు ఇంత అందంగా ఉండగలవని అనాది ఎన్నడూ అనుకోలేదు.

డాక్టర్ అనాది టేబుల్ మీద భరించరాని బాధతో విలవిల్లాడే యువతుల కళ్ళకన్నా అందంగా ఉన్నాయి ఈమె కళ్ళు. మృత్యువు దగ్గరపడితే తప్ప మనిషి కళ్ళలో ఇంత అందం ఎప్పుడూ కనపడదు.

అతను ఆమెకేసి చూస్తూ నిలబడిపోయాడు. నాడీ పట్టుకుని చూసేసరికి అతని కళ్ళలో నీళ్ళు చిప్పిల్లాయి.

తన పాపాలకి ప్రాయశ్చిత్తం చేసుకునేందుకు అతను ఏడాదికి ఒకటి రెండుసార్లు జటీ ఠకురానీ దగ్గరకి వచ్చేవాడు.

"అమ్మా, నేను పాపం చేశానమ్మా!" అనేవాడు.

పగటిపూట ఆమెని ఎవరూ అమ్మా అని పిలవరు, ఠకురానీ అని పిలవవలసిందే. డాక్టర్ అనాది చీకట్లో మొహం కప్పుకుని వచ్చేవాడు.

"ఏం పాపం చేశావు, నాయనా?"

"ఒక ఆడపిల్ల చచ్చిపోయిందమ్మా!"

జటీ పెద్దగా నిట్టూర్చి, "మహాపాపం చేసి ఉంటుంది, నీకేం తెలుసు? ఆమె ఆత్మ కోసం యమదూతలు వచ్చేస్తారు. ఆమె పాపంచేసి తన తండ్రికి చెడ్డపేరు తెచ్చిందా లేదా? మంచి కుటుంబంలోపిల్ల, దాని బుద్ధి పెడదారి ఎలా పట్టిందో?" అన్నది.

"ఇప్పుడేం చెయ్యనమ్మా?"

"ఇదుగో నాయనా! అక్కడ అటకమీద నల్లతాచు ఎముక ఉన్నది చూడు, అది తీసుకెళ్ళి దిండుకింద పెట్టుకుని నిద్రపో. రోజూ పొద్దున్నా, మధ్యాన్నం, సాయంకాలం గదిలో గంగాజలం చల్లు, తెలిసిందా?"

అనాది వంటి పాపులకోసం జటీ ఠకురానీ, పురిటింట్లో చనిపోయిన పసిపిల్లవాడి గోరూ, నల్లతాచు ఎముకా, ధనేశపక్షి నూనె వంటివి చేర్చి పెడుతుంది. ఇలాటివి చేర్చటం ఆవిడ తప్ప ఎవరూ చెయ్యలేరు. వీటికి డబ్బు తీసుకోదు. కొంచెం బియ్యం మాత్రం తీసుకుంటుంది. పొద్దువాలగానే ఠకురానీ సాధన్ వాళ్ళమ్మగా మారిపోతుంది. ఠకురానీగా తీసుకున్న బియ్యం అమ్మగా వండి తన మొద్దు పిల్లవాడికి పెడుతుంది.

ఇప్పుడిక అనాదికి ఎవరు సహాయం చేస్తారు? దుఃఖంతో అతను కన్నీళ్ళు కార్చసాగాడు.

"సాధన్, ఈమెని ఆస్పత్రికి తీసుకెళ్ళి చూపించు. ఈమె పరిస్థితేం బాగాలేదు," అన్నాడు అనాది. సాధన్ చేతిలో డబ్బు పెట్టి, "టేక్సీలో తీసుకెళ్ళు," అన్నాడు.

భయంతో సాధన్ బిక్కచచ్చిపోయాడు. డబ్బు తీసుకుని అతను గబగబా మిఠాయి దుకాణానికి వెళ్ళాడు. తన దుఖాన్ని మరిచిపోవటానికి పేలాలూ, పంచదార బిళ్ళలూ, ఫలహారమూ అక్కడే కూర్చుని తిన్నాడు. తిన్నాక గ్లాసులకొద్దీ మంచినీళ్ళు తాగాడు.

టేక్సీ డ్రైవర్ జటీని తన బండిలో ఎక్కించుకోనన్నాడు, "అరె! ఈమె శవంలాగా ఉంది. బండిలో చచ్చిపోతే?"

సాధన్ యజమాని తన వెదురు అడివినించి బొంగులు నరికి ఇచ్చాడు. ఆ వెదురుతో తొట్టె తయారుచేసి, ఠకురానీని దాన్లో కూర్చోపెట్టి సాధన్ ఆమెని బాంగుడాలోని ఆస్పత్రికి తీసుకెళ్ళాడు.

అతను ఏనాడూ ఆస్పత్రి ఎలా ఉంటుందో చూడలేదు. అంతపెద్ద భవనం, అంతమంది మనుషులు! సాధన్ గాభరా పడుతూ, "బలరామ్, భయంతో నాకు కాలూ చెయ్యీ ఆడటంలేదు! ఈ ఆస్పత్రికి ఇన్ని తలుపులేమిటి? ఏ తలుపులోంచి ఠకురానీని లోపలికి తీసుకెళ్ళాలో కాస్త చెప్పు" అన్నాడు.

"నువ్వు చాలా వింతమనిషివోయ్! పిచ్చివాడిలా ప్రవర్తిస్తున్నావు!"

బలరామ్, జగదీశ్, టోధో, డాక్టర్‌ని పిలుచుకొచ్చారు. జటీ ఠకురానీని ఆస్పత్రిలో చేర్చుకుంటేగాని అక్కణ్ణించి కదలమని కచ్చితంగా చెప్పారు. డాక్టర్, "ముసలావిడ ఇప్పుడో ఇంకాసేపటికో అన్నట్టుంది" అని అన్నప్పుడల్లా సాధన్ ఏడుపు లంకించుకుని, "ఠకురానీని బతికించండి, డాక్టర్! ఆమె లేకుండా నేను బతకలేను. నా బతుకు చీకటయిపోతుంది. పొద్దుగుంకగానే ఆవిడ నాకు అమ్మగా మారుతుంది. నా జుట్టు నెరిసిపోయినా నన్నింకా చంటిపిల్లవాడిలా లాలిస్తుంది. తను పస్తులుండి నాకు కడుపునిండా తిండి పెడుతుంది" అని బతిమాలుకున్నాడు.

"ఏమిటి నువ్వనేది? నీ గోల నాకేమీ అర్థంకావటంలేదు" అని డాక్టర్ విసుక్కున్నాడు.

"డాక్టరుబాబూ! అయ్యో, నేనేం చెయ్యను దేవుడో!" అంటూ సాధన్ వెక్కి వెక్కి ఏడవసాగాడు.

బలికి తీసుకెళ్తున్న పశువులాగ నేలమీద పొర్లిపొర్లి ఏడ్చాడు.

బలరామ్ పెళ్ళి కూతఘాట్‌లో అయింది. అతను కాలనీలో ఉంటాడు. పెద్దమనుషులంటే అతనికి భయంలేదు. అతను పేదవాడుగా ఉన్నన్నాళ్ళూ మంచి

బట్టలు వేసుకుని తిరిగే పెద్దమనుషులని చూస్తే అతనికి కోపం వచ్చేది. కానీ అతని శరీరంలో ఇప్పుడు ధవళేశ్వరి నది, నీటి చల్లదనమూ, స్వభావంలో ఏపుగా పెరిగిన పచ్చటి పైరు వంటి అణకువా ఉన్నాయి.

ఇప్పుడు కాలనీలో అతనికో ఇల్లుంది. సొంత రిక్షా ఉంది. బారుయిపూర్‌లో వరిపొలం కొన్నతరవాత అతను పూర్తిగా మారిపోయాడు.

పెద్దమనుషులని చూసినప్పుడూ, వాళ్ళ తియ్యటి మాటలు విన్నప్పుడూ, అతనికి వాళ్ళ మొహాన ఉమ్మేయ్యాలనిపిస్తుంది. బెంగాలు నిజాయితీగల వాళ్ళకీ, అమాయ కులకీ పనికిరాదనీ, పాముల్లాంటివాళ్ళే ఇక్కడ బతగ్గలరనీ అతను తెలుసుకున్నాడు.

బలరామ్ ముందుకివచ్చి కరుకుగా, "ఈమె మామూలు మనిషి కాదు, ఏమనుకున్నారో! ఈమెలో దేవుడు కొలువున్నాడు. మేము ఈవిణ్ణి దేవతలాగ కొలిచి, పూజలు చేస్తాము. పళ్ళూ, పువ్వులూ సమర్పించుకుంటాము. బెడ్ ఖాళీ ఉంటే ఈవిణ్ణి భర్తీ చేసుకోండి, సార్! ఆస్పత్రిలో బెడ్స్ మీవీకావు, మావీకావు! ప్రజలవి. నే చెప్పేది ఒప్పుకుంటారా?" అన్నాడు.

చివరికి ఆవిణ్ణి ఆస్పత్రిలో చేర్పించారు.

సాధన్ శోకాలు విని డాక్టర్ చాలా బాధపడ్డాడు. అతనికి సిగ్గువేసింది. ఇంత పెద్ద మగాడు అమ్మకోసం ఇలా ఏడవటం అతనెప్పుడూ చూడలేదు.

"డాక్టరు బాబూ! ఠకురానీ బతుకుతుందంటారా?"

"చూస్తాను, సాధన్! భయపడకు!"

"ఈవిణ్ణి ఇక్కడికి ఎవరు తేగలరు, బాబుగారూ? ఈమె మనిషి కాదు, దేవత. జనం ఈవిడ దగ్గరకి రావటానికి భయపడతారు."

"అవును, అది నిజమే."

"ఈమె పగలంతా ఠకురానీగా ఉండి పొద్దువాలగానే నాకు అమ్మగా మారు తుంది. గంగాజలంతో స్నానం చేసి, రంగుబట్టలు కట్టుకోగానే ఈమె మళ్ళీ ఠకురానీగా మారుతుంది. అప్పుడు మిగతావాళ్ళలాగే నేనూ ఈవిణ్ణి దేవతగానే భావిస్తాను."

"అలాగా?"

"కానీ రోజంతా అమ్మా అని పిలవాలని నా మనసు కొట్టుకుపోతుంది.

అందుకే సాయంకాలం అవగానే నేను ఈమె ఒళ్ళో తలపెట్టుకుని, తనివితీరా, 'అమ్మా, అమ్మా' అని పిలుస్తాను.

డాక్టర్ నిర్ఘాంతపోయి సాధన్‌వైపు చూశాడు. నర్సు చిరునవ్వు నవ్వి, "నీ తలకాయ ఇంత పెద్దదిగా ఉందే, ఆవిడ ఒళ్ళో ఎలా పట్టింది?" అని అడిగింది.

సాధన్ చాలా గంభీరంగా, ఏదో రహస్యం చెప్తున్నట్టుగా, "ఒళ్ళో తలపెట్టుకుని పడుకుంటాను, అమ్మా అని పిలుస్తాను, అప్పుడు అమ్మ నన్ను ముద్దుచేస్తుంది. పగలు ఈవిడ చుట్టూ చాలామంది భక్తులుంటారు. కానీ రాత్రి నేను తప్ప ఇంకెవ్వరూ ఉండరు" అన్నాడు.

"పగలు మీ అమ్మ ఏం తింటుంది?"

"నాకేం తెలుసు? టీ, గంజాయి, లేకపోతే గంగాజలం తాగుతుందేమో! దేవతలు ఎక్కడైనా మనలాగా అన్నం పప్పు తింటారా?"

"మరి సాయంత్రం?"

"సాయంత్రం అన్నం వండుతుంది. మొత్తం నాకే పెడుతుంది, తను చాలా కొంచెం తింటుంది. చిన్నపిల్లలు తిన్నంత తింటుంది."

"అందుకే ఈవిడ జబ్బు పడింది, సాధన్!"

"లేదండీ, దేవత ఒంట్లోకి జబ్బు ప్రవేశించగలదా? ఎవరికో ఈమె మీద కోపం వచ్చి మంత్రప్రయోగం చేశారని నా అనుమానం."

"చూద్దాం. నా చేతనైనది చేస్తాను."

"డాక్టర్‌గారూ!"

"ఏమిటి, చెప్పు."

సాధన్ తన కాలి బొటనవేలితో నేలమీద రాస్తూ, "మీ ఇళ్ళల్లో లక్ష్మి వెల్లివిరుస్తోంది. మీ ఇళ్ళల్లో అన్నం కొండలూ, పప్పు సముద్రాలూ ఉంటాయి. మా అమ్మ వంతు అన్నం నాకిస్తారా? ఈవిడ ఎలాగూ తినే స్థితిలో లేదుకదా?" అన్నాడు.

"వీలుపడదు, సాధన్!"

డాక్టర్ మరింత ఆశ్చర్యంతో సాధన్‌ని చూశాడు. పశువులకు మాత్రం ఉండే అమాయకత్వం మనుషుల్లో అతను ఇంతకు ముందెప్పుడూ చూడలేదు.

కానీ జటీ ఠకురానీకి వైద్యం జరగలేదు. "ఈవిడకేమయింది, చెప్పండి

డాక్టర్!" అని అడుగుతూ సాధన్ డాక్టర్లని తెగ వేధించాడు.

డాక్టర్లేం చెబుతారు? ఆవిడకి గ్లూకోజ్ ఎక్కించారు, సెలైన్ వాటర్ ఎక్కించారు. అన్నవాహిక ఎండిపోయి ముడుచుకుపోవటంవల్ల గొట్టంతో ఆహారం ఇవ్వటానికి ప్రయత్నించారు. వాళ్ళ ప్రయత్నలోపమేమీ జరగలేదు.

జటీ ఠకురానీ కోలుకోలేదు. మధ్య మధ్య తెలివొచ్చినప్పుడు, "నన్ను ఆస్పత్రిలో ఉంచొద్దురా, నాయనా! సాధన్, డాక్టర్లు నా పొట్ట కోసేస్తారు, కాటికాపర్లు నా ఎముకలు అమ్ముకుంటారు. నన్నింటికి తీసుకుపో" అని బతిమాలింది.

మూడురోజుల తరవాత జటీ ఠకురానీ జబ్బేమిటో డాక్టర్లకి తెలిసింది. ఆమెది చాలా పెద్ద అంటువ్యాధి. ఇంతవరకూ ఈ రోగానికి భారతదేశంలో ఎవరూ మందు కనిపెట్టలేకపోయారు. ఆ రోగం పేరు, తిండి తినకపోవటం. తను తినకుండా, రాక్షసాకలితో ఎప్పుడూ తిండి అడిగే సాధన్‌కి తినిపించి, తినిపించి జటీ ఠకురానీ ఒళ్ళు పూర్తిగా ఎండిపోయింది.

"ఇది దేవరోగం, సాధన్! దీనికి వైద్యం చెయ్యటం నావల్లకాదు," డాక్టర్ వ్యంగ్యంగా అన్నాడు.

"అయితే తీసుకుపోమా?"

"తీసుకుపొండి."

జటీ ఠకురానీ కూడా కళ్ళు తెరిచి, "ఒరే, వెర్రినాయనా! సాధన్, నీకు నా జీవితం గురించి ఏం తెలుసు? నేనే జాతి మనిషినో తెలుసునా? నన్నింటికీ తీసుకుపో. నేను నా ఇంట్లోనే ప్రాణాలు వదుల్తాను" అన్నది.

బలరామ్, జగదీశ్, సాధన్ ఇంకో ఐదుగురు అతని స్నేహితులు కలిసి ఆమెని ఇంటికి తీసుకొచ్చారు. జటీ ఇంటిముందు ఒక వేపచెట్టుంది. దానికింద జటీని పడుకోబెట్టారు.

"వేపచెట్టు నీడ చాలా మంచిది సాధన్. మేం ఐదుగురం అన్నీ చూసుకుంటాం. నువ్వెళ్ళి ఆవిడ దగ్గర కూర్చో" అని బలరామ్ చెప్పటంతో సాధన్ జటీ ఠకురానీ పక్కన కూర్చున్నాడు.

"ఎవర్నయినా బ్రాహ్మణుణ్ణి పిలుచుకురా."

"ఉన్నాడులే, బ్రాహ్మడున్నాడు."

"ఎవరు?"

"డాక్టర్ అనాది."

"అతన్నే పిలు, ఠకురానీ దగ్గర కూర్చోమను."

అనాది కూడా ఠకురానీ పక్కన కూర్చున్నాడు. సాధన్ దుఃఖం పట్టలేకపోతున్నాడు. అతని మొహంలో భయం కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది.

"ఏమన్నా చెప్పవే, మాట్లాడవే,ఓ"

"చెప్పమంటావా?"

చివరి ఘడియల్లో ఆమెకి పూర్తి స్పృహవచ్చింది.

"చెప్పు."

"మీనాన్న కాందోరీ. మీరు బేదియా జాతివాళ్ళు. అడవుల్లోనూ, కొండల్లోనూ తిరుగుతూ ఉంటారు. చాలా అందమైన చాపలల్లుతారు."

"మరి నువ్వు?"

"నేనా...?"

అప్పటికి సూర్యుడు ఆకాశంలో పైకి వచ్చాడు. పది గంటలయింది. జటీ ఒంట్లో బావున్నప్పుడు ఈపాటికి ఠకురానీ రూపంలో తన గదిలో కూర్చుని భక్తుల పూజలు అందుకుంటూ ఉండేది. సాధన్‌కి ఆమె ఈ నిమిషాన 'అమ్మ' అయితే బావుణ్ణనీ, తనని "సాధన్! నా దగ్గరకి రారా!" అని పిలిస్తే బావుణ్ణనీ ఎంతో అనిపించింది.

జటీకి కూడా సాధన్‌ని దగ్గరకి పిలవాలనిపించింది. "సాధన్, నా దగ్గరకి రా, నాయనా!" అని పిలిచి ఉండవచ్చు, కానీ పిలవలేదు. ఆ సమయంలో ఆమెచుట్టూ చాలామంది భక్తులు నిలబడి ఉన్నారు. వాళ్ళు ఆమె దగ్గరకొచ్చి, దండం పెట్టి, ఆమెపట్ల తమ గౌరవాన్ని తెలుపుకుంటున్నారు. వీళ్ళే ఏళ్ళతరబడి బియ్యం గింజలిచ్చి సాధన్‌ని బతికించారు. జటీ ఠకురానీ అవాలని తనే నిర్ణయించుకుంది. ఇవాళ ఆమె ఠకురానీగానే చనిపోవాలి.

"నువ్వెవరు?" సాధన్ చాలా అమాయకంగా, భక్తిభావంతో అడిగాడు.

తల్లి ఎవరు? జటీ ఎవరు? సాధన్ తండ్రి కాందోరీ అయితే జటీ వేరే జాతి మనిషెలా అవుతుంది? సాధన్, బలరామ్, జగదీశ్ - అందరూ జటీ దగ్గర చేరారు.

"నువ్వు తక్కువ జాతికి చెందినవాడివి కాదు, చాలా పెద్ద జాతి మనిషివి."

"మరి, నువ్వో?"

"నా కథ చాలా విచిత్రమైనది. మా జాతికి మూలపురుషుడు జరా అనే బోయవాడు. ఆయన పేరు విన్నావా?"

"జరా అనే బోయా?"

"మేము అలాగే పిలుస్తాం. మా భాష మీ భాషలాగా ఉండదు, డాక్టర్!"

"పాపం, మనలోకంలో లేదు!" అనాది భయపడుతూ అన్నాడు.

ఇలాంటి రోగిని ఆస్పత్రిలో ఉంచక ఎందుకు తీసుకొచ్చారు? పైగా చుట్టూ ఇంతమంది గుంపేమిటి? జరా అనే బోయవాడి కథ మహాభారతమంత పాతది. అదీ కల్పితం.

"నేను స్పృహలోనే ఉన్నాను, డాక్టర్. నేను చెప్పేది నిజమో అబద్ధమో నాకు మట్టుకే తెలుసు. అసలు నేను విన్నదేమంటే..."

జటీ ఒక వింత కథ చెప్పసాగింది. "ఆ దేశంలో సముద్రం ఉంది, ద్వారకాపురి ఉంది. అక్కడికెళ్ళి జరాబోయ బాణం వేశాడు."

"ఎవరిమీద?"

"కృష్ణుడి మీద. నువ్వు పుస్తకాల్లో చదవలేదా?"

"అందరికీ తెలిసిన కథే."

"అది చాలా పెద్దపాపం, మహాపాపం! దేవుణ్ణి బాణంతో కొట్టటంకన్నా పెద్ద పాపం ఉండదు. ఆ తరవాత జరా వంశంవాళ్ళు ఆ దేశాన్ని వదిలి ఇక్కడికి వచ్చారు..."

"ఎక్కడికి?"

"హిజలీ, కాంథీ, తమలుక్, మేదినీపుర్..."

"ఆ తరవాత?"

"నా జాతి చాలా చిన్నది. మేము శ్మశానాల్లో తిరిగేవాళ్ళం. పాములు పట్టేవాళ్ళం. శ్మశనాల్లో ఉండే కుండల్లో నీళ్ళు పట్టుకుని తాగేవాళ్ళం."

"ఛీ! ఛీ!"

"మేము పిట్టలు పట్టేవాళ్ళం. మమ్మల్ని జనం బోయలనే పిలిచేవారు."

"బోయవాళ్ళా? అదేం జాతి? మేమెప్పుడూ వినలేదే?"

"వేరే జాతి వాళ్ళతో మా పెళ్ళిళ్ళు జరగవు. కానీ సాధన్ వాళ్ళ నాన్నని చూడగానే నా మనసు చలించింది. నలుగురూ నాలుగు రకాలుగా మాట్లాడతారన్న

భయంతో మేమిద్దరం అక్కణ్ణించి పారిపోయి పెళ్ళిచేసుకున్నాం..."

జటీ సరిగ్గా మాట్లాడలేకపోతోంది. మొదటిసారి జరిగేది పెళ్ళి, రెండోసారి జరిగితే దాన్ని 'పెళ్ళి' అనరు, 'సాంగా' అంటారు. బోయజాతి వాళ్ళు ఆడపిల్ల పుట్టగానే దేవుడికిచ్చి పెళ్ళి చేసేస్తారు. దేవుడికి కొబ్బరికాయలూ, పువ్వులూ అర్పించుకున్నాకే అమ్మాయిలు కాపరాని కెళ్తారు.

"ఆ తరవాత, చాలా కాలం తరవాత నేను ఠకురానీ నయ్యాను. ఎప్పుడూ నాలో దేవుడు ఉండేవాడు..."

"జటీ ఠకురానీ, నీళ్ళు తాగుతారా?"

"ఒద్దు, నాయనలారా! ఇక నేను ఆనందంగా స్వర్గానికి పోతాను. కానీ సాధన్..."

జటీ ఠకురానీకి ఎక్కిళ్ళు వచ్చాయి.

"నాతో ఏమన్నా అన్నావా?" అని అడిగాడు సాధన్.

"నేను ఠకురానీ నయ్యాను. అటు చూడు, నా నుదుటిమీద సూర్యుడు..."

"ఇప్పుడింకా పగలేకదా?"

"మీ అమ్మ కాదు సాధన్, ఠకురానీ స్వర్గానికి వెళ్తోంది. నువ్వు ఆవిడకోసం దానం చెయ్యాలి..."

"ఏమివ్వాలి?"

అందరూ చాలా కుతూహలంతో ఏం చెపుతుందా అని వింటున్నారు. సాధన్ ఇంటి వసారాలో ఇరుగుపొరుగువాళ్ళందరూ గుమిగూడి ఉన్నారు. చనిపోతున్నది ఒక అంటరాని పేదరాలు, దిక్కూమొక్కూలేని స్త్రీ కానట్టూ, ఎవరో పెద్దమనిషో, మర్యాదస్తురాలో అయినట్టూ అందరూ చాలా భక్తిగా ఆమె చుట్టూ నిలబడ్డారు.

అందరూ మౌనంగా ఉన్నారు. ఊపిరి బిగబట్టి జటీ ఠకురానీ ఆఖరి కోరిక ఏం కోరుతుందో వినాలని చూస్తున్నారు.

"నేను పొద్దువాలాకో, తెల్లవారకముందో పోయి ఉంటే నీకు కానీ ఖర్చుండేది కాదు. కానీ నువ్విప్పుడు ఏనుగుని దానం చెయ్యవలసి ఉంటుంది. నాకు శ్రాద్ధం పెట్టేటప్పుడు బ్రాహ్మడికి ఏనుగునియ్యి."

"ఇస్తాను. నీకు మాటిస్తున్నాను."

తల్లి చనిపోతోందన్న దుఃఖం సాధన్‌ని పిచ్చివాణ్ణి చేస్తోంది. అంతా ఏదో

కలలో జరుగుతున్నట్టుగా ఉంది. అతని మతి మతిలో లేదు. "అందరూ వినండి. ఈమెకి శ్రాద్ధం పెట్టేటప్పుడు నేను ఏనుగుని దానం చేస్తాను" అన్నాడు.

"గు...గు...గు...గుర్రం కూడా ఇవ్వాలి."

"ఇస్తాను."

సాధన్ వెక్కి వెక్కి ఏడుస్తూ, "అన్నీ ఇస్తాను. నువ్వు నన్ను వదిలి వెళ్ళకు. నాకింకెవ్వరూ లేరు" అన్నాడు.

"నీ పె...పె...పె..."

జటీ ఠకురానీ మాట్లాడలేకపోయింది. సాధన్ పెళ్ళాం పుట్టింటికి పారిపోయింది. ఆమెని పిలుచుకు రమ్మని చెప్పాలని ప్రయత్నించింది కానీ చెప్పలేకపోయింది. వాక్యం ముగించకుండానే ఆమె తల పక్కకి వాలిపోయింది.

తెల్లబట్టలో చుట్టి, పువ్వులతోనూ చందనంతోనూ కప్పి, డోలూ మంజీరా వాయిస్తూ వాళ్ళు జటీ ఠకురానీని కాల్చటానికి తీసుకుపోయారు. ఖర్చంతా డాక్టర్ అనాది పెట్టుకున్నాడు. జటీని చూసి ఇక రోజూ ఆమెకి బియ్యం ఇవ్వాల్సిన పని ఉండదని అతను అనుకున్నాడు. బియ్యం ధర ఆకాశాన్నంటే రోజుల్లో కూడా అతను ఆమెకి బియ్యం ఇచ్చి దండం పెట్టేవాడు. అతని పెళ్ళాం కోపగించుకుని, "ఆవిడలో దేవుడి అంశ ఉందంటున్నారు. మరి భక్తుల కష్టాలు గ్రహించదేం?" అనేది.

అనాది చాలా విచారించాడు. బలరామ్‌కి డబ్బులిచ్చి, "మీ కిష్టమైనది తినండి. కానీ ఒక విషయం గుర్తుంచుకోండి, ఠకురానీని కాల్చటానికి గంధం చెక్కలే వాడండి. కర్ర వాసన చూసి కొనండి. పువ్వులూ, చెరుకుముక్కలూ, చిల్లరడబ్బులూ వెదజల్లండి. అర్థమయిందా? బలరామ్, నీ బావమరిదికి తెలిసిన పాటగాళ్ళ బృందముంది కదూ?" అన్నాడు.

జటీ చనిపోవటం బలరామ్‌కీ అతని స్నేహితులకీ ఏదో అలౌకిక సంఘటనలాగ ఉంది. చనిపోయేముందు జటీ చెప్పినమాటలు వాళ్ళకి దేవవాణిలాగ అనిపించాయి. ఆ ఊపులో బలరామ్, "బావమరిది పాటలు పాడటానికి రాకపోతే తల నరికి పారేస్తాను!" అన్నాడు.

అప్పుడప్పుడూ బలరామ్ ఇలాటి మాటలు అంటూ ఉంటాడు. ఈ కబురు వింటూనే అతని బావమరిది పరిగెత్తుకొచ్చాడు. అతని పేరు సదానంద్. పేరుకుతగ్గ

స్వభావం. అతను గవర్నమెంటాఫీసులో చప్రాసీ పని చేస్తాడు.

"వెధవ ఉద్యోగాని దేముంది? కేజువల్ లీవు లేదూ? ఒక్కరోజు ఆఫీసుకెళ్ళకపోతే ఉద్యోగమేం ఊడదు" అని నడుంకి గావంచా బిగించాడు. తల నున్నగా దువ్వుకుని, మెళ్ళో కాగితం పూలదండ వేసుకుని సదానంద్ తన బృందంతో కలిసి పాడుతూ, "రామ్ నామ్ సత్యహై" అని అంటూ శవంవెంట వెళ్ళాడు.

## రెండు

సాధన్ వాళ్ళమ్మ మనిషినించి దేవతగా ఎలా మారింది అనేదానికి ఒక విచిత్రమైన కథ ఉంది. వాళ్ళు మేదినీపుర్‌లో ఉండే కోయజాతివారు. వాళ్ళకి ఒక చోటంటూ లేదు, ఎప్పుడూ తిరుగుతూనే ఉంటారు. తాము జరాబోయవాని వంశం వాళ్ళని చెప్పుకుంటారు. జరాబోయి దేవుణ్ణి చంపాడు. ఆ శాపం జాతి మొత్తానికీ చుట్టుకుంది. ద్వారకాపురివంటి దూరప్రదేశం నుంచి అందుకే వాళ్ళు ఇంత దూరం వచ్చారు.

వాళ్ళకి ఇల్లూ వాకిలీ ఉండదు. పక్షుల్ని పట్టి అమ్ముతారు. శ్మశానంలో ఉండే చెట్లమీద వంటగిన్నెలు వేలాడగట్టి అక్కడే మకాం పెట్టుకుంటారు. వాళ్ళ జాతిలో పెళ్ళికొడుకూ పెళ్ళికూతురూ శవంతో వచ్చిన గుడ్డలమీద హాయిగా పడుకుని ప్రేమించుకుంటారు. చితిమంటలు చూసి వాళ్ళకి శ్మశాన వైరాగ్యం రాదు. మండుతున్న చితి ముందర కూర్చుని తల్లి పిల్లని ముద్దాడుతుంది! దంపతులు చేతులు కలిపి పాటలు పాడుకుంటారు. మేదినీపూర్‌లో ఉన్న ఉప్పుగనుల్లోనూ, జీడి, బాదం తోటల్లోనూ, దక్షిణ భారతదేశం నుంచి చాలామంది వచ్చి పనిచేస్తారు.

వీళ్ళ జాతిలో బైటివాళ్ళతో పెళ్ళిళ్ళు జరగవు. కానీ జటీ అందం అసాధారణమైనది. రాగిరంగు శరీరం, నీలంరంగు కళ్ళు, ఒత్తైన జుట్టు. జుట్టు ముడివేసుకుని జటీ ఆ ముడిలో ఎర్రరాళ్ళ దండ అలంకరించుకునేది. నది నీటిలో తన మొహం చూసుకోవట మంటేనూ, ముదురు నీలం రంగు బట్టలు వేసుకోవటమంటేనూ జటీకి చాలా ఇష్టం.

చలికాలంలో జటీ గూడెంలో వాళ్ళు సువర్ణరేఖ నది దగ్గర లోయలో ఉండేవారు. ఆ సమయంలో అక్కడికి చాలా రకాల పక్షులు వలస వచ్చేవి. అడవిలో వలవేసి జటీ పక్షుల్ని పట్టేది.

అక్కడే ఆమె ఒకరోజు ఉత్సవ్‌ని చూసింది. ఉత్సవ్ కాందోరీ జాతికి చెందినవాడు. చాపలల్లటం అతని వృత్తి. అప్పుడతని వయసు దాదాపు ముప్పై ఏళ్ళు. చామనచాయగా, పొట్టిగా, కడ్డీలాటి శరీరం అతనిది. అతని ఉంగరాల జుట్టు భుజాలవరకూ వేలాడేది. అతను సొంతంగా పాటలు కట్టి పాడేవాడు.

జటీని చూశాక అతనొక పాట కట్టాడు:

నీలి చీర సింగారించిన కుర్రదానా

నీకై నా మనసు రగిలిందే ఎర్రదానా...

అతను పాడే సమయంలో జటీ చేతుల్లో వల ఉంది. ఆ వలలో చిక్కి ఒక నెమలి కొట్టుకుంటోంది.

ఉత్సవ్‌పాట విని జటీ మొహం కోపంతో ఎర్రబడింది. ఆమె ఉత్సవ్ ముందుకొచ్చి నిలబడి, నేలమీద ఊసి, "నీ మనసు రగులుతోందా? చచ్చినోడా, ఏమిటా పాట? నీవల్ల నా పక్షి తప్పించుకుపోయింది!" అన్నది.

ఆ పక్షి పట్టుకునేదెందుకే సఖీ!

నీ పాదాలచెంత నా మనసనే పక్షి

పడి పొర్లుతోంది చూడు చెలీ!

నా మనసు రగుల్తోంది చూడు సఖీ

నీకోసం...

ఉత్సవ్ మళ్ళీ పాట అందుకున్నాడు. అతనికి చాలా సరదాగా ఉంది. అతని జాతి పిల్లలు ఇంత పొగరుగా ఉండరు. ఇలా కళ్ళెర్రజేసి మాట్లాడరు. ఈ పిల్ల కళ్ళూ, పెదవులూ, ముక్కూ చెక్కినట్టుగా ఉన్నాయి.

"వెధవ సచ్చినోడా!"

తిట్టి జటీ వెళ్ళిపోబోతూంటే ఉత్సవ్ ఆమెపైకి ఉరికి చెయ్యి పట్టుకున్నాడు.

"నువ్వు నన్నెందుకు తిట్టావు?"

"నువ్వు పాటెందుకు పాడావు? నా పక్షిని ఎందుకు ఎగరగొట్టావు?"

ఉత్సవ్ విరగబడి నవ్వాడు. ఆ తరవాత ఆమె చేతిలోంచి వల లాక్కుని పక్షిని విడిపించాడు.

ఆశ్చర్యంగా, కోపంగా చూస్తున్న జటీ మీదికి వల విసిరి, "నువ్వే నా పక్షివి, పారిపోవాలనుకుంటున్నావా? నువ్వు నా పక్షివి, నా ప్రాణం నీలోనే ఉంది" అన్నాడు.

జటీ ఏడవటం మొదలుపెట్టింది. ఆ తరవాత వల అక్కడే వదిలేసి పారిపోయింది. ఉత్సవ్ నవ్వు చాలా దూరం వరకూ ఆమెని వెంటాడింది.

మర్నాడు ఉత్సవ్ జటీవాళ్ళ డేరాకి వచ్చాడు. జటీవాళ్ళ నాయనమ్మ కాళ్ళకి నమస్కారంచేసి, "నేను మందుకోసం వచ్చాను. అడవుల్లోనూ, కొండలమీదా తిరుగుతాను. నా గుండెల్లో నెప్పిగా ఉంటోంది. మీరు చాలా తెలివైనవారనీ, మందులిస్తారనీ వచ్చాను. నాకు కూడా కొంచెం మందిస్తారా?" అని అడిగాడు.

జటీకూడా అక్కడే ఉన్నది. ఉత్సవ్ మాటలు విని ఆమె కోపంగా, "ఈ వెధవకి సరైన మందు చావదన్నటం! అది తినగానే వీడు బాగుపడతాడు. వీడు నే పట్టిన పక్షిని విడిపించేశాడు తెలుసా అవ్వా?" అన్నది.

జటీవాళ్ళ నాయనమ్మ నవ్వింది. ఆమె జటీని, "వెళ్ళి నీపని చూసుకో" అని కసిరింది.

ఆ జాతి ఆడపిల్లలు బైటిమనుషుల్తో కలవరు, వాళ్ళ జాతి దాటి బైటికి పోరు. ఆ గూడెం వాళ్ళు ఆచరించే పద్ధతి అదే. జటీ వ్యవహారం చూసి వాళ్ళ నాయనమ్మ భయపడింది.

ఉత్సవ్ వాళ్ళ డేరాకి మళ్ళీ రాలేదు. కానీ జటీ వెనకాలే తిరుగుతూ ఆమెకి రంగు రంగుల కలలు చూపించాడు. తనకీ ఒక ఇల్లూ వాకిలీ, మంచెపైన ధాన్యంతో నిండిన బుట్టలూ, పేముతో చేసిన ఉయ్యాలలో చంటి పిల్లవాడూ ఉంటే ఎంత బావుంటుందనిపించేలాగ చేశాడు. ఆ ఇంట్లో, అద్దంలో జటీ తన మొహం చూసుకుంటుంది. వెండి నగలు తొడుక్కుంటుంది, ఎరుపు, నీలం రంగు చీరలు ఆ ఇంటి ఆవరణలో ఆరుతూ ఉంటాయి.

రంగురంగుల చాపలకన్నా అందమైన కలలు చూపించి ఉత్సవ్ జటీని ఆకర్షించాడు.

జటీ ఆ వల విడిపించుకుని పారిపోలేకపోయింది.

వాళ్ళిద్దరూ ఇల్లొదిలి పారిపోయారు.

ఖరగ్‌పుర్‌నించి వాళ్ళు దీఘాకి వచ్చారు. జీడి, బాదం కాసే తరుణంలో వాళ్ళు తోటల్లో కూలీపని చేసేవాళ్ళు. చేపలు పుష్కలంగా దొరికేటప్పుడు చేపలు పట్టేవాళ్ళు.

ఎక్కువ దూరం పారిపోకపోతే బోయవాళ్ళు వాళ్ళని బాణాలతో కొట్టి

చంపేసేవారు.

ఉత్సవ్ జటీకి చూపించిన రంగుల కలల్ని నిజం చెయ్యలేకపోయాడు. అయినా జటీ సుఖంగానే ఉంది. ఏం జీవితం! ఇద్దరు మనుషులకి కొద్దిగా వండుకోటం, తినటం, ప్రేమించుకోటం. చేతిలో డబ్బులాడితే బట్టలు కొనుక్కోటం, గాజు పూసల దండలూ, గాజులూ, జరీ అంచులూ కొనుక్కోటం. జటీ జుట్టు ముడుచుకునే పద్ధతీ, బట్టలు వేసుకునే పద్ధతీ కూడా మారిపోయాయి. ఇప్పుడామె బోయ జాతిది కాదు. తన దర్జా పెరిగింది, ఎక్కువ జాతిదయింది.

"జటీ! మా జాతివాళ్ళు పెళ్ళాలని వదిలిపెట్టరు. ప్రతిజ్ఞ చేసి పెళ్ళి చేసుకుంటారు. మాంసం, అన్నంతో విందు చేసుకుంటారు."

"అవన్నీ ఒద్దులే!" జటీ భయంగా అంది.

ఈ ఇల్లూ, ఈ ప్రేమా దూరమైపోతాయేమోనని ఆమె భయం. అనాదికాలం నుంచీ వాళ్ళ జాతికి శాపం ఉంది. తన జాతివాళ్ళు దేవుణ్ణి మడమలో బాణంకొట్టి చంపారు. వాళ్ళకి ఇల్లూ వాకిలీ లేకుండా, చెట్లూ పుట్టలూ పట్టుకు తిరగమని శాపం ఉంది.

కానీ ఈ పాపం జటీ చెయ్యలేదు కదా!

ఒకవేళ కోపమొచ్చి నాయనమ్మ బాణం వదిలితే? ఆమె తల్లి ఉత్సవ్‌దీ, తనదీ గడ్డిబొమ్మలు చేసి సూదితో వాటిలో చిల్లులు పొడిస్తే? అప్పుడు తమ గతి ఏమిటి?

తలుచుకుంటేనే జటీకి చాలా భయం వేసింది. ఆమె గొంతు తగ్గించి, ఉత్సవ్‌తో, "వాళ్ళగురించి చెప్పక, ఇంకేదైనా మాట్లాడు" అన్నది.

"నువ్వు భయపడుతున్నావా?"

"దొంగసచ్చినోడా!"

జటీ అతన్ని గోముగా తిట్టింది. మొహం తిప్పుకుని జుట్టు ముడివేసుకుంది. తన జాతినుంచి వేరుపడటమంటే ఇదే లాగుంది! తక్కువ జాతినుంచి పైజాతికి వెళ్ళటమంటే ఇదేనా? "మీరెలాగైనా చావండి" అనుకోలేకపోతోంది. ఆమెకా గుండెధైర్యం లేదు.

అప్పుడప్పుడు డోలు చప్పుడు, డుం-డుం-డుం-డుం, విని ఆమె ఉలిక్కి పడుతుంది. కోయవాళ్ళు ఇలాగే డోలు వాయించుకుంటూ వస్తారు. వాళ్ళు గుంపులు

గుంపులుగా తిరుగుతారు. తేనెటీగల్లాగ ఏదో ఒకచోట ఆగి దేరాలు వేసుకుంటారు.

కలిసికట్టుగా ఉండటం వాళ్ళకి అన్నిటికన్నా ముఖ్యం.

వాళ్ళు మామూలు మనుషులు కారు. వాళ్ళు జరాబోయవాడి సంతతి. జరా మామూలు బోయ కాడు. ఆయన సాక్షాత్తూ శ్రీకృష్ణపరమాత్మనే చంపినవాడు. ఊళ్ళోవాళ్ళూ, ఇంట్లోవాళ్ళూ పాపాలు చేసి చేసి శిక్షలనుభవించటం, శ్రీకృష్ణుడు చూడలేక, తన దుఃఖాన్ని మర్చిపోవటానికని నిర్జనమైన అడవిలోకెళ్ళి కూర్చున్నాడు. ఆయన పాదాలు తామరపువ్వులాగ, ఎర్రగా ఉండేవి.

జటీవాళ్ళ నాయనమ్మ తల తెగ తిప్పుతూ చెప్పేది, "బోయ ఎత్తుగా పెరిగిన జమ్ముగడ్డిలో దాక్కుని పిట్టల్ని వేటాడుతున్నాడు. అతనికి ఎర్రటి తామరపువ్వులవంటి పాదాలు కనిపించాయి. వాటిని చూసి అతను ఏదో పక్షి అనుకుని వెంటనే బాణంతో కొట్టాడు. ఆ తరవాత ఏమయిందనుకున్నావు?"

"ఆకాశమంతా నల్లగా చీకటి అలుముకుంది. సూర్యుడు మాయమయాడు. దుఃఖం భరించలేక సముద్రుడు తనలోపల దాగిన ప్రాణులన్నిటినీ వెలిగక్కాడు. చేపలు పట్టే పడవ మునిగిపోయి చచ్చిపోయిన వాళ్ళు కూడా మళ్ళీ బతికొచ్చి ఏడవసాగారు. గొల్లవాళ్ళు ఆవుల పాలు పిండితే వాటి పొదుగులనుంచి రక్తధారలు కారాయి. పట్టపగలే ఆకాశం నల్లబడి నక్షత్రాలు కనబడ్డాయి.

అదే సమయంలో, అశరీరవాణి వినబడింది :

"భగవంతుణ్ణి చంపినవాళ్ళు పుట్టగతులు లేకుండా పోతారు. వాళ్ళకీ ఇల్లూ వాకిలీ లేకుండా చెట్లంటా పుట్టలంటా తిరుగుతారు. ఓయీ, జరా బోయా! భగవంతుడు ఈ భూమ్మీద మళ్ళీ మళ్ళీ పుడతాడు. నీలాంటి కసాయివాళ్ళు నూటికో కోటికో ఒక్కరు ఎప్పుడో ఆయన్ని బాణాలతో కొడతారు. ఈ పాపం చేసినవాళ్ళకి నిలవనీడ దొరకదు. ఇప్పుడిక నువ్వు నీ జాతివాళ్ళందర్నీ వెంటబెట్టుకుని ఇక్కణ్ణించి వెళ్ళిపోవాలి, తెలిసిందా?"

"ఎక్కడికి పోము?"

"నీ రెండు కళ్ళూ ఎక్కడికి తీసుకెళ్తే అక్కడికి."

"జాతినంతా తీసుకువెళ్ళాలా?"

"అందర్నీ తీసుకెళ్ళక ఒక్కడివే వెళ్తావా? నీ జాతికి చెందిన వాళ్ళందరూ మహాపాపులే. మీ జాతివాళ్ళు తమ పిల్లల పెళ్ళిళ్ళు మిగతా జాతివాళ్ళతో చేస్తే,

వాళ్ళు చస్తారు. అందుకే పెళ్ళిళ్ళు మీ జాతిలోనే జరగాలి. విను జరా, విను! ఓ బోయవాడా, నా గొంతు నీకు వినిపిస్తోందా?''

"వినిపిస్తోంది.''

"విను, మీ జాతి పిల్లలెవ్వరూ జాతిని వదిలి వెళ్ళటానికి వీల్లేదు. నీ పాపంలో వాళ్ళందరూ పాలువంచుకోవలసిందే. పుట్టినవెంటనే వాళ్ళని దేవుడికిచ్చి పెళ్ళిచెయ్యి.''

"అలాగే చేస్తాను.''

జరా ఏడుస్తూ, "అయ్యో! ద్వారక వదిలి ఎలా వెళ్ళటం? ఎంత అందమైనదీ ద్వారకాపురి! నీలంగా మెరిసే సముద్రం ఒడ్డున బంగారు కలశాలున్న ఇళ్ళూ, వాకిళ్ళూ!''

జరా అడవిలో ఉండక తప్పదు. దూరం నుంచే ఈ అందాలు చూసి తృప్తిపడటం తప్ప వేరే దారిలేదు. మిగతావాళ్ళ సుఖమూ, ఆనందంలోనే తన సుఖం చూసుకుంటాడు.

ఆ తరవాత జరా కోయ నానా కష్టాలూ పడ్డాడు. తన జాతివాళ్ళనీ, కుటుంబాన్నీ, సామానుల్నీ, వేటకుక్కల్నీ తీసుకుని చెట్లూ పుట్టలూ పట్టుకు తిరిగాడు.

సత్యపుత్ర, కేవల్‌పుత్ర, చోళ, పాండ్య రాజ్యాల్లో తెగ తిరిగాడు. ఎక్కడా నిలవనీడ దొరకలేదు. జనం ఎక్కడికెళ్ళినా తరిమేసేవారు, "అవునూ, దేవుణ్ణి బాణంతో కొట్టి చంపింది చాలక ఇప్పుడు మా దేశాన్ని నాశనం చెయ్యటానికి వచ్చావా? ఓరి దొంగనక్కా! ద్వారకాపురిని శ్మశానంగా మార్చావు, ఇక మమ్మల్ని చంపటానికి వచ్చావా?''

జరాకి ఎక్కడా నిలవనీడ లేకుండా పోయింది. పైనించి చూస్తున్న దేవతలు నిట్టూర్పులు విడిచారు. ద్వాపర యుగం వెళ్ళింది, కలియుగం వచ్చింది. అలా చెట్లూ పుట్టలూ పట్టుకు తిరుగుతూ జరా జీవితం వెళ్ళిపోయింది. వయసు మీదపడింది, కాళ్ళు కాయలు కాచాయి. ఒంట్లో బావుండటంలేదు. ఎవరో ఒకరోజు దయతలిచి, "రాఢ్ అనే ప్రదేశం తెలుసునా? వంగదేశం తెలుసునా? గౌడదేశం ఉంది, తెలుసా? అక్కడికి వెళ్ళండి. గంగ సముద్రంలో కలిసే చోటుకి వెళ్ళండి. ఆ దేశంలో పాపులూ, తప్పుడు పనులు చేసేవాళ్ళూ, వంచకులూ ఆశ్రయం పొందుతారు. ఆ దేశంనించీ ఎవరినీ తరమరు. అక్కడికి వెళ్ళండి'' అన్నారు.

జరా ఆ దేశానికి వెళ్ళాడు.

"తమ తెగవారితోనే పెళ్ళిళ్ళూ, శ్మశానంలోనే శోభనాలూ, శ్మశానంలోని కుండల్లోనే ఆడవాళ్ళు వంటలు వండటమూ, ఇదీ వాళ్ళు జీవించే పద్ధతి. దాదాపు అందరూ స్వతంత్రులే. ఆడపిల్లలు చాలా అందంగా ఉంటారు. రాగి రంగు జట్టుని పైకి దువ్వి ముడి వేస్తారు. పూసల పేర్లతో అలంకరించుకుంటారు. శరీరాలు చెక్కిన శిల్పాలంత అందంగా ఉంటాయి. తరతరాలుగా వాళ్ళు తమ తెగలో వాళ్ళనే పెళ్ళాడుతూ ఉండటంచేత వాళ్ళ రక్తంలో కల్తీ లేదు. అందుకే వాళ్ళు చూడటానికి అంత అందంగా ఉంటారు.

వాళ్ళ తెగలో చనిపోయినవాళ్ళు పోగా ఇప్పుడు ఒక వందమంది మిగిలారు. వీళ్ళంతా ఎప్పుడూ కలిసే ఉంటారు.

పట్టణాల్లోనూ, గ్రామాల్లోనూ డుం ... డుం ... అని డప్పు వాయిస్తూ కనిపిస్తారు.

వీళ్ళనిచూసి జనం, "అదుగో కోయలు వెళ్తున్నారు" అంటారు.

వీలైనంతవరకూ వీళ్ళు పట్టణాలవేపుకి వెళ్ళరు. ఎప్పుడైనా ట్రైబల్ వెల్‌ఫేర్ ఆఫీస్‌లో తమ పేరు నమోదు చేయించుకోటానికీ, ఎవరైనా చనిపోతే వాళ్ళ పేరు కొట్టెయ్యటానికీ వస్తారు.

గవర్నమెంటు ఫైళ్ళల్లో వాళ్ళని సంరక్షిత ఉపజాతుల కింద గణిస్తారు.

జటీ సగం ధ్యాస ఉత్సవ్ చెప్పే మాటలమీదా, సగం డుం ... డుం ... శబ్దంమీదా ఉంది. వాళ్ళొకవేళ వచ్చేస్తేనో అని భయపడింది.

తన తల్లీ, తండ్రీ, నాయనమ్మా, తెగవాళ్ళూ!

వాళ్ళొచ్చి, "పద, మాతోనే ఉందువుగానీ, అంటే?"

అప్పుడు జటీ ఏం చేస్తుంది?

ఆమె భయంచూసి ఉత్సవ్ నవ్వి, పాట కట్టేవాడు :

భయం వదలవే పిల్లా
ప్రేమలో పడ్డనీకీ భయమూ
సహజమే కాదులే పిల్లా.

జటీ నవ్వి, "వెధవ సచ్చినోడా!" అనేది.

"నేను బతికుండగా నిన్ను తీసుకుపోయే ధైర్యం ఎవరికుందే? నీ

ఆటవికజాతి మనుషులు ఏం చెయ్యగలరు? వాళ్ళకు నాగురించి బాగా తెలుసు? ఒక్కసారి ఇన్‌స్పెక్టర్‌తో చెపితేచాలు, అందరి పనీ పడతాడు."

అయినా జటీని భయం వదల్లేదు. మెల్లిమెల్లిగా ఉత్సవ్ ఆమె భయం పోగొట్టగలిగాడు.

కొన్నాళ్ళకి ఆమె ఒళ్ళోకి బొద్దుగా, నల్లగా ఉన్న ఒక పాపాయి వచ్చాడు. ఉత్సవ్‌కి ఉన్నట్టే వాడి తలమీదా ఒత్తైన ఉంగరాల జుట్టుంది. తండ్రి తలకి చిన్న అచ్చు తయారుచేసి పిల్లవాడి మొండానికి అమర్చినట్టుగా ఉన్నాడు. చూడగానే ఎవరైనా ఉత్సవ్ కొడుకని చెప్తారు. పిల్లవాడి కళ్ళు మటుకు జటీవి, స్వచ్ఛంగా, పెద్దవిగా, నీలంగా.

ఉత్సవ్ ఇంకా పైజాతివాడనిపించుకోవాలని ఉబలాటపడ్డాడు. జటీని తన జాతిలో కలుపుకున్నాడు. చాపలల్లేవాళ్ళు కోయవాళ్ళకన్నా ఎక్కువజాతివాళ్ళని అతనికి తెలుసు. ఇప్పుడతను కూలీ పని చేస్తున్నాడు. ఇంకోమెట్టు పైకెక్కాడు.

ఒక పిల్లవాడికి తండ్రి అయ్యాక తనింకా పైకి వెళ్ళాలని ఆశపడ్డాడు. ఇప్పుడు పేదవాళ్ళ సావాసం అతనికి నచ్చటంలేదు. పెద్దమనుషుల సమాజంలో ఒక మూలగా కూర్చోవాలని చూస్తున్నాడు.

ఉత్సవ్ తన కోరిక జటీకి చెప్పాడు.

"జటీ, ఓ జటీశ్వరీ! నేను బి.డి. ఆఫీసుకి వెళ్ళాను. అక్కడి గుమాస్తాలేమన్నారో తెలుసా?"

"ఏమన్నారు?"

"ఇప్పుడింక సమస్య లేదుట. డబ్బిచ్చి నా పేరు మార్పించుకోవచ్చుట. కాందోరీ - ఫాందోరీ అనే పేరు వినగానే అందరికీ నేనే జాతివాణ్ణో తెలిసిపోతుంది."

"అందుకని, పేరు మార్చుకుంటావా?"

"ఏం మార్చుకుంటే? 'ఉత్సవ్ కాందోరీ' - వినటానికి ఎబ్బెట్టుగా లేదూ? ఉత్సవ్ దాస్, సాధన్ చంద్రదాస్, వినటానికెంత బావుంది? ఆ తరవాత మనం ఇంకేదైనా పని చూసుకుని పట్నం వెళ్ళిపోతే అప్పుడు చూడు తడాఖా!"

"అప్పుడేమవుతుంది?"

"పెద్ద పట్నమంటే ఏమనుకున్నావు? జగన్నాధుని తీర్థస్నానంలాగా ఉంటుంది. అక్కడ ఎవరూ ఎవర్నీ పట్టించుకోరు. పేరు వినగానే, వీడెవడో పైజాతి

మనిషే, లేకపోతే పేరు చివర 'దాస్' ఎందుకుంటుంది, అనుకుంటారు."

ఉత్సవ్ మాటలు విని జటీ పొంగిపోయింది. నడుంమీద చేతులు పెట్టుకుని ఆమె నాట్యం చెయ్యటం ప్రారంభించింది. ఒక్క క్షణం ఆగి, "పద ఇప్పుడే వెళ్దాం. వెంటనే పైజాతిలో చేరిపోదాం" అంది.

ఉత్సవ్ చాలా ప్రేమగా ఆమెకి నచ్చజెప్పాడు, "నువ్వొత్తి పిచ్చిదానివే! ఇప్పుడే ఎలా వెళ్తాం? పిల్లవాడు కొంచెం పెద్దవాడవనియ్యి. వీడికి అన్నప్రాశనం కానియ్యి. దేవుడికి నైవేద్యం పెట్టాకే మిగతావన్నీ."

జటీకి ఒక అనుమానం వచ్చింది - తన జాతివాళ్ళు ఒకప్పుడు దేవుణ్ణి హత్య చేశారు. అలాంటి తను, తన తెగకి సంబంధించిన దేవుణ్ణి కాక ఇంకో దేవుణ్ణి పూజించవచ్చునా? అలా చేస్తే పాపం చుట్టుకుంటుందేమో! ఏమైనా చెడు జరుగుతుందేమో!

మళ్ళీ తనే అనుకుంది - ఉత్సవ్ చెప్పింది నిజమే. అన్నీ వదిలేసి పట్నానికి పారిపోయి ఆఫీసులో జాతి మార్చి రాయించిన తరవాత తననెవరూ పట్టుకోలేరు.

"సరే, అలాగే చేద్దాం" జటీ కళ్ళు మూసుకుని అన్నది.

కానీ కోయల ఆదిపురుషుడు, జరాబోయతో అశరీరవాణి పలికిన దేవతలు నవ్వుకున్నారు.

సాధన్ అన్నప్రాశన కూడా అయిపోయింది. ఉత్సవ్ ఆ రోజుల్లో ఖడ్గపుర్ స్టేషన్లో కూలీపని చేసేవాడు. అతను మిగతా కూలీలకి మాంసం - అన్నంతో విందు కుడిపాడు. ఆ తరవాత దొంగతనంగా కొన్ని నాటుసారా తాగి, వాంతి చేసుకున్నాడు. ఆస్పత్రిలో చేర్పించారు కానీ బతకలేదు.

తను చూపించిన కలలూ, గుండెనిండా ప్రేమా, గొంతునిండా పాటలూ, అన్నీ తనతోనే తీసుకుపోయాడు. జటీ మళ్ళీ ఒంటరిదయింది. ఇప్పుడామె స్వతంత్రురాలు. ఎక్కడికి కావాలంటే అక్కడికి పోగలదు. కానీ ఉయ్యాలలో పిల్లవాడు ఏడ్చేవాడు, ఆమెవైపు కళ్ళు విప్పార్చి చూసేవాడు.

ఏం చెయ్యాలో జటీకి తోచలేదు. తను మళ్ళీతన తెగవాళ్ళతో కలిసిపోవాలా? తన నాయనమ్మ కాళ్ళమీదపడి ఏడవాలా? పోలీసులూ, డాక్టరూ వేరే కారణాలు చెప్పినా, నాయనమ్మ వేసిన బాణమే ఉత్సవ్ ప్రాణాలు తీసిందని జటీకి తెలుసు.

బెదిరిన పక్షిలాగ జటీ, పిల్లవాణ్ణి గుండెలకి హత్తుకుని తన తెగని

వెతుక్కుంటూ వెళ్ళింది.

అయ్యో, దేవుడా! తన వాళ్ళంతా ఏమయ్యారు? వాళ్ళ రంగురంగుల దుస్తులూ, కుక్కలూ, మేకలూ, గాడిదలూ, వాటిమీద వేసిన సామానూ, గలగల నవ్వే నాయనమ్మా, ఏరీ? ఎక్కడికెళ్ళారు?

వాళ్ళు శ్మశానంలోనూ కనపడలేదు, అడవిలోనూ లేరు, దారులపక్కల్లోనూ కనబడలేదు. ఎక్కడా లేరు. జటీ పట్నంలోని ట్రైబల్ బోర్డ్‌కి పరిగెత్తుకుని వెళ్ళింది.

"బోయ వాళ్ళెక్కడికెళ్ళారో చెప్పండి. బాబ్బాబూ, మీ కాళ్ళట్టుకుంటాను!" జటీ చప్రాసీ కాళ్ళు పట్టుకుంది.

"అరె, ఫో! వెళ్ళి శ్మశానంలో వెతుక్కో! వాళ్ళెక్కడున్నారో మాకేం తెలుసు?"

జటీ కళ్ళు ధారలు కట్టాయి. తనకి తెలిసిన జాతినీ, సమాజాన్నీ వదిలి ఆమె ఉత్సవ్ జాతిలో కలిసిపోయింది. ఉత్సవ్ ఎంత ఊహించాడు? ఎన్ని కలలు కనిపించాడు? కానీ చివరికి ఆ కలలన్నీ లాగేసుకుని తానే వెళ్ళిపోయాడు. ఇప్పుడు జటీ ఏం చెయ్యాలి?

ఇంత అందం, ఆరోగ్యమైన శరీరం, యౌవనం తోడుతీసుకుని ఆమె ఎక్కడికి వెళ్తుంది? దారి తోచక ఆమె స్టేషన్‌లోకెళ్ళి కూర్చుంది. ఒళ్ళో పిల్లవాడు. రెండు చేతుల్లో మొహం పెట్టుకుని ఆమె ఏమేమిటో ఆలోచించింది.

జటీ తన పిల్లవాడి గురించి ఆలోచిస్తూంటే, ఆమెనే చూస్తున్న కొందరు ఆమెని గురించి ఆలోచిస్తున్నారు.

ఇప్పుడేం చెయ్యాలి? ఎక్కడికి పోవాలి? జటీ కూలీలైన్లో ఉండే హనుమాన్ గుడికి వెళ్ళి అక్కడి సన్యాసిని సలహా అడిగింది.

సన్యాసి, "గుడిలో ఉండు" అన్నాడు.

సన్యాసి ఆమెతో మాట్లాడుతున్నప్పుడు కూడా కళ్ళు మూసుకునే ఉన్నాడు. నడి వయసులో ఉన్న సన్యాసి ఇంతకుముందు చాలా గుళ్ళల్లో పూజ చేశాక ఇప్పుడు ఇక్కడ స్థిరపడ్డాడు. ఇప్పుడతని పరిస్థితి కూడా మెరుగుపడింది.

జటీ అక్కడ ఉండటంవలన ఆ గుళ్ళో రద్దీ పెరిగింది. సన్యాసి లోలోపల చాలా భయపడ్డాడు.

కొన్నాళ్ళు గడిచాక కొంతమంది జటీ దగ్గరకొచ్చి, "ఈ ముసలివాడితో ఉంటే ఏం లాభం? మాతో రా. మేం పట్నం మొత్తం తిప్పి చూపిస్తాం" అన్నారు.

జటీ నరాల్లో ప్రవహిస్తున్న రక్తంలో కొన్ని వేల సంవత్సరాలబట్టీ వస్తున్న గుణాలు అలాగే ఉన్నాయి. అడవులూ, కొండలూ, పశుపక్ష్యాదులంటే ఆమెకి తగని ప్రేమ. అలాగే అపరిచిత వ్యక్తులంటే భయం.

జటీ వాళ్ళని తిట్టి పంపేసింది.

బహుశ వాళ్ళే వెళ్ళి పోలీసులకి చెప్పి ఉండాలి.

కొన్నాళ్ళకి పోలీసులొచ్చారు. "మాకంతా తెలిసిపోయిందిలే!" అని వాళ్ళు సన్యాసిని బెదిరించారు.

"ఏం తెలిసింది, బాబూ? నేనా సన్యాసిని. దేవుడి సేవలోనే బతుకుతున్నాను."

"దేవుణ్ణి పూజిస్తున్నావా, లేక దేవిని ఆరాధిస్తున్నావా?"

"ఛీ! ఛీ! పురుగులు పడిపోతారు..."

"గుళ్ళో ఆడదాన్ని ఉంచుకుని, పైగా మమ్మల్నే దబాయిస్తున్నావా? ఇక్కడ ఏమేం వెధవపనులు జరుగుతున్నాయో మాకంతా తెలుసు. ఇక్కడ తాగుడూ, జూదం అన్నీ నడుస్తున్నాయి."

"అంతా అబద్ధం."

సన్యాసి మొహం జేవురించింది.

పోలీసుల్లో ఒకడు పిల్లలు గలవాడు. అతను సన్యాసికి సలహా ఇచ్చాడు, "ఇది అబద్ధమని నాకూ తెలును. ఈ పిల్లవల్లే గొడవంతానూ. దీన్ని తరిమెయ్యరాదూ?" అన్నాడు.

"తరిమేస్తే ఆ దుష్టుల చేతుల్లో చిక్కుకుంటుంది. వాళ్ళక్కావలసిందీ అదే."

"అయితే నీ చావు నువ్వు చావు!" పోలీసు విసుక్కున్నాడు.

వెళ్ళిపోయే ముందు పోలీసువాడు సన్యాసికి మళ్ళీ నచ్చచెపుతూ, "గూండాలకీ, రౌడీలకీ అనవసరంగా ఎందుకు కోపం తెప్పిస్తావు? నీ దగ్గర బెల్లం ఉన్నంతకాలం ఈగలు ముసురుతూనే ఉంటాయి. ఆ అందమైన పడుచుపిల్ల ఇక్కడ ఉన్నన్నాళ్ళూ ఈ వెధవలు ఇక్కడికి వస్తూనే వుంటారు. ఇప్పుడు వీళ్ళదే రాజ్యం. వీళ్ళు ఆ పిల్లని బలవంతంగా ఎత్తుకుపోయినా ఆపే ధైర్యం ఎవరికీ లేదు" అన్నాడు.

సన్యాసి చాలా ఇరుకులో పడ్డాడు. తనక్కడ ఇంకొన్నాళ్ళుంటే తనకీ,

సన్యాసికీ ఇద్దరికీ మంచిది కాదని జటీకి అర్థమయింది.

"ఇందా, ఈ గిన్నెలూ, తప్పేలాలూ తీసుకో. ఇల్లు ఉంటే వీటి అవసరం ఉండేది. ఇప్పుడిక ఇవి నాకు అక్కర్లేదు. ఇవి తీసుకుని నాకు కాసిన డబ్బులివ్వు."

"ఎక్కడికెళ్తావు? నీ కొడుకేమవుతాడు?"

"తెలీదు."

సన్యాసి నిట్టూర్చి, ఇంక ఆమెని వివరాలడగటం మానేశాడు. ఆమె కట్టుకోటానికి ఒక ఎర్రటి బట్టా, త్రిశూలమూ ఇచ్చి, "ఏదో ఒకరోజు నిన్ను నక్కలూ, తోడేళ్ళూ పీక్కుతింటాయని నాకు తెలుసు. అయినా, ఈ బట్టా, త్రిశూలమూ తీసుకో. ఈ బట్టి కట్టుకుని, త్రిశూలం చేత్తో పట్టుకుని నీ ఇష్టం వచ్చిన చోటికి పో. ఈ ఘోరకలిలో కూడా సాధు-సన్యాసులు థర్డ్‌క్లాస్‌లో ఇష్టమొచ్చినట్టు ప్రయాణం చెయ్యవచ్చు. వాళ్ళనెవరూ ఆపరు" అన్నాడు.

"ఎవరైనా అడిగితే ఏం చెప్పను?"

"నేను జటీ ఠకురానీని అని చెప్పు."

"ఠకురానీ!"

నిజంగానే రైల్లో జటీ ఠకురానీని ఎవ్వరూ ఆపలేదు. ఆమె అందమూ, కట్టుకున్న బట్టా, వీపుమీద మూటలా కట్టుకున్న పిల్లవాడూ, చేతిలో త్రిశూలం - ఈ వేషం చూసి అందరూ నోళ్ళు వెళ్ళబెట్టారు.

రైల్లో కూర్చుని జటీ కిటికీలోంచి బైటికి చూస్తోంది. కళ్ళల్లోంచి నీళ్ళు ధారగా కారుతున్నాయి. ఆ మనిషి తనని ఎంతగా గౌరవించాడు! ఎంతగా ప్రేమించాడు! దీనినే పైజాతిలోకి వెళ్ళటమంటారా? అయ్యో, ఉత్సవ్ బతికుంటే చూసేవాడుకదా! ఆఫీసులూ, కోర్టులూ ఏవీ లేకుండా ఒక్క ఎర్ర బట్టా, త్రిశూలమూ సంపాదించుకుని వాటి సహాయంతో తనెంత గొప్పదయిపోయిందో చూసేవాడు.

రైల్లో ఒక మనిషి జటీనే చూస్తున్నాడు. అతను రైల్లో పాటలు పాడుతూ తిరుగుతుంటాడు. భజనలో, క్రిష్ణునిమీద గీతాలో పాడుకుంటూ ఉంటాడు. మనిషి ముసలివాడు, ఏకాకి.

జటీని చూసి, "హౌరా వరకూ వచ్చేశావు తల్లీ! ఇంకెక్కడికెళ్ళాలని?" అని అడిగాడు.

జటీ జవాబు చెప్పలేదు.

హౌరా స్టేషన్లో ఉండే జనారణ్యాన్ని చూసి నీరుకారిపోయింది. ఇదేనా ఉత్సవ్ చెప్పిన తీర్థక్షేత్రం? ఎంతమంది మనుషులో! వీళ్ళని లెక్కపెట్టటం కూడా కష్టమే. అడవిలోని చెట్టుమీద కూడా ఇన్ని ఆకులుండవేమో! ఈ జనంలో తానెక్కడికి వెళ్తుంది?

"నేనడిగింది వినిపించలేదా? ఎక్కడికెళ్ళాలి?" అతను మళ్ళీ అడిగాడు.

"నాకు తెలీదు" జటీ అంది.

"నా ఇంటికి వస్తావా?" అని అడిగాడు.

"ఎక్కడుంది?"

జటీకి అతన్ని చూస్తే భయం వెయ్యలేదు. ఆమె ఆటవిక రక్తంలో సహజంగా ఉన్న గుణమే ఆమెకి దారి చూపుతోంది. మనిషిని చూడగానే ఎవర్ని చూసి భయపడాలో, ఎవర్ని చూసి భయపడక్కర్లేదో ఒక్కక్షణంలో పసికట్టెయ్యగలదు. ఆ బక్కపల్చని మనిషిని చూసి ఆమె భయపడలేదు. అదీగాక, కళ్ళెదుట ఉన్న అద్భుత దృశ్యం నుంచి ఆమె చూపు తిప్పుకోలేకపోయింది.

"నాతోరా."

"ఎక్కడికి?"

"నా కొంపకి. నేను రైళ్ళల్లో పాటలు పాడుకుంటూ పొట్టనింపుకుంటున్నాను."

"పాటలు పాడతావా?"

"ఆఁ."

అతను జటీకి తన గురించి చెప్పాడు. పాటలు పాడుతూ ముష్టెత్తుకుంటాననీ, జటీ పిల్లవాణ్ణి ఎత్తుకుని అతనితో కూడా వస్తే ఇంకా ఎక్కువ బిచ్చం దొరుకుతుందనీ అన్నాడు.

"నీ ఇల్లు ఎక్కడుంది?"

"మీనమేషాలు లెక్కపెట్టకు. నాతో రావాలంటే వెంటనే బయలుదేరు."

ఒక ఏడాదిపాటు జటీకి అతనింట్లో జీవితం హాయిగా గడిచిపోయింది. అతను పాటలు పాడుతూ ముష్టెత్తుకుంటూ ఉంటే జటీ పిల్లవాడితో అతని వెంటే నడిచేది. సాయంత్రానికి పోగైన డబ్బుల్తో ఏది దొరికితే అది వండుకుని తినేవారు. తిండి తిన్నాక అతను ఆరుబయట పడుకుంటే జటీ గది లోపల గడియపెట్టుకుని పడుకునేది.

"సాధన్, నా తండ్రీ! నా బాబూ!" అని జటీ పిల్లవాణ్ణి ముద్దుచేసేది. అప్పుడప్పుడూ ఆమె చేసే అతి ముద్దుకి ఆ పిల్లవాడు తట్టుకోలేకపోయేవాడు.

స్టేషన్ దగ్గర నేపాల్, భూటాన్ నుంచి వచ్చిన ముసలివాళ్ళు తాయెత్తులూ, రకరకాల పూసలపేర్లూ, పక్షుల గోళ్ళూ, కప్పల చర్మాలూ అమ్మేవారు. వాళ్ళని చూశాక జటీకి కూడా వాళ్ళలాగా ఏదైనా అమ్మి డబ్బు సంపాదించాలన్న ఆలోచన వచ్చింది. కొందరు ఆమెతో, 'నువ్వు సన్యాసినివికదా? నీకు మందులూ మాకుల గురించి చాలా తెలిసి ఉండాలే? నాకు కీళ్ళవాతం, ఏదైనా చిట్కా ఉంటే చెప్పరాదూ?' అనేవాళ్ళు. వాళ్ళ మాటలకి జటీకి కోపం వచ్చేదికాదు. తన నాయనమ్మ చిన్నప్పుడు చెప్పిన కొన్ని చిట్కాలు జ్ఞాపకం చేసుకోటానికి ప్రయత్నించేది. కొందరికి మందుకూడా ఇచ్చేది.

తనకి బాగానే గడిచిపోతోంది. ఇలా జీవితం సాగిపోయేదే. కానీ ఒకరోజు ఆ మనిషి గదిలో పడుకోవాలనుందని అన్నాడు. పాపం, ఎన్నాళ్ళని బైట పడుకోగలడు? బైట పడుకోటంలో ఉన్న అవస్థ జటీకేం తెలుసు?

జటీ త్రిశూలం చేతిలోకి తీసుకుని, "నేనెవరో తెలుసా? ఏ జాతిదాన్నో తెలుసా? నా తల్లీ, తండ్రీ, తెగవాళ్ళూ ఎవరో తెలుసా? నాతో ఇలా మాట్లాడటానికి నీకెన్ని గుండెలు? బాణాలు వేసి నీ ప్రాణం తియ్యగలను జాగ్రత్త!" అని బెదిరించింది.

మర్నాడే జటీ అక్కణ్ణించి వెళ్ళిపోయింది. చాలా ఆలోచించిన మీదట ఆమె ఠకురానీగా మారింది. ఠకురానీగా మారకపోతే మతిలేని తన కొడుకుని బతికించుకోటం సాధ్యం కాదని తెలుసుకుంది. తనని తాను కాపాడుకోటానికి కూడా ఆమెకి ఇంకో మార్గమేదీ తోచలేదు.

తన చుట్టూ ఈ అలౌకికమైన లక్ష్మణరేఖ గీసుకోనిదే తనకి రక్షణ లేదని తెలుసుకుంది.

"అందంగా ఉన్నవాళ్ళని ఈ లోకం నెమ్మదిగా బతకనివ్వదు" అని గొణుక్కుంది.

## మూడు

"సాధన్, నువ్వు నీ తల్లికి శ్రాద్ధం పెట్టాలయ్యా!"

పంచాయితీ పెట్టారు.

"అమ్మకి తద్దినం పెడతాను. అమ్మకి నేను ఏనుగూ, గుర్రం, భూమీ, బంగారం, వెండీ అన్నీ దానం చేస్తాను. నేను ఆమెకి మాటిచ్చాను."

అక్కడ చేరినవాళ్ళు ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. సాధన్ మాటలు పిచ్చివాడి ప్రేలాపనలాగా అనిపించాయి. కానీ సాధన్ తల్లికి మాటివ్వటం నిజమే.

అదీకాక, జటీ ఠకురానీ మామూలు స్త్రీకాదు. ఆమె ఈ ప్రపంచానికి సంబంధించిన మనిషి కాదు. దేవతామూర్తి!

"సాధన్, ఏమిటి నువ్వనేది? నువ్వు చెప్పే వస్తువులన్నీ ఇవ్వటానికి ఎంత డబ్బు కావాలో ఏమిటో ఏమైనా తెలుసా?" బలరామ్ రహస్యంగా అన్నాడు.

"ఏం చెయ్యను? మరి మాటిచ్చానుకదా?"

"అయితే వెళ్ళు, వెళ్ళి ముష్టెత్తు! ఇంటింటికీ వెళ్ళి అడుక్కుని తీసుకురా."

సాధన్ మెళ్ళో జోలె తగిలించుకుని బిచ్చమెత్తటానికి బైలుదేరాడు. తల్లి ఇక లేదు. సాయంకాలం పూట వేడి వేడి అన్నం ఎవరు పెడతారు? చేపల్ని తరిగి, వేయించి, అల్లం, నిమ్మకాయ, మిరపకాయలూ, ఉప్పు, నూనె వేసి కలిపి,"రారా, నాయనా, నా ఒళ్ళో కూర్చో!" అని ఎవరు పిలుస్తారు?

మెళ్ళో జోలె, నడుంకి చిరిగిన కంబళి కట్టుకుని కళ్ళల్లోంచి నీళ్ళు కారుతుండగా సాధన్ బిచ్చానికి బైలుదేరాడు.

ఎవరికీ ఏమీ ఇవ్వటం ఇష్టంలేదు. రోజల్లా తిరిగి తిరిగి అతని కాళ్ళ నరాలు పట్టేశాయి. కానీ ఇరవై ఒక్క రూపాయలకన్నా ఎక్కువ దొరకలేదు. బియ్యం ఒక సేరు దొరికింది. సేరు బియ్యం ఇచ్చి డాక్టర్ అనాది జటీపట్ల తనకున్న ఋణం తీర్చుకున్నాడు.

చివరికి బలరామ్ కాళీఘాట్‌కి వెళ్ళాడు. అందరికన్నా దీనంగానూ, బీదగానూ ఉన్న పురోహితుణ్ణి పట్టుకుని, అతనికి సాష్టాంగపడి "నేను చాలా కష్టాల్లో ఉన్నాను. నేనంటే నేను కాదు, నా మిత్రుడు. కర్రా విరగకుండా, పామూ చావకుండా ఉండేటట్టుగా ఏదైనా ఉపాయం చెప్పండి" అన్నాడు.

"ఏమిటి సంగతి?"

బలరామ్ సమస్య విని అతను నవ్వాడు. "మీరు ఎప్పుడూ తేనె బదులు బెల్లమూ, బంగారం బదులు రూపాయి పావలా ఇస్తారు. కాస్త శాస్త్రాల్లో చూసి ఈ

సమస్యకి కూడా పరిష్కారం చెప్పండి" అన్నాడు బలరామ్.

"ముందు నా దక్షిణ అక్కడ పెట్టు, తరవాత చెప్తాను" బ్రాహ్మణుడు పొడుం పీలుస్తూ అన్నాడు.

"ఎంత?"

"వంద రూపాయలు."

"వంద రూపాయలే నాదగ్గరుంటే నీలాంటి దరిద్ర బ్రాహ్మణుణ్ణి వెతుక్కుంటూ ఎందుకొస్తాను?"

"సరే ఎనభై ఇయ్యి."

బ్రాహ్మణుడు ఆశగా బలరామ్‌వైపు చూశాడు. ఇలాంటప్పుడే స్క్రూ బిగిస్తే రూపాయలు కక్కుతారు. కానీ ఈ బీదబ్రాహ్మడు ఏం చూసుకుని బేరాలాడుతాడు? కాళీఘాట్‌లో ఉండే బ్రాహ్మణులు ఆకలిగొన్న కీచురాళ్ళలాగ పనిలేక ఊరికే తిరుగుతూ ఉంటారు. ఐదు రూపాయలు చేతిలోపెడితే సముద్రాలతో సహా మొత్తం భారతదేశాన్ని దానం కింద ఇప్పించెయ్యగలరు. బలరామ్ కాసేపు ఆలోచించాడు. ప్రయాణం ఖర్చులూ, మిగతా చిల్లర ఖర్చులూ పోగా ఎంత మిగులుతుంది? మనసులో లెక్కలు వేసుకుని, "చూడు పంతులూ, నీ చేతిలో పద్దెనిమిది రూపాయలు పెడతాను. పనిచేసిపెట్టగలవా లేదా? త్వరగా చెప్పు, నాకు టైమ్ లేదు. నీతో బేరాలాడుతూ కూర్చోటానికి నాకస్సలు టైమ్ లేదు" అని గట్టిగా అన్నాడు.

"నీ స్నేహితుణ్ణి తీసుకురా. కానీ చూడు నాయనా, మార్కండేయునికి బట్టలూ, పితృదేవతలకి బట్టలూ, నెయ్యీ, పువ్వులూ, కర్రలూ, నువ్వులూ, పంచగవ్యమూ, పంచశ్యయమూ, అన్నీ ఏర్పాటు చేస్తావుకదా?"

"అయ్యో, నా పిచ్చి పంతులూ! ఇవన్నీ నేను తెచ్చేట్టుగా ఉంటే నీ మాసిన బట్టల అందం చూద్దామనా ఇంత దూరం వచ్చాను?"

బ్రాహ్మణుడు మాట్లాడలేదు. బలరామ్ సాధన్‌ని తీసుకొచ్చాడు. పురోహితుడు అన్ని ఏర్పాట్లూ చేసి ఉంచాడు.

"దక్షిణంవైపు మొహంపెట్టి కూర్చో" పురోహితుడి కంఠం ఖంగుమంది.

ఎదురుగా ఒక మనిషి కూర్చుని ఉన్నాడు, పొట్టి జుట్టూ, ఎర్రటి కళ్ళూ, పాత గొడుగులాంటి మాసిన ఒంటి రంగూ!

"ఇతనే అగ్రదాని, దానం పుచ్చుకుంటాడు."

అగ్రదాని కళ్ళు తెరిచి, "ఏదీ, చూడనీ మామయ్యా! వెయ్యి రూపాయల శ్రాద్ధం కదూ? పది నిమిషాల్లో ముగించు. నేను ఇంకో కాంట్రాక్టుమీద వెళ్ళాలి" అన్నాడు.

"ఇదుగో, అయిపోయింది బాబూ! ఆచమనం చెయ్యి."

ఆచమనం చేశాక శ్రాద్ధం తంతు మొదలయింది. ఒక్కొక్క వస్తువే బ్రాహ్మడు సాధన్ చేతికి తగిలించి వెంటనే మెరుపు వేగంతో తీసేశాడు. బలరామ్ ఒక రూపాయినోట్లు, పద్ధెనిమిది, చేత్తో పట్టుకుని కూర్చున్నాడు. మధ్య మధ్యలో అతను పురోహితుడికేసి చూస్తున్నాడు.

ఉత్తర క్రియలు చాలా త్వరగా ముగిసిపోయాయి. నాలుగణాల గావంచా నుంచి ఒక్కొక్క దారమే తెంచుతూ, సాధన్, ఈ లోకం పరలోకం, రెంటికీ సంబంధించిన వస్తువులన్నిటినీ దానం ఇస్తూ పోయాడు. ఆఖర్న పురోహితుడు, "చెప్పు, నీ తల్లికి ఏం దానం చెయ్యదల్చుకున్నావు?" అని అడిగాడు.

"ఒక మంచి ఏనుగు."

"సరే ఇరవై అణాలిలా ఇయ్యి. దీంతో నీకు ఏనుగుని దానం చేసినంత పుణ్యం దొరుకుతుంది, తెలిసిందా? వస్తువుల బదులు డబ్బులిచ్చినా దానం ఇచ్చినట్టే."

బలరామ్ కాగితం మీద 'ఏనుగు' అని రాసి దానిఎదురుగా 'రూపాయి పావలా' అని రాశాడు.

సాధన్ తన దుఃఖాన్ని అదుపులో పెట్టుకోలేకపోతున్నాడు. యంత్రంలాగ పురోహితుడు చెయ్యమన్నదంతా చేస్తున్నాడు. ఎంత విచిత్రం? ఐదు పావలాలతో ఏనుగుని దానం చేసినంత పుణ్యం సంపాదించుకోవచ్చని తనకి తెలియనే లేదు. ముందుగా తెలిసుంటేనా...

"రూపాయి పావలా తే, అశ్వదానం అయిపోయినట్టే."

ఆ తరవాత ఒక అద్భుతమైన పోటీ మొదలయింది. సాధన్, 'గుర్రం-భూమి-బంగారం-ధాన్యం-వస్త్రాలు' అని వరసగా అంటూ ఉంటే పురోహితుడు ప్రతిదానికీ 'రూపాయి పావలా' అంటూపోయాడు. ఇంకో పక్క బలరామ్ ఈ లెక్కలన్నీ పద్ధెనిమిది రూపాయల్లో తేలుతున్నాయా లేదా అని చూడటంలో మునిగిపోయాడు.

"బ్రాహ్మణుడి గోదానం కూడా రూపాయి పావలాతో కానిచ్చెయ్యండి, పంతులుగారూ!" బలరామ్ కూర్చున్నచోటినుంచే అన్నాడు.

"రూపాయి పావలాకి ఎక్కడైనా ఆవు దొరుకుతుందా?" పొగవల్ల మండుతున్న కళ్ళని చికిలిస్తూ అన్నాడు అగ్రదాని.

"దొరక్కపోతే మామా అల్లుళ్ళు కూర్చుని బొటనవేళ్ళు చీకండి. దక్షిణ ఇవ్వం!"

సాధన్ ఆ సమయంలో తన తల్లి ఎర్ర చీర ఒంటికి చుట్టుకుని ఉన్నాడు. చూట్టానికి పొగరుబోతు గేదెలాగా ఉన్నాడు. పిండ దానానికిగాను చిన్న పిడతలో కాసిని గింజలు ఉడుకుతున్నాయి. అన్నం వాసన తగలగానే సాధన్ మరి ఆగలేకపోయాడు.

"ఇందా, సాధన్! ఆచమనం చెయ్యి. పురోహితుడికి దండంపెట్టి లేచి నిలబడు."

సాధన్ లేచి నిలబడ్డాడు. అతని చూపులు భూమిలో దిగబడి ఉన్నాయి. అతని గావంచాలో డాక్టర్ సాధన్‌కి ఇచ్చిన సేరు బియ్యం మూటగట్టి ఉంది. బ్రాహ్మణుడు బియ్యమంతా వండలేదేం? బియ్యం తన తల్లి కోసం ఇచ్చారు, మరి కొంచెమే వండారేం? అతనికి అనుమానం వచ్చింది. అతని ముక్కులోంచి వింత శబ్దం వచ్చింది.

"నా చేతిలో పద్దెనిమిది రూపాయలు పెట్టగానే నువ్వు హరిశ్చంద్రుడివై పోయావా? రామచంద్రుడివైపోయావని అనుకుంటున్నావా?"

దీనికి జవాబుగా బలరామ్ నవ్వాడు. కానీ అతని నవ్వు ఉన్నట్టుండి ఆగిపోయింది. సాధన్ కింద కూర్చుని గావంచాలో బియ్యం మూట కట్టుకుంటు న్నాడు.

"ఏమిటి నాయనా ఇది? ఈ బియ్యం నాకోసం ఇచ్చినది కదా?"

"నోరు ముయ్యి, వెధవా!" సాధన్ బ్రాహ్మణ్ణి తిట్టాడు. అదే బ్రాహ్మడు అతనిచేత జటీ ఠకురానీ పేర అంతులేని ఐశ్వర్యాలు దానం చేయించాడు. జటీ ఠకురానీ ఈపాటికి వేగంగా స్వర్గంవేపుకి వెళ్తూ ఉంటుందా? తన పూర్వీకులు చంపిన దేవుడి పాదాలదాకా వెళ్ళి ఆమె ఆగిపోతుందా? గోలోకంలోనా? సాధన్ తను ఇంతవరకూ చేసినవన్నీ మర్చిపోయాడు.

"సాధన్! ఏం చేస్తున్నావు?"

"బియ్యం తీసుకుపోతున్నా, అన్నం వండుకుంటా."

"అరే, అది ఈ బ్రాహ్మణులకివ్వవలసిన బియ్యం, సాధన్! నువ్వు తినకూడదు."

"నోర్మూయ్యి. రా, బలరామ్."

మదించిన ఏనుగులా అరిచాడు, సాధన్, "బియ్యం కొనటానికి ఇంట్లో చిల్లిగవ్వ లేదు. ఈ బియ్యం నేనెవ్వరికీ ఇవ్వను."

"పోరా అప్రాచ్యుడా, మూర్ఖుడా!"

"ఈ బియ్యం నాది. దగ్గరకొచ్చావంటే చూడు ఏం చేస్తానో! బలరామ్ దూరంగా పో!"

పురోహితుడు కోపంగా, "శ్రాద్ధానికి వాడిన బియ్యం ఎక్కడైనా వండుకుంటారా? అది బ్రాహ్మడికి చెందాలి. పోరా, పో! నువ్వు పెట్టిన శ్రాద్ధం ఫలించదు, పో!"

"ఎందుకు ఫలించదు? నేను ఏనుగు దానం చెయ్యలేదా? గోవు నివ్వలేదా? బంగారం, వెండి, భూమి ఇవ్వలేదా? మా అమ్మకి పెట్టిన శ్రాద్ధం ఫలించకుండా చెయ్యటానికి ఎవరికి దమ్ములున్నాయిరా?"

బియ్యం మూట మెళ్ళో తగిలించుకుని సాధన్ ఇంటికొచ్చాడు. ఇంట్లో పొయ్యి అంటించి అన్నం వండుకుందామనుకున్నాడు.

అన్నం వాసన ఎంత బావుంటుంది! బియ్యం ఉన్నన్నాళ్ళూ అతను వేడి వేడి అన్నం తింటాడు. అలా తను అన్నం తిన్నన్నాళ్ళూ తన సాయం-సంధ్యల తల్లి తనకూడానే ఉంటుంది.

తల్లి జ్ఞాపకం రాగానే బ్రాహ్మడితో అలా ప్రవర్తించినందుకు సాధన్‌కి ఏడుపు వచ్చింది. అతను మనసులోనే తల్లితో, "అమ్మా, ఎలాగో ఒకలాగ నువ్వు స్వర్గానికి వెళ్ళిపో. సాధన్ ఇంక అన్నం వండుకుని తింటాడు. తప్పుగా అనుకోవద్దు" అన్నాడు.

# మంత్రగత్తె

భగీరధ్ ఇంకా చాలా చిన్నపిల్లవాడుగా ఉండగానే, వాడి తల్లి చండీని మంత్రగత్తె పట్టుకుంది. ఆ తరవాత ఊళ్ళోవాళ్ళు చండీని ఊర్నించి బైటికి తరిమేశారు. మంత్రగత్తెను చంపరు. ఎందుకంటే ఆమెని చంపితే, ఊళ్ళోని పిల్లలందరూ చచ్చిపోతారు. ఎవరినైనా భూతం పట్టుకుంటే ఆ మనిషిని కాల్చి చంపేస్తారు, కాని మంత్రగత్తె పట్టుకుంటే చంపకూడదు.

అందుకే చండీని ఊరికి దూరంగా రైల్వేలైన్ పక్కన గుడిసెవేసి దానిలో ఉంచారు.

భగీరధ్‌ని సవతి తల్లి పెంచింది. ఆమె శాపనార్థాలు పెట్టినా వాడు భరించాడు. సొంత తల్లి ఎలా ఉంటుందో వాడికి తెలియదు. మైదానానికి అటువేపు 'ఛాతిమ్' చెట్టుకింద ఒక గుడిసె చూశాడు. అందులో చండీ బాయేన్ ఒక్కత్తే ఉంటుందని విన్నాడు. ఛండీ మంత్రగత్తె ఎవరి తల్లో అయి ఉంటుందని అనుకోలేదు. దూరంనించి చూస్తే గుడిసె మీద ఎర్రగుడ్డ పీలిక ఎగురుతూ కనిపించేది. అప్పుడప్పుడు చైత్రమాసపు మండుటెండలో ఎర్రటి బట్టలు కట్టుకుని చేతిలోని రేకుడబ్బామీద కర్రతో కొడుతూ ఎవరో ఆడది పిచ్చిదానిలా పొలంగట్ల వెంబడి చెరువువేపుకి వెళ్తూ కనిపించేది. ఆమె వెనకాలే ఒక కుక్క పరిగెత్తుతూ పోయేది.

చండీ బాయేన్ ఎక్కడికైనా వెళ్ళేటప్పుడు డబ్బామీద కొడుతూ అందరికీ తెలియపరిచేది. మంత్రగత్తె చూపు ఏ పిల్లవాడిమీదో, యువకుడిమీదో పడితే, వాళ్ళ ఒంట్లోని రక్తమంతా కళ్ళతో పీల్చేయగలదు.

అందుకే ఆమె ఒంటరిగా ఉండాలి. మంత్రగత్తె కనిపిస్తే పిల్లలూ పెద్దలూ అందరూ దారిలోంచి తప్పుకుంటారు.

ఒకే ఒకరోజున భగీరధ్ తన తండ్రి మలిందర్ మంత్రగత్తెతో మాట్లాడటం చూశాడు.

"కిందకి చూడు భగీరథ్" తండ్రి కోప్పడ్డాడు.

మంత్రగత్తె చప్పుడు చెయ్యకుండా చెరువుగట్టుమీదకి వచ్చి నిల్చుంది.

భగీరథ్ కళ్ళ చివర్నించి ఒక్కసారి చూశాడు, చెరువు నీటిలో ఎర్రటి బట్టలూ, రాగిరంగు మొహం, జడలు కట్టిన జుట్టు కనిపించాయి.

ఆమె కళ్ళల్లో ఒకరకమైన ఆకలి కనిపించింది, భగీరథ్‌ని కళ్ళతోనే తినేసే టట్టుందా చూపు.

ఆమె భగీరథ్ వేపు చూడలేదు. భగీరథ్ చూసినట్టే ఆమె కూడా నీళ్ళల్లో అతని నీడ చూసింది.

భగీరథ్ ఒళ్ళు గగుర్పొడిచింది. వాడు కళ్ళు గట్టిగా మూసుకుని తండ్రి కట్టుకున్న పంచె కొంగును గట్టిగా గుప్పెట్లో పట్టుకున్నాడు.

"ఎందుకొచ్చావు?" భగీరథ్ తండ్రి బుసకొట్టినట్టుగా ఆమెను అడిగాడు.

"తలకి రాసుకోటానికి నూనెలేదు. గంగాపుత్రా! ఇంట్లో కిరసనాయిలు లేదు. నాకు ఒంటరిగా ఉండటానికి భయంగా ఉందయ్యా!" అని ఏడ్చింది.

"ఏం? ఈ శనివారం నీకు వారానికి సరిపడే సామానుల బుట్ట ఇవ్వలేదా?"

ప్రతి శనివారం కాటికాపరుల గూడెంనించి ఒక మనిషి వారంరోజులకి సరిపడే సామాను తీసుకొచ్చి మంత్రగత్తె చండీకి ఇస్తాడు. ఆ బుట్టలో బియ్యం, పప్పు, ఉప్పు, నూనె అన్నీ ఉంటాయి. బుట్టను తీసుకెళ్ళి ఛాతిమ్ చెట్టుకింద పెట్టేస్తాడు. ఆ తరవాత ఆ చెట్టు సాక్షిగా 'మంత్రగత్తెకు వారం గ్రాసమున్న బుట్ట ఇచ్చి వెళ్తున్నాను' అని చెప్పి త్వరత్వరగా అక్కణ్ణించి తన ఇంటికి పారిపోతాడు.

"బుట్టలోని సామానంత కుక్క తినేసింది."

"డబ్బు కావాలా? ఇందా తీసుకో!"

"నాకు సామానెవరు అమ్ముతారు?"

"నేను కొనిస్తానులే, నువ్వు పో ఇంక!"

"నేనొక్కదాన్నీ ఉండలేనయ్యా!"

"అయితే మంత్రగత్తెవి ఎందుకయ్యావు? నేచెప్పింది చెయ్యి."

భగీరథ్ నాన్న చెరువుగట్టునించి బోలెడంత బురద చేతిలోకి తీసుకున్నాడు.

"గంగాపుత్ర! ఈ పిల్లవాడు...?"

అసహ్యంగా తిట్టి భగీరథ్ తండ్రి బురదను చండీమీదకి విసిరికొట్టాడు.

ఆమె పారిపోయింది.

"నాన్నా, నువ్వు మంత్రగత్తెతో మాట్లాడావే?"

భగీరథ్ హడిలిపోయాడు. మంత్రగత్తెతో మాట్లాడినవాళ్ళు తప్పకుండా చచ్చిపోతారు. తన తండ్రి చచ్చిపోతాడేమో అని అనుకోగానే భగీరథ్ మీద పిడుగు పడ్డట్టయింది. తన తండ్రి చచ్చిపోతే, సవతితల్లి తప్పకుండా తనని కొట్టి ఇంట్లోనుంచి తరిమేస్తుంది.

"ఇప్పుడు మంత్రగత్తె అయిందికాని, ఆమె నీ తల్లే!"

ఈ మాట చెప్తున్నప్పుడు అతని గొంతు ఎప్పుడూ లేనంత గంభీరంగా పలికింది. భగీరథ్ గొంతుకి ఏదో అడ్డంపడ్డట్టనిపించింది. అమ్మా? మంత్రగత్తె ఎక్కడైనా ఎవరికైనా అమ్మ అవుతుందా? మంత్రగత్తె అసలు మనిషేనా? మంత్రగత్తె మట్టి తవ్వి పాతిపెట్టిన పిల్లల శవాలని ఒళ్ళోకి తీసుకుని లాలిస్తుంది, పాలు పడుతుంది. మంత్రగత్తె కళ్ళుపడితే చాలు పచ్చని చెట్టు నిమిషాల్లో మోడవుతుంది. తను ప్రాణం వున్న పిల్లవాడు, తనెలా మంత్రగత్తెకి పుట్టాడు? భగీరథ్‌కి ఏమీ అర్థం కావటంలేదు.

"ఇంతకుముందు ఆమె మనిషే, నీకు అమ్మ!" అన్నాడు భగీరథ్ తండ్రి.

"నీ పెళ్ళామా?"

"అవును, నా పెళ్ళామే!"

ఏదో జ్ఞాపకం వచ్చి మలిందర్ పెద్దగా నిట్టూర్పు విడిచాడు. "నేను నీకంతా చెప్తాను భగీరథ్, నీకేం భయంలేదు" అన్నాడు.

మారుమాట్లాడకుండా భగీరథ్ తండ్రికేసి చూస్తూ అతని పక్కనే నడవసాగాడు. తండ్రి గొంతు కొత్తగా అనిపించింది. వాళ్ళు మామూలు కాటికాపరులు కారు. శ్మశానంలో ఉండే కాటికాపరులు. ప్రస్తుతం మునిసిపాలిటీ శ్మశానంలో ఒక్కడికన్న ఎక్కువ కాటికాపరులని ఉండనివ్వదు. భగీరథ్ ఇంట్లో వాళ్ళు వెదురుతో అల్లే పనులు చేస్తారు. గవర్నమెంటు కోళ్ళఫారంలలో పనిచేస్తారు. చెత్త తీసుకెళ్ళి ఎరువు చేస్తారు. ఒక్క మలిందర్‌కి తప్ప ఆ ప్రాంతాల ఉండే వాళ్ళెవరికీ వాళ్ళపేరు రాయటం కూడా రాదు. అందుకే కొన్నాళ్ళక్రితం మలిందర్‌కి ప్రభుత్వ ఆసుపత్రిలో శవాలు కోసేగది (మార్చురీ)లో ఉద్యోగం దొరికింది.

అది గవర్నమెంటు ఉద్యోగం. 'మలిందర్ గంగాపుత్ర' అని సంతకం చేసి

అతను నెలకి 42 రూపాయలు సంపాదిస్తాడు. తన తండ్రి అప్పుడప్పుడూ దొరికే అనాధ శవాల్ని సున్నమూ, బ్లీచింగ్ పౌడరూ కలిపి కాల్చి అస్థిపంజరాల్ని తయారుచేస్తాడని భగీరధ్‌కి తెలుసు. పూర్తి అస్థిపంజరం దొరికితే చాలా లాభం. డాక్టరీ చదవటానికి దాని అవసరం ఎంతైనా ఉంది.

గవర్నమెంటు ఉద్యోగులు కలకత్తాలోని డాక్టర్లకి ఈ అస్థిపంజరాలని చాలా ఎక్కువ ధరకి అమ్ముకుంటారు. భగీరధ్ తండ్రికి 10-15 రూపాయలు ఇస్తారు, దాంతోనే అతను తృప్తిపడతాడు. ఈ పై సంపాదనని వడ్డీలకి తిప్పి అతను కొన్ని పందుల్ని కొన్నాడు.

మలిందర్ మంచి బట్టలేసుకుని, కాళ్ళకి చెప్పులు తొడుక్కుని ప్రధాన కార్యాలయానికి వెళ్తాడు. ఇరుగు పొరుగువాళ్ళు కూడా అతన్ని గౌరవంగా చూస్తారు.

అదే మలిందర్ మంత్రగత్తె చండీ గుడిసెమీద ఎర్రబడ్డ ఆకాశంలో, ఆడదాని నుదుటిమీది సిందూరంలాగ ఎగురుతున్న ఎర్రనిగుడ్డని కళ్ళెర్రజేసి చూశాడు. కొడుకుతో గుసగుసలాడుతున్నట్టు "ఆమెకి చీకటంటే భయం, అలాంటి దాన్ని దేవుడు మంత్రగత్తెగా చేసేశాడు. చచ్చిపోయినా దానికి శాంతి దొరికేది. కానీ మంత్రగత్తెను తానై చావకపోతే ఎవ్వరూ చంపలేరే? ఇదంతా నీకు తెలుసా నాయనా?"

ఎంతో దుఃఖం ఉంటే తప్ప మలిందర్ ఇంతగా మాట్లాడడు.

"నాన్నా, ఒక మనిషిని మంత్రగత్తెగా ఎవరు మారుస్తారు?"

"దేవుడు."

మధ్యాహ్నపుటెండలో భగీరధ్ దగ్గర్లో ఎటువంటి నీడా పడకుండా జాగ్రత్తగా చూసుకుంటున్నాడు మలిందర్. మంత్రగత్తె ఏ రూపంలోనైనా రాగలదు. సంతల్లో పువ్వులూ, వెన్నా అమ్మేవాళ్ళలాగ ఆమెకి చాలా రకాల మోసాలు తెలుసును. ఆమె ఏ పిల్లవాడినైనా తీసుకుపోవాలనుకుంటే వాడు నడుస్తున్నప్పుడు నాలుగు వైపులా ఎండ కాస్తున్నా, వాడి మొహంమీద నీడ కనిపిస్తుంది. తను అదృశ్యంగా ఉండి, తన చీరకొంగుతో పిల్లవాడి తలపైన నీడపట్టి కూడా నడుస్తుంది. ఆ పిల్లవాడు చనిపోతే, ఆమెని ఎవరైనా గట్టిగా నిలదీస్తే, నవ్వి, "నాకేం తెలుసు? పాపం ఎండలో నడుస్తున్నాడే అని కొంగునీడ పట్టాను. నేను ముట్టుకోగానే కరిగిపోవటానికి నీకొడుకేమన్నా మట్టిబొమ్మా?" - అడుగుతుంది.

భగీరథ్ చుట్టుపక్కల మురికిపట్టి కంపుకొట్టే ఎర్రటి కొంగు లేకపోవడం చూసి మలిందర్ హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు.

భగీరథ్‌తో "నీకేం భయం నాయనా? ఆమె నీకెటువంటి హానీ చెయ్యదు" అన్నాడు.

అయినా భగీరథ్‌కి నమ్మకం కుదరలేదు.

వాడి మనసు అటే లాగేది. పొలానికి వెళ్ళినా, ఆవుల్ని మేపటానికి వెళ్ళినా ఆ రైలు కట్టవెంబడే ఆ గుడిసెకి వెళ్ళాలని మనసు పీకేది. ఒక్కత్తే ఉంది మంత్రగత్తె ఎలా భయపడుతోందో, జుట్టుకి నూనె రాసుకుని గాలిలో ఎలా ఆరబెట్టుకుంటుందో చూడాలనిపించేది.

కానీ భగీరథ్ వెళ్ళలేకపోయేవాడు, వాడికి భయం వేసేది.

ఒకసారి అక్కడికెళ్ళాక ఇంక మరి వెనక్కి రాలేనేమోనని భయపడేవాడు. ఆమె తనని చెట్టుగానో రాయిగానో మార్చేస్తే? చాలారోజులు దూరంనించే చూస్తూ ఉండేవాడు.

'ఛాతిం' గుబరు చెట్టుకీ గుడిసెకీ మధ్య ఉండే ఆకాశం అతని కళ్ళకి పుర్రె ఆకారంలో కనిపించేది. ఆ పుర్రెమీద సిందూరంలాంటి ఎర్రటిబట్ట ఒక్కొక్కప్పుడు గాలికి ఎగిరేది, ఒక్కొక్కప్పుడు స్థిరంగా ఉండేది. ఎంతగానో వెళ్ళాలని ఉన్నా, భయంవల్ల వెళ్ళలేకపోయేవాడు. భయంతో ఇంటికి పారిపోయేవాడు.

మంత్రగత్తె కొడుకని తెలిసినా ఎవరూ వాడిని దూరంగా ఉంచేవారుకాదు, పైగా వాడిని చాలా బాగా చూసేవారు. మంత్రగత్తెకు తన కొడుకుని బాగా చూస్తున్నారని తెలుస్తుంది. తెలిస్తే ఆమె కూడా వాళ్ళ జోలికి రాదు. వాళ్ళ పిల్లా పీచూ క్షేమంగా ఉంటారు. ఇలా చూడనివాళ్ళ ఇళ్ళల్లో పిల్లలు చచ్చిపోతుంటారు.

భగీరథ్ సవతి తల్లి ఏమీ మాట్లాడదు. తన సవితి కొడుకంటే ప్రేమో ద్వేషమో, ఇష్టమో, అయిష్టమో ఎప్పుడూ ఏమీ చెప్పదు. దానికి ముఖ్య కారణమేమిటంటే ఆమెకి కొడుకులు లేరు. గైరభీ, సైరభీలని ఇద్దరు కూతుళ్ళు మట్టుకు ఉన్నారు. కొడుకులు లేని ఆడదానిమాట మొగుడు వినిపించుకోడు. ఇది కాక ఆమె పైపెదవి చిట్లి ఉంటుంది. చిగుళ్ళు కనిపిస్తాయి. అందుకని ఆమె ఇంట్లోనించి బైటికి పోదు.

"'ఏ మొహం పెట్టుకుని వెళ్ళను? నా నోరు మూసుకోదు. నవ్వకపోయినా నవ్వుతున్నానని అందరూ అనుకుంటారు. చూడు గంగాపుత్ర, నేను చనిపోయాక

నా మొహం గావంచాతో కప్పు, తెలిసిందా? లేకపోతే అందరూ 'పళ్ళకోతి చచ్చిపోయింది' అని అంటారు" అని మొగుడితో అంటూ ఉంటుంది.

యశి రోజల్లా పనిచేస్తూ ఉంటుంది. ఇల్లు ఊడుస్తుంది, వంట చేస్తుంది, కట్టెలు ఏరుకొస్తుంది, పేడ అలుకుతుంది, పందుల్ని మేపుతుంది, పిల్లల తలలో పేలు తీస్తుంది. భగీరథ్‌ని 'నాయనా' అని పిలుస్తుంది. 'అన్నం తిను నాయనా', 'స్నానం చెయ్యి నాయనా' అని ఏదో దూరపు చుట్టరికం ఉన్నట్టు మాట్లాడుతుంది. మంత్రగత్తె కొడుకుని సరిగ్గా చూసుకోకపోతే, మంత్రగత్తె తన పిల్లల్ని బాణంతో కొట్టి చంపేస్తుంది. యశికి ఈ విషయం తెలుసు. చివరికి ఏదో ఒకరోజు తనూ, తన పిల్లలూ భగీరథ్ మీదే ఆధారపడాలనీ తెలుసు.

అప్పుడప్పుడూ భయం ఎక్కువైతే చెయ్యి బుగ్గకానించుకుని ఆలోచిస్తూ కూర్చుంటుంది. ఎవరికి తెలుసు? ఉన్నట్టుండి ఏ మిట్టమధ్యాహ్నం వేళో మంత్రగత్తెకి తన కూతుళ్ళు జ్ఞాపకం వచ్చి మట్టితో వాళ్ళ బొమ్మలు చేస్తోందేమో! ఆ బొమ్మల్ని బాణంతో చిల్లులు పొడుస్తుందేమో! ఇలా ఆలోచించేటప్పుడు అసలే కురూపిగా ఉన్న యశి ఇంకా కురూపిగా కనిపిస్తుంది. కాటికాపరుల గూడెంలోని అందరికన్నా అందవికారంగా ఉన్న ఆమెని చూసి మలిందర్ పెళ్ళిచేసుకున్నాడు. కాని తరవాత చాలా విచారించాడు. చాలా ఊళ్ళల్లో అందమైన కాటికాపరుల అమ్మాయిలు మంత్రగత్తెలుగా మారిపోయారు. అప్పట్నించీ మలిందర్ అందమైన అమ్మాయిలవైపు కన్నెత్తి చూడటం మానేశాడు.

మలిందర్ తన మొదటి పెళ్ళాన్ని చాలా ప్రేమగా చూసుకున్నాడు.

ఆ పాత ప్రేమ జ్ఞాపకం వచ్చే కామోసు ఒకరోజు అతను భగీరథ్‌తో మంత్రగత్తె చండీ గురించి చెప్పాడు. ఇద్దరూ రైల్వేలైన్ పక్కగా వెళ్తున్నారు. మలిందర్ చేతిలో మాంసం పొట్లం ఉంది. మలిందర్‌కి ఒక విచిత్రమైన బలహీనత ఉంది. తన చేతుల్తో పెంచిన పందుల్ని అతను చంపలేడు. అవి పెరిగి పెద్దవి అయాక అతను వాటిని అమ్మేస్తాడు. ఆ కొన్నవాడు పందుల్ని చంపాక కొంచెం మాంసం మలిందర్‌కి ఇస్తాడు.

"రా, ఈ చెట్టునీడలో కాసేపు కూర్చుందామా?"

పదమూడేళ్ళ కొడుకుని అనుమతి అడిగినట్టుగా అన్నాడు. మర్రిచెట్టు ఊడకి ఆనుకుని కూర్చున్నారు.

"ఇటుగా బందిపోట్లు వెళ్తారు కదా నాన్నా?" అన్నాడు భగీరథ్.

ఆరోజుల్లో భగీరథ్ ప్రయిమరీ స్కూల్లో చదువుతూండేవాడు. గవర్నమెంటు స్కూల్లో ఒకసారి వాళ్ళ మాస్టారు పిల్లలచేత గోడమీద అతికించే పత్రిక తయారు చేయించాడు. మాస్టారే రాసుకొస్తే, దానిమీద భగీరథ్ సిరాతో అక్షరాలు దిద్దాడు. ఆ వ్యాసం చదివాక 'అస్పృశ్యతా రాహిత్యం' చట్టం 1955లో వచ్చిన తరవాత తమలాంటివాళ్ళు అంటరానివాళ్ళుగా పరిగణించబడటంలేదని భగీరథ్‌కి తెలిసింది.

రాజ్యాంగం అనేది ఒకటుందని, దానిలో మొదట్లోనే ప్రాథమిక హక్కులగురించి స్పష్టంగా రాసి ఉందనీ, దానిప్రకారం అందరు మనుషులు సమానమని తెలుసు కున్నాడు.

గోడమీద ఆ వ్యాసం ఇంకా వేలాడుతూనే ఉందికాని, మాస్టారూ మిగిలిన జాతుల పిల్లలు తననీ తన జాతి పిల్లల్నీ విడిగా కూర్చోపెడతారని వాడికి తెలుసు. చాలా బీదవాళ్ళో, మొద్దులో అయితే తప్ప పైజాతి పిల్లలు ఈ స్కూలుకి రారు. ఎందుకు రావాలి? ఈ రోజుల్లో ఎక్కడపడితే అక్కడ స్కూళ్ళున్నాయి.

ఏది ఏమైనా, భగీరథ్ ఈమధ్య కొత్తరకం పదాలు వాడుతున్నాడు. మలిందర్‌కి వాడు మాట్లాడే భాష చాలా ఇష్టం. అప్పుడప్పుడు భగీరథ్‌కి తను తగిన తండ్రి కాదని అనుకుంటూ ఉంటాడు.

భగీరథ్ బందిపోట్ల గురించి అడిగాడు. ఈమధ్య సోనాడాంగా, పలాశీ, దుబులియా ఇలాకాల్లో సాయంకాలం అయాక అక్కడక్కడా రైళ్ళల్లో దోపిడీలు పెరిగిపోయాయి. ఒకరకంగా చూస్తే అందరూ దోపిడీలు చేసేవాళ్ళే! పెద్ద మనుషులమనీ, బీద విద్యార్థులమనీ, కాలనీలో ఉండేవాళ్ళమనీ, ఇళ్ళ యజమానులమనీ రకరకాలుగా చెప్పుకుని బండీలో ఎక్కుతారు. ఆ తర్వాత రైలు చీకట్లో, నిర్జనప్రాంతాల్లో వెళ్తున్నప్పుడు గొలుసులాగి బండిని ఆపేస్తారు. చీకట్లోంచి వాళ్ళ మనుషులు వస్తారు. రైల్లో ప్రయాణీకుల్ని దోచేసి చీకట్లో మాయమవుతారు. ముఖ్యంగా ఈ మర్రిచెట్టు చీకట్లో చూడటానికి చాలా భయంకరంగా ఉంటుంది.

అందుకే భగీరథ్ బందిపోట్ల గురించి అడిగాడు, కానీ మలిందర్ వినిపించుకో లేదు. ఏదో ఆలోచనల్లో మునిగిపోయి, ఖాళీ మైదానంవేపు చూస్తూ కూర్చున్నాడు. ఉన్నట్టుండి, "నేను ఒకప్పుడు చాలా నిర్దయగా ప్రవర్తించేవాణ్ణిరా! మీ అమ్మ మౌనంగా లోపల్లోపల కుమిలిపోయి ఏడుస్తూ ఉండేది. అంతా ఆ భగవంతుని

లీల!" అన్నాడు.

ఒకరోజు ఆ భగవంతుడే స్వయంగా వచ్చి వాళ్ళ గూడెంలో అంతా తలకిందులు చేసేశాడు! చండి మంత్రగత్తెగా మారింది, క్రూరంగా కఠోరంగా, శిశుహంతకిగా మారింది. మలిందర్ నిప్పుల కుంపటి అయాడు, అవక తప్పలేదు!

ఒక వ్యక్తి అమానుషంగా ఎవరికీ అందనంతగా మారిపోయి, ఇంకో లోకంలోని కనిపించని తలుపులు తీసుకుని వెళ్ళిపోతే, మిగతావాళ్ళు కూడా మారక తప్పదు.

తండ్రి తనతో ఏదో చెప్పాలనుకుంటున్నాడని భగీరధ్‌కి అర్థమయింది. కొద్దిగా ఆశ్చర్యం వేసింది కూడా. చాలాకాలం క్రితం తండ్రి మంత్రగత్తెతో మాట్లాడటం తను చూశాడు. ఆ తరవాత మరెప్పుడూ ఆమె విషయం మాట్లాడలేదు. మళ్ళీ ఇవాళ మంత్రగత్తె విషయం ఎందుకెత్తాడు? మలిందర్ భగీరథ్ చెయ్యి గట్టిగా పట్టుకుని, "భయం ఎందుకు? అందరికీ తెలిసినదేగా, మరి నీకు మట్టుకు మీ అమ్మ కథ ఎందుకు తెలియకూడదు?" అన్నాడు.

మలిందర్ గంగాపుత్రుడు, 'డోమ్' కులస్తుడు (కాటిపనికి ప్రత్యేకించబడిన కులానికి చెందినవాడు). అతడు వెదుళ్ళు మోసేవాడు, కట్టెలు కొట్టేవాడు. చండి శవాలని మోసేది.

గ్రామానికి ఉత్తరదిక్కుగా బావిపక్కనున్న మర్రిచెట్టు కింద శ్మశానం వంశపారం పర్యంగా వాళ్ళది. ఐదేళ్ళలోపు పిల్లలు చనిపోతే ఈ రోజుల్లో వాళ్ళని కాల్చాలని నియమం. ఆ రోజుల్లో అందర్నీ పాతిపెట్టేవారు. ఈ శ్మశానంలోనే చండీవాళ్ళ నాన్న గొయ్యి తవ్వి, పిల్లల శవాల్ని పూడ్చిపెట్టి, ముళ్ళపొదలతో దాన్ని కప్పి, నక్కలనీ తోడేళ్ళని తరుముతూ కూర్చునేవాడు. హయి-హయి-హయియా ... అతని గొంతు మత్తుగా పగలూ రాత్రి వినబడేది. అతని కేకలు భయంగొలిపేవి.

చండీవాళ్ళ నాన్న గంజాయి, సారా ఎప్పుడూ తాగేవాడు. శనివారాలు ఊరంతా తిరిగి, "నేను మీ దాసుణ్ణీ, గంగాపుత్రుణ్ణీ, నాకు తినడానికి ఏదేనా ఇవ్వండి" అని అడుక్కునేవాడు.

అందరూ అతన్ని చూసి భయపడేవాళ్ళు. చిన్నపిల్లల్ని అతని కంట పడనిచ్చేవారు కాదు. ఒక్క మాట కూడా మాట్లాడకుండా అతనికి బిచ్చం వేసి తప్పుకునేవారు.

ఒకరోజు సోగకళ్ళూ, ఎర్రటి జుట్టూ ఉన్న ఒక తెల్లటిపిల్ల వచ్చి, "నా పేరు చండి, ఫలాన గంగాపుత్రుడి కూతుర్ని. మా నాన్న పోయాడు. అతనికి వేసే బిచ్చం నాకు వేయండి" అన్నది.

"మీ నాన్న చేసే పని ఇప్పుడు నువ్వు చేస్తావా?"

"ఆఁ చేస్తాను."

"నీకు భయం వేయదా?"

భయం అంటే ఏమిటో చండికి తెలియదు. పిల్లలు పోయినప్పుడు తలిదండ్రులు ఏడిస్తే, కడుపుశోకం ఏమిటో అర్థం అవుతుంది. కాని శవాన్ని ఎవరైనా ఇంట్లోనే ఉంచుకుంటారా? ఉంచుకోగలరా? చనిపోయినవారికి అంతిమక్రియలు చెయ్యటమే చండిపని, అదే ఆమె వృత్తి! దీన్లో భయపడటానికీ, జాలిపడటానికి ఏముంది? ఒకవేళ ఉన్నా తనకేమిటి? ఇదే భగవంతుడి నియమం కదా? ఈ నియమం గంగాపుత్రులు పెట్టింది కాదే! మరైతే వాళ్ళని చూసి జనం ఎందుకు భయపడతారు? వాళ్ళని ఎందుకు అసహ్యించుకుంటారు?

ఈ చండినే మలిందర్ పెళ్ళి చేసుకున్నాడు. ఆ రోజుల్లోనే మలిందర్ గవర్న మెంటు ఉద్యోగితో కలిసి ఎముకలు అమ్మేవాడు. పశువుల ఎముకలతో ఎరువు తయారవుతుంది, దానికీ మంచి ధర పలికేది. మలిందర్ చేతిలో డబ్బుండేది, గుండెల్లో ధైర్యం ఉండేది. రాత్రిపూట మైదానంలో నడుస్తూ గట్టిగా, "మాకు ఎవరన్నా భయంలేదు. మేము నిప్పు తింటాం. ఎవరికీ భయపడం" అనేవాడు.

సాయంత్రాలు చీకట్లో లాంతరు పట్టుకుని చండి మర్రిచెట్టుకింద తిరిగేది. ఆమెనుచూసి అతను, "ఏయ్! నీకు చీకటంటే భయంలేదా?" అని అడిగేవాడు.

"లేదు, మేము కూడా నిప్పు తింటాం, తెలుసా?" అని నవ్వుతూ చెప్తున్న చండిని చూసి మలిందర్‌కి మాట పెగలలేదు. ఆ వైశాఖంలోనే అతను చండిని పెళ్ళి చేసుకున్నాడు. మరుసటి ఏడు వైశాఖానికి చండి ఒళ్ళోకి భగీరథ్ వచ్చాడు.

ఒకరోజు చండి భగీరథ్‌ని ఎత్తుకుని ఏడుస్తూ వచ్చింది. "గంగాపుత్ర! వాళ్ళు నన్ను రాయితో కొట్టారు. నాకళ్ళు పడితే చెడు జరుగుతుందట!" అన్నది.

"ఎవరా రాయి విసిరింది?"

"ఏం, నువ్వు వాళ్ళని కొడతావా?"

"ఎందుకు రాయి విసిరారు?"

మలిందర్ కోపంతో చిందులు తొక్కసాగాడు. నోటికొచ్చినట్టు తిడుతూ, "ఎన్ని గుండెలు వాళ్ళకి? నా పెళ్ళాన్ని రాయితో కొడతారా?" అన్నాడు.

చండి కొన్ని క్షణాలు అతన్ని రెప్పవాల్చకుండా చూసింది. "గంగాపుత్ర! నాకు పట్టుకోవటం ఇష్టంలేదు. ఇష్టంలేని పని దేవుడే నాచేత చేయిస్తుంటే ఏం చెయ్యను, చెప్పు?" అన్నది.

చండీ తల తిప్పుతూ తన చేతులనీ, కాళ్ళనీ ఆశ్చర్యంగా చూసుకుంది. ఆమె వంశంలో అన్నో, పినతండ్రో, తాతో ఉంటే వాళ్ళు ఆ వృత్తి చేసేవారు. కాని ఎవ్వరూ లేరు. వాళ్ళు మొదటినించీ శ్మశానంలో కాటికాపరి పనే చేస్తూ వస్తున్నారు. హరిశ్చంద్రుడు చండాలుడుగా మారినప్పుడు, చండి వాళ్ళ వంశంవాళ్ళే అతనికీ పని నేర్పారు. ఆ తరవాత హరిశ్చంద్రుడు రాజయాక ఆతని రాజ్యం నాలుగు దిక్కులా విస్తరించింది. ఆయన రెండు చేతులా దానాలు చేశాడు.

"మా సంగతేమిటి?" అని అతనికి పనినేర్పిన గంగాపుత్రుడు నిండుసభలో గొంతెత్తి అడిగాడు.

వాళ్ళ చెవుల్లో ఎప్పుడూ రావణకాష్టం కాలే మోత ఉండటంచేత వాళ్ళకి చెవులు సరిగ్గా వినబడేవికాదు. అందుకే వాళ్ళు గట్టిగా అరిచి మాట్లాడేవాళ్ళు.

"ఏం చెయ్యమంటావు?" రాజు అడిగాడు.

"బ్రాహ్మణుడికి ఆవులూ, ఎద్దులూ దొరుకుతాయి, సన్యాసికి ఎల్లప్పుడూ భిక్ష దొరుకుతుంది. మాకేమిస్తారు?"

"ఈ భూప్రపంచంలో ఉన్న శ్మశానాలన్నీ మీకే ఇస్తున్నాను" అన్నాడు రాజు.

"ఏమిస్తున్నారు?"

"ఈ భూమిమీద ఉన్న శ్మశానాలన్నీ మీకే ఇస్తున్నాను" రాజు గట్టిగా చెప్పాడు.

"నిజంగానా?"

"అవును, నిజంగానే ఇస్తున్నాను."

అప్పుడా కాటికాపరి చేతులు పైకెత్తి సంతోషం పట్టలేక నాట్యం చేశాడు. "ఆహా! ఈ భూమ్మీది శ్మశానాలన్నీ మాకే దొరికాయి. అవన్నీ మావే. అన్నీ మాకే" అని మురిసిపోయాడు.

అదే కాటికాపరి వంశంలో పుట్టిన చండి ఈ పని తనకొద్దని ఎలా ఒదిలించు కుంటుంది? అలా నిర్లక్ష్యం చేస్తే దేవతలు కోపగించరూ? కోపగించరని ఏమిటి

నమ్మకం? కానీ చండీకి చాలా భయం. నేల తవ్వేటప్పుడు ఆమె మొహం ఇంకో వేపుకి తిప్పుకుంటుంది. ఆ గొయ్యను ముళ్ళ పొదలతో కప్పాక కూడా ఆమె భయం పోదు. ఉన్నట్టుండి నిప్పులు కక్కే నక్క ఎక్కణ్ణుంచో వచ్చి, మర్రి ఊడల్లాంటి పంజాలతో మట్టి తవ్వటం మొదలు పెడుతుందని హడిలిపోతుంది.

"భగవంతుడా ... భగవంతుడా ... భగవంతుడా ..." అని గొణుక్కుంటూ చండి ఏడుస్తుంది. ఇంటికి పారిపోతుంది. ఇంట్లో దీపం వెలిగించి భగీరథ్‌ని కళ్ళార్పకుండా చూస్తూ దేముడిని తలుచుకుంటుంది. ఆ సమయంలో ఊళ్ళోని ప్రతి శిశువూ, చిరంజీవిగా ఉండాలని, హాయిగా, సుఖంగా ఉండాలని కోరుకుంటుంది. మునుపులేని బలహీనత ఏదో ఆమెలో కొత్తగా తలెత్తింది.

భగీరథ్‌ని తలచుకున్నప్పుడల్లా మిగతా పిల్లలకోసం ఏదో దుఃఖం ఆమెని పట్టిపీడిస్తుంది. మర్రిచెట్టుకింద ఎక్కువసేపు ఉండవలసివస్తే ఆమె రొమ్ములు పాలతో నిండి నెప్పి పెడతాయి.

తల వంచి గొయ్యి తవ్వేటప్పుడు తనకి ఇలాంటి పని అప్పచెప్పిపోయినందుకు చనిపోయిన తండ్రిని తిట్టుకుంటుంది.

"మీరు ఇంకెవరినైనా చూసుకోండి. నాకీపని ఇష్టంలేదు" అని చండి ఒకరోజు చెప్పేసింది.

కానీ ఆమె మాటలు ఎవరూ వినిపించుకోలేదు. మలిందర్‌కి కూడా ఆమె ధోరణి అర్థం కాలేదు. మిగతావాళ్ళు చూసి భయపడే, అసహ్యించుకునే, అపవిత్రమైన శవాలలోని ఎముకలూ, చర్మమూ అతనికి తిండిపెడుతున్నాయి. చండీ మాటలు విని, "ఛ, ఊరుకో! నువ్వు అనవసరంగా భయపడుతున్నావు" అంటాడు.

చండీ మరీ ఏడ్చి రాగాలుపెడితే "నీ వంశంలో ఇంకెవరూలేరు. నువ్వే చెప్పు, ఈ పనికి ఎవరు వస్తారు?" అంటాడు.

ఆ రోజుల్లోనే ఒక భయంకరమైన సంఘటన జరిగింది. మలిందర్‌కి చెల్లెలి వరసైన ఒకామె ఆ ఊరికి వచ్చింది. ఆమె కూతురు రెండు మూడు రోజుల్లోనే చండికి మాలిమి అయింది. అప్పుడు ఊరంతా అమ్మవారు వ్యాపించి ఉంది. ఆడబడుచునీ, ఆమె కూతుర్నీ వెంటబెట్టుకుని చండి అమ్మవారిగుడికి వెళ్ళి పూజ జరిపించి, ప్రసాదం పట్టుకొచ్చింది. రైలుకట్ట పక్కన బీహారునుంచి వచ్చిన కూలీలు

పనిచేస్తున్నారు. వాళ్ళే అమ్మవారి గుడి కట్టించారు. ఒక బీహారీ పూజారిని కూడా నియమించారు.

ఆశ్చర్యమేమిటంటే నాలుగైదు రోజుల్లో ఆ పిల్ల అమ్మవారు సోకి చనిపోయింది. చండి ఇంట్లోకాదు, ఇంకోచోట. కాని ఆ పిల్ల తలిదండ్రులూ, బంధువులూ చండీయే ఆ పిల్ల ప్రాణాలు తీసిందని అనసాగారు.

"నేనా?"

"అవును, నువ్వే!"

"నేను కాదు, నేనా పిల్ల ప్రాణాలు తియ్యలేదు!" చండి చాలా దీనంగా వాళ్ళతో మొరపెట్టుకుంది.

"అవును నువ్వే!"

"కానే కాదు!"

చండి పాములాగ బుసలుకొడుతూ, "నావల్ల ఎవరికీ చెడు జరగదు. నేనే వంశం దాన్నో తెలుసా?" అంది.

భయంతో, మూఢనమ్మకాలతో కళ్ళు మూసుకుపోయిన బుద్ధిలేని ఆ ఊరివాళ్ళు రహస్యంగా, "మరి టుకనీ కోసం గొయ్యి తవ్వుతున్నప్పుడు నీ రొమ్ముల్లోంచి పాలు కారి మట్టిలో ఎందుకు పడ్డాయి?" అని అడిగారు.

"అయ్యో, మూర్ఖుల్లారా!" అని చండి ఆశ్చర్యంగా వాళ్ళవేపు చూస్తూ ఉండిపోయింది కొద్దిసేపు.

"సరే, నా తాత ముత్తాతలు ఇచ్చే శాపం నాకు తగిల్తే తగలనీ! ఇవాళ్టినుంచీ ఈ పని మానేస్తున్నాను" అంది.

"పని మానేస్తున్నావా?"

"అవును, మానేస్తున్నాను. వెళ్ళండి, గుండెధైర్యం ఉన్నవాళ్ళు కాపలా కాయండి. చాలా రోజులుగా నాకీ పని చెయ్యాలని అనిపించటంలేదు. గంగాపుత్రుడికి గవర్నమెంటు ఉద్యోగం రాబోతోంది. అలాటప్పుడు నేనెందుకు ఈ పనిలో ఒళ్ళు హూనం చేసుకోవాలి?"

అందరినోళ్ళు మూయించి చండి తన గదిలోకి వెళ్ళిపోయింది. మలిందర్‌తో, "నువ్వు పనిచేసేచోట గది దొరకదా? పద, అక్కడికే పోదాం! వాళ్ళు నన్నేమంటున్నారో తెలుసా?" అంది.

మలిందర్ చండి కోపం, దుఖం తగ్గించాలనే ఉద్దేశంతో హాస్యంగా, "ఏమంటు న్నారు? నువ్వు మంత్రగత్తెని అయిపోయావనా?" అని తన అలవాటు చొప్పున గట్టిగా అన్నాడు.

ఆ మాట అన్న వెంటనే అతనికి తన తప్పు తెలిసింది. ఏమన్నాడు తను! ఇంత భయంకరమైన మాట తన నోట ఎలా వచ్చింది?

వాకిట్లోని రాటను పట్టుకుని చండి వణకసాగింది. పిచ్చిదానిలా, దుఃఖం పట్టలేక, కోపంగా ఎన్నో రెట్లు గట్టిగా కేకలు పెట్టింది, "ఇంట్లో వంశోద్ధారకుణ్ణి పెట్టుకుని, ఎవరైనా ఇలాంటి మాటలంటారా? నేను మంత్రగత్తెనా? నేను ఇంట్లో ఉన్న నా పిల్లవాణ్ణి వదిలి, చనిపోయిన పిల్లలకి పాలు పడతానా? చనిపోయిన పిల్లల్ని ముద్దుచేస్తానా? చెప్పు, నేను మంత్రగత్తెనా?"

"నోరు ముయ్!"

మలిందర్ ఆమెని కసిరాడు. మధ్యాహ్నం అయింది. ఈ సమయంలో మనిషి నోట్లోంచి వచ్చిన చెడుమాట గాలిలో కలిసి నాలుగువైపులా వ్యాపిస్తుంది. తలమీద నూనె, కడుపులో అన్నంలేని వాళ్ళ మనసుల్లో భయంకరమైన ఈర్ష్యా ద్వేషాలూ, కోపతాపాలు మండుతూ ఉంటాయి. మలిందర్‌కి తన తెగవాళ్ళ మనస్తత్వం, స్వభావం బాగా తెలుసు.

"నేను మంత్రగత్తెను కాదయ్యా, మంత్రగత్తెను కాను!"

చండీ ఏడుపునీ, మాటల్నీ గాలి గద్దలాగ పైకి తన్నుకుపోయింది. క్షణంలో ఈ మాటలు అన్నిదిక్కులూ వ్యాపించాయి.

చండి తను మంత్రగత్తెని కానని చెప్పుకొని ఏడ్చి ఏడ్చి ఊరుకుంది. ఆ తరవాత ఆమె నోటంట మాట రాలేదు. చాలాసేపున్నాక మలిందర్‌తో, "పద ఈ చీకట్లో ఎటైనా పోదాం" అన్నది.

"ఎక్కడికి వెళ్తావు?"

"ఎక్కడికైనా పారిపోదాం."

"ఎక్కడికి?"

"తెలియదు."

చండి భగీరథ్‌ని ఎత్తుకుని మలిందర్ దగ్గరకొచ్చి "కొంచెం దగ్గరకి రా, నీ గుండెలమీద తలపెట్టుకోనీ!" అన్నది.

కొంచెం ఆగి, "నాకు చాలా భయంగా ఉంది. కులవృత్తి చెయ్యనని వాళ్ళకి చెప్పి వచ్చాను. అలా చెప్పినందుకు కూడా భయంగా ఉంది. ఇన్నాళ్ళూ ఎప్పుడూ భయపడలేదు. ఇవాళ ఎందుకింత భయం వేస్తోంది? ఎందుకో నిన్నింక చూడనేమోననిపిస్తోంది. భగీరథ్‌ని కూడా చూడనివ్వరా?" అన్నది.

"ఓరి దేవుడా!" అని మలిందర్ కళ్ళు తుడుచుకున్నాడు.

ఒక్క క్షణం ఆగి, "ఇప్పుడనిపిస్తోంది, దేవుడే ఆమెచేత అలా మాట్లాడించాడని! అర్థమయిందా?" అన్నాడు.

"ఆ తరవాత?" భగీరథ్ అడిగాడు.

ఇది జరిగాక చాలా రోజులవరకూ చండి బొమ్మలాగ ఉండిపోయింది. ఇంటిపని చేసి భగీరథ్‌ని ఒళ్ళోపెట్టుకుని కూర్చునేది. అప్పుడప్పుడూ పాటలు పాడేది. గదిలో దీపం, ధూపం వెలిగించి చెవులు రిక్కించి ఏదో వినేది.

రెండునెలలు ఇట్టే గడిచిపోయాయి. చండిని పిలవటానికి ఎవరూ రాలేదు. ఆ అవసరం రాలేదు. ఆ కాసిని రోజులు ఆమెకి హాయిగా గడిచిపోయాయి. చండి కూడా శాంతించింది.

ఒక రోజు, "ఈ పిల్లలకి సరైన ఏర్పాట్లు జరగాలి. ఇప్పుడన్నది సరైనది కాదు" అన్నది.

"జరుగుతాయి, అన్నిచోట్లా జరుగుతున్నాయి."

"నేను చేసింది తప్పో ఒప్పో ఎవరికి తెలుసు? అప్పుడప్పుడూ మా నాన్న గట్టిగా పిలుస్తున్నట్టనిపిస్తుంది" అన్నది చండి.

"నువ్వు నిజంగా విన్నావా?"

"మా నాన్న హాయి-హాయి-హాయియా అని అరుస్తూ నక్కల్ని తరుముతున్నట్టు అనిపిస్తుంది."

"ఊరుకో చండీ!"

మలిందర్ భయపడ్డాడు. అప్పుడప్పుడూ తనకి కూడా చండి అయినట్టు అనిపిస్తుందా? చండి ఒకరాత్రివేళ ఉలిక్కిపడిలేచి మర్రిచెట్టుకింద ఎవరో ఏడుస్తున్నారని అంటుంది. బహుశా అందరూ అనేది నిజమేనేమో! ఊరొదిలి ఏదైనా పట్నం పారిపోతే నయమని అతనికి అనిపిస్తుంది.

ఇంకోపక్క జనం కూడా చండిని మరిచిపోలేదు. చండీమీద నిఘా ఉంచారు.

చండికి ఆ విషయం తెలియలేదు. జనం బాహాటంగానూ, రహస్యంగానూ ఆమెని గమనిస్తూనే ఉన్నారు. జనం తలుచుకోవాలేగాని ఏదీ వాళ్ళకి అసాధ్యం కాదు.

ఒకరోజు రాత్రి మలిందర్ పూటుగా తాగేసి మంచి నిద్రలో ఉండగా, తుఫాను వస్తున్న సమయంలో అతని ఇంటి ఆవరణలో జనం పోగయారు. కేతన్ కేకేసి మలిందర్‌ని లేపాడు. అతను చండి పెద్దమ్మ మొగుడు.

"రా, నువ్వే చూడు, నీ పెళ్ళాం మంత్రగత్తె అవునో కాదో!" అన్నాడు.

హఠాత్తుగా మెలకువ రావటంతో మలిందర్ బుర్ర పనిచేయలేదు. కొంచెంసేపు అలా చూస్తూ ఉండిపోయాడు.

అప్పుడు కేతన్ మళ్ళీ "చూడు లంజాకొడకా! నాతో వచ్చి చూడు. ఇంట్లోనే పెట్టుకుని ఇన్నాళ్ళూ మా పిల్లల్ని చంపించావు!" అన్నాడు.

మలిందర్ లేచి వెళ్ళాడు. వెళ్ళి చూస్తే మర్రిచెట్టుకింద కాగడా వెలుగుతోంది. దానిచుట్టూ ఊళ్ళోని మగవాళ్ళు నిలబడి ఉన్నారు. ఎవరూ మాట్లాడటంలేదు.

"చండీ!"

మలిందర్ పెట్టిన కేక నిశ్శబ్దాన్ని కత్తిలా చీల్చింది. అందరూ ఏమవుతుందోనని ఊపిరిబిగబట్టి చూస్తున్నారు.

"చండీ!"

చండి నిలబడి ఉంది. ఆమె చేతిలో కొడవలి ఉంది. పక్కనే ఒక పక్కగా చెట్టుకొమ్మలు కలిపి కట్టి ఉన్నాయి.

"కొమ్మలూ, పొదలూ తెచ్చి నేను గొయ్యి పూడుస్తున్నానయ్యా!"

"ఎందుకు? నువ్వెందుకు నిద్రలేచి వచ్చావు?"

"ఇంతసేపూ అరుస్తున్న నక్కలు ఉన్నట్టుండి అరవటం మానేస్తే గొయ్యి తవ్వి శవాల్ని తింటున్నాయేమోనని అనుమానం వచ్చింది."

"నువ్వు మంత్రగత్తెవి!" ఊరివాళ్ళు మంత్రం చదువుతున్నట్టు ఏకకంఠంతో అన్నారు.

"ఎవరూ కాపలా కాయటంలేదు!" అన్నది చండి.

"నువ్వు"

"ఇది నా తాత ముత్తాతల వృత్తి. వీళ్ళకేం తెలుసు?"

"నువ్వు మంత్రగత్తెవి!"

"నేను మంత్రగత్తెని కానయ్యా! నా ఒళ్ళో పసిపిల్లవాడున్నాడు, నా రొమ్ముల్లో పాలు చిమ్ముతున్నాయి. నేను మంత్రగత్తెను కాను. గంగాపుత్ర! నువ్వు చెప్పరాదా, నీకన్నీ తెలుసు కదా?"

లాంతరు వెలుతురులో వానకి తడిసి చండి రొమ్ములకి అతుక్కుపోయిన చీరకొంగుని మలిందర్ మంత్రముగ్ధుడిలా చూడసాగాడు. అతని గుండెలు బాధతో పగిలిపోతున్నాయి. అతనిలోనున్న ఎవరో అంటున్నారు - "ఓ మలిందర్ నువ్వు పాముదగ్గరకెళ్ళటానికి కూడా భయపడవు ... నిప్పు మండుతుంటే దాన్లో చెయ్యి పెడతావు. ఇప్పుడెందుకు భయపడుతున్నావ్? మీరిద్దరూ ఎంత అన్యోన్యంగా ఉంటారు, మీ దాంపత్యం ఎంత సుఖంగా సాగిపోతోంది! నువ్వు వెనక్కి వెళ్ళిపోతే అంతా సర్వనాశనం అవుతుంది!"

మలిందర్ చండి దగ్గరకు వెళ్ళి, ఎర్రబడ్డ కళ్ళతో ఆమెను చాలాసేపు పరికించి. ఉన్నట్టుండి పశువులాగ, "నువ్వు మంత్రగత్తెవి. మర్రిచెట్టు కిందికొచ్చి ఎవరికి పాలుపడుతున్నావు?" అని అరిచాడు.

"గంగాపుత్ర! అయ్యో! నువ్వు కూడా అలా అంటున్నావా?"

చండి ఏడవసాగింది. ఏడుపు ఆమె గుండెల్ని చీల్చుకుని వస్తోంది. ఆమె భయంకరమైన రోదన విని మట్టికింద నిద్రపోతున్న మృతశిశువులూ, చండివాళ్ళ నాన్న ఆత్మా, చివరికి ఆమె జాతి ఆదిపురుషుడు కూడా బెదిరిపోయారు. ఈ ప్రపంచంనుంచి పైలోకాలకి వెళ్ళే వాళ్ళ ఆత్మ బహుశా ఇలాగే ముల్లోకాలనీ వణికిస్తూ, వెళ్తుందేమో!

మలిందర్ పరిగెత్తి ఇంటికొచ్చాడు, తన మామగారు శనిదేవత పూజకి వాడే డోలు తీసుకుని మళ్ళీ మర్రిచెట్టు కిందికి వచ్చాడు. కర్రతో డోలుని వాయిస్తూ ఊరు మొత్తాన్ని భయపెడుతూ అతను, "నేను, మలిందర్ గంగాపుత్ర, నా పెళ్ళాం మంత్రగత్తెగా మారిందని ఊరందరికీ దండోరా వేస్తున్నాను" అని కేకలు పెట్టాడు.

"ఆ తరవాత ఏమయింది?" భగీరథ్ అడిగాడు.

"ఆ తరవాత ఊళ్ళోవాళ్ళు ఆమెని బేల్‌తలాకి తీసుకుపోయారురా, నాన్నా! ఒంటరిగా ఉండటానికి ఎంతో భయపడే ఆమె ఇప్పుడు బొత్తిగా ఒంటరిదైపోయింది. అదిగో విను, మంత్రగత్తె పాడుతోంది."

చాలా దూరంగా డబ్బామీద కొడుతున్న చప్పుడూ, అద్భుతమైన పాట గాలిలో

తేలివచ్చాయి. ముందు మాటలు వినబడలేదు, కాని వినగా వినగా మాటలు కూడా వినబడ్డాయి :

"నిదుర పోరా, బంగారు తండ్రీ
రావే నిదురా మా బాబు కళ్ళకీ..."

ఈ పాట భగీరద్‌కి తెలుసు. వాడి సవతి తల్లి తన పిల్లలు గైరబీ, సైరభీని ఈ పాట పాడే నిద్రపుచ్చుతుంది.

"పద నాయనా, ఇంటికి పోదాం!"

మలిందర్ భగీరథ్‌తో ఇల్లు చేరుకున్నాడు. మంత్రగత్తె పాడిన పాట తన గుండెలోకి చొచ్చుకు పోయినట్టూ, తన రక్తంలో కలిసిపోయినట్టూ భగీరథ్‌కి అనిపించింది. అర్థంకాని బాధలాగ ఆ పాట వాడి చెవుల్లో గింగురుమంటూనే ఉంది.

ఇది జరిగిన చాలా రోజులకి భగీరథ్ మంత్రగత్తె గుడిసెకి ఒంటిగా వెళ్ళాడు. చాలా దూరంనించే డబ్బామోత విని పరిగెత్తి వెళ్ళాడు.

మంత్రగత్తె ఆ సమయంలో మట్టికుండలోకి చెరువులోంచి నీళ్ళు నింపుకుంటోంది. ఆమె వాడివైపు చూడలేదు. నీళ్ళలో ఆమె నీడ కనిపిస్తోంది.

"నీ దగ్గర వేరే బట్టలు లేవా?" అని భగీరథ్ అడిగాడు.

మంత్రగత్తె జవాబు చెప్పలేదు, మొహం తిప్పేసుకుంది. భగీరథ్‌వేపు చూడలేదు.

"నువ్వు మంచి బట్టలు వేసుకుంటావా?"

"గంగాపుత్రుడి కొడుకా, ఇంటికి పో!" అన్నది మంత్రగత్తె.

"నేను ... నేను స్కూల్లో చదువుకుంటున్నాను. నేను మంచి పిల్లవాడి నయిపోయాను."

"నాతో మాట్లాడకూడదు, నేను మంత్రగత్తెను."

"నేను నీడతో మాట్లాడుతున్నాను."

"నా నీడ కూడా పాపిష్టిదే. గంగాపుత్రుడి కొడుకువి, ఈ విషయం నీకు తెలియదా?"

"నాకు పాపమంటే భయంలేదు."

"ఇప్పుడు ఇంటికెళ్ళు. చాలా ఎండగా ఉంది. పాలుతాగే పసివాళ్ళు

ఈవేళప్పుడు బైట తిరగకూడదు."

"నీకు ... నీకు ఒంటరిగా ఉండటం భయం వేస్తుంది కదూ?"

"ఒంటరిగానా? లేదురా! నాకేం భయంలేదు. మంత్రగత్తె ఎక్కడైనా ఒంటరిగా ఉండటానికి భయపడుతుందా?"

"అయితే నువ్వు ఏడుస్తావెందుకు?"

"ఎవరన్నారలా?"

"నేను విన్నాను."

"గంగాపుత్రుడి కొడుకు నేను ఏడుస్తానని చెప్పుకోగా విన్నాడా?"

నీళ్ళల్లో ఎర్రటి నీడ కంపిస్తోంది. ఏడుస్తోంది. మంత్రగత్తె కళ్ళు తుడుచుకుని, "గంగాపుత్రుడి కొడుకు ఇంట్లో ఉండాలి. దగ్గరకెప్పుడూ రాకూడదు. లేకపోతే ... లేకపోతే ... నేను గంగాపుత్రుడితో చెప్పేస్తాను."

గట్టువెంబడి మంత్రగత్తె వెళ్ళిపోవటం చూశాడు భగీరథ్. జుట్టు జడలు జడలుగా గాలిలో ఎగురుతోంది. ఆమె కట్టుకున్న ఎర్రటి బట్ట మెరుస్తోంది. భగీరథ్ చాలాసేపు చెరువుగట్టునే కూర్చున్నాడు. చెరువునీళ్ళు కదలటం ఆగేదాకా అక్కడే కూర్చున్నాడు. కానీ మళ్ళీ ఎవరూ ఆ పాట పాడలేదు -

"నిదురపోరా బంగారుతండ్రీ
రావే నిదురా బాబు కళ్ళకూ..."

గుడిసెకొచ్చాక మంత్రగత్తె కూడా చాలాసేపు రాతిబొమ్మలా కూర్చుండిపోయింది.

ఏవేవో ఆలోచిస్తూ కూర్చుంది. చాలాసేపటికి లేచి ఎక్కణ్ణించో ఒక విరిగిన అద్దం తీసింది.

"మొహంలో ఏమీ లేదు" అని గొణుక్కుంది. జుట్టు చిక్కు వేళ్ళతో సరిచేద్దామని ప్రయత్నించింది. కానీ వీలుకాలేదు. వెంట్రుకలు అంటుకుపోయి జడలు కట్టాయి.

పిల్లవాడు బట్టల విషయం ఎందుకెత్తాడో అని అనుకుంది. వాడు చాలా పసివాడు! ఏమీ జ్ఞాపకం ఉండీ ఉండదే! మంచి బట్టలూ, అందమైన మొహమూ వాడికి ఎలా జ్ఞాపకం ఉన్నాయి? కనుబొమలు ముడిచి చాలాసేపు ఆలోచించింది. చాలా రోజులుగా మామూలు మనుషుల్లాగ ఆలోచించే అలవాటు పోయింది.

ఆలోచించటానికి ఏముందని అసలు! మర్రిచెట్టు ఆకులు కదిలే చప్పుడూ, గాలి ఎక్కువగా వీస్తే వచ్చే చప్పుడూ, పక్కనించి వెళ్ళే రైలు చేసే చప్పుడు తప్ప ఏమీ వినబడదు. వీటిగురించి ఆలోచించటానికేముందని?

కాని ఇవాళ తన పిల్లవాడికి కీడు జరుగుతుందని అనిపించింది. ఉన్నట్టుండి ఒక పెళ్ళాంలాగ తన మొగుడి బుద్ధిలేనితనంమీద ఆమెకి కోపం వచ్చింది. పిల్లవాణ్ణి జాగ్రత్తగా చూసుకోవటం ఎవరి బాధ్యత? మంత్రగత్తె కళ్ళపడకుండా వాడిని కాపాడటం ఎవరి బాధ్యత?

ఆమె లేచి లాంతరు వెలిగించింది. గబగబా రైలుకట్ట వెంబడి నడవసాగింది. రైల్వే గేటు, లెవల్ క్రాసింగ్ దాటింది. అట్నించే మలిందర్ వస్తాడు. అట్నించి మేథోమీంచి ఇంటికి వెళ్తాడు. రైల్వే లైను వెంబడి వెళ్తూ ఆమెకి కొందరు మనుషులు కనబడ్డారు. వాళ్ళు పట్టాలమీదనించి ఏవో తొలగిస్తున్నారు.

కాదు, కాదు, పట్టాలమీద వెదురుబొంగుల్ని తెచ్చి పేరుస్తున్నారు.

ఇవాళ బుధవారం. రాత్రి ఫైవ్ అప్‌లో లాల్‌గోలానించి మైల్ బేగ్ వస్తుంది. దాన్నిండా డబ్బుంటుంది. చాలా రోజులుగా వీళ్ళు దీనికోసం ఏర్పాట్లు చేస్తున్నారు.

"ఎవరు మీరు?"

గద్దించి లాంతరు ఎత్తి తన మొహం దగ్గర పెట్టుకుని ఊపింది. ఒకడు తలెత్తి చూశాడు. మంత్రగత్తెని చూడగానే బిక్కచచ్చిపోయాడు. కళ్ళల్లో భయం కొట్టిచ్చినట్టు కనిపించింది. మంత్రగత్తె ఎన్నడూ ఊరిమనుషుల మొహాల్లో ఇంత భయం చూసి ఎరగదు.

"మీరు బండికి అడ్డంగా బొంగులు పెడుతున్నారా, బండిని బోల్తా కొట్టించాలనా? మరిప్పుడు ఎందుకు పారిపోతున్నారు? నేనంటే భయమా? ముందు ఈ బొంగులు తీసి దూరంగా పారెయ్య... లేకపోతే సర్వనాశనం అవుతుంది!"

వాళ్ళు పట్టాలమీదనించి అన్ని బొంగులూ తియ్యలేకపోయారు. ఇప్పుడు సర్వనాశనం అవకుండా ఆపడం అసంభవం. సమాజం ఎప్పుడు ఇలాగే చేస్తూ ఉంది. వీళ్ళల్లోనే ఒకడు ఒకనాడు డోలు వాయించి తను మంత్రగత్తెనని అందరికీ చెప్పాడు. వర్షం మొదలైంది. గాలితో తుంపర పడసాగింది. చేత్తో లాంతరు పట్టుకుని చండీ ఏమీ తోచక నిలబడిపోయింది. ఒకవేపు రైలు వేగంగా వస్తోంది. తను నిజంగా మంత్రగత్తే అయితే తను పోషించిన భూతప్రేతాలు వచ్చి ఈ రైలుని ఆపవేం

అనుకుంది. జనం తలచుకుంటే చేయగలరు, కానీ తానొక్కర్తీ ఏం చెయ్యగలదు? ఎంత అసహాయురాలు చండి? ఇప్పుడేం చేయాలి?

లాంతరు ఒక చేత్తో ఎత్తి పట్టుకుని చండి పట్టాలమీద పరిగెడ్తూ రెండో చెయ్యి ఊపుతూ ఎంతో ప్రయత్నించింది. గొంతు చించుకుని అరిచింది - "రావద్దు, ముందుకి రావద్దు, ఇక్కడ పెద్ద కొండలా వెదురుబొంగుల గుట్ట..."

రైలు ఆగటంలేదు. చెప్పినమాట వినని పిల్లవాడిలాగ ఆగకుండా పరిగెత్తి చండీ మీదనించి పోయింది.

తన ప్రాణాలని ఒడ్డి రైలు ప్రమాదాన్ని ఆపినందుకు చండి పేరు దూరదూరాల వరకూ పాకిపోయింది, గవర్నమెంటు వరకూ వెళ్ళింది.

చండి శవాన్ని తీసుకెళ్ళాక ఇనస్పెక్టర్. ములిందర్‌వాళ్ళ ఊరికి వచ్చాడు. అతనితో పాటు బి.డి.ఓ. కూడా ఉన్నాడు.

"రైల్వే కంపెనీవాళ్ళు చండి గంగాదాసీకి మెడల్ ఇస్తారు. మలిందర్! మీకథ నాకు తెలుసు, ఆమె కెవ్వరూ లేరు. కాని గవర్నమెంటు వివరాలు కనుక్కోమని బి.డి.ఓ.ని పంపింది."

"చాలా సాహసంతో కూడుకున్న పని, ఆమె చాలా సాహసం చేసింది. మా డిపార్టుమెంటు వాళ్ళందరూ ఆమెని పొగుడుతున్నారు. ఆమె మీ కుటుంబంలోనిదా?"

ఎవరూ మాట్లాడలేదు. ఊళ్ళోని వాళ్ళు మొహమొహాలు చూసుకున్నారు. తలవంచుకుని, కళ్ళు దించి ఎవరో, "అవునండి. మా కులం మనిషే" అన్నారు.

భగీరథ్ నోటమాట రాలేదు. వాడు అందరివేపూ చూశాడు. చండి తమ జాతి మనిషేనని వీళ్ళు ఒప్పుకున్నారా? అంటే, ఆమెని వాళ్ళు స్వీకరించారా?

"మీ అందరికీ ప్రభుత్వం మెడల్ ఇవ్వదు!"

"సర్, నాకివ్వండి" భగీరథ్ ముందుకొచ్చాడు.

"ఎవరు నువ్వు?"

"ఆమె నా తల్లి."

"అలాగా, నీ పేరేమిటి? ఏం చేస్తూంటావు?"

బి.డి.ఓ. కాగితం, కలం తీశాడు. భగీరథ్ ఏడవసాగాడు. గొంతు సవరించుకుని అతి కష్టంమీద "నా పేరు భగీరథ్ గంగాపుత్రుండీ, తండ్రి పేరు

పూజా మలిందర్ గంగాపుత్ర. మేముండేది కాటికాపర్ల గూడెంలో. తల్లి పేరు ఈశ్వర చండి గంగాదాసి ..." భగీరథ్ తన వంశాన్ని పరిచయం చేశాడు.

# బేహులా

నదిపేరు బేహులా, ఊరిపేరు బేహులా, ఇర్‌ఫాన్‌పూర్ బ్లాకు. బ్లాక్ ఆఫీసు, హెల్త్‌సెంటర్, వ్యవసాయ సహాయకేంద్రం - ఇర్‌ఫాన్‌పూర్‌లో అన్నీ ఉన్నాయి. బాలీగంజ్ స్టేషన్‌నుంచి రెండున్నర గంటలు ప్రయాణంచేసి ఇర్‌ఫాన్‌పూర్ స్టేషన్‌కి వెళ్ళవచ్చు. రైలుదిగి ఇర్‌ఫాన్‌పూర్ బ్లాకుకి కాలినడకన చేరుకోవచ్చు. చలికాలంలోనూ, ఎండాకాలంలోనూ పొలాలకడ్డం పడి, గట్లవెంబడి, కాలిబాటన పట్టుకుని వెళ్ళొచ్చు. వానాకాలంలో నడవటం ఇబ్బంది అవుతుంది. అంతా బురదమయం, నడిస్తే కాలు జారుతుంది. ఊరిజనం బేహులా వెళ్ళినా ఏడుస్తూ వెళ్ళాలి, బేహులానుంచి వచ్చినా ఏడుస్తూ రావాలి అని అంటారు. వసంత్‌కుమార్ ఇక్కడే వుంటాడు. మునుపు హాప్‌కిన్ ఇన్‌స్టిట్యూట్‌లో వుండేవాడు. అతను బెంగాలీ యువకుడు. బలహీనంగానూ, అనారోగ్యంగా వుండేవాళ్ళ శరీరాల్లో కాలాజ్ పాము విషం ఎలాంటి ప్రభావం చూపుతుందనే విషయంమీద అతను రీసెర్చ్ చేస్తున్నాడు. ఆ పనిమీదే అతను ఇక్కడకి వస్తూ వుంటాడు. ఈ ఊళ్ళో 24 పరగణాలున్నాయి. ఇక్కడ బలహీనంగా, అనారోగ్యంగా ఉన్న మనుషులూ, కాలాజ్ పాములూ విపరీతంగా వున్నాయి.

పాముల విషయానికొస్తే ఈ గ్రామప్రాంతాన్నే చెప్పుకోవాలి. ఈ ప్రాంతంలో బక్కచిక్కి ఆకలితో బాధపడే మనుషులు కూడా ఎక్కువే. వానలొచ్చినా, వరదలొచ్చినా, కరువు కాటకాలేర్పడినా ఈ పాములు అన్నీ తట్టుకుంటాయి. ఈ ప్రాంతంలో కాలాజ్ పాముని 'శియడ్ చాందా' అని 'శివడ్ చాందా' అనీ అంటారు. పాముకాటువల్ల ఇక్కడ చాలామంది చనిపోతూ వుంటారు.

'కాలాజ్' అంటే వాంగెరాస్ కైరూలియస్. ఇవి భారతదేశంలో అంతటా వుంటాయి. చదునైన ప్రదేశంలో ఇవి వుంటాయి. ఉక్కులాంటి రంగుతో మెరిసే చర్మంమీద తెల్లటిగీతలు వుంటాయి. దీని పొడుగు 1500 మి.మీ. మగపాము కొంచెం పెద్దదిగా వుంటుంది. ఈ పాములు రాత్రిళ్ళు బైటికి వస్తాయి. నల్లత్రాచు

తరువాత కాలాజ్ పామునే చెప్పుకోవాలి. దీని విష ప్రభావంతో కూడా చాలామంది మరణిస్తారు. పురులియాలో దీన్ని 'డోమనాచితి' అంటారు. అక్కడివాళ్ళు 'డోమనా కాటు వేస్తే బ్రాహ్మణ్ణి పిలుచుకురా' అంటారు. అంటే మృత్యువు తప్పదనీ, అందుకే అంత్యక్రియలు చెయ్యటానికి బ్రాహ్మణ్ణి పిలుచుకురమ్మనీ అర్థం అట. నల్లత్రాచు చంద్రబోడా విషం 12-15 మి.గ్రా. వరకూ శరీరంలో ప్రవేశిస్తే స్నేక్‌వెనమ్ ఏంటీసీరమ్ వల్ల ప్రయోజనం వుంటుంది. కాలాజ్ విషం 6 మి.గ్రా. కన్నా ఎక్కువ శరీరంలో ప్రవేశిస్తే ఏంటీసీరమ్ పనిచెయ్యదు. ఈ పాములు పాడి ప్రదేశాల్లో వుంటాయి. పేర్చిన ఇటుకల మధ్యలోనూ వుంటాయి.

వసంత్‌కుమార్ బేహులా కొచ్చినప్పుడు అతనికి ఒకే ఒక ఇల్లు తను వుండటానికి సౌకర్యంగా కనిపించింది. అది జమీందారు హృదయ (హేదో) నశ్కర్‌ది. ఊళ్ళో ఇటుకలూ సిమెంటుతో కట్టిన ఒకే ఒక ఇల్లు అది. పైగా ఆ ఇంట్లోఒక గదికూడా ఖాళీగా వుండటంతో అతనికి అక్కడ వుండక తప్పదు. ఆ జమీందారు పాముల పెంపకానికి కారణభూతు డయ్యాడు. అతడు ఒకప్పుడు ఇటుకల బట్టీ పెట్టాలనుకున్నాడు. పని ప్రారంభించాడు. లక్షదాకా ఇటుకల్ని కాల్చి తయారు చేయించాడు. ఆ తరవాత లెక్కలు వేసి చూసుకుంటే వాటిని సరఫరా చెయ్యటానికయ్యే ఖర్చు, అమ్మితే వచ్చే డబ్బుకన్నా ఎక్కువ అనిపించింది. అందుకని అతను మనసు మార్చుకున్నాడు. ఈ ఇటుకబట్టీలు కాలాజ్ పాములు ఉండటానికీ, వాటి సంఖ్య పెరగటానికీ చాలా అనువుగా తయారయింది. ఇటుకలు బైటినుంచి తెప్పించి అతను తన రెండంతస్తుల మేడ ఎప్పుడో పూర్తిచేశాడు. అతని కొడుకు పెళ్ళి కలకత్తాలో వుండే అమ్మాయితో జరిగింది. అందుకని పట్నంలో పెరిగిన ఆ అమ్మాయికోసం బావిదగ్గర స్నానాలగది కట్టించవలసి వచ్చింది. పాత తాపీ పనివాణ్ణి పిలిపించి, కొలతలు తీయించి ఇటుకలు తీసుకురమ్మని బట్టీకి పంపించాడు. వెళ్ళేటప్పుడు చాలా ఉత్సాహంగా వెళ్ళినవాడు కొద్దిసేపట్లో కాలినత్తువకొద్దీ పరిగెత్తుకొచ్చి, "అయ్యా, తమరు పాముల పెంపకం మొదలుపెట్టారా, ఏం? బాబోయ్, అన్ని కాలాజ్ పాముల్ని ఒకచోట నేను నా జన్మలో చూడలేదు. మీకో నమస్కారం! శియద్‌చాందా కరిస్తే బతికే ప్రసక్తేలేదు!" అన్నాడు.

హేదో నశ్కర్ "ఆ ఇటుకల వెల ఎంతో తెలుసా?" అని గర్జించాడు.

"అది మీకే తెలియాలి, బాబుగారూ! నాతరం కాదు.

"ఛిరిమాల్‌ని పిలిచి చూపిస్తాను."

"ఛిరిమాల్ ఏమిటి, సాక్షాత్తూ ధన్వంతరి వచ్చినా నేను అక్కడికి వెళ్ళను. బాబోయ్! శియడ్ చాందాల్ని పెంచి పోషిస్తున్నారు మీరు!"

శ్రీపద్‌మాల్ ఆప్రాంతాల్లో పేరుమోసిన మంత్రగాడూ, భూతవైద్యుడూను. పిల్లలకోసం గిలకలు తయారుచెయ్యటం అతనికి చాలా ఇష్టం. ఆ సమయంలో అతను ఊళ్ళోలేడు. అత్తవారి భూముల్ని చూసుకోవటానికి బాదా వెళ్ళాడు. అక్కణ్ణించి వచ్చి తన భూముల్ని చూసుకోవటానికి వెళ్ళి హేదోనశ్కర్‌తో, "ఏమిటీపని? ఊరి నడిబొడ్లో ఇన్ని ఇటుకలు పేర్చి పెట్టారేమిటి? ఇవి ఇటుకలు కావు, మనుషుల్ని చంపే మిషన్లు. అసలే వెధవ పాముల బాధలేక పడలేక చస్తున్నాం." అన్నాడు.

"నువ్వుకూడా అదే పాటా?"

"కావలిస్తే వెళ్ళి మీ కళ్ళారా చూసుకోండి."

హేదోనశ్కర్ వెంటనే కలకత్తానుంచి కార్బోలిక్ ఏసిడ్ తెప్పించాడు. తన ఇంట్లోకి పాములు రాకుండా కట్టుదిట్టం చేసుకున్నాడు. కానీ ఊళ్ళో వాళ్ళనెవరైనా కాటువేస్తే వాళ్ళు చనిపోయే ప్రమాదం వుంది. నెలకి ఒకరో ఇద్దరో పామువాత పడుతూనే వున్నారు. శ్రీపద్ అన్నీ కేసులూ చూడడు. పాముకాటుకి పైన తాడుకట్టి ఇర్‌ఫాన్‌పుర్ హెల్త్‌సెంటర్‌కి పంపిస్తాడు. ఆ హెల్త్‌సెంటర్‌ని చూసి కలకత్తా ఇంత దగ్గర్లో వుందని ఎవరూ అనుకోరు. సెంటర్‌లో డాక్టర్ల దగ్గర వుండే మందులు, కొంచెం సల్ఫాడయిజీన్, ఇంట్రోక్యూనాల్, దగ్గుకి మిక్చురూ మాత్రమే. పొటాషియం పెర్మాంగనేట్‌తో గాయాన్ని కడిగి, శ్రీపద్ కట్టిన తాడు సరిగ్గా వుందో లేదో చూసి, "కలకత్తాకి తీసుకుపొండి" అంటారు.

సాధారణంగా శ్రీపద్‌కూడా వాళ్ళతో వెళ్తాడు. అతనికి పాముకాటుకి చికిత్స చెయ్యటం కొద్దిగా తెలుసు. విషసర్పం మరీలోతుగా కాటు వెయ్యకపోతే దానికి అతను చికిత్స చేసి, ప్రాణాలు కాపాడగలడు. అతనివల్ల కాకపోతే హెల్త్‌సెంటర్‌కి తీసుకుపోతాడు. అదే అతని పద్ధతి. అక్కడ పాముకాటువల్ల జనం రోజూ బాధపడుతుంటారు కాబట్టి, అక్కడి హెల్త్ సెంటర్లలో పాముకాటుకి కావలసిన తిరుగులేని మందు స్నేక్ వెనమ్ ఏంటీ సిరమ్ ఎప్పుడూ సప్లయి చెయ్యబడదు.

డాక్టర్లు రోగిని కలకత్తాకి తీసుకుపొమ్మని సలహా ఇస్తారు.

"డాక్టరుగారూ! రోగిని నిద్రమత్తు ఆవహిస్తోంది. కళ్ళు సరిగ్గా కనపడటం లేదు, కళ్ళల్లో వెలుగు తగ్గిపోతోంది, నోటమాట రావటంలేదు, మెడ వంకర తిరిగిపోతోంది, కలకత్తా చేరేవరకు ఇతను బతకడు. వేళకాని వేళ అక్కడికి రైలుకూడా లేదు." అని శ్రీపద్ అంటాడు.

రోగి ఇంట్లో వాళ్ళు, "ఏం లాభంలేదు, ఇతను బతకడు, యమరాజు తీసుకుపోవటానికి వచ్చాడు" అంటారు.

"డాక్టరుగారూ, ఇంజక్షనివ్వరూ? "శ్రీపద్ అడుగుతాడు.

"ఇంజక్షన్‌లేదు"

"ఇక్కడ వుండదా?"

"ఉండదు"

రోగిని చిన్న మంచంమీద పడుకోబెట్టి, అతని బంధువులందరూ ఏడుస్తూ ఇంటికి తీసుకుపోతారు. శ్రీపద్ మట్టిలో పిచ్చిగీతలు గీస్తూ గొణుక్కుంటాడు, "ఓట్లకోసం పరిగెత్తుకొస్తారు వెధవలు! ఇక్కడ ఎన్నికల్లో గెలిచిన వాళ్ళందరితో మొరపెట్టుకున్నాను - ఇంజెక్షన్లు పంపండి, ఇంజక్షనిస్తే జనం అంత త్వరగా చనిపోరని. కాని వెధవలందరూ మధురకి వెళ్ళిన కృష్ణుడిలాగ మళ్ళీ మా విషయమే పట్టించుకోరు!"

డాక్టర్లు ఏంటీవెనమ్ సీరమ్ కావాలని ఎప్పుడూ అడుగుతూనే వుంటారు, వాళ్ళు అక్కణ్ణించి గర్భనిరోధక మాత్రలు, సల్ఫాడయిజీన్ పంపిస్తారు. ఏమీ చెయ్యలేని స్థితిలో వాళ్ళు టైఫాయిడ్, నిమానియా, రక్త విరేచనాలూ, కడుపులో పురుగులూ, అన్నిటికీ ఈ మందులే యిస్తారు. వీలైనంత త్వరగా కలకత్తాకి బదిలీ చేయించుకోటానికి ప్రయత్నిస్తూ వుంటారు. ఇక్కడికొచ్చాక ఎటువంటి ప్రమాదాన్నించైనా దేవుడే మనుషుల్ని కాపాడగలనన్న విశ్వాసం ఈ డాక్టర్లకి కలిగింది. లేకపోతే నిమోనియా రోగి గర్భనిరోధక మాత్రలతో ఎలా కోలుకుంటాడు? నిజంగానే ఈ మాత్రలని దేవుడు ఆశీర్వదించి పంపాడు!

పాముకాటుకి గురైన ఆ మనిషి కొంతసేపటికి వైద్యంలేక చచ్చిపోతాడు. అంత్యక్రియలైనాక ఇప్పటికీ వీళ్ళు ఆ శవాన్ని బేహులా నదిలో పడేస్తారు. నదికా పేరుండటంవలన ఇలా శవాల్ని మొయ్యక తప్పటంలేదు. వాన లేకపోతే దానిలో

నీళ్ళు తక్కువగా వుంటాయి. శవం నెమ్మది నెమ్మదిగా తేలుతూ పోతుంది. తిండిలేక నీరసించిన బేహులా లఖింద్ర శవాన్ని మోస్తున్నట్టుగా, చాలా నెమ్మదిగా కదులుతుంది. జోరుగా ప్రవహించే తామలీ అనే పెద్దనదిలో కలిసేముందు బేహులాలో ఒక సుడిగుండం ఏర్పడుతుంది. అక్కడికి చేరుకున్న శవాలు అరటిబోదెల్లాగ గుండ్రంగా తిరుగుతూ నెమ్మది నెమ్మదిగా మునిగిపోతాయి. కొంతసేపయాక అవి తామలీలో తేలుతూ కనిపిస్తాయి.

శ్రీపద్‌కి ఊళ్ళో మంచి పేరుంది. దాన్లో ఆశ్చర్యం ఏమీలేదు. కానీ కోరలు లోతుగా దిగబడితే మరిక దానికి తిరుగులేదు. తాడూ-గీడూ కట్టినా కూడా గంటలోపల ఏంటీసిరమ్ ఇంజక్షనివ్వకపోతే రోగి బతుకుతాడన్న ఆశ వుండదు. ఇంజక్షనిచ్చినప్పటికీ బతుకుతాడన్న హామీ ఏమీలేదు. ఇదంతా చూస్తున్న కొద్దీ శ్రీపద్‌కి తనమీద తనకు నమ్మకం తగ్గిపోతోంది. హెల్త్ సెంటర్‌లోకి ఇంజక్షన్లు వస్తే అతనే అందరికన్నా ఎక్కువ సంతోషిస్తాడు. అతను కొన్నాళ్ళు ఊరొదలి ఎక్కడికైనా వెళ్తే అందరి గుండెలూ గుబగుబలాడుతూ వుంటాయి. అతనికికూడా ఊళ్ళో జనాన్ని మృత్యువువాత పడటానికి వదిలేసి వెళ్ళిపోయానే అని అనిపిస్తుంటుంది. నిద్రపోయేటప్పుడు చెయ్యి కిందికి వేలాడేస్తే పాము కరుస్తుంది. పొయ్యిలో బూడిద తీస్తుంటే పాము కాటువేస్తుంది. రాత్రిళ్ళు చెంబుతీసుకుని మైదానాల్లోకి బయటకిపోతే పాము కాటు వేస్తుంది. అన్నివైపులా కాలాజ్‌లే! హేదోనశ్కర్ ఇటుకల బట్టీవల్ల పాముకాటు చావులు పెరిగిపోయాయి.

పాముకాటువల్ల జనం చచ్చిపోతుంటే, మనిషికి తనేదో ఓడిపోయానన్న భావం కలుగుతుంది. నదిపేరు కూడా ఈ భావాన్ని ఇంకా బలపరుస్తుంది. నదిపేరు బేహులా అయితే ఆ ప్రాంతంలో వుండే ఆడమగా లఖింద్రలే కదా మరి. మనసాపూజకీ దీనికీ ఎటువంటి సంబంధమూలేదు. ఇక్కడ మనసాదేవిని మట్టిదిబ్బ రూపంలో చేసి కుండలో గంగాజలం వుంచి మనసాచెట్టు కొమ్మతోనూ పూజిస్తారు. పూజ జరిగేరోజున రకరకాల పిండివంటలు చేస్తారు. మర్నాడు ఇళ్ళల్లో వంట చెయ్యరు. (ఆరంఘని=వంటచెయ్యరు) చాలామంది దీనిని ''రసోయీ పూజ'' అనికూడా అంటారు. ఇటుకబట్టీ పెట్టి పాముల పెంపకానికి తోడ్పడి, బంగారం పండించిన హేదోనశ్కర్ మనసా పూజని ఇంకా పెద్దఎత్తున చేయించసాగాడు. 'వెధవలకి దేనిమీద భక్తిలేదు, అందుకే వాళ్ళని పాములు కరుస్తున్నాయి. నా

ఇటుకలవల్ల పాములు ఎక్కువయితే, మరి నన్ను కాటు వెయ్యవేం?' అని అందరితో అనసాగాడు.

అతనీమాట వసంత్‌తోకూడా అన్నాడు. వసంత్ ఆలోచనలూ, అతని లోకం వేరు. పరిశోధనలు చెయ్యటానికి వచ్చాడు. అతనికి హేదోనక్కర్‌ని చూస్తే భయంలేదు. అతని ప్రతాపం వసంత్ దగ్గర సాగదు. అక్కడి ఎస్.డి.ఓ. వసంత్‌కి బావ అవుతాడు. అతనే వసంత్ వుండటానికి ఏర్పాట్లూ అవి చేశాడు. ఆఫీసర్‌ని ఒబ్లయిజ్ చెయ్యటానికి అవకాశం దొరికిందికదా అని హేదోనక్కర్ కూడా చాలా సంతోషించాడు. దేశాన్ని ఎవరు పాలించినా ఆఫీసర్లు తనతో సర్దుకుపోతే హేదోనక్కర్‌కి అంతా లాభమే!

హేదో మాటలూ, ఊళ్ళోవాళ్ళ కుసంస్కారమూ చూసి వసంత్, "అన్ని వేపులా కార్బోలిక్ చల్లుతున్నారు, ఇంట్లో బాగా వెల్తురుంది, పొదలూ, తుప్పలూ లేవు, చెప్పులేసుకోకుండా ఇంట్లోంచి బైటికి వెళ్ళరు, మరింక పాము ఎలా కాటు వేస్తుంది?" అని నవ్వుతూ అంటాడు.

"అది కాదండీ! అందరూ నా ఇటుకల బట్టీనే అంటారు. మరి ఇది లేనప్పుడు పాములు కరవలేదా? నేను పుట్టి బుద్ధెరిగినప్పటి నుంచీ బేహులాలో పాముకాటుతో చచ్చిపోయినవాళ్ళ శవాలు తేలటం చూస్తూనే వున్నానే! శ్రీపద్‌కి కూడా హస్తవాసిలేదు. లేకపోతే మంత్ర తంత్రాలు తెలిసి, భూతవైద్యుడై వుండికూడా ఎప్పుడూ ఇంజెక్షన్లో అని గోలపెడుతూ వుంటాడు."

"అలాగా? అతను ఇంజెక్షన్ ఇవ్వాలని అంటూ వుంటాడా?"

"అడక్కండి! నన్ను చంపుకు తింటుంటాడు - ఇంజెక్షన్ తెప్పించే పని చూడండి అంటూ. ఇంజెక్షన్ మాటెత్తావంటే, పాము మంత్రం తెలిసుండీ నువ్వు ఓడిపోయానని ఒప్పుకుంటున్నావన్నమాట!"

"హెల్త్‌సెంటర్లో స్నేక్‌వెనమ్ ఏంటీసీరమ్ లేదా? ఏమంటారు వాళ్ళు?"

"అది ఎప్పుడైనా ఉండేడిస్తేగా? ఈ దక్షిణ ప్రాంతాల్లో పాములు లేనిదెక్కడ? అన్ని చోట్లా పాములే! నిద్రలోనే మనిషి పని అయిపోతుంది. నరుడూ నాగమూ కలిసే జీవిస్తారని అంటూ వుంటారు. ఇక్కడ హెల్త్‌సెంటర్‌కూడా తయారైపోయింది. అక్కడ మట్టుకు ఇంజక్షన్లెక్కడున్నాయి? ఒక ఏడు చాలామంది పాముకాటుతో చచ్చిపోతే ఆ ఏడుమట్టుకు ఇంజక్షన్లు పంపారు. అయినా వాళ్ళెందుకు పంపాలి?

పాముకాటుతో చావాలని ఎవరికైనా రాసిపెట్టి వుంటే, ఎలా తప్పించుకోగలరు?''

వసంత్ మనసులో ఒక ఎకడమిక్ ప్రశ్న తలెత్తింది. పాముల విషయంలో మట్టుకు మనుషులు ఇలా ఎందుకు ఓటమిని అంగీకరిస్తారు? పాములవల్ల ఇన్ని చావులు సంభవిస్తున్న ఈప్రాంతంలో స్నేక్‌వెనమ్ ఏంటీసీరమ్ ఎందుకులేదు? ప్రభుత్వ ఆరోగ్యశాఖకూడా పాముకాటువలన చావు కొందరికి రాసిపెట్టి వుంటుందనే అనుకుంటుందా?

''పాము కరిస్తే ఏం చేస్తారు?''

''ఆ శ్రీపదే చూస్తాడు.''

''నయం చేస్తాడా?''

నయం చేస్తాడో లేదో! పాము కాటువేస్తే ఏదైనా చెయ్యగలవాడు అతనొక్కడేగా! కానీ, ఒకమాట! అతను పోయిన తర్వాత ఎలాగా అని మేమంతా చాలా మథనపడుతూ వుంటాం. అతని కొడుక్కి ఇవన్నీ చేతకావు.''

''శ్రీపద్ తండ్రికూడా ఇదే పని చేసేవాడా?''

''అతను చాలా గొప్ప పాము మంత్రగాడు రామ్ పద్‌మాల్ పేరు ఇక్కడ అందరికీ తెలుసు. ఒకసారి ఒక పిల్లవానికి పాము కరిచి చచ్చిపోయాడు. మర్నాడు వాణ్ణి నదిలో వదిలిపెట్టటానికి తీసుకుపోతుండగా రామ్‌పద్ ఇన్‌స్పెక్టర్‌తో, ''బాబుగారూ, ఈ పిల్లవాడు బతికే వున్నాడు. బతికుండగానే వీణ్ణి నీళ్ళల్లో పారేస్తారా?'' అన్నాడు. ఇన్‌స్పెక్టర్, ''వీణ్ణి బతికిస్తే ఐదువందల రూపాయలిస్తాను'' అన్నాడు. వాణ్ణి బతికించి రామ్‌పద్ ఇన్‌స్పెక్టర్ దగ్గర్నుంచి ఐదువందల రూపాయలు సంపాదించుకున్నాడు. నేను కళ్ళారా చూశాను. అప్పుడు నేను చాలా చిన్నవాణ్ణి.''

''శ్రీపద్‌ని కలుసుకోవాలని వుంది.''

''ఆ సీసాల్లోది ఏమిటి?''

''ఇంజక్షన్లు''

''ఇంజక్షన్లా?''

''పాములతో పనికదా?''

''దీనివల్ల నయమవుతుందా?''

''నన్ను రెండుసార్లు పాము కరిచింది. మీముందు కూర్చునే ఉన్నానా? అంటే దీనివల్ల లాభం ఉందనేనా అర్థం!''

"తెల్లపొడిలాగా ఉందే!"

"ఇది పవుడర్ సీరమ్"

"నిజంగానే పనిచేస్తుందా ఏం? ఈ తెల్లపొడి ఇంజక్షన్లో ఇస్తే మనిషి బతుకుతాడా?"

"మీ ముందు కూర్చుని వున్నాగా? నేను బతికున్న మనిషిలా కనిపించటంలేదా?"

హేదో మాట మార్చాడు, "మీరు ఆఫీసరుగారి బంధువు, ఈ తక్కువజాతి వాళ్ళ గురించి మీరెందుకు అవస్థ పడుతున్నారు? ఇది మీవంటివాళ్ళు చెయ్యవలసిన పనేనా?" అన్నాడు.

వసంత్ ఈ మాటకి జవాబు చెప్పకుండా, "మీ హేండ్ పంపు ఎక్కడుంది?" అని అడిగాడు.

"ఇదుగో ఎదురుగానే వుందే, హేండ్పంపు, సెప్టిక్టాంకు కూడా వుంది, పెద్ద మనుషులొస్తే హేదోనశ్కర్ ఇంట్లోనే దిగుతారు. మీరు స్టవ్, స్టీల్గిన్నెలు కూడా తెచ్చుకున్నారే?"

"మరి వండుకోవద్దూ! వండుకోకపోతే ఏం తింటాను?"

"మా ఇంటినుంచి పంపిస్తాగా! మా ఇంట్లో అతిధిగా ఉంటూ స్వయంగా వండుకుంటారా?"

"చూడండి, మీగదికి నేనివ్వబోయే అద్దె, తిండికయ్యే ఖర్చు - అన్నీ నాకు డిపార్టుమెంటు వాళ్ళిస్తారు. అలాటప్పుడు మీదగ్గర ఎందుకు తీసుకోవాలి?"

"సరే కానివ్వండి, కాని పాలు మాత్రం కొనకండి."

"నాదగ్గర పాలపొడి డబ్బా వుంది."

హేదో నవ్వి, "అర్థమయింది, మీ బావగారు ఒద్దని చెప్పివుంటారు. అయినా. ఏదైనా కావలిస్తే అడగండి."

రెండ్రోజుల్లో వసంత్ - శ్రీపద్ కలుసుకున్నారు. వాళ్ళిద్దరూ స్నేహితులై పోయారు. ఈస్నేహం పోట్లాటవల్ల అయింది! చరణ్బేరా కూతుర్ని పాముకరిచిన రోజే వీళ్ళిద్దరికీ స్నేహం అయింది. ఆమె యౌవనంలో వుండి కడుపుతో వుంది.

వసంత్ టీ తాగాక కప్పు కడుగుతుండగా హఠాత్తుగా ఒక పొడవాటి మనిషి పరిగెత్తుకుంటూ వచ్చి, "బాబుగారూ, ఇంజక్షన్ తీసుకుని నాతోరండి, ధీరిపద్

పిలుచుకు రమ్మన్నాడు"అన్నాడు.

"ఎందుకు?"

"మాలతిని పాము కరిచింది, పాపం కడుపుతో వున్న పిల్ల!"

వసంత్ ఇంజక్షన్లు తీసుకుంటూ, "కట్టు కట్టారు కదా?" అని అడిగాడు.

"ఆఁ, ఛిరిపద్..."

చరణ్‌బేరా ఇంటి వసారాలో ఆ పిల్లని పడుకోబెట్టారు. వసంత్ ఆమె తొడమీద మూడుచోట్ల సరైన పద్ధతిలో కట్టుకట్టి వుండటం చూశాడు. ఆ కట్ల కింద రక్తం కారిపోవటానికి గాట్లుకూడా పెట్టివున్నాయి. సన్నగా, ఒంట్లో ఎముకలు పొడుచుకొచ్చినట్టు, ఉంగరాల జుట్టుతో వున్నవాడే శ్రీపద్ అని తెలిసింది. అతను చకచకా కట్లువిప్పి కొంచెం పైగా వాటిని కడుతున్నాడు. కడుతూనే, "వచ్చారా బాబుగారూ? ఇంజక్షనివ్వండి, కాటు మరీలోతుగాలేదు, కాని శియడ్ చాందా పాము ఎంతైనా శియడ్ చాందాయేకదా?" అన్నాడు.

వసంత్ ఇంజక్షనిచ్చాడు. నీళ్ళగిన్నె చూసి, "వేడినీళ్ళు ఆవిరి పడుతున్నారా?" అని అడిగాడు.

"ఆఁ"

గాయం దగ్గర్లో మడమమీద శ్రీపద్ గాటు పెట్టేప్పటికి ఆ పిల్ల నోట సన్నగా మూలుగు వినిపించింది.

"గొంతు పెగిలిందిగా, అంటే బతికే అవకాశం వుంది"అన్నాడు శ్రీపద్.

"ఎంత చల్లటి కబురు చెప్పావయ్యా! అల్లుడు అటు వెళ్ళగానే ఎంత ఘోరం జరిగింది, హరి భగవంతుడా!"

శ్రీపద్ విసుక్కుంటూ. "నేలమీద అన్ని తపేలాలూ, బొచ్చెలు చేరిస్తే ఏమవుతుంది? ముందుగా తెలియదా, ఏలోకంలో వుంటున్నావు? తపేలా అడుగున పాము చేరింది. అర్థమయిందా?"

"పాము ఏమయింది?"

"బామన్ దేవతకదా అది! ప్రస్తుతం దీర్ఘ నిద్రలో వుంది. తరవాత దానికి దహనసంస్కారం చేద్దాం!"

"ఒక గంటలో ఆ పిల్ల గండం గడిచి బైటపడింది. చరణ్ అతని పెళ్ళాం శ్రీపద్ కాళ్ళకి దండం పెట్టారు. శ్రీపద్ వాళ్ళని ఆశీర్వదించి, పేలవంగా నవ్వుతూ,

"ప్రాణాలు కాపాడింది ఆయన" అన్నాడు.

వసంత్‌కుకూడా చాలామంది దండంపెట్టారు.

"మీ అల్లుడు వచ్చాక ఒకరోజు మనసాదేవి భజనపూజ చేయించు, సరేనా చరణ్? ఇక్కడ భజనమండలి కలుసుకుని చాలా రోజులయింది. పడవ నడిపి నువ్వు బాగానే డబ్బు సంపాదించావు!" అన్నాడు శ్రీపద్.

"మీరు చెప్పినట్టే చేస్తాం."

"పదండి, బాబుగారూ మీతో కొంచెం మాట్లాడాలి. ఇక్కడ గండం గడిచినట్టే," అన్నాడు శ్రీపద్.

ఇద్దరూ ఇంట్లోంచి బైటపడ్డారు. "పదండి బాబుగారూ, పాముల పెంపకం జరిగే చోటు చూపిస్తాను,"అన్నాడు శ్రీపద్.

దూరం నుంచే వాళ్ళకి ఇటుకల బట్టీ కనిపించింది. శ్రీపద్ బీడీ వెలిగించి, నేలమీద ఉమ్మి, "ఆ నక్కవెధవ నక్కరే దీనికంతటికీ కారణం!" అన్నాడు.

"ఈ బట్టీ అతనిదేనా?"

"అవును. ఇంత గొప్ప పని ఇంకెవరు చేస్తారు? ఇది పాములవాడ! పాములు కరిచి చనిపోయినవాళ్ళ శవాల్ని మోసిమోసి బేహులానది కూడా అలిసిపోయింది. వాన కురిస్తేగాని దాన్లో ప్రవాహం వుండదు. పైగా ఈ వెధవ, నక్కర్ పాముల పెంపకం చేస్తున్నాడు."

"అది సరేకాని, ఒక విషయం చెప్పండి. పాము కాటువల్ల చచ్చిపోయిన వారి శవాల్ని కాల్చరెందువల్ల?"

శ్రీపద్ విచారంగా నవ్వి, "ఈవిషయం ఎత్తితే జనం తన్నడానికొస్తారు. నది శవాల్ని లాక్కెళ్ళి తామలీలో పడేస్తుంది. ఆ తరవాత అవి ప్రవాహంలో కొట్టుకుపోయి సముద్రంలోకి చేరుతాయి. బేహులాకి చావొచ్చి పడింది. ఇక్కడ జనాభా మహా ఎంతమంది? ఉన్న నదులన్నీ వెళ్ళి సముద్రంలో కలుస్తున్నాయి. అలాటప్పుడు శవాల్ని తగలబెట్టడానికి ఎవరికైనా ఎన్ని గుండెలు?"

శ్రీపద్ మాటల్లో అతను ఎంత మంచివాడో, ఎంత వివేకం కలవాడో తెలిసింది. వసంత్ ఆశ్చర్యపోయాడు.

"ఈ ఇటుకలబట్టీని ఎందుకు పడగొట్టరు?"

దీనికి జవాబు చెప్పక శ్రీపద్ "పదండి మా ఇంటికిపోదాం. అక్కడ కూర్చుని

మాట్లాడుకుందాం." అన్నాడు.

వసంత్ పాముల గురించి పరిశోధన చేస్తున్నాడు కానీ పాములు పట్టే వాళ్ళగురించీ, పాము విషం పోగొట్టే మంత్రగాళ్ళ గురించీ అతని అభిప్రాయాలన్నీ శరత్‌చంద్ర రాసిన 'శ్రీకాంత్'లోని మొదటి అధ్యాయం మీద ఆధారపడినవే. శ్రీపద్ ఎలా చూసినా షాహ్‌జీలాటి వాడు కాదని తెలిశాక అతని అభిప్రాయం కొద్దిగా మారింది. శ్రీపద్ భార్య వాళ్ళిద్దరికీ టీ చేసి ఇచ్చింది. ఆమె మొహానికీ, ఆనందా దీదీ మొహానికీ అసలు పోలికేలేదు. ఇదికూడా అతన్ని ఆశ్చర్యపరిచింది. ఆ తరవాతే కథలోని పాత్రలే తన అభిప్రాయాలకి కారణం అని అతనికి తెలిసింది. లేకపోతే, పశ్చిమ బెంగాలులోని పాములవాళ్ళు నాటకాల్లో వేసేవాళ్ళలాగా నటించగలరా? నెయ్యి, వెన్న, చేపలూ, అన్నం సుష్టుగా తినేవాళ్ళే రంగస్థలం మీద తిండికి మాడే పేదవాళ్ళ వేషాలు వెయ్యగలరు!

"మీరెక్కడ నుంచి వచ్చారు? ఇర్‌ఫాన్‌పూర్‌లోని డాక్టర్ మీరొస్తున్నారని చెప్పారు. ఇలాంటి చోటికి మీరసలు ఎందుకువచ్చారు?" అని అడిగాడు శ్రీపద్.

"పాముకాటుతో చాలామంది చనిపోతున్నారు. వాటి విషం శరీరంలో ఎలాంటి ప్రభావం చూపుతుందో తెలుసుకోటానికే నేను పరిశోధనలు చేస్తున్నాను. అందుకే ఇక్కడికి వచ్చాను."

"మీరు డాక్టరా? ఇంజక్షనిస్తారా?"

"డాక్టర్‌ను కాను. కానీ ఇక్కడున్నన్నాళ్ళూ రోగులకి ఇంజక్షనిస్తాను."

"ఎన్నాళ్ళుంటారు?"

"మూడు నెలలు."

"అన్నట్టు, మీరు ఇటుకబట్టీల గురించి ఏదో చెప్తున్నారు?"

"దీన్ని పడగొట్టి నేలమట్టం చేస్తే మంచిదేమో?"

"బాగా చెప్పారు. దీనివెనక పెద్ద కథుంది. ఇటుకల్ని సరఫరా చెయ్యటానికి కావల్సినంత డబ్బు తనదగ్గర లేదని హేదోనశ్కర్ నిర్ణయించాక అతని దగ్గరకి ఒక కాంట్రాక్టర్ వచ్చాడు. అతను ఇటుకల్ని మోయించి తీసుకెళ్తానన్నాడు. బేహులా మీదుగా, తామలీ దాటి నావల్లో ఇటుకల్ని తీసుకెళ్తానన్నాడు."

"ఆ తరవాత?"

"ఈ మనిషి పిశాచం కదా! నేనెంతో చెప్పాను, అమ్మొయ్యండి బాబూ"

అని. అక్కడ పాములకి పెద్దవాడ తయారవుతుంది, అమ్మెయ్యండని చెప్పాను. అతను ఏమని జవాబు చెప్పాడో తెలుసా, బాబుగారూ? "సరైన ధర రాకపోయినా అమ్మమంటావా?" అన్నాడు. ఆరకంగా ఆ బట్టీ ఇక్కడే ఉండిపోయి పాములకి ఆలవాలమయింది. నశ్కర్‌కి కావలసిన ధర పలికేనాటికి ఆ ఇటుకల దగ్గరకెళ్ళటానికి ఎవరూ సాహసించలేకపోయారు. పాముల్తో చెలగాటం కదా మరి? నిరుడు నేను మళ్ళీ చెప్పాను, 'వైశాఖంలో మట్టి పొడిగా వుంటుంది. బట్టీ చుట్టూ గొయ్యి తవ్వి, బట్టీకి నిప్పంటించండి. మూడు నాలుగు డబ్బాల కిరసనాయిలు కావలసి వుంటుంది. నాలుగువేపులా గొయ్యి తవ్వి, దాన్ని ఎండుపొదలూ, కర్రలూ, ఎండుగడ్డితో నింపి కిరసనాయిలు పొయ్యాలి. మంటపెట్టగానే పాములన్నీ చచ్చిపోతాయి. నేను మేదినీపుర్‌లో ఇలా పాముల్ని చంపటం చూశాను, అక్కడ కూడా ఒక బట్టీలో ఇలాగే పాములు పుట్టాయి. ఇప్పుడక్కడ స్కూలు నడుస్తోంది."

"ఏమైంది మరి, అతను ఒప్పుకోలేదా?"

"లేదు, ఈ బట్టీ ఏమన్నా నీ గుమ్మంలో ఉందా? రెండు, మూడు టిన్నుల కిరసనాయిలంటున్నావు, వాటికి డబ్బు నువ్విస్తావా? అని అడిగాడు. అతని దగ్గర కిరసనాయిలు అమ్మే రేషన్‌షాపు వుంది, కిరసనాయిలు అతను బ్లాకులో కొనుక్కోనక్కరలేదు, అయినా ఒప్పుకోలేదు."

"మిమ్మల్ని చాలా విషయాలడగాలి. ఈ కట్లు కట్టడం, విప్పటం, గాట్లు పెట్టటం, ఇవన్నీ మీ తండ్రిగారి దగ్గర నేర్చుకున్నారా?"

"అవును, బాబుగారూ! నేను ఇంజక్షన్ కావాలని అంటాను, అందుకే అందరూ నాకేమీ రాదనుకుంటారు కానీ..."

"ఏమిటీ?"

"మీకంతా తెలుసుగా!"

"చెప్పరాదూ?"

శ్రీపద్ కాసేపు వెనకాడాడు. "అది నేను తరవాత చెప్తాను. ప్రస్తుతం మీరు వెళ్ళి స్నానపానాలూ, భోజనం కానివ్వండి. మీరు ఇక్కడే వుంటారు, నేను ఇక్కడే వుంటాను కదా," అన్నాడు.

వసంత్ వెళ్ళిపోయాడు, అతను గదిలోకి వెళ్ళాడో లేదో, హేదోనశ్కర్ పనిమనిషి పెద్ద పళ్ళెం నిండా బోలెడు గిన్నెలతో వచ్చింది. ఆ పళ్ళెంపైన గుడ్డ

కప్పి వుంది. "అమ్మగారు మిమ్మల్ని అన్నం మట్టుకు వండుకోమన్నారు. పప్పులూ, కూరలు కష్టపడి చేసుకోవద్దని చెప్పమన్నారు," అని చెప్పింది.

వసంత్ గుడ్డతీసి చూస్తే గిన్నెల నిండా రకరకాల కూరలూ, పెద్ద పెద్ద చేప ముక్కలూ కనిపించాయి. అతని కళ్ళు తిరిగిపోయాయి.

"మీ అమ్మగారితో చెప్పు, ఇవాళ్టికి ఆవిడ పంపింది కాబట్టి మర్యాదకు తీసుకుంటున్నాను కాని ఇంకెప్పుడూ పంపవద్దని చెప్పు, నేనింతింత తినలేను" అన్నాడు.

హేదోనశ్కర్ ఇటుకలబట్టీ కథ విన్నప్పటి నుంచీ అతని మనసులో ఏదో ఒక సందేహం చోటు చేసుకుంది. అతను చాలా శాంత స్వభావుడు. ఏదైనా సంఘటన అతన్ని కలవరపరచినా గబుక్కున అతను ఏమీ అనడు. మధ్యతరగతి స్వభావం కలవాడవటంచేత, మిగతావాళ్ళ విషయాల్లో జోక్యం కలగజేసుకోడు. కాని అతను పరిశోధనలు చేస్తున్నదే పాముల గురించి. పాముకాటువల్ల జనం ఎంత ఘోరంగా చనిపోతారో అతనికి తెలుసు. ఒక్కమనిషి పెట్టిన ఇటుకల బట్టీవల్ల ఊళ్ళో ఇంతమంది మనుషులు ఎందుకు చావాలి? ఒక్క సంవత్సరంలో పాతిక-ముప్పై మంది పాముకాటు వలన చనిపోవటం చాలా శోచనీయం.

ఈమాటే అతను తన బావగారితో చెప్పాడు అతను అక్కడికి వెళ్ళినప్పుడు. ఎస్.డి.ఓ. అతని మాటలు చాలా తేలిగ్గా తీసిపారేశాడు.

"ఇంతకుముందు పాము కరిచి ఎవరూ చావలేదా? బట్టీవల్లనే చస్తున్నారా?" అన్నాడు.

"కానీ డెత్ రేటు పెరిగింది కదా?"

"ఏది ఏమైనా దీన్లో నువ్వు తలదూర్చవలసిన అవసరంలేదు. అతను మంచివాడు కాదు, ఆ విషయం గుర్తుంచుకో."

"అసలు విషయమేమిటంటే, ఇక్కడ హెల్త్ సెంటర్‌కి ఏంటీసీరమ్ కావాల్సి వుంది."

"నాకు తెలుసు, డాక్టర్ వున్నాడుగా, అతను రిక్విజిషన్ ఇస్తే చూద్దాం."

బావగారు వసంత్‌తో తనగోడు చెప్పుకున్నాడు. "బేహులా బ్లాక్ ప్రస్తుతం చాలా ప్రశాంతంగా వుంది. రైతుల సమస్యలకి ఒక రకంగా సమాధానం దొరికింది. అందరికీ నచ్చే విధంగా సమస్యలు తీరలేదు, కొందరికిది నచ్చలేదు. కానీ అందరికీ

నచ్చేటట్టుగా జరిగే పని అసలు ఏదైనా ఉందా? పంచాయితీ ఎన్నికలుకూడా ఎలాగో ఒకలాగు ముగిశాయి. హేదోనశ్కర్ ప్రస్తుతం పంచాయితీ ప్రెసిడెంట్. ఏ కారణంగానూ ఊళ్ళో వాళ్ళకీ - అతనికీ తగాదాలు పెట్టటం మంచిదికాదు. అసలే జమీందారనీ, పంచాయితీ ప్రెసిడెంటు అనీ గ్రామస్తులు అతనితో సరిగ్గా ఉండరు, ఉండబోరుకూడా. కానీ నే చెప్పేదేమిటంటే వాళ్ళమధ్య సామరస్యం లేకపోతే దానికి కారణం వాళ్ళే, నువ్వుకాదు. నీవల్ల సిట్యుయేషన్ పాడవటం మంచిదికాదు. గ్రామంలో చదువుకున్న కుర్రాడు కాలు పెడితేనే అన్ని సంఘటనలకీ పొలిటికల్ రూపం వస్తుంది.''

వసంత్ మళ్ళీసారి గ్రామానికి వచ్చినప్పుడు అతనికి పరిస్థితులన్నీ బాగా తెలిసిపోయాయి. శ్రీపద్‌మాల్ అతన్ని పిలవటానికొచ్చాడు. చరణ్‌బేరా ఇంట్లో మనసాదేవత భజన జరుగుతోంది. ''పాటలూ, ఆటలూ, కోలాహలంగా వుంటుంది. చరణ్ మనసా విందుచేస్తాడు. మీరెలాగూ వెనక్కి వెళ్ళిపోవటానికి టిక్కెట్టు కొనుక్కునే వచ్చారు. ఒకసారి కలిసిరండి.''

వసంత్ ఒప్పుకున్నాడు.

ఇది విని హేదో అతన్ని వారించాడు. ''ఆఫీసరుగారి బావమరిది అయుండి అక్కడికి వెళ్తారా? వెధవలు అమ్మవారికి పులగం వండి నైవేద్యం పెడతారు, మీరు అదే తింటారా?'' అన్నాడు.

''నా పని పాముల గురించి తెలుసుకోవటమే కదా? నేనెలా తప్పించుకుంటాను చెప్పండి?''

హేదోనశ్కర్‌కి ఇది నచ్చలేదు. అతను తన పెళ్ళాంతో, ''రకరకాల వంటకాలు చేసి పంపక్కర్లేదు. చదువుకున్న కుర్రాడు, మంచి కుటుంబంనించి వచ్చాడు. ఏదో పనిమీద వచ్చానంటున్నాడు కానీ దీని వెనకాల ఏం రహస్యం ఉందో? లేకపోతే శ్రీపద్‌తో అతనికి స్నేహమేమిటి?'' అన్నాడు.

''మీ కళ్ళుకప్పి ఏం చెయ్యగలడు?''

''నాకు తెలియకుండా ఏమీ చెయ్యలేడు. కానీ ఎంతైనా ఆఫీసరు బావమరిది కదా! నేనిందులో కల్పించుకోబోవటం లేదు. రెండు మూడు నెలలు ఏ గొడవా పెట్టుకోకుండా ఇతను పని ముగించుకుని వెళ్ళిపోతేగాని నాకు మనశ్శాంతి లేదు. ఆ ఆఫీసరు ఇంట్లో చోటివ్వమనటంవల్ల కానీ లేకపోతే ఈ తద్దినాన్ని నా తలకెందు

కెత్తుకుంటాను?''

''జాలరివాళ్ళు చేపలు అమ్మటానికి ఇంటికి వస్తారు. లాగదీ వాళ్ళు ఇంట్లోకొచ్చి ఆకుకూరలు అమ్ముతున్నారు. మన ఆచారాలన్నీ మంటగలుస్తున్నాయి!''

''అవన్నీ అలా ఉంచు ఇప్పుడా విషయాలు తలుచుకుంటే బాధగా వుంటుంది. ఆ బాధ భరించటం నీవల్ల అవుతుందా?''

వసంత్‌కి వీళ్ళిద్దరూ ఏమనుకుంటున్నారో తెలియదు, అతను సంతోషంగా మనసాదేవి భజనలు వినటానికి వెళ్ళాడు. చరణ్ ఇంటి ఆవరణంతా శుభ్రంగా అలికించినట్టున్నాడు. అది అద్దంలా మెరుస్తోంది. దీపం వెల్తురులో చేతిలో దేవి ధ్వజం పట్టుకుని శ్రీపద్ అక్కడికొచ్చి నిలబడ్డాడు. ఒక కాలికి గజ్జెలు కట్టుకుని, ఒక చేతికి గజ్జెల కడియం తొడుక్కుని అతను తాళం వేస్తూ పాడుతున్నాడు. కొంతమంది అతనికి వంత పాడుతున్నారు. మనసాదేవి పాట నిజానికి బేహులా కథే. పాట విన్నాక ఈ కథని ఈ ప్రాంతానికి కావల్సినట్టు వీళ్ళు మార్చుకున్నారని వసంత్‌కి అర్థం అయింది.

శ్రీపద్ పాట ప్రకారం బేహులా, లఖింద్ర పెళ్ళి చేసుకుని కాపురం చేస్తున్నారు. చివరికి లఖింద్ర చనిపోతాడు. బేహులాని దేవుడు శపిస్తాడు. దేవతలు, ''దేవసభలో బేహులా లాస్యభావం చూపిస్తూ నాట్యం చేసింది. దానివల్ల పాపం జరిగింది. ఆ పాపకార్యానికి ప్రాయశ్చిత్తం చేసుకోవటానికి బేహులా కలియుగంలో నది రూపంలో ప్రవహించాలి. పాముకాటుతో మరణించేవాళ్ళు బేహులానది నీళ్ళలో కలిసి మోక్షం పొందుతారు.''అన్నారు.

''నాకు మోక్షం ఎప్పుడు?'' అని అడిగింది బేహులా. దేవతలు దీనికి జవాబు చెప్పలేదు. అప్పట్నించీ బేహులా నదిగానే వుండిపోయింది. పాట అయాక మనసాదేవిని స్తుతిస్తారు. ఆ తరవాత ఇంటిముందు ఆవరణలో జండా ఎగరేస్తారు.

వసంత్‌కి ఈ విషయాలన్నీ తెలుసుకోవటంవల్ల చాలా లాభం కలిగింది. పచ్చి 'మసూరు' పప్పుతో చేసిన పులగమూ, ఐదురకాల కూరలతో అమ్మవారికి నైవేద్యం పెట్టారు. తింటున్నప్పుడు శ్రీపద్, ''ఇక్కడే అదంతా జరిగింది. చంపయీ నగరం ప్రస్తుతం నది గర్భంలో ఉన్నది. బేహులా నిల్చున్న చోటే నదిగా మారిపోయింది. అక్కడ ఒక అద్భుతమైన కదంబవృక్షం వున్నది. వైశాఖంలో ఆ

చెట్టు విరగబూస్తుంది." అని చాలా నమ్మకంతో అన్నాడు.

"వైశాఖమాసం దాకా ఇక్కడ వుంటే మీరే చూడవచ్చు. అప్పుడు ఇక్కడ ఉత్సవం చేసుకుంటారు. సంత వుంటుంది. రకరకాల వస్తువులు అమ్మకానికుంటాయి. అన్ని ఊళ్ళనించీ పాములని ఆడించే వాళ్ళొస్తారు. అది చూడాల్సిందే!" అన్నాడు చరణ్.

"పాముల్ని పట్టటానికొస్తారు", అన్నాడు శ్రీపద్.

"పాముల్ని పడతారా?"

"మరేమిటనుకున్నారు? ఇటీవల పాముల్ని పట్టి అమ్మటం చాలా లాభసాటి వ్యాపారం అయింది కదా! కలకత్తాలో పాము చర్మం చాలా ఎక్కువ ధరకి అమ్ముడవుతుంది. త్రాచుని పట్టిస్తే మందులషాపుల్లో దాని విషం అమ్ముడవుతుంది."

"మీరా పని చెయ్యరా?"

"చెయ్యను, మా నాన్న వద్దన్నాడు."

"మీకు మరి ఇల్లెలాగ గడుస్తుంది?"

"ఏం చెప్పమంటారు? నా ఇంట్లో టీ తాగారు, మీకు తెలీదా? నక్కర్ భూముల మీద ఆధారపడటంకూడా అంతంత మాత్రమే!"

"అతని దగ్గర ఎంత భూమి ఉంది?"

"గవర్నమెంటు సీలింగుని ఉల్లంఘించి చాలా భూములు సంపాదించాడు - దేవుడి పేర కొంతా, కార్ఖానాని కట్టిస్తానని కొంతా, ఇంకోచోట పళ్ళతోటలు ఉన్నాయని చూపించీ, ఇంకొంత చేపల వ్యవసాయానికీ అని చెప్పి- కాని నిజానికి అన్ని భూముల్లోనూ వ్యవసాయమే చేయిస్తున్నాడు. పొలాలనిండా ధాన్యమూ, జనపనారా ఏపుగా పండి వున్నాయి."

"అతను ప్రయత్నిస్తే హెల్త్‌సెంటర్లో పాముల ఇంజక్షన్ తెప్పించగలడు."

"కాని ఎందుకు ప్రయత్నిస్తాడు? అతనెప్పుడూ ఏ సహాయమూ చెయ్యలేదు. మళ్ళీ పంచాయితీ ప్రెసిడెంట్ అయాడు. మేము ఎప్పట్నుంచో అతనికి వెట్టిచాకిరి చేసే బానిస బతుకులు బతుకుతున్నాం."

భోజనం ముగించాక శ్రీపద్, "పదండి, మిమ్మల్ని ఇంటి దగ్గర దింపుతాం. రాత్రి పొద్దుపోయింది, అతనుకూడా వస్తున్నాడు. ఉండండి, చేతికర్ర తీసుకుంటాను. కర్ర టకటక చప్పుడే మనకి ఆధారం. టార్చి కొందామనుకున్నాను, కాని చేతిలో

డబ్బులేదు."

"ఒద్దు, నేను ఒంటిగా వెళ్ళిపోతాను. కానీ మీతో ఒకరోజు తాపీగా కూర్చుని మాట్లాడాలి. మీ సహాయం లేకుండా నా పని పూర్తవదు."

"అలాగే తప్పకుండా కూర్చుందాం. ఈ ఇంజక్షనిస్తే మనిషి బతుకుతాడుకదూ?"

"సరైన సమయానికి ఇవ్వాలి. విషం పూర్తిగా ఎక్కిపోతే ఇది పని చెయ్యదు!"

"ఈ ఇంజక్షన్‌లని మందుల కంపెనీలు ఎందుకు తయారు చెయ్యవు? వాళ్ళు చాలా రకాల మందులు చేస్తారుగా?"

"పాముకాటు వలన ఏటా 20వేల మంది చనిపోతారు, అంత తక్కువ మంది కోసం మందులు తయారుచేస్తే లాభాలు రావు, అందుకని ఏటా దాదాపు నాలుగు లక్షల మందైనా పాముకాటువల్ల బాధపడతారు, కాని వారిలో దాదాపు ఇరవైవేల మంది మట్టుకే చనిపోతారు. అందులోకూడా కొంతమంది విషంలేని పాములు కరచి భయంవల్ల చచ్చిపోతారు. ఇంకొంతమంది పాము మంత్రగాళ్ళూ, భూతవైద్యుల చేతల్లో చనిపోతారు. మీరు నామాటని తప్పుగా అర్థం చేసుకోకండి."

"లేదు, ఫరవాలేదు. నా శక్తి ఎంతో నాకు తెలుసు. సరే, రేపు మాట్లాడుకుందాం, ఇక మీరు వెళ్ళిరండి."

మర్నాడు వసంత్ శ్రీపద్ ఇంటికి వెళ్ళాడు. అతను తన పని గురించి శ్రీపద్‌కి చెప్పాడు. శ్రీపద్ చాలా సహజంగా వివేకంతో మాట్లాడి అతన్ని ఆశ్చర్యపరిచాడు.

"మీరు సరైన చోటికే వచ్చారు. తిండికోసం వాచిపోయే బీదవాళ్ళ శరీరాలమీద కాలాజ్ విషప్రభావం ఎలా ఉంటుందో నేను చెప్పగలను. ఇక్కడ వుంటున్న అందరూ తిండికి గతిలేని వాళ్ళే మరి."

"బహుశా నేను ఈ విషప్రభావాన్ని చూడగలుగుతానేమో?"

"ఎందుకు చూడలేరు? హేదోనశ్కర్ ఇటుకల బట్టీ వుందిగా! మీ బావగారు ఏమన్నారు? ఎందుకలా ఉలిక్కిపడుతున్నారు? ఇక్కడ ఏ మాటా దాగదు. మీరు ఆఫీసరుగారి బంధువు, అందుకే హేదో నోరుమూసుకుని వున్నాడు, లేకపోతే మీరు ఇలా తక్కువజాతి మనుషులతో స్నేహం చేస్తున్నందుకు అతను ఊరుకుంటాడను కుంటున్నారా? అతని దగ్గర డబ్బుంది. అతని పెదనాన్న కొడుకు పరాన్ నశ్కర్ రైతు. అందువల్ల హేదో లెక్కన అతను కూడా తక్కువజాతివాడే! 1970లో పట్టుబడి,

తరవాత భయపడి పారిపోయాడు."మీరు పంట కోసుకుని మీమీ వంతు తీసుకోండి," అని చెప్పి వెళ్ళాడు.

"కాలాజ్ కాటువేస్తే ఎటువంటి లక్షణాలు కనిపిస్తాయి?"

"బాబుగారూ, అది యముడే అనుకోండి. త్రాచుపాముకాని, కాలాజ్ కానీ కాటువేస్తే నరాల్లో సలుపు ప్రారంభమవుతుంది, తిమ్మిరెక్కినట్టుగా ఉంటుంది. త్రాచు కరిస్తే మంట పుడుతుంది. చంద్రబోడా కాటువేసిన ప్రదేశం కాలినట్టుగా అవుతుంది, కానీ కాలాజ్ కరిస్తే వెంటనే నొప్పి తెలియదు. వీటి కోరలు కూడా చిన్నవిగా వుంటాయి. కాసేపటికి ఎముకల్లో వణుకూ, కాటువేసిన చోట నొప్పి తెలుస్తుంది. ఒళ్ళంతా కంపిస్తుంది, నిద్ర వస్తుంది, కళ్ళు మసకలు కమ్ముతాయి."

"మీకన్ని విషయాలూ తెలుసునే?"

"పుస్తకాల్లో ఇలా రాసి వుందా?"

"అవును. పుస్తకాల్లో సరిగ్గా ఇదే రాసి వుంది."

"కోపగించుకోనంటే చెబుతాను. మీరు నేర్చుకున్నదంతా పుస్తకాలనుంచి, ఇంకా అదేదో అంటారే లయిబ్రరీ..."

"లేబరేటరీ."

"ఆఁ, అదే! అక్కడ ఉత్త పాముల్ని చూసి నేర్చుకుంటారు. ఇక్కడ మేము పాములతో బాటు బతుకుతున్నాము. అందుకే మేము పాము మంత్రగాళ్ళం, మమ్మల్ని 'మాల్'అంటారు."

"మీరు చేసే వైద్యం మీ తాతముత్తాతల కాలం నుంచి వస్తున్నాది. ఇంకోపక్క మీకు ఇంజక్షన్‌మీద కూడా నమ్మకం వుంది. మామూలు భూతవైద్యులూ, పాముల వాళ్ళూ ఇంజక్షన్లని నమ్మరు."

"చూడండి, మీకు ఉన్నదున్నట్టుగా చెప్తాను. మిగతావాళ్ళ విషయం నాకు తెలియదు. నేను అలాంటి మాల్‌ని కాను. ఉండండి, మీకోటి చూపిస్తాను. ఒసే రథియా! సర్టిఫికెట్ తీసుకురా, తల్లీ!"

శ్రీపద్ తమ్ముడి కూతురు ఒక చిరిగిపోయి,మాసిన కాగితాన్ని తెచ్చింది. దానికి దారం కట్టి వుంది. తామలీ ప్రైమరీ స్కూల్లో శ్రీపద్‌మాల్ విద్యార్థివేతనం ఇవ్వటానికి జరిపిన పరీక్షలో మొత్తం జిల్లాలో ద్వితీయస్థానం సంపాదించుకున్నాడని దానిలో రాసి వుంది.

వసంత్ దాన్ని చదివాక శ్రీపద్ రథియాని మళ్ళీ పిలిచి ఆ కాగితాన్ని లోపల పెట్టమన్నాడు. ఆ తరవాత బీడీ వెలిగించాడు. అతని కళ్ళల్లో గడిచిపోయిన రోజుల నీడలు కనిపించాయి. ఏదో బాధకూడా కనిపించింది. క్షణం ఆగి, "అప్పుడు స్కూల్లో నన్ను చేర్చడం గురించి మావాళ్ళు ఆలోచించారు. నెలకి రెండు రూపాయలు ఖర్చుచేసే స్థితిలో వుండి వుంటే ఇర్ఫాన్‌పుర్ స్కూల్లో చదువుకుని వుండేవాణ్ణి. హేదో వాళ్ళ నాన్నని మా నాన్న డబ్బుకోసం ఎంతో బతిమాలాడు."

"ఇవ్వలేదా?"

"లేదు. పైగా ఇవాళ మాల్ కొడుకు చదువుతాడు, రేపు జాలరివాడి కొడుకు చదువుతాడు, ఎల్లుండి మీరు నా నెత్తినెక్కి కూర్చుంటారు. ఇది జరిగే పనికాదు, అన్నాడు. అందుకే నేను చదువుకోలేకపోయాను."

"అప్పట్నించీ ఈ పనే చేస్తున్నారా?"

"దీనితో డబ్బు సంపాదన అంతగాలేదు. నాట్లప్పుడు హేదో పొలం దున్నుతాను. పొట్టగడవకపోతే బ్లాకుకి వెళ్తాను. సరే, అవన్నీ వదిలెయ్యండి. ఈ విద్య మట్టుకే కొద్దిగా వచ్చు. మానాన్నతో కలకత్తా వెళ్ళేవాణ్ణి, అక్కడే ఆస్పత్రి చూశాను. ఆస్పత్రి మంచిది బాబుగారూ, వైద్యం చాలా మంచి విద్య. ఒకప్పుడు టైఫాయిడూ, కలరా వచ్చి జనం చచ్చిపోయేవారు. ఇప్పుడు సరైన సమయానికి డైమండ్ హార్బర్ ఆస్పత్రికి తీసుకుపోతే మనిషి బతుకుతాడు. ఆ ఆస్పత్రికిగాని, ఇర్ఫాన్‌పుర్‌కిగాని తీసుకెళ్తే కాన్పులయాక ఆడవాళ్ళు చావటం లేదు."

"అందుకే మీకు నమ్మకం కుదిరిందా?"

"కాదు, ఇంకా వుంది. మాల్‌జాతి నిజాయితీగలదైతే నా మార్గాన్నే అనుసరిస్తుంది."

"అంటే?"

"చాలామంది భయంవల్ల చనిపోతారు. నేను ముందర పాముకాటుని పరీక్షిస్తాను. కరిచినది విషసర్పం కాదని తెలిసిపోతే రోగికి ధైర్యంచెప్పి, కాసిని గంతులేసి, మంత్రాలు చదువుతాను. కాటుపైన వేప మండలు ఝుళిపిస్తాను, మందిస్తాను. రోగి బతికితే నాకు పేరొస్తుంది. నిజానికి మనిషి భయంవల్లే చస్తాడు. బాబుగారూ! ఢోడా, దాండాస్, ఝుర్మనో, చిలీ, లాఉఢ్గా - ఈ పాములన్నీ విషం లేనివే! ఈ విషయం అందరికీ తెలుసు, కానీ పాము కాటు వెయ్యగానే త్రాచుపామో,

శియడ్ చాందాదో కాటువేసిందని అనుకుంటారు.''

''విషసర్పం కాటువేస్తే ఏమవుతుంది?''

''ప్రతీసారీ అది కోరలు దిగబటేటట్టు కాటు వెయ్యలేదు. అందుకే ముందు కాటుని పరీక్షిస్తాను. చూడగానే ఏ పాము కాటువేసిందో తెలిసిపోతుంది. కోరలు సరిగ్గా దిగబడలేదని తెలిస్తే ముందుగా కట్లుకడతాం, మందిచ్చి, మంత్రాలు చదివి వేపమండలు ఝుళిపిస్తాం.''

''మందు పనిచేస్తుందా?''

''చేస్తుంది, బాబుగారూ! విషం ఒంట్లో పూర్తిగా ప్రవేశించకపోతే పని చేస్తుంది. మాదీఫలం, కట్‌కల్-టాబా (స్థానికంగా దొరికే మూలిక) నిమ్మపండు, శంఖంపూలూ, పంచదార, ముళ్ళ తోటకూర కలిపి ఉడికించి మందు తయారుచేస్తాం. ముందుగా కట్టుకడతాం, తరవాత గాటుపెట్టి నోట్లో గుడ్డనో మట్టినో పెట్టుకుని రక్తం పీలుస్తాం. ఇంకా చాలారకాల మందులున్నాయి.''

''నిజంగానే ఈవైద్యంతో మనుషులు బతుకుతారా?''

''ఏమంటున్నారు, బాబుగారూ! ఇక్కడ చావు తప్పించుకున్న వాళ్ళందరూ ఈ వైద్యంవల్లే బతికారు. మీరు ఇవి మంత్రాలు అని అనుకుంటారు. కానీ, చూడండి, కలకత్తాకి ఇంత దగ్గర్లో వుంటున్నాం, కానీ ఇంజక్షన్లు లేవు, డాక్టర్లు లేరు. మరి ఈ వైద్యం తప్ప ఇంకోదారి లేదుకదా?''

''కరవరాని చోట కరిస్తే?''

''బాబుగారూ, మనుషులు చీకట్లో నడుస్తారు, అందువల్ల సాధారణంగా పాములు కాళ్ళమీదే కాటువేస్తాయి. ఇంట్లో వున్న మనిషిని కూడా అవి కాటువేస్తాయి. నిద్రలో చెయ్యి కిందికి జారితే చేతిమీద కాటు వేస్తాయి. అప్పుడు కట్టు కట్టవచ్చు, కానీ నడుం మీదో, మెడమీదో, ఛాతీమీదో ఎప్పుడోగాని కాటువెయ్యవు. ఒకవేళ అలాటి చోట్ల కాటువేస్తే చావు తప్పదు. కట్లు ఎలా కడతాం? అన్నిచోట్లా కట్లు కట్టడం సాధ్యమేనా?''

''పాముకోరలు దిగబడేటట్టుగా కాటువేస్తే?''

''కట్లు కడతాం, గాటు పెడతాం, రక్తాన్ని పీలుస్తాం, ఇర్‌ఫాన్‌పుర్ తీసుకెళ్ళమని చెపుతాం. అక్కడికి తీసుకెళ్ళినా గడచిన ఏడేళ్ళలో రెండుసార్లు మాత్రమే ఇంజక్షను దొరికింది, మనిషి బతికాడు. కోరలు దిగబడితే మాల్ ఏమీ

చెయ్యలేదు. ఈవిషయం తెలిసీ, మంత్రం వేసి, కట్లు కట్టేవాళ్ళు దొంగ మంత్రగాళ్ళు. కానీ, మీకు తెలియని దేముంది, బాబుగారూ! అంత విషం ఒంట్లోకెక్కాక ఇంజక్షన్ కూడా పనిచెయ్యదు. కలకత్తా డాక్టర్ చెప్పారు. అందుకే మానాన్న బతకలేదు."

"ఆయన్ని కూడా పాము కరిచిందా?"

"ఆ(, శియడ్ చాందా కరిచింది."

ఈ విషయం వసంత్‌కి కూడా తెలుసు. 12 మి.గ్రా. కన్నా ఎక్కువ త్రాచుపాము విషమూ, 15 మి.గ్రా. కన్నా ఎక్కువ చంద్రబోడా విషమూ, 6 మి.గ్రా. కన్నా ఎక్కువ కాలాజ్ విషమూ ఒంట్లో ప్రవేశిస్తే స్నేక్ వెనమ్ ఏంటీ సీరమ్ పని చెయ్యదు. చంద్రబోడా కాటువేస్తే ఒంట్లోని ఎర్ర రక్తకణాలు నశిస్తాయి, ముక్కునుండీ. నోటినుండీ, మూత్రనాళం నుండీ, ఆసనం నుండీ రక్తం కారుతుంది. వెంటనే చచ్చిపోతారు. అప్పుడప్పుడు మాంసం కుళ్ళి రక్తంతోపాటు పడుతుంది. భరింపరాని బాధ అనుభవించి చివరికి చచ్చిపోతారు. త్రాచు, కాలాజ్ విషంలో న్యూరోటాక్సిన్ వుంటుంది. నరాలు వట్టి తవ్వుతాయి, కండరాలు ముడుచుకుపోతాయి, నోట్లోంచి నురుగు వస్తుంది. నిద్ర ముంచుకొస్తుంది, ఊపిరి అందదు, చివరికి చచ్చిపోతారు.

"నా శక్తి నాకు తెలుసు. ఇంజక్షన్ కనిపెట్టాకకూడా మనుషులెందుకు చావాలి?"

"బలహీనమైన ఒంటిమీద కూడా విషప్రభావం ఇలాగే వుంటుందా?"

"ఆ(, తిండికి మాడే దరిద్రుడికి ధైర్యం కూడా కరువవుతుంది. మామూలు విషం ఒంట్లోకెళ్ళినా అతను చచ్చిపోతాడు. ఎందుకంటే అతని ఒంట్లో శక్తిలేదు కనక."

వసంత్ మనసు పాడైపోయింది. ఇల్లు చేరాక కూడా ఆలోచించసాగాడు. మామూలు విషం ఒంట్లో కెళ్ళినా, దాన్ని భరించే శక్తిలేని బీదవాళ్ళు అన్యాయంగా చచ్చిపోతున్నారు!

అన్ని విషయాలనీ ఎకడమిక్ దృష్టితో చూడటం సరైన పద్ధతి కాదని అతనికి తట్టింది. బలహీనమైన శరీరంమీద కాలాజ్ విష ప్రభావం అతను చూడగలడు, దాన్ని గురించి రాయగలడు. కానీ మహానగరానికి దగ్గర్లో వున్న ఈ ఊళ్ళో ఇంత అంధకారమేమిటి?

లాభసాటి బేరం కుదరనందువల్ల నక్కర్ ఇటుకలు అమ్మడు. దానివల్ల పాములు పెరిగిపోతున్నాయి, మనుషుల చావులూ ఎక్కువవుతున్నాయి. మనిషి తిండిలేక ఎందుకింత బలహీనంగా వున్నాడు? ఈ క్రానిక్ ఉపవాసం వెనక నక్కర్ పాత్ర ఎంత వుంది? హెల్త్ సెంటర్‌లో ఏంటీసీరమ్ ఎందుకులేదు?

హెల్త్‌సెంటర్లోని కుర్ర డాక్టరు తలాడించాడు. ఈ ప్రశ్నలకి జవాబులు అతని దగ్గరలేవు. కలకత్తాలోని ఆరోగ్యశాఖ అంటే అక్కడ పనిచేసేవాళ్ళూ, ఫైళ్ళూ అని అర్థం. మనుషులూ, వాళ్ళ సమస్యలూ ఫైళ్ళలో రాసిన అక్షరాల వరకే పరిమితం.

"నా ఆస్పత్రి చూస్తే మీకే తెలుస్తుంది. ఒక్కొక్కప్పుడు ఒకే బెడ్‌మీద ఆరుగురు పడుకోవలసి వస్తుంది. మీరు ఏంటీసీరమ్ గురించి మాట్లాడుతున్నారు! నేను ఏంటీసీరమ్ కావాలని అడిగితే ఇంట్రోక్యునాల్ పంపించారు. అయినా రోగులు కోలుకుని ఇళ్ళకి వెళ్తున్నారు, ఎందుకో తెలుసా? యమధర్మరాజుకి కూడా వీళ్ళంటే ఇష్టంలేదు లాగుంది! నేను ఇక్కడకి వచ్చిన కేసులన్నీ కలకత్తాకో, డైమండ్ హార్బర్‌కో పంపుతాను. ఏం చెయ్యను?" అన్నాడు డాక్టరు.

"ఏంటీ సీరమ్ కావలని అడగండి."

"అడుగుతున్నానండీ బాబూ, అడుగుతునే వున్నాను."

"పంపించటం లేదా?"

"లేదు, మీ దగ్గరున్నదని విన్నాను!"

"నా దగ్గర చాలా కొద్దిగా వుంది."

"నాక్కొంచెం ఇస్తారా?"

"చూస్తాను. కానీ మీకు చాలా ఎక్కువ కావాలనుకుంటాను?"

"మనసు విరిగిపోయింది తెలుసా? ఇంజక్షనిస్తే బతుకుతారని తెలుసు, కానీ... శ్రీపద్ కేసులు తీసుకొచ్చినప్పుడు నాకేమనిపిస్తుందో తెలుసా?"

"ఏమనిపిస్తుంది?"

"ఇంట్రావెనస్ ఇవ్వలేడు, కానీ ట్రైనింగిస్తే శ్రీపద్‌లాంటి తెలివైనవాడు చాలా సులభంగా ఇంట్రామస్కులర్ కాని సబ్‌క్యూటీంశ్ కానీ ఇవ్వగలడని అనిపిస్తుంది. చాలా తెలివైనవాడు. లిగేచర్, సక్షన్ అన్నీ చేసి రోగిని నాదగ్గరకి తీసుకొస్తాడు. అసలు రోగిని బతికించేది అతనే, కాని అతను క్వేక్, నేను డాక్టర్ని!"

"సక్షన్ అతను చేస్తే ప్రమాదం ఏమీలేదు కదా?"

"అతని పళ్ళూ, చిగుళ్ళూ ఆరోగ్యంగా ఉన్నాయి... మీరు సీరమ్ ఇస్తారు కదూ?"

"చూస్తాను."

"మీరు మీ బావగారికి చెప్పకూడదూ?"

వసంత్ నవ్వి, "ఈ విషయం అందరికీ తెలుసు కదూ? హిమాద్రి ఇటువైపుకి రాడు, నేను ఎవరికీ చెప్పలేదు. అయినా అందరికి తెలిసిపోయింది."

"చిన్న ఊరుకదా?"

"అలాగే, చెప్తాను"

బావగారికి వసంత్ అడిగినది నచ్చలేదు. "రాసిస్తున్నాను. కలకత్తాలో ఒకచోట ఇది దొరుకుతుంది. కానీ చాలా తక్కువగా దొరుకుతుంది. ఒక విషయం గుర్తుంచుకో. నాపేరు బైటికి రాకూడదు. హెల్త్ డైరెక్టరేట్ ఏమీ చెయ్యదు. కలకత్తాలోని ఆస్పత్రులుకూడా సిగ్గుతో తలవంచుకోవలసేటట్టుగా వున్నాయి. గ్రామాల్లో ఉండే హెల్త్ సెంటర్లయితే ఇంకా ఆటవికదశలోనే వున్నాయి. హెల్త్‌సెంటర్లలో వాళ్ళు మందులిస్తున్నారు! హెల్త్‌సెంటర్లు! ఎన్నిజిల్లాల్లో ఆస్పత్రుల్లో ఓ.టీ.ల్లో ఎయిర్ కండిషనర్లున్నాయి? ఎక్స్‌రే మిషన్లు పని చేస్తున్నాయి? రోగుల పక్కలు శుభ్రంగా వున్నాయి? వార్డులలో కుక్కలు తిరుగుతుంటాయి. ఈసారికి రాసిస్తున్నాను కానీ ఈ విషయంలో నువ్వు ఎక్కువ తల పగలకొట్టుకోవద్దు. నేనిక్కడ ఉద్యోగం చెయ్యటానికి వచ్చాను. ఉద్యోగం చేసుకుంటూ నెమ్మదిగా ఉందామనుకుంటున్నాను. పులిగుహలో పులి దూరింది. నీ ఈ నాలుగురోజులు ఉత్సాహంవల్ల ఏమీకాదు." అన్నాడు.

వసంత్ కలకత్తాకి వెళ్ళి ఏంటీసీరమ్ తీసుకొచ్చాడు. ఎవర్ని అడిగినా 'ఓ, ఏంటిసీరమా?' అని ఢీలాపడిపోయి తీసిస్తారు. "దీనికి సబ్‌రియాక్షన్ వుంటుంది జాగ్రత్త!" అని హెచ్చరిస్తారు.

"నాకు తెలుసు."

"ఏం తెలుసు?"

"ఇది మా ఇన్‌స్టిట్యూట్‌లోనే తయారవుతుంది. అది సరే, దీనిని ఇలా ఇక్కడే ఉంచుతారా?"

"నాకూ అలాగే అనిపిస్తోంది. గోడ అందాన్ని పెంచుతోంది, ఇంకేమిటి?"

ఈ మందు బజార్లో దొరికితే బావుణ్ణని వసంత్‌కి అనిపించింది. కానీ వెంటనే దాన్లో వున్న సాధకబాధలు జ్ఞాపకం వచ్చి అతను నిరాశ చెందాడు. కంపెనీలు ఈ మందు తయారు చెయ్యటానికి ముందుకురావు. ఎందుకంటే నాలుగులక్షల మందిని పాములు కరిస్తే వారిలో ఇరవై వేలమందే చనిపోతారు. చాలా ఆశ్చర్యకరమైన విషయం! ఏళ్ళ తరబడి 20,000 మందే చనిపోతున్నారు, ఈ సంఖ్యలో ఏ మార్పూ లేదు. మనదేశంలో పాములకీ, మనుషులకీ మధ్య ఏదైనా ఒప్పందం ఉందా?

పోన్లే, కంపెనీలు తయారు చెయ్యకపోతే పోయాయి, గవర్నమెంటు తయారుచేస్తోందిగా. త్రాచుపాము, కాలాజ్, చంద్రబోడా, అహిరాజ్ పాముల విషంతో గుర్రాల్ని హైపర్-ఇమ్యూనైజ్ చేసి, గుర్రం ప్లాస్మా ఉపయోగించి గవర్నమెంటు ఈ సీరమ్ తయారుచేస్తుంది. ప్లాస్మాని రసాయనిక ప్రక్రియతో ఎండబెట్టి తయారుచేస్తే ఏంటీసీరమ్ చాలారోజుల వరకూ నిలవ వుంటుంది. కలకత్తాలోని గోడౌన్‌లలో దీన్ని నింపి పెట్టటంవలన ఏమిటి లాభం? పాముకాటుకి వైద్యం కలకత్తాలో ఎందుకుంది? కలకత్తా గుమ్మంలో వున్న ఇర్‌ఫాన్‌పుర్‌లోని హెల్త్‌సెంటర్లూ, బేహులా బ్లాకూ ఎందుకు కాలాజ్ దయాదాక్షిణ్యాలమీద బతుకుతున్నాయి?

హేదోనక్కర్ ఇటుకలెందుకు అమ్మలేదు? అతన్ని శిక్షించే ఉపాయం ప్రభుత్వం చేతుల్లో ఎందుకులేదు? ఆరోగ్య కేంద్రంలోని డాక్టర్ చెప్పిన మాట జ్ఞాపకం పెట్టుకుని స్టెరయిల్ - పైరోజన్ లేని ఫిజియలాజికల్ సాల్ట్ సొల్యూషన్ కొనేటప్పుడు రెండు సిరంజిలుకూడా కొన్నాడు. ఒక టార్చ్, ఉజ్జాయింపున ఐదోనంబర్ సెండక్ పంప్‌షూలూ ఫుట్‌పాత్‌మీద కొన్నాడు.

కావాలనే సాయంత్రం రైల్లో వచ్చాడు. ఆరోగ్యకేంద్రం డాక్టరింటికి వెళ్ళి ఏంటీసీరమ్, సొల్యూషన్ ఇచ్చి, "నా పేరు ఎక్కడా బైటికి రాకూడదు. లేకపోతే ఇద్దరం ఇబ్బందిలో పడతాం" అన్నాడు.

డాక్టర్ ఆనందంగా, "మీరు చేసిన ఉపకారం ఎన్నటికీ మర్చిపోను. పాముకాటు తో మనుషులు మందులేకుండా నురుగులు కక్కుకుని చచ్చిపోతున్నారు. ఒక డాక్టర్ ఇలాంటి దృశ్యాన్ని నిస్సహాయంగా చూస్తూ నిలబడటం ఎంత కష్టమో నేను అనుభవంతో తెలుసుకున్నాను" అన్నాడు.

వసంత్ హెల్త్‌సెంటర్లోని బీటలువారి, సున్నంరాలి మురికిపట్టిన గోడల

మీదున్న సాయిబాబా, బామాఖ్యాపా, శారదామణి - రామకృష్ణ బొమ్మలున్న క్యాలెండర్లు చూశాడు. ఆవిషయం అతనికి జ్ఞాపకం వచ్చింది. విజ్ఞానపరమైన వైద్యం, దేశాన్ని పరిపాలించేవారి నిర్లక్ష్యంవల్ల నిష్ఫలమైపోయాక, పాపం డాక్టర్ ఏమీ చేయలేక ముల్గాంవ్‌కర్ వేసిన ఈ మహాత్ముల బొమ్మల్ని చూసి ఓదార్పు పొందాడేమో! కానీ కాలాజ్ కరిస్తే సాయిబాబా ఇచ్చే విభూతీ, తేనెలూ కూడా ఎందుకు పనికిరావు.

"ట్రైనింగ్ అయ్యారా?"

"దేనికి?"

"ఏంటివెనమ్ ఇంజక్షనివ్వటానికి"

"ఆ( అయాను."

"ఏంటీ రియాక్షన్‌కి కావాల్సిన మందుల్ని ఎలాగైనా సంపాదించండి."

"అలాగే సంపాదిస్తాను"

"అయితే మరి, వెళ్ళనా?"

"అలాగే మీరివ్వన్నీ తీసుకెళ్తున్నారా?"

"ఆ( నా దగ్గర కూడా కొంచెం ఉంచుకుంటాను."

"లెక్కలేనంతమంది చనిపోతున్నారు, తెలుసా?"

"ఆ( తెలుసు."

"కాని బైట చాలా చీకటిగా ఉందే!"

"టార్చి ఉంది."

చీకట్లో టార్చిలైటు సహాయంతో బేహులాకి వెళ్తున్న వసంత్ చాలా ఉత్సాహంగా వున్నాడు. ఈ ఆనందానికి కారణం వేరే వుంది. తను చేస్తున్న పనికీ దీనికీ ఎటువంటి సంబంధమూ లేదు.

మర్నాడు అతను శ్రీపద్‌ని కలిశాడు. అతనికి షూలు, టార్చీ ఇచ్చి, "ఊరికే ఇవ్వటంలేదు. దీనికి బదులుగా మీరు ఒకపని చెయ్యాలి."

"నేను మీకేం చేసిపెట్టగలను?" శ్రీపద్ షూలని నిమురుతూ అన్నాడు. వాటిని మాటిమాటికీ వాసన చూస్తూ, కళ్ళతోనే వసంత్‌కి కృతజ్ఞతలు చెప్పాడు.

"ఒక విషయం బాగా జ్ఞాపకం చేసుకుని చెప్పండి. మీదగ్గరకి కాలాజ్ కాటుతో, ఒంట్లో ఎక్కువ విషం ఎక్కకుండా బాధపడుతున్న మనిషి ఎప్పుడైనా

వచ్చాడా? అతనికి మీరు శక్తి కొద్దీ వైద్యం చేసినప్పటికీ, చాలారోజుల తరువాత అతను చనిపోవటం జరిగిందా?''

"అవును. భూనీదాస్ అలాగే చచ్చిపోయింది.''

"ఎవరామె?''

"శ్మశానంలో వుండే కాటికాపరి సాగర్ పెళ్ళాం.''

"ఆ కేసేమిటో కాస్తా చెప్పండి.''

"రాస్తారా?''

"ఆఁ''

"టీ పంపించమని చెప్పి వస్తాను.''

"ఒద్దు, ఉండండి. ముందు కేస్ విషయం చెప్పండి.''

శ్రీపద్ కూర్చున్న చోటునించే, "రధియా, కొద్దిగా టీ చేసి తీసుకురా!''అని అరిచాడు

"ఇప్పుడు చెప్పండి.''

"భూనీదాస్ నేలమీద చాపపరుచుకుని నిద్రపోతుండగా... మీకు తెలుసుగా, అందరి దగ్గరా మంచాలుండవు! కాలాజ్ చేతి బొటనవేలు మీద కాటువేసింది. నన్ను పిలిచారు. కట్టుకట్టి, గాటుపెట్టి రక్తం పీల్చాను. రాత్రంతా పక్కనే కూర్చున్నాను. తెల్లవారాక గండం గడిచింది. భూనీకి స్పృహ వచ్చింది. అయినా నేను కట్టు విప్పలేదు. సాయంకాలానికి మాట్లాడింది. మసకబారిన చూపు బాగయింది. కిందకారిన రక్తం గాలి తగిలి గడ్డ కట్టింది. వేళ్ళల్లోనూ, చేతుల్లోనూ కదలిక వచ్చింది. సూదితో గుచ్చితే నొప్పి తెలిసి తిట్టింది. ఆ తరవాత నేనింటికి వచ్చేశాను.''

రథియా టీ తెచ్చింది. ఇద్దరూ తాగారు. పాలులేని బెల్లపుటీని చాలా ఇష్టంగా చివరికంటా తాగి శ్రీపద్ గ్లాసు కింద పెట్టాడు.

"మర్నాడు సాగర్ నన్ను మళ్ళీ పిలిపించాడు. వెళ్ళి చూస్తే... అన్నట్టు నేను కట్లన్నీ క్రితంరోజే విప్పేశాను. పాము కరచిన రోజునే ఆమె కాల్లో వెదురు మొన గుచ్చుకుంది. ఆ కాలు వాచింది. గుండెల్లో సన్నగా నొప్పి వచ్చి వుండుండి మూర్ఛపోతోంది. స్పృహ వచ్చినప్పుడు, 'ఊపిరి ఆడటంలేదు, గుండెల్లో నెప్పిగా వుంది,' అంది. వెంటనే ఆమెని ఇర్‌ఫాన్‌పుర్ తీసుకువెళ్ళాను. కాని బతికించలేకపోయాను.''

"ఇదొక్కటే కేసా?"

"ఇంకా చలా వున్నాయి. ఇంకా ఇక్కడ వుంటారుగా, మీరే చూద్దురుగాని నేను చూపిస్తాను. అది సరేగాని, పాము విషం దిగిపోయాక కూడా దాని ప్రభావం ఇంకా వుంటుందా?"

"ఆఁ వుంటుంది"

"మరి దానికి విరుగుడు?"

"అప్పుడిక డాక్టరే గతి!"

"మందూ, ఇంజక్షన్లూ లేకపోతే డాక్టరు మట్టుకేం చేస్తాడు?"

"అందుకే మనుషులు చస్తున్నారు."

"ఏది ఎలా వున్నా మా చావు ఎవరూ తప్పించలేరు!"

"ఈసారి నేను ఇంజక్షన్, సూదులూ, మందులూ తీసుకొచ్చాను, మీకు నేర్పిస్తాను."

"నాకా?"

"ఆఁ మీకే!"

"నేను నేర్చుకోగలుగుతానా?"

"ఎందుకు నేర్చుకోలేరు? ఈసారి కేసు వచ్చినప్పుడు నేనేం చేస్తానో, ఎలా చేస్తానో చూడండి."

"పిల్లవాడికి నేర్పుతున్నాను, వాడూ చూడవచ్చుకదా?"

"అతన్ని కూడా చూడమనండి. మీరు ఎల్లకాలం ఉండరుగా?"

"నిజంగానే నేను నేర్చుకోగలుగుతానా?"

"ఆఁ, తప్పకుండా నేర్చుకోగలరు. నేను నేర్చుకున్నాను కాబట్టి నరంలోకి ఇంజక్షనివ్వగలను. మీరు చేతిలోనో, కాల్లోనో నూది ఎక్కించి ఇంజక్షనివ్వగలుగుతారు. ఎంత మందు తీసుకోవాలి, ఎలా కలపాలి, అన్నీ నేను నేర్పిస్తాను. నా దగ్గరున్న సీరమ్ చాలా రోజుల వరకూ సరిపోతుంది."

"మందు పాడైపోదుకదా?"

"ఆహాఁ"

"నేను ఇంజక్షనిచ్చి ప్రాణాలు కాపాడగలుగుతానా?"

"తప్పకుండా."

శ్రీపద్ రెండు చేతుల్లోనూ తలపట్టుకుని కూర్చున్నాడు. కాస్సేపయాక కళ్ళు తుడుచుకుని, "మా నాన్నకి కోపమొస్తే రానివ్వండి. నా దేవుడికి అంతా తెలుసు నావల్ల కావటంలేదు. వాళ్ళు నేర్పించిన విద్యనే వాడుతున్నాను, కానీ ప్రాణాలు పోతూనే వున్నాయి. నాకేమైనా పరవాలేదు. మనుషుల్ని కాపాడాలి" అన్నాడు.

"తప్పకుండా కాపాడగలుగుతారు."

"అయితే నాకు నేర్పించండి."

"తప్పకుండా నేర్పుతాను."

శ్రీపద్ అంత త్వరగా నేర్చుకోవటం చూసి వసంత్ ఆశ్చర్యపోయాడు. మొదట్లో అతన్ని తన గదికి తీసుకుపోయి చేతుల్లోనూ కాళ్ళలోనూ చర్మంకింద డిస్టిల్ వాటర్ ఇంజెక్ట్ చేసి చూపించాడు. ఆ తరవాత శ్రీపద్ వసంత్‌కి ఇంజక్షనిచ్చి ప్రాక్టీసు చేశాడు. దీనివల్ల ఇద్దరికీ చేతుల్లోనూ, కాళ్ళలోనూ నెప్పి పెట్టింది. శ్రీపద్ చాలా త్వరగా నేర్చుకుంటున్నాడు.

వసంత్ అమోనియమ్ క్లోరైడ్ వేడినీళ్ళు కలిపి ఎలా వాడాలో నేర్పాడు. ఉడుకు నీళ్ళతో కాపడం పెట్టడం నేర్పాడు. ఇద్దరూ చాలా ఉత్సాహంగా ఆనందంగా వున్నారు. శ్రీపద్, ''మీరు నేర్పించే విద్యవలన మనుషుల్ని చావునుంచి కాపాడవచ్చునా? "మానుష బాంచలీ విషహరీ కీ కోపనీ!" అన్నాడు.

"ఎవరి కోపం?"

"ఇదే అంటాను. అందరూ నేను మంత్రం చదువుతున్నాననుకుంటారు. వెధవలు కాన్పుకి పెళ్ళాలని ఆస్పత్రికి తీసుకుపోరు. టైఫాయిడ్ వస్తే తీసుకుపోరు. పాముకాటు వేస్తే, డాక్టర్ ఇంక్షనిస్తానన్నా తీసుకోరు."

వసంత్ నవ్వటం మొదలుపెట్టాడు. కలకత్తా దగ్గర్లో వున్న ఈ ఊరుపేరులేని బేహులాలో శ్రీపద్ వల్ల తనకి ఎన్నో కొత్త విషయాలు తెలిశాయి. "ఆడా మగా శియడ్ చాందా పాములు పుష్యమాసంలో కలుస్తాయి. ఈసారి పంట కోతలైనాక చందాలు వసూలుచేసి కిరసనాయిలు కొంటాను. ఇటుకల బట్టీలో మంటపెట్టి వీటిని తుదముట్టిస్తాను. బాబోయ్, ఆ పాముల్ని చూస్తుంటే, ఇది 'సర్పపురి' అనిపిస్తోంది" అన్నాడు శ్రీపద్.

కొన్నాళ్ళకి హేదో నశ్కర్ కొడుకు, మహేంద్ర శశి, పాముల్ని లెక్కచెయ్య కుండా బట్టీలోంచి ఇటుకలు తీసుకురావటానికి వెళ్ళాడు. నాలుగు ఇటుకలు

తీశాడో లేదో ఒక కాలాజ్ అతని తొడమీద కాటువేసింది. శ్రీపద్ వసంత్‌ని పిలుచుకొచ్చి, "కోరలు బాగా దిగబడలేదు, పైపైన గాయం అయింది," అన్నాడు.

శశి తను చనిపోతున్నానే అనుకున్నాడు. మానసికంగా చాలా భయపడటంవల్ల పాముకాటు లోతుగా పడ్డ లక్షణాలన్నీ అతనిలో కనిపించసాగాయి. శ్రీపద్ అతన్ని గట్టిగా మందలించాడు, "ఊరికే వేషాలెయ్యకు, శశీ! తెలిసిందా?" అన్నాడు.

వసంత్ వచ్చేటప్పటికి కట్లు కట్టడం పూర్తయింది. నీళ్ళు కాగుతున్నాయి. మందు తయారై వుంది. అతను శ్రీపద్‌తో, "ఇంజక్షనివ్వండి, నేను చెప్పిన విధంగా ఇవ్వండి" అన్నాడు.

"ఛిరిపద్ ఇంజక్షనిస్తాడా?" అందరూ గాభరాపడ్డారు. అదిచూసి శ్రీపద్ గట్టిగా అరిచాడు. చిన్న పిల్లవాడికి ఏంటీరేబీస్ ఇంజక్షన్ ఇచ్చినప్పుడు లూయీపాశ్చర్ అలాగే అరిచి వుంటాడు. చాలా ఆత్మవిశ్వాసంతో, "విషహరీ ఆజ్ఞతో నేను వైద్యం చేస్తున్నాను. నమ్మకం లేకపోతే ఇక్కణ్ణించి పొండి!" అన్నాడు.

శ్రీపద్ ఇంజక్షనిస్తూ గట్టిగా అరవసాగాడు!

అమ్మా మనసాదేవీ దయచూడు తల్లీ, విషాన్ని విరగ్గొట్టు తల్లీ!
భుజంగ జననీ విషాన్ని సప్తస్వర్గాల ఆవలకి పంపు తల్లీ!
అమ్మా మనసా, నీ తంత్రి అడుగుతున్నాడు
ఆ విషం అతని కంఠహారంగా మారనీ
జయ జయ శుభంకర శంకరా!

విజ్ఞానమూ, తంత్రజ్ఞానమూ రెండూ సమానంగా ప్రయోగించాడు శ్రీపద్. గాయంమీద వేడినీళ్ళు పోశాడు. ఉడుకు నీళ్ళతో కాపడం పెట్టాడు. ఇంజక్షనిచ్చిన గంట తరవాత కట్టు ఇంకొకచోట మార్చి కట్టాడు.

మళ్ళీ గట్టిగా అరిచాడు :

ధ్వని ధ్వని ధ్వని వెళ్ళిపో
ధ్వని అనగానే విషం వెళ్ళిపో
రక్తమాంసాలలో ధ్వని పొంగనీ
ధ్వని పొంగుతో విషం హరించనీ.

ఇక శశి ప్రాణానికేం భయలేదని వసంత్ చెప్పాక శ్రీపద్ తన జోలె

సర్దుకోసాగాడు. అతను శశి తల్లితో, "నశ్కర్‌ని అడిగి అన్నం, పప్పు తీసుకెళ్ళి అమ్మవారికి నైవేద్యం పెట్టండి, గట్టిగా ఏడవండి. నీ ఇటుకలబట్టీలోంచే పాము వచ్చి పిల్లవాణ్ణి కరిచింది అని చెప్పి, నైవేద్యానికి సరుకులు ఇస్తేగాని వీల్లేదని చెప్పండి," అన్నాడు.

"మీరు చెప్పనక్కరలేదు. దుర్గాదేవి హేదోనశ్కర్‌ని వదిలిపెడుతుందా? అతని బట్టీవల్ల మనమందరం నాశనం అవుతున్నాం. ఒక మాట చెప్పు ఛిరిపద్! ఇంజక్షన్ నివ్వటానికి దేవి ఒప్పుకుందా?" శశి వాళ్ళమ్మ అడిగింది.

"అయ్యయ్యో! ఆమె ఆజ్ఞ లేనిదే నేను ధైర్యంగా ఇంజక్షనిస్తానా? మీ కెందుకంత అపనమ్మకం? మీ ప్రాణాలకి నా ప్రాణాలు అడ్డువేస్తాను, ఏనాడైనా మిమ్మల్ని ఏమైనా అడిగానా? మీరందరూ పనికిమాలినవాళ్ళు, మీరు పిలిచినా రాకుండా ఉండాల్సింది, అప్పుడు తెలిసేది."

శశివాళ్ళమ్మ శ్రీపద్ కాళ్ళమీద పడింది. అక్కడ చేరినవాళ్ళంతా ఆమెని తిట్టారు. శ్రీపద్ మంచి అభినేత. ఇప్పుడు అంతా తన పక్షం వున్నారని తెలుసుకున్నాడు. "ఇంకోమాట, అందరూ వినండి," అన్నాడు.

"చెప్పవయ్యా! నువ్వు చచ్చిపోయిన పిల్లవాణ్ణి బతికించావు!"

"ఆ తల్లి సేవకుణ్ణి. ఆమె ఆజ్ఞలేనిదే అసలు ఏ పనైనా చెయ్యగలనా? ఆవిడే నాకు కలలో కనిపించి వసంత్‌ని పంపిస్తున్నానని చెప్పింది. అతను నీకన్నీ నేర్పిస్తాడు. ఆ తల్లి ఏమందో తెలుసా? బేహులా వాళ్ళ అవస్థ చూడలేకుండా వున్నానంది."

"అలాగా? ఇంకా ఏమంది దేవి?"

"హేదో నశ్కర్ సర్కారువాళ్ళిచ్చే కిరసనాయిలు కాజేసి తన ఇల్లు నింపుకుంటున్నాడు. అతని బట్టీవల్ల ఊరు నాశనమవుతోంది, అయినా అతను కిరసనాయిలు ఇవ్వడు. ఈసారి కోతలయాక మనందరం చందాలు వేసుకుని కిరసనాయిలు కొందాం."

"అలాగే కొందాం."

"బట్టీలో మంటపెట్టి శియడీ చాందాల్ని మట్టుపెట్టాలి. లేకపోతే మనలో ఒక్కడు కూడా మిగలడు. ఇది ఆ తల్లి ఆజ్ఞ!"

"అలాగే కానివ్వండి! అలాగే కానివ్వండి!" అందరూ అన్నారు.

ఇంటికెళ్తూ శ్రీపద్ వసంత్‌తో "ఇప్పుడందరూ సరేనంటే సరే అంటున్నారు. అసలు సమయం వచ్చినప్పుడు అందరూ జారుకుంటారు. వెధవలకి వాళ్ళ మంచే వాళ్లకి తెలియదు," అన్నాడు.

క్షణం ఆగి, "ఇవాళ ఎంత మంచిరోజు! నే నివాళ ఇంజక్షనిచ్చాను, శశిని కాపాడాను, అవునా?" అన్నాడు.

"నిజమే!"

శ్రీపద్ వసంత్ చెయ్యి పట్టుకుని "నామీద దేవికి ఎంతో దయ! మీతో 'సరే' నన్నప్పటి నుంచీ మనసులో పశ్చాత్తాపపడుతూనే వున్నాను. కానీ రాత్రి దేవి కలలో కనిపించింది. ఆమె ఒంటినిండా శియడ్ చాందాలని నగలుగా ధరించింది. 'నువ్వతని దగ్గరకి వెళ్ళు, అతన్ని నేనే పంపాను, 'అన్నది," అన్నాడు.

శ్రీపద్ చెప్పే ఈ కల అతని ఆటో సజెషన్ అని వసంత్‌కి తెలిసిపోయింది. ఈవిధంగా అతను తన ఆటవిక విశ్వాసాన్ని విడిచిపెట్టి ఆధునిక విజ్ఞానంవైపు మళ్ళి నందుకు క్షమించమని అడుగుతున్నాడు. శ్రీపద్ మనులో పాతుకున్న మూఢ విశ్వాసాలని సమూలంగా పెకలించడం తనవల్ల కాదని కూడా వసంత్‌కి అనిపించింది. శ్రీపద్‌కి 'తమసోమా జ్యోతిర్గమయి' అలవికాని పని. అతని మనసులో చీకటీ, వెలుతురూ కలిసే వుంటాయి. ఎందుకంటే అతను పేరుకి మాత్రమే 20వ శతాబ్దంలో ఉంటున్నాడు. నిజానికి నాగరికత సమకూర్చే ఏ సులువులూ అతనికి లభించటంలేదు. అతను చీకట్లోనే బతుకుతున్నాడు. విషహరీ అమ్మవారిని వదిలిపెట్టటం అతనివల్ల కాదు.

"రేపు సంతకెళ్తాను. రేపు రాత్రి మీరు మా ఇంట ఎంగిలిపడాలి. ఇదే నేనిచ్చే గురుదక్షిణ అనుకోండి" అన్నాడు శ్రీపద్.

"డబ్బు ఖర్చుచేస్తారా?"

"ఎందుకు చెయ్యను? చేపలూ, బంగాళాదుంపలు తీసుకొస్తాను. పిండివంటలు చేయిస్తాను. అందరం కడుపునిండా తిందాం."

మర్నాడు పొద్దున్న వసంత్ ఇర్‌ఫాన్‌పుర్ వెళ్ళి మిఠాయిలు కొనుక్కొచ్చాడు. సాయంత్రం అతను బైటికి వెళ్తుంటే హేదోనక్కర్, "ఛిరిపద్ ఇంట్లో భోజనానికి వెళ్తున్నారా? తక్కువవాళ్ళని నెత్తికెక్కించుకోవటం మంచిదికాదు" అన్నాడు.

వసంత్ నవ్వి "అతను నా స్నేహితుడు" అన్నాడు.

"స్నేహితుడా?"

"అవును. నేనిక్కడ ఎక్కువకాలం ఉండబోవటంలేదు. నావల్ల అతను మీ నెత్తికెక్కుతాడన్న భయంలేదు."

హేదోనశ్కర్‌కి వసంత్ మాటలు విని పిచ్చికోపం వచ్చింది. "ఇలాంటి మాటలు నక్సలైట్లు మాట్లాడతారు. మీరు నక్సలైట్ కాదు కదా?" అన్నాడు.

"లేదు, లేదు! అసలు అలాంటివాణ్ణి కాను."

"మీది పల్లెటూరు, ఇక్కడా సంఘ నియమాలుంటాయి."

"నేను వస్తాను."

"శ్రీపద్ ఇంజక్షనిచ్చాడని విన్నాను?"

"అవును."

"విషహరీ దేవి ఆజ్ఞతోనటగా?"

"ఆ(, అతనలాగే చెప్పాడు."

"ఆ తల్లి ఆజ్ఞ అయిందా?"

"అది నేనెలా చెప్పను? పూజ చేసేవాడే చెప్పగలుగుతాడు. ఏం, అతను అబద్ధాలు కూడా చెప్తాడా?"

"లేదు, లేదు! అబద్ధాలు చెబితే నాలుక తెగిపడిపోతుంది. సరే, ఇవ్వనివ్వండి ఇంజక్షన్లు! ఊరివాళ్ళకి లాభమేగా?"

"అవును మంచే జరుగుతుంది."

"నేనీ మాట వినగానే శశివాళ్ళమ్మకి బియ్యం, పప్పు, మసాలాలూ ఇచ్చి దేవికి నైవేద్యం పెట్టమని చెప్పాను. నా కొడుకు బతికిపోయాడు!"

"అతను బతికాడు, కానీ మీ బట్టీ గురించి ఏం చేశారు? ఏం చెయ్యకపోతే అందర్నీ ప్రతీసారీ కాపాడటం వీలుకాకపోవచ్చు."

"చూస్తాను, మంచి ధర పలికితే అమ్మేస్తాను."

శ్రీపద్ ఇంట లాంతరు వెలుతుర్లో బాతుమాంసం, కాకరకాయ కూర, అన్నం తిన్నారు. చివరికి రసగుల్లాలు వడ్డించారు.

భోజనం అయాక శ్రీపద్, "దేవి మీద పాట వింటారా?" అని అడిగాడు.

"తప్పకుండా."

మనసా భజనలు పాడారు. రాత్రి చాలా పొద్దుపోయింది. నక్కలుకూత

పెట్టసాగాయి. అన్నివైపులా నిశ్శబ్దం. వసంత్ మనసు వికలమైంది.

చాలాకాలం తరవాత తామలీనించి శ్రీపద్ పిలుపు వచ్చింది. అక్కడి స్కూలు మాస్టర్‌ని పాము కరిచింది. శ్రీపద్ వెంటనే వెళ్ళి చాలా ప్రయత్నించాడు, కానీ అప్పటికి పాము కరిచి అరగంట అయింది. శ్రీపద్ చేరుకునేలోపలే అతను సగం చచ్చి ఉన్నాడు. అయినా శ్రీపద్ తన శక్తికొద్దీ ప్రయత్నించాడు. ఆ ప్రాంతాల్లో శ్రీపద్ శక్తిసామర్థ్యాలు అందరికీ తెలిశాయి. తామలీలో కూడా పాము మంత్రం తెలిసిన మనిషి ఉన్నాడు. అతని పేరు భూషణ్‌మాల్. భూషణే శ్రీపద్‌ని పిలిపించమని సలహా ఇచ్చాడని తెలిసింది. ఊళ్ళో తను ఉండికూడా, శ్రీపద్ ఇంజక్షన్ ఇవ్వగలడని, భూషణ్ అతన్ని పిలిపించాడు.

రోజులు గడుస్తున్నాయి. శ్రీపద్, ఆరోగ్యకేంద్రంలో ఉండే డాక్టర్ - వీరిద్దరి సహాయంతో, వసంత్ తన పేపర్ రాస్తున్నాడు. గుర్రం ప్లాస్మా సీరం వల్ల ఎలర్జీలేని వాళ్ళు కూడా సెకండరీ సింటమ్స్ డెవలప్ అవటంవల్ల చనిపోవచ్చు. పుష్టికరమైన ఆహారం తినలేని వాళ్ళ శరీరాల్లో పేగుల వాపూ, పుప్పిపళ్ళూ, డిసెంట్రీ, ప్లీహం వంటి రోగాలు ఎప్పుడూ అంటిపెట్టుకుని ఉంటాయి. దీనివల్ల మిగతా లక్షణాలు కూడా కనిపిస్తాయి.

కొంతమంది చచ్చిపోతారు, కానీ బతికినవాళ్ళు డాక్టర్‌కీ శ్రీపద్‌కీ ప్రయత్నించటానికి కొత్త శక్తి నిస్తారు. వసంత్ మళ్ళీ కొత్తగా చదివినదంతా శ్రీపద్ దగ్గర నేర్చుకున్నాడు. పాము కరిస్తే భయంవల్ల మరణిస్తారని అతను మునుపు పుస్తకాల్లో చదివాడు.

శ్రీపద్ ఆ భయాన్నీ, దానివల్ల జరిగే ప్రమాదాన్నీ కళ్ళెదుట చూపించాడు. శ్రీపద్ ఒకరోజు "మీరు చాకలి రాజు చనిపోవటం చూశారా? నేను ఆ సమయంలో బజారుకు వెళ్ళాను. అతన్ని కరిచింది టోడా పాము, కానీ అతను తనని శియడ్‌చాందా కరిచిందని అన్నాడు. భయంతో అతని గుండె ఆగిపోయింది. అతని పెళ్ళాం ఏడుస్తూ - "ఎక్కడికెళ్ళావయ్యా, మీరుంటే అతనికిలా జరిగుండేదికాదు! టోడా కరిస్తే, శియడ్‌చాందా అనుకున్నాడు" అని మొత్తుకుంది. అందుకే మన శాస్త్రాల్లో రోగిని ఒంటరిగా వదలకూడదంటారు. ఎవరైనా దగ్గరుంటే రోగికి ధైర్యంగా ఉంటుంది" అన్నాడు.

"భయంతో అతని హార్ట్ ఫెయిలయింది."

"ఈ భయానికి మందులేదా?"

"మీ కొడుకు నేర్చుకుంటున్నాడా?"

"ఆఁ వాడు మంత్రాలూ తంత్రాలూ నేర్చుకోమంటే వినడు. కానీ ఇంజక్షనంటే చాలా ఉత్సహం చూపిస్తాడు. అప్పుడే అన్ని లక్షణాలు అర్థమయ్యే వయసు కాదు. పూర్తిగా వాడికే వదిలిపెట్టలేను "

"కట్టు మార్చకపోతే గేంగ్రీన్ అవుతుంది, హఠాత్తుగా విప్పితే మనిషి చచ్చిపోతాడు. ఈ విషయాలు అతనికి అర్థమయేటట్టు నేర్పండి."

"అన్నీ నేర్పుతున్నాను. నేను వైద్యానికి డబ్బు తీసుకోను కదా, అందుకని జాలరి నిశికాంత్ వనస చెక్కతో చేసిన పెట్టె ఒకటి ఇచ్చాడు. అతని తల్లిని నేను కాపాడాను. మందులూ ఇంజక్షన్లూ పెట్టుకోమని ఆ పెట్టె ఇచ్చాడు. 'ఆ తల్లిని తలుచుకుని వైద్యం చెయ్యి. ప్రస్తుతం నీ వైద్యంమీదే అందరం ఆధారపడి ఉన్నాం.' అన్నాడు. ఆఁ, ఇక చెప్పండి మీ పని ఎంతవరకు వచ్చింది?"

"ఊఁ బాగానే ఉంది. ఇక్కడికి వచ్చి ఉండకపోతే తిండి సరిగ్గాలేని వాళ్ళకి ఇంజక్షనిస్తే ఎటువంటి లక్షణాలు కనిపిస్తాయి, వాళ్ళెలా బాధపడతారు అన్న విషయం తెలిసేదే కాదు!"

"హేదోని పాము కరవదు. ఒకవేళ కరిస్తే ఏనుగులాగ తిండితినే మనిషి శరీరంలో జరిగే ప్రతిక్రియ చూసి ఉండేవారు. అతన్ని పాము కూడా కరవదు, ఎందుకంటే ఒకవేళ కరిచినా పామే చచ్చిపోతుంది. బాబోయ్, ఏం మనిషి?"

"నేనిక ఈ ఊరొదిలి వెళ్ళిపోవాలి."

"అది తలుచుకుంటే చాలా బాధగా ఉంది."

"మళ్ళీ రావలసివస్తుందేమో?"

ఏమో, పనిలో పడితే కదలటం కుదురుతుందా?"

"మీ మనసాదేవి ఒంటిమీద కాలజ్ చర్మంతో నగలు తయారుచేసి వేస్తారా? చూడటానికి చాలా అందంగా ఉంటుందేమో కదూ?"

"ఆఁ. పాముని చంపి, చర్మం ఒలిచి దానితో నగలు చేస్తారు. ఇది కూడా మేము చెయ్యవలసిన పనుల్లో ఒకటి. ఈ రోజుల్లో ఈ నియమాలెవరూ పాటించటం లేదనుకోండి! ఇప్పుడు వాళ్ళు టోడాని చంపి, దాని చర్మం కలకత్తా తీసుకెళ్ళి అమ్ముతారు. త్రాచుని చంపితే రెండింతలు లాభం."

వసంత్ వెళ్ళిపోతున్నాడని తెలిసి హేదోనశ్కర్ చాలా సంతోషించాడు. ఇర్ఫాన్‌పుర్ పోలీసుస్టేషన్‌కి వెళ్ళి "ఆఫీసరు బావమరిదని ఊరుకున్నాను. లేకపోతే ఇతను లేవదీసిన గొడవ కాస్తా కూస్తానా? నక్సలైట్లని మించిపోయాడు! తక్కువ జాతివాళ్ళతో స్నేహం చేసేవాడు. వాళ్ళకి ఇంజక్షన్లిచ్చేవాడు. వాళ్ళ ఇళ్ళల్లో భోజనం చేసేవాడు. ఈసారి కోతలప్పుడు వాళ్ళు మనం చెప్పిన మాట వింటారా? అతను నాలుగు రోజులుండి వెళ్ళిపోతాడు కాబట్టి అతనికి పట్టలేదు. మరి నాకలా కాదే, జీవితాంతం భరించాలే!" అన్నాడు.

"ఏమైనా గూడుపుఠాణీ జరిగిందా?"

"అలాంటిదేం లేదు. కానీ ఊళ్ళో వాతావరణమే ఇతనివల్ల మారిపోయింది. ఛిరిపద్ చెప్పులు వేసుకుని, టార్చీ చేత్తో పట్టుకుని తిరుగుతున్నాడు. తక్కువ జాతివాళ్ళు చెప్పులేసుకుని తిరిగితే ఘోరకలి వచ్చినట్టే కదా! పాము కరవకపోతే పరవాలేదుకాని చెప్పులేసుకున్నంత మాత్రాన కరవడం మానుతుందా? ఎవరాపగలరు?"

విషహరీదేవి హేదోనశ్కర్ మాటలు విన్నట్టుంది.

ఆ రాత్రే వసంత్ ఎవరో తలుపు తడుతుంటే లేచాడు. బైటనించి ఎవరో చాలా గోలగా పిలుస్తున్నారు. వసంత్ హడావిడిగా లేచి తలుపుతీసి చూస్తే, హేదోనశ్కర్, శ్రీపద్ కొడుకు పతిత్ ఇంకా చాలామంది కనిపించారు. వసంత్‌ని చూడగానే పతిత్ ఏడుస్తూ, "ఇంజక్షన్ తీసుకుని పదండి బాబుగారూ! నాన్న ... నాన్నని ..."

"శ్రీపద్‌నా?"

"అవును బాబుగారూ, నిద్రపోతుంటే నడుంమీద కాటేసింది."

ఉన్నట్టు నాలుగువేపులా వెల్తురు కమ్ముకుంది. శశి చేతిలో పెట్రోమాక్సు లైటుంది. హేదోనశ్కర్ కూడా భయపడుతున్నాడు. శ్రీపద్ పాముకాటుతో చచ్చిపోతే ఏమవుతుందో అతనికి తెలుసు. "దీపం పట్టుకెళదాం" అన్నాడు హేదోనశ్కర్.

"మీరూ వస్తున్నారా?"

"ఛిరిపద్...!"

వసంత్ టార్చిపట్టుకుని పరిగెత్తాడు. అతని భుజాన సంచీ వేలాడుతోంది. శ్రీపద్‌ని పాము కరిచింది. శ్రీపద్‌నే?

శ్రీపద్ ఇంటినిండా జనం ఉన్నారు. ఆవరణంతా నిండి ఉన్నారు జనం. వసంత్ అందర్నీ తోసుకుంటూ లోపలికి వెళ్ళాడు. కొందరు ఏడుస్తూ, "మాల్‌ని బతికించండి బాబూ! మీరు కాపాడకపోతే అతను బతకడు."

శ్రీపద్ గోడకి ఆనుకుని కూర్చున్నాడు. అతని కెదురుగా చచ్చిపోయిన పడి ఉంది. శ్రీపద్ ఒక చెయ్యి పెళ్ళాం భుజం మీద ఆనించి కూర్చుని ఉన్నాడు. ఆమె గొల్లున ఏడుస్తోంది. శ్రీపద్ నడుంమీద గాటుపెట్టి ఉన్నది. శ్రీపద్ కళ్ళు నిద్రతో బరువెక్కాయి. కన్నురెప్పలు వాలిపోతుంటే అతను బలవంతాన వాటిని తెరుస్తున్నాడు.

"శ్రీపద్!"

"బాబుగారూ! వసంత్ బాబూ!"

"ఎవరైనా నీళ్ళు కాగబెట్టండి, కాస్తా ఎక్కువగా కావాలి. పెట్రోమేక్స్ ఇక్కడ పెట్టు. శ్రీపద్, భయపడవద్దు, నేను ఇంజక్షన్ చేస్తున్నాను."

ఇంజక్షనిస్తున్నప్పుడు వసంత్ చేతులు వణికాయి. శ్రీధర్ పెదవులమీద చిరునవ్వు మెరిసింది. ఎక్కడో బావిలోనించి మాట్లాడుతున్నట్టుగా అతని గొంతు నీరసంగా వినిపించింది, "పతిత్ కట్టుకట్టాలనుకున్నాడు. కానీ ఎక్కడ కడతాడు?"

"శ్రీపద్, నీకు అందరికన్నా ఎక్కువ డోసు ఇస్తున్నాను."

"ఇవ్వండి."

వసంత్ శ్రీపద్ నడుంమీద నిర్లిప్తంగా, ఏ తొట్రుపాటు లేకుండా గాటు పెట్టాడు. శ్రీపద్ మళ్ళీ నవ్వి, "అక్కడ గాటు పెడితే ఏం లాభం బాబుగారూ? నడుంకీ గుండెకీ ఏమీ తేడా లేదని మీరే చెప్పారుకదా?" అన్నాడు.

"శ్రీపద్ కళ్ళు తెరు."

"కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి బాబుగారూ! ఒకటే నిద్ర!"

"వేడినీళ్ళ గిన్నె తీసుకురండి. కంబళి కిందపరచి కూర్చోపెట్టండి."

శ్రీపద్ పూజకి కూర్చునేటప్పుడు ఉపయోగించే కంబళి కాటుపైన పెట్టి వేడినీళ్ళు కాపడం పెట్టారు. అయినా అతని శరీరంలో ఎటువంటి కదలికా రాలేదు. వసంత్ శ్రీపద్ నాడి చూశాడు, గుండెలమీద చెవి పెట్టి విన్నాడు.

చాలా ప్రయాసపడిన మీదట శ్రీపద్ కళ్ళు తెరవగలిగాడు. కళ్ళు తెరిచి గద్గదస్వరంతో "నక్కర్ ఇటుకలు అమ్మనేలేదుకదూ?" అడిగాడు.

వసంత్ చెవి ఇంకా అతని గుండె చప్పుడు వినటానికి ఛాతీని అంటుకునే ఉంది. కొద్దిసేపటికి నెమ్మదిగా లేచి నిలబడి శ్రీపద్‌ని నింపాదిగా పడుకోబెట్టాడు. అతని మొహంమీద గుడ్డకప్పి వెక్కి వెక్కి ఏడవసాగాడు. అతనితోపాటు బేహులాలోని జనం అందరూ - వందమందికి పైగా ఉంటారు - ఏడవటం మొదలుపెట్టారు. ఆ నిశ్శబ్దమయిన రాత్రి ముక్కలు ముక్కలయింది. కాలాజ్ చర్మం కిరీటంగా ధరించిన మనసాదేవి కళ్ళు విప్పార్చి చాలా ప్రేమగా చూస్తూ ఉండిపోయింది.

తెల్లవారింది. ఆ రోజు సర్వనాశనాన్ని వెంటబెట్టుకొచ్చినట్టుగా ఉంది. ఎలా తెలిసిందోగాని, తామలీ, బకుల్‌పూర్, ఫూలే, గాంగటీ ఊళ్ళనించి మాల్‌లు అక్కడ చేరారు. వసంత్ కేవలం ఒక ప్రేక్షకుడిగా మిగిలిపోయాడు. అక్కడ జరిగేదాన్లో అతను పాలుపంచుకోలేకపోయాడు. అరటి బోదెతో పడవ తయారు చేశారు. దానిమీద ఆకులు పరచి పాలిపోయిన శ్రీపద్ దేహాన్ని పడుకోబెట్టారు. ఒక్కొక్కరే వచ్చి అతని చితిమీద ఒక చిన్న దొన్నెలో బియ్యమూ, తులసి ఆకులూ ఉంచి అతనికి దండంపెట్టి వెళ్ళిపోయారు.

ఒక పెద్ద శవయాత్ర బయలుదేరింది. అందరూ దేవుడి పేరు ఉచ్చరించారు, కళ్ళు తుడుచుకున్నారు. ఆడవాళ్ళకన్నా మగవాళ్ళే బాహాటంగా ఏడిచారు. చివరికి శవాన్ని నదిలోకి దింపారు. నెమ్మది నెమ్మదిగా అది ప్రవాహం వెంబడి పోసాగింది. అందరూ ఒడ్డునే నడవసాగారు. ఆ శవాన్ని లాక్కెళ్ళటానికి ముసలి బేహులానది గుండెలు చెరువయ్యాయి. తను శాపగ్రస్తురాలు! శవం చాలా నెమ్మదిగా తేలుతోంది. వసంత్ దయ్యం పట్టినవాడిలాగ ఒడ్డునే నడవసాగాడు. ఒకచోటికి వచ్చాక అందరూ ఆగారు. ఇప్పుడిక శవం సుడిగుండంలో పడబోతోంది. అక్కడే శవం గుండ్రంగా తిరుగుతుంది. అందరూ శవాన్నే చూస్తున్నారు. అందరి కళ్ళల్లోనూ చీకటీ, సూర్యుని వెలుతురుకానీ, చుట్టుపక్కల దృశ్యాలుకానీ వాళ్ళకి కనిపించటంలేదు. ఎవరో అన్నారు, "ఏడుసార్లు శవం గుండ్రంగా తిరిగాక మునిగిపోయి, మళ్ళీ తామలీనదిలో తేలుతుంది."

కానీ శవం అలా తిరుగుతూనే ఉంది. అందరూ అది చూసి ఆశ్చర్యపోయారు. గాలికి శ్రీపద్ మొహంమీద కప్పిన గుడ్డ ఎగిరిపోయింది. సగం తెరుచుకున్న శ్రీపద్ కళ్ళు తనని తప్పుపడుతున్నట్టు, తనవేపు తిరస్కారంగా చూస్తున్నట్టూ వసంత్‌కి అనిపించింది. మనిషి, పాముకాటుకి భయపడే మనిషి,

ఉత్త రీసెర్చి కాగితం కాదు. వినయ్-బాదల్-దినేష్ ఆఫీసులోని అంకెలుకారు. మనిషి అమరుడు కాదు, అందుకే అతనికి సహాయం కావాలి, అతని భయం పోగొట్టాలి, అతన్ని కాపాడాలి.

శశి వాళ్ళమ్మ గట్టిగా ఏడుస్తూ, "పిల్లల్ని అనాధుల్ని చేసి పోతున్నావు, అందుకే వెళ్ళలేకపోతున్నావు. అందుకే అన్నిసార్లు సుడిగుండంలో తిరుగుతున్నావు" అంది.

తరువాత చనిపోయిన శ్రీపద్‌కి తనకి తన తండ్రినించి వచ్చిన విద్య తన కొడుక్కు తను నేర్పించలేకపోయాననే అనిపించినట్టు, నిరాశ చెందినట్టుగానూ, వసంత్ వెళ్ళిపోతు న్నాడనీ బాధపడ్డట్టూ, అందుకే మునిగిపోవటంలేదనీ అందరూ అనుకున్నారు. తనకి తల కొరివి పెట్టే హక్కు కొడుక్కి ఉంది కానీ తన తరవాత తన పని ఎవరు చేస్తారు? తనకి తల కొరివి పెట్టినంతమాత్రాన కొడుకు తనకు వారసుడవలేడే! శ్రీపద్ ఎంతో నిరాశగా నదితో చెప్పినట్టు, వెంటనే నది అతని శవాన్ని లోపలికి లాగేసింది.

వసంత్ ఇంటికి వచ్చాడు. రోజంతా తిండీ తిప్పలు లేకుండా, స్నానమైనా చెయ్యకుండా పక్కమీద పడుకునే ఉండిపోయాడు.

మర్నాడు పొద్దున్న అతను హేదోనశ్కర్‌ని పిలిచాడు, "మీరు కిరసనాయిలు డబ్బాలు బైటికి తియ్యండి. అవి సర్కారు వారివి" అన్నాడు.

"ఏం చేస్తారు?"

"చూద్దురుగాని."

"కానీ, ఏం చేస్తారో చెప్పండి..." హేదోనశ్కర్ ఇంకేదో చెప్పబోయాడు. శ్రీపద్ చనిపోయినందుకు అతను కూడా బాధపడుతున్నాడు. కానీ కిరసనాయిలంటే అథారిటీ, దీన్ని చేతిలో ఉంచుకోవాలి. వసంత్ అతన్ని మాట్లాడనివ్వటంలేదు.

"నశ్కర్‌గారూ, ముందు ఊళ్ళోవాళ్ళందర్నీ పిలిచి నేను కిరసనాయిలు బైటికి తీయిస్తాను. ఆ తరవాత ఎస్.డీ.ఓ.కి కబురు చేస్తాను. తరవాత కలకత్తా వెళ్ళి చెయ్యవలసింది చేస్తాను. మీ ఇటుకలబట్టీ ... ఎస్.డీ.ఓ.నా బావగారు మాత్రమే కాదు, గట్టి ఆఫీసరూను. వీళ్ళ దగ్గర పర్మిట్లున్నప్పటికీ మీరు వీళ్ళకి కిరసనాయిలు ఇవ్వటంలేదు. మీరు బ్లాక్ మార్కెట్ చేస్తారు. నాకు తెలియదా? మీరు పంచాయతీ ప్రెసిడెంటయితేమట్టుకేం? మీ ఆటలన్నీ తెలిశాక సర్కారు మిమ్మల్నింకా ప్రెసిడెంటుగా ఉండనిస్తుందనుకుంటున్నారా?"

ఎప్పుడూ శాంతంగా, సభ్యతగా ప్రవర్తించే వసంత్ కళ్ళల్లో నశ్కర్‌కి తన ఓటమి కనిపించింది. ఊరు తనకి ఎదురు తిరిగింది. పోలీస్ స్టేషన్ ఇరాఫాన్‌పుర్‌లో ఉన్నది. ఏదో తెలియని భయం అతన్ని పట్టుకుంది. 1970-71లో వీళ్ళ భయంతోనే అతను పారిపోయాడు.

గొంతు ఎండిపోతుంటే, "తీసుకోండి, ఎన్ని డబ్బాలు కావాలి?" అని అడిగాడు. "మీదగ్గర ఒక డబ్బా వదిలేసి, మిగతావన్నీ తీసుకుంటారు. శశీ! నువ్వెళ్ళి చరణ్, సాగర్, రావణ్, నిశికాంత్ అందర్నీ పిలుచుకురా. నాకు ఇరవైమంది మనుషులు కావాలి."

వసంత్ గొంతులోనూ, మనసులోనూ ఏదో పాశవిక ఆనందం. జంతువులాంటి నశ్కర్ మొహం చూస్తే అతనికి ఇంత ఆనందం వస్తుందని అతను ఎప్పుడూ అనుకోలేదు.

"హోజ్ పైపులు కూడా అన్నీ ఇవ్వండి. ఊళ్ళో నిప్పు ఆర్పటానికి గవర్నమెంటిచ్చిన పైపులు అవి, మీరు మీ వంగతోటకి నీళ్ళు పెట్టటానికి వాడుతున్నారు?"

చరణ్, మిగతావాళ్ళూ వచ్చారు. వసంత్, "డబ్బాలూ, పైపులూ తీసుకోండి. వీలైనంత గడ్డీగాదం ఏరుకురండి" అన్నాడు.

చరణ్ అతనివేపు చూశాడు. శ్రీపద్ చావు అతన్ని చాలా దెబ్బతీసింది. చాలా కుంగిపోయాడు. అయినా వసంత్ వాళ్ళ జీవితాల్లో మళ్ళీ కొత్త జీవం పోస్తున్నాడు.

"పెద్ద పెద్ద వెదురుబొంగులు తీసుకురండి. పిల్లలూ, ఆడవాళ్ళూ దగ్గరకి రావద్దు."

గడ్డీ, గాదంతో పెద్ద పెద్ద మూటల్లాగ కట్టి బట్టీమీదకు విసిరివేశారు. కాస్సేపటికి బట్టీ పూర్తిగా కప్పబడిపోయింది. ఆ తరవాత దాని చుట్టూ ఎండుగడ్డితో కంచెలాగ కట్టారు. నిప్పు స్వభావం బాగా తెలిసిన కాటికాపరి, సాగర్ కుర్రవాళ్ళతో, "ఒరే, మీరెళ్ళి శ్మశానంలోని చిన్న చిన్న చెట్లు కొట్టి తీసుకురండర్రా. ఒకసారి నిప్పు ముట్టిస్తే ఆరకుండా కాలుతుంది" అన్నాడు.

"ఇంటింటినించీ ఎండుగడ్డి తీసుకురండి. చలికాలం మంట వేసుకోవటానికి దాచుకుని ఉంటారు" అన్నాడు చరణ్.

ఆ తరవాత గడ్డిమీద కిరసనాయిలు స్ప్రే చేసి తడిపారు.

"ఒక్కసారిగా అన్ని వేపులనించీ మంటపెట్టండి. కిరసనాయిలుతో తడిపిన గుడ్డపీలికలు విసరండి. గడ్డితో చుట్టూ కట్టిన కంచె ఆరకూడదు. దానిమీద గడ్డీ, కఱ్ఱముక్కలూ వేస్తునే ఉండండి. పాములు బైటికొస్తే కఱ్ఱతో కొట్టి చంపండి" అన్నాడు వసంత్.

"అరె, మీరు చెప్పాలా, బాబుగారూ! ఛిరిపద్‌ని ఇవి పొట్టన పెట్టుకున్నాయి. ఒక్కటి కూడా తప్పించుకోలేదు."

మంటలు ఎత్తుగా లేచాయి. అందరూ కళ్ళార్పకుండా చూస్తున్నారు. బాగా అలవాటున్న పనికావటంవల్ల కాటికాపరి సాగర్ దూరంనించే కఱ్ఱతో ఇటుకల్ని కూల దోస్తున్నాడు.

"అందరూ అన్ని వైపులనించీ పడగొట్టండి. పాములు బైటికి వస్తున్నాయి, చూడండి, చూడండి!" అన్నాడు.

మంటలవేడికి తట్టుకోలేక పాములు బైటికి రాసాగాయి. అందరూ కెవ్వుమన్నారు. ఒక కొత్త ఉత్సాహం అందర్నీ ఊపింది. కంచెమీదికి కఱ్ఱముక్కలు విసిరారు. కిరసనాయిలు పిచికారీలాగ చిమ్మారు. పాములు బైటికి వస్తుంటే వాటిని జనం ఒక్కొక్కటిగా చంపేశారు. ఊళ్ళోవాళ్ళ శోకమూ, కాలాజ్ అంటే వాళ్ళకున్న భయమూ, హేదోనక్కర్ మీది కోపమూ ఆ అగ్నిగా మారిందని అనిపించింది. వాళ్ళ క్రోధాగ్ని దానికి తోడయో ఏమో ఆ మంట ఇంకా ఎత్తుకి లేచి మండసాగింది.

# బికారి దుసాధ్, ప్రాథమిక హక్కులు

ఆ ప్రాంతం నవాగఢ్ పొలిమేరల్లో, బస్సు తోవలో వున్నది. నవాగఢ్ ఒక చిన్న స్టేటో, పెద్ద జమీందారీయో అనవచ్చు. జమీందారుకి 'రాజా' అనే బిరుదుంది. దేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పుడు రాజాగారు సంవత్సరం పిల్లవాడు. అయినా ఆయన్ని రాజాగారనే అనేవారు. జమీందారీ వ్యవస్థ పోయాక కూడా ఆయన తన హక్కులన్నిటినీ వదులుకోలేదు. రాజ్యం చేతులు మారే సమయంలో చాలా భూములు దేవుళ్ళపేర రాయబడ్డాయి. అయినా రాజాగారికి చాలా అన్యాయం జరిగింది. ఈ పాపం చేసినది గవర్నమెంటు. బస్సురోడ్డూ, రైల్వేలైనూ వెయ్యటానికని రాష్ట్రప్రభుత్వమూ, కేంద్ర ప్రభుత్వమూ కలిసి దేవుళ్ళపేర ఉన్న ఈ భూమిని లాక్కున్నాయి.

రాజాగారు ఇంకా కుర్రవాడుగా ఉండగానే ఇదంతా జరిగింది. రాజమాత తెలివైనది. ఆమె, ఆమె వకీలూ తమకి జరిగిన ఈ ఘోరాన్యాయానికి చాలా బాధ పడ్డారు. ఆ తరవాత ఒకపక్క రాంచీలోనూ, పాట్నాలోనూ ఉన్న వకీళ్ళతో సంప్రదింపులు జరుగుతూ ఉండగా, ఇంకోపక్క రాజాగారికి జీవనోపాధి కల్పించటానికి ప్రయత్నాలు జరిగాయి. నివాసయోగ్యమైన భూములూ, అడివిలో చెట్లు కొట్టించటానికి కాంట్రాక్టులూ, కలప ఫ్యాక్టరీ, ట్రక్కుల ట్రాన్స్‌పోర్టూ - ఇవన్నీ సమకూర్చిన తరవాత తమకి జరిగిన తీరని అన్యాయానికి పగ సాధించటానికి గట్టి ప్రయత్నాలు మొదలు పెట్టారు.

ఆరేళ్ళ తరవాత వాళ్ళ ప్రయత్నాలకి ఫలితం దక్కింది. ఆరోజు నవాగఢ్‌లో ఒకటే సందడి. ప్రైమరీ స్కూళ్ళకి సెలవలిచ్చారు. 'రాజమాత ట్రాన్స్‌పోర్ట్' వాళ్ళ ట్రక్కులు కూడా సెలవు పెట్టాయి. రాజాగారి భవంతి, 'శూరనివాస్' నుండి రంగు కాగితాలతో కట్టిన మిఠాయి బుట్టలూ, పళ్ళాలూ తోహరీలోని కోర్టుకీ, టహోడ్‌లోని శివాలయానికీ పంపారు.

చాలారోజుల తరవాత నవాగఢ్‌లో అందరూ స్వేచ్ఛగా పండగ జరుపు

కున్నారు. రాజాగారు అందరికీ కబురుపెట్టారు - వైభవంగా పండగ చేసుకోండి, ఇంటింటా దీపాలు వెలిగించండి - మీ ఖర్చుతోటే! రాజగారి ఆజ్ఞ పాటించటం అందరివల్లా కాకపోయినా, మొత్తంమీద అందరూ ఆనందంగా, ఏదో బరువు దిగిపోయినట్టు ఆనందించారు.

దాదాపు పదినెలల క్రితం రాజగారి భూములు దున్నే సేద్యగాళ్ళు ఎదురు తిరిగారు. ఇలా ఇంతకుముందు చాలా ఏళ్ళుగా జరుగుతున్నా ఎప్పుడూ పోలీసులు మట్టుకు రాలేదు. ఈసారి మొదట రాజాగారి గుమస్తాలు రైతుల్ని కొట్టారు. ఆ తరవాత పోలీసులొచ్చారు. రైతుల్లో బలహీనంగా కనిపించిన వాళ్ళందరినీ పోలీసులు పట్టుకుపోయారు.

ఇలాగే ఇన్నాళ్ళూ జరుగుతూ వస్తోంది, ఇకముందు కూడా జరుగుతుంది. ఈ సంఘటనలన్నీ నవాగఢ్‌లోని మట్టి అంత పాతవి.

ఈ మధ్యకాలంలో ఏటా రైతుల సంఖ్య పెరుగుతూ వచ్చింది. పంటలో వాళ్ళకి రావలసిన వాటా గురించీ, వాళ్ళ హక్కుల గురించి కూడా వాళ్ళు జాగరూకులైనారు. ఇందులో బైటవాళ్ల జోక్యం ఉండి ఉండాలని పోలీసులు అనుమానించారు.

ఈ బైటినించి ఉసికొల్పే శక్తుల్లో ఐకమత్యం ఉన్నట్టులేదు. ఒకళ్లు కమ్యూనిస్టూ, ఒకళ్లు గిరిజనుల పక్షం పోరాడేవాళ్ళూ, ఇంకొకళ్ళు ఉగ్రవాదులూను. కానీ ఈ వెధవలు అందరూ బీదరైతులకి మద్దతిచ్చేవాళ్ళే.

అందుకే ఈసారి గొడవలు చాలా ఎక్కువగా అవుతున్నాయి. దాదాపు మూడునెలల క్రితం రైతుల పోరాటం సాగినప్పుడు ఒక పొడుగాటి గుడ్డమీద వాళ్ళు, 'మా కష్టంతో పెరిగిన పంట, సగం పంటమీద మాదే హక్కు'అని రాశారు.

ఆ గుడ్డని రెండువైపులా పొడుగాటి బొంగులకి కట్టి దాన్ని పట్టుకుని వీధులన్నీ తిరిగారు. ఈ విషయం రాజాగారిని చాలా కలవరపెట్టింది. ముఖ్యంగా వాళ్ళు రాసిన నినాదం ఆయనకి నచ్చలేదు. రాజాగారి దయాదాక్షిణ్యాలమీద బతికే రైతులకీ, వ్యవసాయ కూలీలకీ ఎంత ధైర్యముంటే మా శ్రమతో పండిన పంట మీద మాకు కూడా హక్కుందని అంటారు? ఇదేం బాగాలేదు. పైగా, వాళ్ళల్లో రాయటం వచ్చిన వాళ్ళెవరైనా ఉన్నారా, లేక ఇంకెవరైనా వాళ్ళకి రాసిచ్చారా?

రాజాగారు లోలోపల చాలా భయపడ్డారు. తను చాలా ఘోరంగా మోస

పోయానని అనుకున్నారు. ఇది అన్యాయం, చాలా అన్యాయం! తనని పీడిస్తున్నారు! జులుం చేస్తున్నారు! గవర్నమెంటువాళ్ళు తన భూముల్ని లాక్కుని దానిమీద బస్సురోడ్డూ, రైల్వేలైనూ వేశారు. గవర్నమెంటు అలా చెయ్యబట్టేకదా తన 'రాజమాతా ట్రాన్స్‌పోర్టు' ట్రక్కులు ఆ రోడ్డుమీద కర్రలూ, బొగ్గూ, ధాన్యమూ, కూలీలని మోసుకు పోగలుగుతున్నాయి. రైళ్ళల్లో తన మెషీన్లు కోసిన కలప పలకలు మిగతా ఊళ్ళకి పోతున్నాయి. కానీ, అది వేరే సంగతి. తనని బాధపెట్టే అసలు సంగతి గవర్నమెంటు తన భూముల్ని లాక్కుందనేదే. ఈ అన్యాయానికి ఏం చెయ్యాలి అని ఆలోచించే లోపలే రైతులూ, కూలీలూ ఇంకో కొత్త ఉపద్రవం తెచ్చిపెట్టారు! 'పంటలో వంతు కావాలి' గవర్నమెంటు వారి 'శ్రమ విభాగం' నియమాల ప్రకారం వాళ్ళకీ పంటలో వాటా కావాలిట. ఇదేం అన్యాయం?

ఈసారి రైతులు జమీందారు మనుషులని పంట తీసుకుపోనివ్వలేదు. 'చంపండి, ఈ తొత్తులని! అన్నారు. ఆ కొట్లాటలో మధురాసింగ్ గాయపడ్డాడు. చందన్‌మల్ దగ్గరున్న తుపాకీని వాళ్ళు లాగేసుకున్నారు. రాజాగారు తుపాకీ పేల్చక తప్పలేదు. ఆయన మనుషుల్లో ఒకడు చచ్చిపోయాడు, చావురాసి పెట్టి ఉంది మరి!

ఇలాగే ఇన్నాళ్ళూ జరుగుతూ వస్తోంది, ఇకముందు కూడా జరుగుతుంది. ఈ నవాగఢ్ నేలలోని మట్టి ఎంత పురాతనమైనదో ఈ సంఘటనలూ అంతే! ఎవరో ముసలావిడ తన మనవలని నిద్ర పుచ్చుతూ కథ చెప్తోంది...

ఆ తరవాత రాజాగారు వచ్చి "ఏమిట్రా దుఖియా, ఏమిటి మీ గొడవ?" అన్నారు. మీతాత, "ఇందులో గొడవేముంది? పంటలో వాటా ఇవ్వండి. అది మా హక్కు కాదా? మీ సిపాయిలని పంపెయ్యండి" అన్నాడు. ఆ తరవాత రాజాగారు తుపాకీ పేల్చాడు. మీ తాతని చంపేశాడు. గుండె చీలిపోయి రక్తం, వర్షాకాలంలో గంగానది నీళ్ళల్లాగా ప్రవహించింది." ఇన్నాళ్ళుగా ఇలాగే జరుగుతోంది, ఇకముందు కూడా ఇలాగే జరుగుతుంది. భూస్వాములూ, బీదరైతులూ, వ్యవసాయ కూలీలూ, సేద్యగాళ్ళూ-వీళ్ళకథ ఇలాగే నడుస్తుంది. దీన్ని ఎవరూ మార్చలేరు.

ఆ తరవాత కథ కొద్దిగా మారింది. దెబ్బలు వేస్తూ, దెబ్బలు తింటూ కూడా నినాదాలు చేశారు. "మా శ్రమతో పండించిన పంట, సగం వాటా మాకు చెందటం మా హక్కు!"

నవాగఢ్ చరిత్రలో ఇటువంటి సంఘటన ఎన్నడూ జరగలేదు. దీనివల్ల పోలీసులు కాపలా కాయటం మొదలుపెట్టారు. దుఖియా శవాన్ని ఎక్కడికో పంపేశారు. దెబ్బలు తగినవాళ్ళని ఆస్పత్రిలో చేర్పించారు. చట్టానికి విరుద్ధంగా ప్రవర్తించి గొడవలు లేపిన రైతుల పేర్లు కొట్టివేశారు. హఠాత్తుగా అనుకోనిది జరిగింది. రైతుల యూనియన్ యజమానుల మీద కోర్టులో దావా వేసింది.

పై కారణాలవల్ల నవాగఢ్‌లో పోలీస్‌స్టేషన్ వెలిసేప్పటికి అందరూ భయపడ్డారు. మూడు నెలలపాటు ఎవరూ నోరు మెదపలేదు. ఈ మధ్యలో రాజాగారికి నష్టపరిహారం చెల్లించబడింది. స్తంభించిన గాలి కొద్దిగా కదిలింది! ఈ విషయం జనం కథలు కథలుగా చెప్పుకున్నారు.

బిచ్చగాడు దుసాధ్‌ని ఎవరూ పట్టించుకోలేదు. పట్టించుకోవాల్సిన పనిలేదు! అతను చాలా పిరికివాడూ, ఎందుకూ పనికిరానివాడూను. ఎప్పుడూ మేకల్ని తోలుకుంటూ ఉంటాడు. ఆ పనే అతనికి తిండి పెడుతుంది. అతనికి జీవనాధారం ఆ మేకలే. వాటికి ఎక్కువ పోషణ అవసరంలేదు. అవి అన్నిరకాల ఆకులూ తింటాయి. గడ్డి ఎలాగూ తింటాయి. ఏటా రెండు మూడుసార్లు ఈనుతాయి.

ఇంకొకళ్ళయితే ఈ మేకలతోనే అదృష్టం పండించుకునేవాళ్ళు, కానీ దుసాధ్ దురదృష్టాన్ని వెంటపెట్టుకుని పుట్టాడు! అతని మేకలు కూడా కుటుంబ నియంత్రణ పాటిస్తున్నాయి! రెండు మూడు మేకలకన్నా ఎక్కువ అతని దగ్గర ఎప్పుడూ వుండవు. "ఏం చెయ్యమంటారు, బాబూ! నా ఖర్మ అలా కాలింది," అంటాడు.

"ఇంకోడయితే మేకల్ని పెంచి డబ్బు సంపాదించుకునేవాడు. నీకు మంచి రోజులు రావేం?" అని ఎవరైనా అడిగినప్పుడు - అతని జవాబు-

"ఎలా వస్తాయి? అడివిలో మేపుతాను కదా. ఏ దుమ్ములగొండో, నక్కో ఎత్తుకు పోయి తినేస్తాయి. శెట్టిగారూ ఒక పావు పేలపిండి, ఐదు పైసలకి కొంచెం నిమ్మకాయ, ఊరగాయ ఇప్పించండి. ఆఁ, ఇంకో ఐదు పైసలకి ఉప్పుకూడా ఇవ్వండి."

"చాలా? వీటితో కడుపు నిండుతుందా?"

"చాలు, బాబూ!"

"ఒరే బికారీ! నువ్వు మేకలని సంతలో అమ్మరాదూ? అక్కడైతే ఎక్కువ ధర పలుకుతుంది."

"ఏం చేసేది, బాబయ్యా! నా మొహం చూస్తే ఎవరికీ మంచిధర ఇవ్వాలనిపించదు."

బికారి, పిరికి బికారి గట్టిగా నవ్వాడు. ఎవరికీ పనికిరాని తన బతుకుని చూసి సిగ్గుపడ్డాడు. అప్పుడప్పుడూ మేకపిల్లని ఒక చేత్తో ఎత్తుకుని, ఇంకోచేత్తో చూడిమేకని తోసుకుంటూ అడివికేసి వెళ్తూ కనిపిస్తాడు. అతని మొహంలోనూ, కళ్ళల్లోనూ ఏదో తత్తరపాటూ, భయమూ కనిపిస్తాయి. పెదవుల అంచుల్లో నురుగు వుంటుంది. బికారి భయపడ్డప్పుడు అతనికి నోరెండిపోయి ఇలాగే నురుగు కనిపిస్తుంది. కొత్తల్లో జనం బికారిని ఈ స్థితిలో చూసి ఆశ్చర్యపోయేవారు.

"ఏమయింది, బికారీ?"

"పోలీసులొచ్చారు, పోలీసులు!"

"ఒస్తే నీకేం?"

వాళ్ళు నా మేకలని ఎత్తుకుపోతారు."

పారిపో బికారీ, పారిపో! అడివిలో దుమ్ములగొండీలుంటాయి, నక్కలుంటాయి. అవన్నీ మేకలకి శత్రువులు. నవాగఢ్‌లో వాటికి శత్రువులు పోలీసులు. బికారి అడివిలోకి పారిపోయాడు. బాగా దూరం వెళ్ళాక కొడవలితో కొమ్మలు నరికి కొట్టంలాగా తయారుచేసి మేకలని అందులోకి తోలి తను ద్వారం దగ్గర కూర్చుని గజగజ వణకసాగాడు.

అతనికున్న ఆస్తల్లా ఆ మేకలే. భూముల్లేవు, పెళ్ళాం-పిల్లలు లేరు, ఉద్యోగం- సద్యోగం లేదు. ఒంటిమీద గోచీతప్ప ఏమీలేదు. మేకలు తోలుకోవటం అంత లోకువ పనేమీకాదు. ఎప్పటికైనా తనదగ్గర పది-పదిహేను మేకలు చేరితే వాటిని సుమాదీలోని సంతకు తీసుకెళ్ళి అమ్మేస్తాడు. బోలెడంత డబ్బు వస్తుంది. చూడితో ఉన్న మేకలని తప్ప మిగతా అన్నిటినీ అమ్మేస్తాడు.

ఆ డబ్బుతో ఒక మంచి ధోవతీ కొనుక్కుంటాడు. తనెప్పుడూ చిన్న గుడ్డముక్క మాత్రం కొనుక్కుని గోచీలాగ పెట్టుకుంటాడు. డబ్బొస్తే ధోవతితోపాటు కొత్త గావంచా కూడా కొనుక్కుంటాడు.

ఆ తర్వాత సుమాదీలోనో, ఇంకో ఊళ్ళోనో దుసాధ్ సమూహాన్ని వెతుక్కుంటాడు. బజార్లోకి మంగలివాళ్ళొస్తారు, వాళ్ళని అడిగితే తెలుస్తుంది. ఏ వితంతువునో, వయసుమళ్ళిన ఆడదాన్నో పెళ్ళి చేసుకుంటాడు. అప్పుడు తనకంటూ

ఇల్లు వుంటుంది, కనీసం ఒక గుడిసైనా వుంటుంది. ఒకరికి ఇద్దరుంటే మేకల సంఖ్య పెరుగుతుంది.

కానీ బికారి కన్న ఈ కల నిజమయ్యే ఆశలేదు. బాధా గ్రామంలోని దుసాధ్‌లు అడవిని చదునుచేసి తమ బస్తీ ఏర్పరచుకున్నారు. అక్కడ బికారికి సుఖంగానే గడిచింది. కానీ అక్కడా సమస్య ఎదురైంది. బాధాలో గణేశ్‌సింగ్‌దే పెత్తనం. దుసాధ్‌లతో అతనేదో పోట్లాడినట్టున్నాడు, దుసాధ్‌లు అతన్ని చంపి పారేశారు. ఊళ్ళో పోలీసుస్టేషన్ పెట్టారు. దుసాధ్‌ల దగ్గరున్న మేకలన్నీ పట్టుకుపోవటం మొదలుపెట్టారు. బికారిని కూడా తీసుకుపోయారు. బికారి వాళ్ళతో ఎంతో మొత్తుకున్నాడు, "నాదగ్గర ఇంకేమీలేదు, ఈ మేకలే ఆధారం." కానీ పోలీసులు ఇవన్నీ పట్టించుకోరు, గోడు వినరు. చివరికి రాంకా దుసాధ్ బికారితో, "నువ్వు చూడి మేకలని తీసుకుని పారిపో. నాథాలో ఏ గొడవా ఉండదు. మేకలని మేపటానికి బయళ్ళు కూడా వున్నాయి. ఒక పెద్ద మర్రి చెట్టుంది, దానికింద పడుకుని నిద్రపోవచ్చు." అన్నాడు.

మర్రిచెట్టుకింద గడ్డీగాదంతో వేసిన ఒక గుడిసె వుంది. మేక ఈనింది. పిల్లలు పెద్దవయాయి. నాథాలో పెత్తనమంతా రాజపుత్రులది. మాంసం తింటారు. వాళ్ళు చాలా బలం కలవాళ్ళు. వాళ్ళు బికారిని చూశారు కాని పట్టించుకోలేదు. మేక మాంసం తినాలనిపించినప్పుడు మేకని కొనుక్కునేవారు. కానీ ధర తక్కువే ఇచ్చేవారు - ఎనిమిదో పదో రూపాయలు! పది - పదిహేను శేర్ల మాంసం ధర పది రూపాయలేనా? "ఏం చెయ్యను, బాబయ్యా! అందరికీ అన్నీ రాసిపెట్టి ఉండవుకదా?"

నాథాలో ఒక గొప్పింటి మనిషి ఒక ఆడదాన్ని తుపాకీతో కాల్చి చంపాడు. ఆమె హోలీ పాటలు పాడేవాళ్ళ గుంపులో మనిషి. అంతే! నాథాకి కూడా పోలీసులు వచ్చేశారు. పోలీసులు రాగానే ఆ గొప్పింటివాళ్ళు - బికారి దుసాధ్ దగ్గరున్న మేకల్లో ఒకదాన్ని తీసుకురండి అని ఆజ్ఞ జారీచేశారు. వరసగా మూడు రోజులు మూడు మేకలని సమర్పించుకున్న తరవాత దుసాధ్ ఊరొదిలి పారిపోయాడు.

ఈ ప్రపంచం అందరికీ అంత విశాలంగా కనిపించదు. బికారికి ఈ లోకం చాలా చిన్నదిగా కనిపించింది. నాథాలో జరిగిన దానికి మనసు విరిగిపోయిన దుసాధ్ టాహాడ్‌కి వెళ్ళాడు. అక్కడి శివాలయానికి వెళ్ళి పూజారి హనుమాన్‌మిశ్రాకి దండం

పెట్టివచ్చాడు.

"ఆహా, ఏం రూపం మిశ్రాగారిది! శరీరంలోనుండి ఏదో వింత కాంతి వస్తున్నట్టుగా ఎర్రటి శరీరఛాయ! ఎందుకుండదు? ఎంతైనా బ్రాహ్మణుడు కదా, రోజూ పాలూ తాగుతారు, పాలతో స్నానం చేస్తారు. ఈశ్వరుడితో మాట్లాడతారు!" బికారి దుసాధ్ ఆయన్ని గురించి అంటూ వుంటాడు.

బికారి ఒకసారి అడివి అంచున ఉన్న దుసాధ్‌గంజ్ బస్తీకి వెళ్ళాడు. టాహాడ్‌లోని దుసాధ్‌లు చాలా ఆప్యాయంగా అతన్ని తమతో వుండమని పిలిచారు. అతను అక్కడే వుండసాగాడు. అతను అడివిలో మేకలని మేపుకురావటానికి వెళ్ళినప్పుడు ఒక ముసలమ్మ అతని చూడి మేకలని చూసుకునేది. ఆమే అతనికి వంట కూడా వండి పెట్టేది. వాళ్ళు అతనితో, "ఇక్కడే ఉండిపో. మా బస్తీలో ఇంకొక ఇల్లు పెరుగుతుంది. నీకు పెళ్ళికూడా మేమే చేస్తాం" అన్నారు.

బికారికి అక్కడ చాలా సుఖంగా వుంది. కానీ ఒకరోజు ఆ ఇలాకాలోని ఇన్‌స్పెక్టరు బ్రాహ్మణుడి ఇంటి వచ్చాడు. అతను టాహాడ్‌లో వారంరోజులు వున్నాడు. ఒకరోజు పూజారి బికారిని పిలిచి, "ఒరే, దుసాధ్! ఇన్‌స్పెక్టర్‌గారి భోజనానికి ఒక మేకనియ్యి." అన్నాడు.

"అయ్యా, నేను మేకని అమ్ముదామనుకుంటున్నాను."

"ఏమిటి నువ్వనేది? పోలీసు ఇన్‌స్పెక్టర్‌గారు ఆలయాలన్ని కనిపెట్టి ఉంటారు. ఆయన తినటానికని అడుగుతూ ఉంటే డబ్బు మాటెత్తుతావా?"

మేకని పూజారికిచ్చి బికారి టాహాడ్‌ని కూడా వదిలి వెళ్ళిపోయాడు. అక్కడి దుసాధ్‌లు చాలా బాధపడ్డారు. "ఏం చెయ్యను? మీలాగ నాకు కూలిపనీ, పొలంపనీ, అడివిలో ఎండుకట్టెలు కొట్టుకునే పర్మిట్లూ లేవుకదా? నాకీ మేకలే కదా ఆధారం? మేకలని పెంచటం, అమ్మటం, పెంచటం, అమ్మటం. పోలీసులు ప్రతిసారీ నా పొట్టకొట్టి నాకున్న ఒక్క ఆధారాన్నీ లాక్కుపోతారాయె!".

టాహాడ్‌లోని దుసాధ్‌ల బస్తీ బికారికి చాలా నచ్చింది. బీదవాడని అతన్ని ఎవరూ తక్కువగా చూడలేదు. ముసలమ్మ అతనికోసం రకరకాల కూరలు వండిపెట్టేది. హర్వా పెళ్ళాం తన కొడుక్కిచ్చి 'ఛట్' పండగ ప్రసాదం పంపేది, ఊరగాయ పంపేది. హర్వా ముళ్ళపందిని చంపినప్పుడు బికారికి కూడా కొద్దిగా మాంసం ఇచ్చాడు.

అన్నీ వదిలేసి అతను చివరికి మళ్ళీ నవాగఢ్‌కే వచ్చాడు. ప్రైమరీ స్కూలు మాస్టరు సుఖ్‌చాంద్ చాలా మంచివాడు. స్కూలు పక్కనున్న మర్రిచెట్టుకింద కూర్చుని బికారితో కబుర్లు చెప్పేవాడు. వయసులో చిన్నవాడు. ఆ ఊరి పద్ధతులు అతనికి తెలియవు. అందుకే ఒకరోజు అతను బికారితో "రాత్రిళ్ళు పెద్దవాళ్ళకి చదువు చెప్పిస్తున్నాను. నువ్వు కూడా రా!" అన్నాడు.

"ఏం చెయ్యమంటారు, బాబుగారూ? బికారికి మీరు చదువు చెప్తే వాడి పని అంతే! వాడు నవాగఢ్ వదిలి పారిపోవలసిందే! రాజాగారు తరుముతారు, పోలీసులు వస్తారు, శెట్టి సరుకులివ్వడు, బావిలో నీళ్లు తోడుకోనివ్వరు!"

సుఖ్‌చాంద్, "ఎందుకని?" అన్నాడు.

"ఎందుకేమిటి? ఒక టార్చి చూపించి దాని ఖరీదెంతని శెట్టిని అడిగాను. దానికే ఆయనకి ఎంత కోపం వచ్చిందనుకున్నారు? ఒరే, బికారి వెధవా! నువ్వు దుసాధ్‌వి, తక్కువ పనులు చేసేవాడివి, తక్కువ జాతి వాడివి, నువ్వు టార్చి వెలిగిస్తావురా? అన్నాడు."

నవాగఢ్‌లో బికారి ఒక పాడైపోయిన డొక్కు బస్సులో ఉండేవాడు, అదే వాడి ఇల్లు! రాజాగారి వకీలు పాడైపోయిన పాత బస్సులూ, లారీలు కొంటాడు. చాలా బస్సులు చేరాక వాటిని విరగ్గొట్టించి లోహమూ, చెక్కలూ అమ్ముకుంటాడు. అటువంటి బస్సుల్లో ఒకదాన్లోనే బికారి మకాం. అక్కడ అతనిలాగే చాలామంది కుటుంబాలతో వుంటున్నారు. ట్రక్కులకీ బస్సులకీ మధ్య ఖాళీ స్థలంలో గడ్డి పెరిగింది. బికారి మేకలు అక్కడే మేస్తాయి. నవాగఢ్‌లో మేకలు మెయ్యటానికి పనికివచ్చే బయళ్ళు ఇంకా వున్నాయి. కానీ బికారి దగ్గర బయళ్ళలోకి తీసుకెళ్ళి మేపటానికి అన్ని మేకలేవీ?

తన మేకలని కొట్టంలో పెట్టి, మనసులోనే వాటిని కాపాడమని దేవుణ్ణి ప్రార్థిస్తూ అతను గడగడలాడుతూ నవాగఢ్‌కి వచ్చాడు. అప్పుడు అవిటివాడూ, ఒంటికంటిదీ, కుష్టురోగి దోరా అతనికి చాలా సహాయం చేశారు. వాళ్ళే, "పోలీసులింకా ఇక్కడే వున్నారు, పారిపో!" అని చెప్పారు.

నీటికుండా, పేలపిండీ తీసుకుని బికారి మళ్ళీ అడివిలోకెళ్ళిపోయాడు. దేవుడు ఏదో ఒకరోజు కరుణించకపోడు. తన మేకలు చల్లగా ఉండాలి! కానీ దేవుడు అప్పుడప్పుడూ బికారిని మరిచిపోతూ ఉంటాడు. అప్పుడు దుమ్ములగుండ్లో,

నక్కలో తన మేకలని ఎత్తుకుపోయి తినేస్తాయి. లేకపోతే పాములు కరుస్తాయి.''

అడివిలో బికారి మేకలకి నీళ్ళు తాగించాడు. గుడ్డ కొసన పేలపిండీ, బెల్లమూ మూటకట్టి, నీళ్ళల్లో నానపెట్టి తిన్నాడు. ఇలా రెండు మూడు రోజులు గడిచాయి. రోజూ నవాగఢ్‌కి వెళ్ళక తప్పటంలేదు. పోలీసులు వెళ్ళిపోతే నవాగఢ్‌కి తిరిగి పోదామని చూస్తున్నాడు.

ఈసారి పోలీసులు నవాగఢ్‌లో మూడునెలలు తిష్టవేశారు. బికారి పూర్తిగా 'అడివి జంతువుగా' మారిపోయాడు. అడివి అంచు వెంబడి అతను బాఢాకి వెళ్ళాడు. అక్కడ రాంకా దుసాధ్‌ని కలిశాడు. రాంకా సహాయం చెయ్యకపోతే దుసాధ్ ఇన్నాళ్ళు అడివిలో ఉండగలిగేవాడు కాదు.

రాంకా అతని కష్టాలన్నీ ఓపిగ్గా విని, ''ఉండు, చూస్తాను.'' అన్నాడు.

ముగ్గురు నలుగురు కుర్రవాళ్ళని తీసుకుని రాంకా ఒకసారి అడివిలో బికారి దగ్గరకెళ్ళాడు. వాళ్ళు మేకలకోసం ఒక గట్టి కొట్టం కట్టిపెట్టారు. పైన ఆకులూ, కొమ్మలతో కప్పుకూడా వేశారు. ''ఇక్కడే ఉండు. నీళ్ళు కావలసివస్తే దగ్గరగా కాలవకూడా ఉంది,'' అన్నారు.

''మరి తిండో?''

''డబ్బియ్యి, కొనుక్కొస్తాం.''

''ఇందా.''

చాలారోజులు ఇలాగే గడిచాక రాంకా బికారితో ''ఇక్కడ ఇంకా ఎన్నాళ్ళు ఉండాలో తెలియదు, ఒక మేకని అమ్మెయ్యి,'' అన్నాడు.

''ఎక్కడ అమ్మను?''

''సంతలో''

''తోహరీలోనా?''

''మరింకెక్కడ?''

''నేనెప్పుడూ వెళ్ళలేదు.''

''నామీద నమ్మకం వుంటే ఇయ్యి, అమ్మిపెడతాను.''

''ఏమిటా మాటలు? నిన్ను నమ్మకపోతే ఇంకెవర్ని నమ్ముతాను?''

''అయితే మేకనియ్యి.''

రాంకా మేకని అమ్మి అరవై రూపాయలు తెచ్చి బికారి చేతిలో పెట్టాడు.

రూపాయలు చేతిలో పడగానే బికారికి తనేదో పెద్ద రాజుగారయినంత సంబరం కలిగింది. మరో మూడునెలలకి అతని మేక ఈనింది. ఇంకొక మేకని అమ్మి రాంకాకి డబ్బిచ్చి తిండి సరుకులు తెప్పించుకున్నాడు.

"ఇంక పోలీసులు లేరు. అప్పుడప్పుడూ దుసాధ్ బస్తీకి వెళ్ళి రావచ్చు," అన్నాడు రాంకా. బాఢాలోని దుసాధ్, బస్తీలో వుండే కానూ దుసాధ్ ఒకరోజు బికారితో నవాగఢ్‌లోని పోలీసుస్టేషను ఎత్తేశారని చెప్పాడు.

"నిజంగానా?"

"అలా అనే విన్నాను."

ఇప్పుడిక నవాగఢ్‌కి వెళ్ళిపోవాలని బికారి తొందరపడ్డాడు. తనదగ్గర ఎనిమిది మేకలు చేరాయి - రెండు ఆడవీ, రెండు పోతులూ, నాలుగు పిల్లలు.

"ముందు పోలీసులని వెళ్ళిపోనీ, తరవాత వెళ్ళువుగానీ," అన్నాడు రాంకా.

పోలీసులు వెళ్ళిపోయారు, స్టేషను ఎత్తేశారు. ఆ తరవాత బికారి నవాగఢ్‌కి బైలుదేరాడు. తన చోటికి మళ్ళీ ఇన్నాళ్ళ తరవాత వెళ్ళ గలుగుతున్నందుకు అతను ఆనందం పట్టలేకపోయాడు. నవాగఢ్ చేరగానే అతని స్నేహితులందరూ చాలా సంతోషించారు.

ఒంటికంటి మనిషి సవిరి కొమ్మతో అతని ఇల్లు ఊడ్చింది, ఇల్లంటే అదే, పాడైపోయిన బస్సు! ఆమె తన ఒంటికంటితో చుట్టూ చూసి, "చూసుకో, నీ సామానంతా భద్రంగా ఉంది కదా!" అన్నది.

"ఆ(, ఆ(! అన్నీ ఉన్నాయి."

ఏముంది అసలు సామాను? గడ్డితో పేనిన ఒక చిన్న చాప, మూతి విరిగిపోయిన ఒక సీసా, ఒక చిన్న రేకు డబ్బా

"నీకు తెలుసా బికారీ?"

"ఏమిటి?"

"దోరా పారిపోయాడు."

"ఎక్కడికి?"

"సూమాదీకి. సంతలో కూర్చుంటే బోలెడంత డబ్బు దొరుకుతుంది. అవిటివాడేం చేశాడో తెలుసా? దాలీని తరిమేసి ఇంకొకత్తెను తెచ్చుకున్నాడు."

"మరి నిన్ను?"

"నన్ను ఇంట్లో ఎవరుంచుకుంటారు చెప్పు? ఒక కన్ను అసలు కనిపించదు. ఇంతకన్నా రెండు కళ్ళూ పోయినా బాగుండేది. గుడ్డివాళ్ళకి బిచ్చమెత్తుకుంటే చాలా డబ్బు దొరకుతుంది. పైగా నేనింకా ముసలిదాన్నైనా కాను! కష్టపడి పనిచేసి సంపాదించుకోరాదూ? అంటారు. నువ్వే చెప్పు, నేను కష్టపడి పని చెయ్యటం లేదూ? రోజూ తోహరీకి వెళ్తున్నానా లేదా? అంతదూరం రోజూ కాలినడకన వెళ్ళి రావటమంటే మాటలా? కష్టం కాదూ?"

"అది నిజమే."

"అరె! ఎన్ని మేకలు చేరాయో!"

"రేపు అమ్మటానికి తీసుకుపోతాను."

"నవాగఢ్‌కి సంబంధించిన సమాచారం ఇంకా వుంది.'

"ఏమిటి?"

"రాజాగారికి గవర్నమెంటువాళ్ళు ఏం ఇచ్చారో తెలీదు కానీ చాలా పెద్ద ఎత్తున విందులూ, వినోదాలూ జరుపుకుంటున్నారు. సాయంత్రమైతే టపాకాయలు కూడా కాలుస్తున్నారు."

"మీ పని బావుందన్నమాట!"

"లేదు, లేదు మునుపటిలా విస్తట్లో అన్నీ ఎక్కువగానే వేయించుకుని తినకుండా పారెయ్యటం ఇప్పుడులేదు. వీళ్ళు వేయించుకున్నవన్నీ ఒక్కటి వదిలిపెట్టకుండా తింటున్నారు. ఇక మనకి తిండి ఎలా దొరుకుతుంది? ఆఁ, బైజ్‌నాధ్‌లాలా, చచ్చిపోయినప్పుడు తోహరీలో కడుపు నిండా అన్నం తిన్నాం. ఇంతలేసి పూరీలు, కచోరీలూను!"

"అలాగా?"

"ఎక్కడి కెళ్తున్నావు?"

"సుఖ్‌చాంద్‌గారితో కాస్త పనుండి, వెళ్తున్నాను."

సుఖ్‌చాంద్ దుసాధ్‌ని బికారివాడనీ, మేకలు తోలుకునేవాడనీ హీనంగా చూడడు. నవాగఢ్‌కి తిరిగొచ్చాక ఇన్నాళ్ళనించీ ఎక్కడున్నావని బికారిని ఎవరూ అడగలేదు.

అక్కడే ఉన్నాకూడా అతన్ని ఎవరూ గమనించరు. వెళ్ళిపోయినా ఎవరూ పట్టించుకోరు, పట్టించుకోలేదు. ఇప్పుడు మళ్ళీ వచ్చినా ఎవరూ అతన్ని

పలకరించలేదు.

"ఏం చెయ్యను, బాబయ్యా! ఇది ఎప్పుడూ ఉండేదే. మేక మాంసం, పాలూ కావలసి వచ్చినప్పుడే బికారి జ్ఞాపకం వస్తాడు. కారు చవగ్గా పాలూ, మాంసమూ దొరుకుతాయిగా! కానీ, అంతమాత్రం చేత బికారిని ఎవరైనా ఒక మనిషిగా గుర్తిస్తారా? ఎన్నటికీ జరగదు! ఈ కథ చాలా పాతది. నవాగఢ్ పుట్టక ముందుది!

సుఖ్‌చాంద్ స్కూలుకి ఆరోజు సెలవ. సుఖ్‌చాంద్ మర్రిచెట్టు కింద కూర్చున్నాడు. నవాగఢ్‌లోని గొల్లవాళ్ళు చాలా డబ్బున్నవాళ్ళు. మోతీహార్, భగత్ కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. సుఖ్‌చాంద్ వయసులో చిన్నవాడు. తనకి తెలిసిన విషయాలు నలుగురికీ చెప్పి, సలహాలివ్వాలని అతనికి చాలా ఉత్సాహంగా ఉంటుంది. అతను ఆ ఇద్దరు గొల్లవాళ్ళకీ చాలా ఓపిగ్గా ఏదో వివరించి చెప్తున్నాడు. బికారిని చూడగానే "రా, రా, బికారీ! ఎప్పుడొచ్చావు?" అని అడిగాడు.

"ఇవాళ తెల్లవారగట్లే వచ్చానండీ"

"బాగున్నావా, బికారీ?"

"ఏదో దేవుడి దయవల్ల ఇలా ఉన్నాను. మీరు కులాసాయేనా?"

"ఆఁ, బాగానే ఉన్నాను. ఇలా కూర్చో."

చేతులు జోడించి నవ్వుతూ బికారి భయంభయంగా కొంచెం ఎడంగా కూర్చున్నాడు. గొల్లవాళ్ళు కాళ్ళకి మందమైన పట్నం చెప్పులు తొడుక్కుని ఉన్నారు. చెవులకి ఇత్తడి లోలాకులూ, తలకి పాగా, చేతిలో కర్రా ఉన్నాయి. బికారికి వాళ్ళంటే భయం.

మోతీహార్ బికారిని పట్టించుకోకుండా, "ఏదీ, మళ్ళీ ఒకసారి చెప్పండి సుఖ్‌చాంద్‌గారూ!" అన్నాడు.

"మొదటినించీనా?"

"ఆఁ."

"చెప్పాను కదా?"

"మాకు సరిగ్గా అర్థం కాలేదు. రాజాగారి భూములమీద బస్సురోడ్డూ, రైల్వేలైనూ వేశారు. ఇది ఉన్నదేగా? ఏమంటావు, భగత్? గవర్నమెంటు ఆకాశంలో బస్సురోడ్డూ, రైల్వేలైనూ వేస్తుందా మరి?"

"అవును మోతీహార్, సరిగ్గా చెప్పావు."

"దీనికోసం రాజాగారు దావా ఎందుకు వేశారు? అదే నాకర్థం కావటంలేదు."

"ఎందుకు వెయ్యడు? చూడండి, ఆ భూమి ఎవరిది? రాజాగారిదా కాదా?" అన్నాడు సుఖ్‌చాంద్.

"అవును. కానీ ఆయన దగ్గర ఇంకా బోలెడన్ని భూములున్నాయిగా?"

"ఆ భూముల మీద ఆయనకి హక్కుందా లేదా?"

"ఎంతమాట? నిస్సందేహంగా ఉంది."

"ఈ ఆస్తిమీది హక్కుందే, భారతదేశ రాజ్యాంగం ప్రకారం ఇది ప్రతి మనిషికీ ఉండే ప్రాథమిక హక్కు. ఏడు ప్రాథమిక హక్కులున్నాయి. రాజ్యాంగానికి ఈ హక్కులని పరిరక్షించాల్సిన బాధ్యత వున్నది."

"అలాగా? చాలా విచిత్రంగా ఉందే! అంటే ప్రాథమిక హక్కులు అనేవి మన మంచికే నన్నమాట."

"ఆఁ, మంచికే."

"మీ బుర్రలో అలాంటి సందేహం ఎందుకు వచ్చింది? మోతీహార్‌గారూ, ప్రాథమిక హక్కులు మంచివి కావని ఎందుకనుకుంటున్నారు?"

"రైతులు ప్రాథమిక హక్కులు కావాలని గొడవ చేసినందుకేగా పోలీసులు వచ్చింది?" అన్నాడు మోతీహార్.

"కాదు, ఆ గొడవలవల్ల శాంతికిభంగం అవకుండా చూడటానికని పోలీసులు వచ్చారు."

"ప్రాథమిక హక్కులంటే ఎలా ఉంటాయి?"

ఈ ప్రశ్న విని సుఖ్‌చాంద్ చాలా సంతోషించాడు. అతనికి తనకున్న జ్ఞానం ప్రదర్శించుకోవటానికి అవకాశం దొరికింది. వేళ్ళు లెక్కిస్తూ అతను చెప్పటం మొదలుపెట్టాడు. "మొదటిది సమానత్వం. జాతీ, మతం లేక ఇంకే కారణాలవల్లనూ అసమానత్వం ఉండకూడదు. అంటే అందరూ సమానమని అర్థం. ఈ తేడాల ఆధారంగా ఎవరూ ఎవరినీ పీడించరాదు. ఇదే మొదటి ప్రాథమిక హక్కు".

"అలా అని పుస్తకాల్లో రాసి ఉందా?"

"ఆఁ, రాసి ఉంది."

మోతీహార్‌కి ఇప్పటికి నమ్మకం కుదిరింది. అతను గర్వంగా తలెత్తి, "ఇది తప్పకుండా ఇంగ్లీషువాళ్ళు రాసిన పుస్తకం అయి వుంటుంది. ఏమన్నారు? జాతి,

మతం ఆధారంగా ఏ తేడాలూ ఉండకూడదా? అంటే నేనూ, బికారి దుసాధ్, సమానమే నన్నమాట!"

"అవును, రాజ్యాంగంలో అలాగే వుంది."

"రాజ్యాంగం చెప్పినా, మరొకళ్ళు చెప్పినా ఇదిమాత్రం పచ్చి అబద్ధం. మన కళ్ళెదుట రోజూ చూస్తూనే ఉన్నాం. తక్కువ జాతి వాడని బికారి దుసాధ్‌ని పైజాతి వాళ్ళెవరూ గుమ్మం తొక్కనివ్వరు. అతని చెయ్యి తగిలితే నీళ్ళుకూడా ముట్టరు. ఎవరో కిట్టనివాళ్ళు చేసిన ప్రచారం ఇది. ఏమంటారు సుఖ్‌చాంద్ గారూ? జవహర్‌లాల్ ప్రధాని అయారు, ఇందిరమ్మగారూ అయారు. మే మెప్పుడూ ఈ మాట వినలేదే? దుసాధ్‌కీ బ్రాహ్మణుడికీ ఒకేరకమైన గౌరవం లభించటం ఎన్నడూ చూడలేదే?" సుఖ్‌చాంద్ తేనెతుట్టెని కదపలేదు. చాలా సులభంగా అర్థమయే భాషలో స్వాతంత్ర్యం తీసుకొచ్చి ప్రాథమిక హక్కుల గురించి వివరించాడు.

"ఇది అబద్ధం," అన్నాడు భగత్.

"ఏం, ఎందుకు?"

"మనిషి తనకిష్టమైన పని చెయ్యటానికి స్వతంత్రుడు, అవునా?"

"అవును."

"తురకవాళ్ళు తినేదాన్ని నవాగఢ్‌లో వాళ్ళెవరైనా అమ్మగలరా? జనం అమ్మనిస్తారా?"

సుఖ్‌చాంద్ నవ్వి, "మిగతా ప్రాథమిక హక్కులేమిటో, అవికూడా వినండి.

నేను సాయంత్రాలు పెద్దవాళ్ళకి చదువు చెప్తాను. మీరూరండి. మీ స్నేహితులనీ తీసుకురండి. చదవటం నేర్చుకుంటే రాజ్యాంగంలో ఏమి రాసి ఉందో మీరే స్వయంగా చదివి తెలుసుకోవచ్చు" అన్నాడు.

"ఇది జరిగేపనా? ఈ వయసులో ఇప్పుడు..."

"చదువు నేర్చుకోటానికి వయసుతో పనేమిటి?"

"ఎందుకుండదు?"

"నేనింకోటి చెప్పేది? సరే, వినండి."

మోతీహార్, భగత్ చలా శ్రద్ధగా విన్నారు. బికారి నోరు విప్పలేదు. ప్రాథమిక హక్కులని గురించి శ్రద్ధగా వింటూ సుఖ్‌చాంద్ వేపు సంభ్రమంతో చూడసాగాడు. చివరికి మోతీహార్, "ఆఁ, మీరు చివరగా చెప్పినది సరిగ్గా వుంది. ఎవరి ఆస్తినీ,

అది ఏదైనా సరే, ఎవరూ లాక్కోలేరు. ఇది మంచి విషయమే, ఒప్పుకుని తీరాలి!" అన్నాడు.

"అందుకే రాజాగారికి ఆరు లక్షల రూపాయలు వచ్చాయి."

"ఆరు లక్షలా?"

ఆరులక్షల రూపాయల గురించి విన్నాకూడా బికారికి ఏమీ అనిపించలేదు. ఎందుకంటే ఆరులక్షల రూపాయలంటే ఎంతో అతనికి తెలియదు. కానీ మోతీహార్, భగత్ అవాక్కయిపోయారు. ఆరు లక్షల రూపాయలే!

సుఖ్‌చాంద్‌కి లోయర్ ప్రైమరీ టీచర్లకొచ్చే జీతమే వస్తుంది. ఇన్ని లక్షల రూపాయలు అని విని అతనికీ ఏమీ అనిపించలేదు. ప్రాథమిక హక్కుల గురించి వివరించటంలోనే మునిగిపోయాడు.

"అదే నేను చెప్పేదీనీ. రాజాగారికి తన భూమిమీద హక్కుంది కదా? గవర్నమెంటు రోడ్డూ, రైల్వేలైనూ వేసేటప్పుడు ఆ భూమి లాక్కున్నారు కదా? దీనివల్ల ఆయన ప్రాథమిక హక్కు దెబ్బతిన్నదా లేదా?"

"ఎలా?"

"అరె! ఆయన్ని అడక్కుండా గవర్నమెంటు భూమే అనుకుని పని మొదలుపెట్టి ఉంటారు. ఎక్కడో తప్పు జరిగి వుండాలి..."

"ఆఁ, సరే! ఆ తరవాత ఏమయింది?"

"రాజాగారు ఈడొచ్చాక కోర్టులో దావా వేశారు."

"ఎవరి మీద?"

"రైల్వేశాఖమీదా? రోడ్డు రవాణాశాఖ మీద?"

"ఆ దావాని ఆయన గెలుచుకున్నాడా, మరి?"

"ఆఁ, గెలుచుకున్నాడు."

"బావుంది! ఆస్తిమీద ప్రాథమికహక్కు, కానీ దానికోసం ఎవరైనా జామీను ఉండాలికదా?"

"అక్కర్లేదు, భగత్‌గారూ! జాగ్రత్తగా వినండి. మీ దగ్గర ఆస్తి వుంది - ఇల్లు, ఆవులు, గేదెలు, సామాన్లు వగైరా. మోతీహార్ గారి దగ్గర కూడా అవన్నీ వున్నాయి. నాకున్న ఆస్తి-ఈ బట్టలూ, మంచం, పుస్తకాలూ. బికారి ఆస్తి, మేకలు. స్థిర చరాలన్నీ ఆస్తికిందే వస్తాయి. వీటిని ఎవరైనా లాక్కుంటే నష్టపరిహారం ఇచ్చుకోవలసి

ఉంటుంది."

"ఇప్పుడర్థమయింది. ఇదంతా విన్నాక మాకున్న భయాలన్నీ తీరాయి."

మోతీహార్, భగత్ ఇద్దరూ లేచి నిలబడ్డారు.

"మళ్ళీ రండి," అన్నాడు సుఖ్‌చాంద్.

వెళ్ళేటప్పుడు మోతీహార్, 'మాస్టారు! మీరింక పెళ్ళి చేసుకోండి. మీ జాతి ఆడపిల్లలు నవాగఢ్‌లోనూ ఉన్నారు. వాళ్ళు మీకు పొలమూ, గేదెలూ, వంట సామానూ, సైకిలూ అన్నీ ఇస్తారు," అన్నాడు.

"అబ్బే, వద్దు లెండి!"

"ఇక వెళ్ళిరామా, సుఖ్‌చాంద్‌గారూ?"

"సరే, వెళ్ళిరండి."

గొల్లవాళ్లు వెళ్ళిపోయారు. బికారి మాట్లాడకుండా కూర్చున్నాడు. తను విన్న కొత్త విషయం వల్ల అతని మెదడు మొద్దుబారినట్టయింది.

కాసేపటికి మాట పెగుల్చుకుని, "బాబుగారూ!" అనగలిగాడు.

"చెప్పు, బికారీ!"

"మీరిందాక చెప్పారే, అదంతా నిజమేనాండీ?"

"అవును, నిజమే!"

"అదేదో హక్కులన్నారు...?"

"ఆఁ, అవే, ప్రాథమిక హక్కులు."

"వంతులు కావాలని నినాదాలు చేసే కూలీలు ఊరికేనే అలా అడుగుతున్నారని అనుకున్నాను. వాళ్ళు చెప్పినదీ ఇదే కదా?"

"అవును, బికారీ!"

"రాజాగారి భూములు ఆయన సొంత ఆస్తా?"

"అవును."

"మరి నా మేకలు నా సొంత ఆస్తేగా?"

"నిస్సందేహంగా"

"రాజాగారి భూమి లాక్కున్నందుకు దానికి బదులుగా చాలా డబ్బిచ్చారు కదా?"

"అవును."

"మరి నా మేకలని పోలీసులు లాక్కుపోతారు. మరి నాకు ఒక్కపైసా కూడా ముట్టదే, ఎందుకు? ఆ పోలీసులకి గవర్నమెంటు వాళ్ళు ప్రాథమిక హక్కుల గురించి చెప్పటం మరిచిపోయారా?"

"బికారీ, ఇది పోలీసులు చేసే జులుం"

"మరి, బాబుగారూ, రాజాగారికి డబ్బు ముట్టిందికదా? అంటే రాజాగారిలాంటి గొప్పవాళ్ళకే డబ్బులిస్తారా?"

సుఖ్‌చాంద్ జాలిగా నవ్వాడు, "నిజానికి అలాగే అనిపిస్తోంది, బికారీ! కానీ రాజ్యాంగంలో చాలా మంచి విషయాలు రాసి వున్నాయి. నే నింతకుముందు మీకు చెప్పినటువంటివి."

"ఏం రాసి ఉందో మాకేం తెలుసండీ?"

"రాజాగారికి కూడా దావా వేశాకే డబ్బులు దొరికాయి. రాజ్యాంగంలో ప్రాథమిక హక్కులకి ఏవైనా ఆటంకాలు వస్తే కోర్టులో దావా వెయ్యవచ్చని కూడా వున్నది." "నేనా? నే నెలా చేస్తానండీ? దావాలూ, కేసులూ, అవన్నీ నాకేం తెలుసు? పోలీసులు మేకలు లాక్కుంటే దుసాధ్ ఎవ్వడూ వాళ్ళమీద దావా వెయ్యలేడు."

"వెయ్యొచ్చు, అతనికా హక్కుంది," అన్నాడు సుఖ్‌చాంద్.

"ఎలా?"

"ఎలా ఏమిటి? చెప్పాగా నీకా హక్కుందనీ."

"డబ్బులేవీ? ధైర్యం ఎక్కడిది దుసాధ్‌కి? ఈ హక్కులేమిటో నాకర్థంకావు సుఖ్‌చాంద్‌గారూ. వీటివల్ల ఎటువంటి ప్రయోజనమూ లేదు."

"అవును, నువ్వనేదీ నిజమే. నీకెలా చెప్పాలో తెలియటంలేదు..."

"ఏం చెప్పగలరు, బాబుగారూ?" సుఖ్‌చాంద్ పడుతున్న అవస్థచూసి, అతన్ని ఊరడించటానికన్నట్టు నవ్వుతూ, "మీరేం చేస్తారు? ఈ లోకంలో ఇన్నాళ్ళుగా జరుగుతూ ఉన్నదే ఇప్పుడూ జరుగుతోంది, అవునా?" అన్నాడు, బికారి.

"అలా అనుకోవద్దు, బికారీ! రాజ్యాంగంలో రాసి ఉన్నదే నిజం. కానీ అదంతా నిజ జీవితంలో వీలుపడదు, ఎందుకంటే తప్పు మనలోనే వున్నది. ఇదంతా మనం చేతులారా చేసుకున్నదే, అవునా కాదా?"

"నాకేం అర్థం కావటంలేదు. మోతీహార్‌గారి దగ్గరా, భగత్‌గారి దగ్గరా ఎన్ని ఆవులూ-గేదెలూ ఉన్నాయో! వాళ్ళకి చాలా విషయాలు తెలుసు. వాళ్ళు చెప్పేదే

నిజం. వేర్వేరు జాతుల వాళ్ళూ సమానంగా ఉండగలరా?"

సుఖ్‌చాంద్ ఇన్ని మాటలు మాట్లాడినా తీరా చేతల్లోకి వస్తే బికారి చేతి తిండి తినలేడు, కానీ అనటానికి తనకే పట్టింపులు లేవనే అంటాడు. ఎందుకంటే పుస్తకాల్లో అలాగే రాసి వుంది. అతనికి అచ్చులో కనిపించే విషయాలమీద చాలా నమ్మకం. ఆ నమ్మకంతోనే అంటూ ఉంటాడు - "జాతి భేదాలూ, అంటరానితనం, ఇవన్నీ చదువుకోని బైతులు నమ్మే విషయాలు. వీటిని జవహర్‌లాల్ నెహ్రూ నమ్మలేదు, ఇందిరాగాంధీ కూడా నమ్మలేదు."

"అయినా అంటరానితనం అనేది ఇంకా ఉన్నది కదా? ఎప్పటికీ ఉంటుంది.! చూడండి, ఇది దేవుడు చేసిన సృష్టి. ఒకళ్ళని బ్రాహ్మణుడిగానూ, ఇంకొకణ్ణి దుసాధ్‌గానూ దేవుడే పుట్టించాడు. దానివల్లే జాతుల్లో తేడాలూ, అంటరానితనమూ వచ్చాయి. సరే, నాకేం తెలీదు, మరి టాహాడ్‌లో ఉండే పూజారి హనుమాన్ మిశ్ర మంచి బ్రాహ్మణుడేనా కాదా? ఆయన దుసాధ్ నీడనికూడా తొక్కడే? ఆయన చాలా గొప్ప పండితుడు. దేవుడితోనే మాట్లాడగలవాడు. దేవతల మాటలు అర్థం చేసుకుంటాడు.

సుఖ్‌చాంద్‌కి ఏమనాలో తెలియలేదు. పెద్ద నిట్టూర్పు విడిచి, "సరే, బికారీ! ఇంకేమిటి విశేషాలు? నువ్వెలా ఉన్నావు?"

మాట మారేప్పటికి బికారి మొహంలో జీవం వచ్చింది. నవ్వి, "బాగానే ఉన్నాను. ఇంత బాగా ఉంటానని అనుకోలేదు. అన్నిటికన్నా పెద్ద విషయం - నాదగ్గర పది మేకలదాకా చేరాయి."

"పదే? ఏమిటి నువ్వంటున్నది?"

"అవును, సుఖ్‌చాంద్‌గారూ, రెండు బలిష్టమైన మేకలు, ఒక్కొక్కదానిలోనూ 15-16 శేర్ల మాంసం ఉంటుంది. సంతలో శేరు ఎనిమిది రూపాయలు పలుకుతుంది. నా దగ్గరున్నవన్నీ శేరు ఆరు రూపాయల చొప్పున ఎవరైనా తీసుకున్నా ఎంత డబ్బో చెప్పండి?"

"రెండూ కలిపి దాదాపు రెండువందల రూపాయలు రావచ్చు."

"రెండు వందల రూపాయలే!!

బికారి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. తమాయించుకుంటూ, "మీరే ఆశీర్వాదం చెయ్యాలి, బాబుగారూ! రెండువందల రూపాయలొస్తే నా కష్టాలన్నీ గట్టెక్కినట్టే."

"ఎలా?"

"ఎలా ఏమిటి? చూడండి, రెండువందల రూపాయలొస్తే పెళ్ళి చేసుకుంటాను.

నాకంటూ కొంపాగోడు ఏర్పడుతుంది. దుసాధ్‌ల ఆడపిల్లలు బండ చాకిరీ చేస్తారు.

మేకల పోషణలో జీవితం వెళ్ళిపోతుంది. ఎక్కడో ఒక గుడిసె వేసుకుని సంసారం వెళ్ళదీస్తాను."

"నీ ఇల్లెక్కడ, బికారీ?"

"అదే, బీజూ పాడా దాటాక."

"నీకెవ్వరూ లేరా?"

"లేరయ్యా!"

"నీకు మంచిరోజులు రావాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను, బికారీ!" సుఖ్‌చాంద్‌కి బికారి మీద ఆప్యాయత కలిగింది, మనసులో మాట చెప్పాడు.

"ఇక వెళ్ళిరానా, బాబుగారూ?"

"అలాగే"

"ఇవాళ టపాసులు కాలుస్తారటగా?"

"ఆఁ, విన్నాను."

బికారి ఇంటిదారి పట్టాడు. ఎందుకో తెలియదుకానీ అతని మనసు తేలికగా ఉన్నది. మేకలని ముద్దు చెయ్యాలనిపించింది. పోలీసులు అతనికి ఒక ఉపకారం చేశారు. నవాగఢ్‌లో పోలీసుస్టేషను పెట్టకపోతే అతను బాఢాకి పారిపోయేవాడు కాదు."

బాఢాకి వెళ్ళటంవల్లనే రాంకా సహాయం దొరికింది. రాంకా సహాయం లేకపోతే అతని మేకల సంఖ్య పదివరకూ పెరిగేదే కాదుకదా? తోవలో అతను గోధుమపిండీ, ఉప్పు, మిరపకాయలూ, కాకరకాయలూ కొనుక్కున్నాడు. శెట్టిని "బావున్నారా, బాబూ!"అని పలకరించాడు.

శెట్టి అతని మాటకి జవాబైనా చెప్పలేదు. కాంట్రాక్టర్ రామ్‌ధారీ చెప్పే కబుర్లు వినటంలో మునిగిపోయాడు. వస్తువులు కొంటున్నప్పుడు టపాకాయలు 'శూరమహల్' ఎదురుగా ఉన్న మైదానంలో కాలుస్తారని వాళ్ళు చెప్పుకోవటం

విన్నాడు, బికారి. సాయంకాలం కాలుస్తారుట. ఐదువేల రూపాయలు ఖరీదు చేసే టపాకాయలు కాలుస్తారుట. అది చూడటానికి తనుకూడా వెళ్ళాలని బికారి అనుకున్నాడు. బట్టలు ఉతుక్కోటానికని ఒక బట్టల సబ్బుకూడా కొన్నాడు.

కాకరకాయ కూరా, లావాటి గట్టి రొట్టెలూ చేసుకుంటే రేపటివరకూ సరిపోతాయి అనుకున్నాడు. రెండువందల రూపాయలు! అవిటివాడు ఇంకో ఆడదాన్ని ఎక్కణ్ణించైనా తీసుకురాగలిగితే తనూ ఒక ఇంటివాడవుతాడు! ముందు కొన్నాళ్ళు మేకల్నే తోలుకుంటాడు. ఆ తరవాత, చెప్పలేం, కొద్దిగా భూమి సంపాదించగలుగుతాడేమో! పెళ్ళయితే అతనికి పెళ్ళాం తరపు బంధువులెవరైనా దొరుకుతారు. అవసరమొస్తే వాళ్ళూ సహాయం చేస్తారు. ఎవరైనా ఎల్లకాలం ఒంటరిగా బతగ్గలరా? బాథా-నాథా- టాహాడ్, ఇంకా ఎన్నో ఊళ్ళు, బీదవాడికి ఎవరైనా తోడుగా ఉండి సహాయం చేస్తే ఎంత మద్దతుగా ఉంటుంది!

బికారి బట్టలు ఉతుక్కున్నాడు. వంట ముగించేప్పటికి సాయంకాలమైంది. వండుకున్నది తినేసరికి చీకటి పడింది. మేకలని లెక్కపెట్టి బస్సులోకి ఎక్కించాడు. తడికె అడ్డం పెడుతూ ఉండగా వాళ్ళు వచ్చారు. రాజాగారి సిపాయిలు - ఇద్దరు.

పోలీసులా?

బికారి బెదిరిపోయి తడికెకి అతుక్కుపోయాడు. ఏమిటది? పోలీస్‌స్టేషన్‌లేదు, పోలీసులు లేరని కదా తను మళ్ళీ నవాగఢ్‌కి వచ్చాడు? మరి ఈ పోలీసులో?''

''ఏం, బికారీ? భయపడ్డావా?

సిపాయి గజానన్ బికారివైపు చూసి నవ్వాడు. అతని నోరు సారా కంపు కొట్టింది.

''రెండు మేకపోతులనియ్యి. రాజాగారు స్టేషనులో వాళ్ళందరినీ పిలిచారు. మాంసం ఎక్కడ దొరుకుతుంది?''

''లేదు, లేదు, మేకలు లేవు.''

''అయితే పోనీ ఆడ మేకలియ్యి.''

''మీకు దండం పెడతాను. నా మేకలని అడక్కండి సిపాయి బాబులూ! అవే నా ప్రాణం. వాటిని తీసుకుపోకండి.''

''ఫోరా, దుసాధ్ నాయాలా!''

గజానన్ బికారిని లెంపకాయ కొట్టాడు. ముక్కూ, పెదవీ చిట్లి రక్తం కారింది. అయినా బికారి అరవటం మానలేదు, "ఆ పోలీసులకి భయపడి నేను బాఢాకి పారిపోయాను. అయినా పోలీసులు నా మేకల్ని తీసుకుపోవటం మానలేదు. తీసుకుపోకండి సిపాయి బాబూ..."

"ఎందుకు తీసుకుపోకూడదురా? రాజాగారు పిలిపిస్తే పోలీసులొచ్చారుకదా? వాళ్ళు మాంసం కొనుక్కునే తిన్నారా? నువ్వు రాజాగారి జమీందారిలో ఉంటున్నావా, లేదా? ఫో, ఫో రా!"

బికారి ఈ అనుకోని ఆపదకి పిచ్చివాడైపోయాడు, "రాజాగారికి గవర్నమెంటు వాళ్ళు లాక్కున్న భూమిమీద ఎంత హక్కుందో, నాకూ నా మేకలమీద అంతే హక్కుంది. ఆ హక్కువల్లనే కదా ఆయనకి డబ్బు దొరికింది? నేను మాత్రం నా హక్కునెందుకు వదులుకోవాలి?" అన్నాడు.

"ఏమన్నావురా? మళ్ళీ అను. దుసాధ్ నాయాలా!"

సిపాయిలు దుసాధ్‌ని చితకబాదారు. చాలా నేర్పుగా, తర్ఫీదు పొందిన పద్ధతిలో, ప్రభుత్వం వాళ్ళకిచ్చిన అధికారమదంతో అతన్ని చావదన్నారు. కొడుతూనే, "వీడి మాటలు విన్నావయ్యా, గజానన్? కూలీలు వాటాకోసం పోరాటం లేవదీసి వీళ్ళకి కూడా హక్కుల కోసం పోరాడటం నేర్పారు. పోలీసులు మేకలని తినకపోతే మరి ఎవరు వాటిని తింటారు చెప్పు? రాజాగారికి భూములమీదున్న హక్కూ, వీడికి మేకలమీద ఉన్న హక్కూ ఒకటేనట!"

వాళ్ళు బికారిని కుళ్ళబొడిచి వదిలారు. అతని ఒళ్ళంతా గాయాలతో నిండిపోయింది. అతన్ని అలా వదిలి, తడిక తోసుకుని, నాలుగు మేకల్ని లాక్కుపోయారు.

బికారి దెబ్బతిన్న జంతువులాగ మూలుగుతూ ఉండిపోయాడు. హడిలిపోయి, కదలటానికి కూడా భయపడ్డాడు. దెబ్బలవల్ల కలిగిన నొప్పికన్నా తనకి జరిగిన అన్యాయం భరించలేక అతడు ఏడవసాగాడు. అన్నీ అబద్ధాలు. సుఖ్‌చాంద్ చెప్పినవన్నీ పచ్చి అబద్ధాలు! మేకల మీద తనకున్న హక్కుకూడా ప్రాథమిక హక్కా? ఆస్తి హక్కు ఏడవ ప్రాథమిక హక్కా? ప్రాథమిక హక్కులకి హాని కలగకుండా రాజ్యాంగం చూసుకుంటుందా? అబద్ధం, అంతా అబద్ధం. బికారి ప్రాథమిక హక్కులకి ఎన్నోసార్లు హాని కలిగింది. రాజాగారికి నష్టపరిహారం

దొరుకుతుంది. మరి బికారికి ఎందుకు దొరకదు? రాజాగారి నష్టం ఆరులక్షలతో పూడుకుంటుంది. తన మేకలే ఆధారంగా బతికే బికారి ప్రాథమిక హక్కు కోల్పోతే అతనికి నష్టం రాకుండా చూసే శక్తి ప్రభుత్వానికి లేదు, అందుకే అతనికి నష్టపరిహారం దొరకదు.

అతని ఒంటిమీద ఎవరిదో చల్లటి చెయ్యి పడింది. ఒంటికంటి మనిషీ, అవిటివాడూ, అవిటివాడి పెళ్ళామూ బికారిని మోసుకుని తీసుకుపోయారు. అవిటివాడి పెళ్ళాం గుడ్డ పీలికలు తడిపి అతని ఒంటిమీది రక్తం మరకలు తుడవసాగింది. ఒంటికంటి మనిషి అతని మొహం తుడిచింది.

అవిటివాడు, "నీళ్ళు తాగు, బికారీ!" అన్నాడు.

అవిటివాడి పెళ్ళాం, "నేను సున్నం తీసుకొస్తాను. సున్నం రాస్తే రక్తం కారటం ఆగుతుంది, నొప్పికూడా ఉండదు." అని వెళ్ళింది.

ముగ్గురూ అతనికి సేవలు చేశారు. గాయాలు మాని లేచి నిలబడటానికి అతనికి పదిరోజులు పట్టింది.

ఒకరోజు బికారి, "పద అవిటీ! మేకపిల్లలని అమ్మివద్దాం. ఎంతో కొంత దొరక్కపోదు,"అన్నాడు.

బికారి ఇరవై రూపాయలకి నాలుగుమేక పిల్లలనీ అమ్మేశాడు. అతని నడుం వంగి పోయింది. ఇక ఎప్పటికీ నిటారుగా నడవలేడు! తన ప్రాథమిక హక్కుల కోసం అతను మొదటిసారిగా, చివరిసారిగా కూడా, జరిపిన పోరాటం గుర్తులుగా అతని మొహాన గాయాలూ, గాట్లూ మిగిలాయి. తలకి తగిలిన గాయాలు మానాక అతను జుట్టు గొరిగించుకోవాలని అనుకున్నాడు.

"ఇప్పుడేం చేస్తావు, బికారీ?"

"బిచ్చమెత్తుకుంటాను."

"బిచ్చమా?"

"ఆఁ, బిచ్చమే."

"ఇక్కడా?"

"కాదు."

బికారి వాళ్ళ ముగ్గురికీ మూడేసి రూపాయలిచ్చాడు. శెట్టి కొట్లో చేసిన అప్పు తీర్చాడు. మేకలని కట్టటానికి తయారు చేయించిన తాడు ఖరీదు

రెండ్రూపాయలు మోతీహార్ నౌకరుకిచ్చాడు. మిగిలిన మూడు రూపాయలనీ తన బొడ్లో దోపుకున్నాడు. చెట్టుకొమ్మ ఒకటి కొట్టి చేతికర్రగా చేసుకున్నాడు. తోహరీలో సంతకెళ్ళి ఒక బొచ్చె కొనుక్కోవాలని అనుకున్నాడు. భిక్షాపాత్ర కావాలిగా! అర్ధరూపాయో, రూపాయో, ఎంతైతే అంత.

అతన్ని చూసి సుఖ్‌చాంద్ కిందికి దిగి వచ్చాడు. బికారి దెబ్బలు తిన్న విషయం అతను విన్నాడు.

''బికారీ!''

''నేను వెళ్తున్నాను, సుఖ్‌చాంద్‌గారూ!''

''ఎక్కడికి, బికారీ?''

''ఎక్కడ బిచ్చం దొరికితే అక్కడికి.''

''బిచ్చమా?''

''అవును, సుఖ్‌చాంద్‌గారూ!''

''కానీ నీ ఒంట్లో, ఇంకా...''

''అది నిజమే, కానీ ఏం చెయ్యను, బాబుగారూ? మీరు అబద్ధాలు చెప్పారు. నాకు ప్రాథమిక హక్కులు లేనేలేవు. రాజాగారికి మట్టుకే ఉన్నాయి. వెళ్తాను, సుఖ్‌చాంద్‌గారూ!''

కర్ర సహాయంతో బికారి దుసాధ్ వెళ్తున్నాడు. నెమ్మది నెమ్మదిగా. ఏమాత్రం భయం లేకుండా. ఇప్పుడు పోలీసులని చూసినా అతనికి భయం లేదు. మేకలూ, భూములూ, వస్తువులూ, ఏదైనా ఆస్తి ఉంటేకదా అతను పోలీసులని చూసి భయపడాలి? అడవిలోకి పారిపోవాలి? దుసాధ్‌ని చూడగానే పోలీసులు కొట్టి అతని దగ్గర ఉన్నది లాక్కుంటారని దాక్కోవాలి? ఏ ఆస్తిలేని నిరుపేద, బికారి దుసాధ్‌ని చూసినా పోలీసులేమీ చెయ్యరు. అతన్ని కొట్టరు. ఇంకెప్పుడూ పోలీసులు అతన్ని కొట్టరు. ఈ విషయం ముందే తెలియలేదే అని బికారి ఇప్పుడు విచారించాడు. దుసాధ్ రాజాగారితో, శెట్టితో, పోలీసులతో, హనుమాన్ మిశ్రతో మంచిగా ఉంటూ, తను పుట్టి పెరిగిన ఊళ్ళోనే ఉండాలంటే ఒకటే మార్గం - బిచ్చగాడుగా మారటం! బికారి దుసాధ్‌లాగా మేకలు తోలుకుంటూ మనిషిలాగ బతకాలని ప్రయత్నిస్తే ఈ పెద్ద వాళ్ళందరికీ అతనిమీద కోపం వస్తుంది.

ఇప్పుడు బికారికి ఒంటరితనం అనిపించటంలేదు. బిచ్చగాళ్ళు లేనిదెక్కడ?

ఒంటికంటి మనిషీ, అవిటివాడూ, దోరాలాంటి వాళ్ళు అన్నిచోట్లా ఉంటారు. ఇప్పుడు బికారి కుటుంబం చాలా పెద్దది. సుఖ్‌చాంద్ అతనివైపు కళ్ళార్పకుండా చూస్తూ ఉండిపోయాడు. ఏడో నంబరు ప్రాథమిక హక్కుని పోగొట్టుకున్నా, బికారి ఇప్పుడు మూడో నంబరు హక్కుని సంపాదించుకున్నాడని అతనికి తట్టింది. అది, స్వతంత్రంగా జీవించేహక్కు. తనకిష్టమైన ఉద్యోగం కానీ, వృత్తికానీ ఎంచుకునే హక్కు. బికారి బిచ్చగాడి వృత్తి ఎంచుకున్నాడు. రాజ్యాంగం తప్పకుండా బికారిని ఎన్నో జన్మలవరకూ బిచ్చగాడిగానే ఉండేట్టు చూసుకుంటుంది. కానీ అతనికి కాస్త మెరుగైన జీవితం కావాలనిపిస్తే? అప్పుడు ప్రాథమిక హక్కులు కావాలని అతను అడిగితే రాజ్యాంగం భరించలేదు. భారతదేశంలో ఇలా హక్కులకోసం పోరాడే చోటుకి రాజ్యాంగం పోలీసులనీ, రిజర్వు పోలీసులనీ, సిపాయిలనీ, టాంకులనీ, యుద్ధ విమానాలనీ - అన్నిటినీ పంపుతుంది. బికారి దుసాధ్ కాళ్ళీడ్చుకుంటూ నడుస్తూ వీధి మలుపులో మాయమయ్యాడు. ఇప్పుడతని దగ్గర పోగొట్టుకోటానికి ఏమీలేదు.

Lasertypeset at Visalaandhra, Vijayawada- 520 004
and printed at Shivam Offset Press, New Delhi - 110 028